# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము



## రెండవ భాగము

## నిత్యపారాయణ గ్రంథము



వద్దిపర్తి రాజారావు "శ్రీవత్స"

ఉభయ భాషాప్రవీణ



SRI VENKATACHALA MAHATMYAMU (PART-II)

by
*Vaddiparti Raja Rao 'Srivatsa'*

Published under Aid to Authors Scheme of
Tirumala Tirupati Devasthanam, TIRUPATI.



1st Edition 1998
1st Print 1998
Copies 750
Price Rs. 80/-

for copies :
*Tallapragada Bhaskara Rao*
2-184, Balaji Nagar, opp. APSP Qtrs.
KAKINADA - 533 005. Tel : 26359

Title Designed by
**BAPU**

Printed at
**LATA OFFSET PRINTERS,**
C/o RAJ SCREEN PRINTERS,
Majestic Cine St.,Kakinada - Tel : 66897

రచయిత - సతీమణి



జననము 1903

**శ్రీ వద్దిపర్తి రాజారావు - సత్యవతీ దేవి**

ఉభయ భాషా ప్రవీణ

స్వాతంత్ర్య సమరయోధులు

# రెండవ భాగము - విషయసూచిక

పేజీ సంఖ్య

## ప్రథమాధ్యాయము



## ద్వితీయాధ్యాయము

# తృతీయాధ్యాయము



# చతుర్థాధ్యాయము



# పంచమాధ్యాయము

## షష్ఠాధ్యాయము



## సప్తమాధ్యాయము

## అష్టమాధ్యాయము

# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము

## రెండవ భాగము

## ప్రార్థన

౧. కం॥ శ్రీ వేంకట గిరి వాసా !
దేవేశా ! శ్రీనివాస దీనార్తిహరా !
సేవించెదఁ గీర్తించెద
భావించెద నెడఁద విడని భక్తిని యుక్తిన్.

౨. పంచ చామరము॥
ధరాధరంబు లేడు దాటి దంటవై వసించుచున్
పరాకు లేక మామొఱల్గుబాలునంజెవింబడన్
బరాబరింబరుంగు వెట్టి వచ్చియాదు కొందువో
వరాల తండ్రి యేడు కొండలయ్య వందనాలివే.

౩. చ॥ ఇడుములు వాపుకర్తలు మఱెవ్వరు లేరని నమ్మియెవ్వరేన్
ముడుపులు కట్టి భక్తిఁగడు మ్రొక్కులు దీర్పగ, వారికోరికల్
కడవడనీక కూర్తువట కామిత సత్ఫలదాత వేంకటే
శుడ ! కనకాద్రివాస మముఁజూడుమ కన్నులనొప్పు ప్రేమతోన్.

౪. తే॥ వేంకటేశుండె దేవుండు వేరొకండు
లేడులేడెందు ఁతేఁడుల ఁతేడితండు
నమ్మిశేషాద్రి వాసు ననారతంబు
భక్తి మనసారఁ గొల్తును బ్రస్తుతింతు.

౫. తే॥ కలియుగంబునఁ బ్రత్యక్ష గతిని బ్రోచు
దైవమీవెగ మముఁబ్రోవ రావెవేగ
వేంకటేశ పద్మావతీ ప్రియరమేశ॥
లెంకలుగమమ్మునేలుకో వంకలిడక॥

## వేంకటాద్రిని శ్రీనివాసు విహారలీలలు

నారాయణాద్రియందు స్వామి పుష్కరిణీతటమ్మున, భృగు స్థానమున విష్ణు భగవాను నారాయణ దేవు శ్రీనివాసు వింత చరిత లింకను నెట్టులన లరారెనో మాకుంజెప్పరే యనిన శౌనకాదులకు సూతమహర్షి వర్యుండిట్టులనియె. నిజగర్భాంతరమున బ్రహ్మాండము లెల్ల నొకయెడ నిమిడ్చికొని యున్న యా సర్వాంతర్యామి కథల నమృత మధురమ్ముల నా యోపిన కొలందిగవచించెద నాలింపుడు.

తొల్లి యమరారియను నొక రక్కసుండు శంకరునర్చించి తపమ్ములందనిపి దుర్లభములగు వరములా దేవువలనంబొంది దుర్మతియై, గర్వియై మన్ను మిన్ను గానక తనయట్టి దుండగులంబెక్కురం జేర్చికొని ఇందు నందునెల్లెడ మానవుల, దేవతల, ఋషిముని వరుల, తపోధనుల, సాధుజనుల సామాన్య జన సంతతులంబెక్కు తెఱగుల పీలుగులంబాల్పరచి కడుంగడు కడగండ్లఁ బెట్టి వేచు చుండెను.

వానెల్ల మానవులు నల్లో లక్ష్మణాయని యటమటించుచుండ, నట దేవతలును వానిచేతంగడుంగడు ప్రపీడితులై యారిన నిప్పు వలె నిస్తేజులు, శుష్క శరీరులునై, శోక సంతప్తమానసులు, విహ్వల హృదయులు, కింకర్తవ్య విమూఢులునై బ్రహ్మంజేరి మొఱలిడి, యా పరమేష్ఠిని ముందిడికొని, బయలుదేరి దానవాంతకు, దుష్టశిక్షకు, శిష్టరక్షకు సర్వేశుకేశి నిషూదను, కేశవుఁబుండరీ కాక్షుఁ బురుషోత్తము శరణం బొంద శాంతి సౌఖ్యములందఁగడు జలనమ్మునఁ బాలకడలిందరిసి దైత్య దానవ దమనుదక్షు లక్ష్మీమనోహరుం జక్రపాణిని సదయహృదయుంబరి పరి విధముల నిట్లు ప్రణతులొనరించుచు గీర్తింపసాగిరి.

దేవదేవునకు, దైత్యారికి, నసురహంతకు నీకివె వందనములు. శ్రీవత్సాంకునకు, లక్ష్మీమనోహరునకు, బరమపురుషునకుఁ బరమాత్మునకునివే ప్రణతులు, వ్యాహెూప వ్యాహెూంతర విభూతునకు, విభువునకు, విశ్వాంతర్యామికి నణువునకునణువై, మహత్తునకు మహత్తైనవానికివే నే నమస్కృతులు. పుట్టువులేని వానికి బెక్కు పుట్టవులందు వానికి బుట్టువులిచ్చువానికి, సర్వావతారునకు నీకివే యనవరతాంజలులు. ఈ జగత్తునెల్లం గ్రిందుమీఁదు చేయువానికి మాయావినోదునకు జగములంబుట్టించి పోషించు పుండరీకాక్షునకు నారాయణునకు నీకు నమోవాకములు. జగదానందదాతకు జగన్నాథునకు, మంగళదాతకు, మంగళ స్వరూపునకు, గమల పత్రాక్షునకుఁ గమలాక్షికిదక్షునకు గమల నాభునకు నీకు వేవేలుకైమోడ్పులు, పావన గంగామతల్లికిం

ప్రభవస్థానంబులు పదపల్లవముల, రేబవళ్లంజేయుకనుదమ్ములనొప్పు విశ్వమూర్తికి దామోదరునకు, ధరణీధవునకు నీకు దండములు. జంగమాజంగమ జగత్తును బుట్టించు స్రష్టకుంబుట్టువు నిచ్చినవాడా! నీకివే జేజేలు.

సాధుసజ్జనులకండయైనవాడా ! సభ్య సాదర రక్షకా ! శ్రియఃపతే ! శ్రీనివాసా ! విష్ణుదేవా, సదావిష్ణూ మాహావిష్ణూ నీకుం బ్రణతులు. ధర్మ రక్షణమునకై, యధర్మము నణంపను, దుష్టులందునుమను, యుగయుగమ్ములందతినెలింగి యవతరించువాడా ! నలిననాభా, నాగరాజశయనా ! నీకివే నమస్కారములు. విశ్వేశ్వరా ! విశ్వాతీతా, విశ్వమూర్తీ నీకివే వేవేలు కేలుమోడ్పులు. విశ్వరూపా, విశ్వాంతర్యామీ ! విశ్వమును లోగొన్నవాడా! సర్వమునకుంబరమైన వాఁడా పరమేశా ! పరమపురుషా ! నీకివే ప్రణతులు. గరుడవాహనా, గరుడగమనా ! నిత్యనిరవద్య నిర్వికారా ! నీకుననేకానేకనతులు. నిస్సీమా, కళ్యాణగుణా! గుణాతీతా ! సచ్చిదానందా సదానందా ! గోవిందా ! అచ్యుతా ! ఆదిమధ్యాంత రహితా! మహాత్మా ! నీకివే యభివందనములు. నిస్తరంగ నిశ్చలా పారాగాధ కరుణాసముద్రా, లక్ష్మీ విలక్షణా, విచక్షణా ! ఋత సత్వ స్వరూపా ! పరబ్రహ్మ, కృష్ణ పింగల పురుష, ఊర్ధ్వరూపా ! నీకివే నమస్కారములు. అనంత మహావిభూతునకు, కారణా కారణునకు, నీకు నమస్కృతులు. శంకర చాపహరునకు, శార్ఙ్గధనుర్ధారికి, నంతర్నివాసికి నాదిత్య రూపునకు, సువర్ణ రూపునకు, రూపవిహీనునకు పురుషోత్తమునకు నీకివే యనేకానేక నమస్కృతులు. నిగమాంతవేద్యా, నిగమాంతరూపా ! మాటి మాటికి నీకివే వందనములు. సంస్తవనీయ, పరమానంద ! మాయందుఁ బ్రసన్నుండవగుము. పరమేశ్వరా ! కమలాకాంతా ! కరుణాకరా ! ప్రసన్నుండవగుము. విబుధర్షభ, భక్తార్తిహరా ! పుండరీకాక్షా! పురుషోత్తమా ! బుధజన వినుతా ! ప్రసన్నుండవగుము.

## భగవన్నియుక్తిని లక్ష్మీసఖి కనవచ్చుట
## దేవతలకు దేవ దేవు నానతిం జెప్పుట

ఇట్టులా దేవత లెల్లరును బలు విధముల నాదేవ దేవు వినుతులొనరించు చుండ నంతలో భగవదుద్బోధితయై పుణ్యస్వరూప క్లేశ వినాశిని సర్వార్థ ప్రదాయిని క్షీరసాగర కన్య కమలాలయ కలుముల చెలి యొక్క ప్రియసఖి యోర్తు పుత్తడి బొమ్మ యా క్షీర సాగరము నుండి బ్రహ్మాది దేవతల ఎదుటందోచి అమృతోక్తుల దేవు పలుకు లిటులు పలికి వినిచెను.

దేవ వరులారా ! స్వాగతము. మీకిదే నమోవాకములు. మీ కార్యము సంసిద్ధి నంది సుసంపన్నము కాగలదు. దైత్య దానవులచే మీకిపుడేమేని యిక్కటులు చేపడినవా ? శ్రీ

పత్సాంకుడు శారజ్ఞపాణి భగవానుడు నిత్యప్రసన్నుడు మిమ్ము దేవవరుల రక్షింప నిరంతరము సంసిద్ధుడె ! వెఱపందకుడు. మీ కష్టములు కడముట్టును. మీకు సుఖానందములు సేకురును. అందునే విధమగు నడ్డంకులు మీకుంగలుగ జాలవు. శీఘ్రముగనె స్వర్గవాసి శ్రీనివాసుడు, జగదారాధ్యుడు, లోకనాథుఁడు భగవానుఁడు విష్ణుదేవుడు మీకుంబ్రత్యక్షము కాగలడు. సర్వసిద్ధులు చేకూర్పంగలడు. ఆమోదాది దివ్యలోకమ్ములను వీడి భగవానుఁడు శ్రీహరి, అధోక్షజుడు, సర్వాంతర్యామి సహస్రశీర్షుడు సహస్రాక్షుడు, సహస్రపాతు పరమ పురుషుడు భగవంతుడిపుడు భూమిని నారాయణ పర్వత ప్రాంతమ్ముల, స్వామి పుష్కరిణీ తీరమ్మున పాలమున్నీటి కన్నియతో, కలుముల జవరాలితో నివసించుచున్నవారు. ఓ లోకేశులారా ! చతురాననాది దేవతావరులారా ! తమ రెల్లరిపుడు ఇటకు దక్షిణముగ అటకు దయచేయుడు. మీ కార్యములెల్ల నిర్విఘ్నముగ నెరవేరంగలవు. ఇట్లని ఆయబ్ధి రాకుమారిసఖి పలికి యంతర్ధానమాయెను.

ఆ యమ పలుకులు శ్రద్ధా భక్తుల నాలించిన ఆ దేవవరులు ఆమెకు దండ ప్రణామములొనరించి నలుదిక్కుల బ్రదక్షిణలొనరించి, ప్రసన్నచిత్తులై యప్పుడెయటనుండి, దక్షిణ భూభాగమునకు వెడలిరి. అటఁజేరి వారు పవిత్రాతి పవిత్రములు పుణ్య జలాశయంబులయు, సరోవరమ్ములయు, నదీ నదమ్ములయు పావనజలమ్ముల సేవలొనరించుచు, స్నానపానముల సంసిద్ధులయి యచ్చటచ్చటి సిద్ధ జనమ్ములచే, తపస్సులచే స్వాగత సన్మానములందుచు నారాయణాద్రి పాదతలమున, సానువుల నివాసములొనరించు కిన్నర దంపతుల మంద్ర మధ్యమోచ్చ స్వరముల మాధురీ విశేష యుక్త రాగములాలించుచు నటనట శిలాతలమ్ముల సర్ప గణమ్ము లానందమ్మున పడగలు విప్పి యాడుచు నెలవుకొని యుండు. అచ్చటచ్చట నచ్చర మచ్చె కంటులు పాడు సప్తస్వర విభవనా సమ్మిళిత వేణువీణా మృదంగాదుల, నవనాట్య రసాన్వితముల ఆవిర్భావాత్మకలయతాన మూర్ఛనాయుక్త గీతమ్ముల నాలించుచు, కాంచుచు, వినోదించుచు, మెలమెల్లగ క్లేశరహితులు, మోహరహితులు, విమలానంద పరిపూర్ణులునై, నారాయణగిరిని స్వామి పుష్కరిణిని దరిసిరి.

తమాలతాలహింతాల, రసాలసాల నారికేళ తిలక నాగ పున్నాగ సురపున్నాగ, పూగ పాటల, తరువరమ్ములచే, కేతకీపుత్ర దీపక, జంబీర, చంపక కుటజ వటభూజాత తతులచే, శ్వేతమందార, మందార, కేసర హరిచందన, చందనములచే కింశుకాశోక సంతాన, నీప, హరీతక, శ్రీవృక్షములచే, మాతులుంగలవంగ బిల్వకదళీ దాడిమములచే, పనసార్ద్రపనసలచే, కురవక కురంటక కుందరామల జంబు భూరుహములచే సమస్త తరు సమాకీర్ణ సాంద్రచ్ఛాయా సుసంపన్నములచే పుష్పఫల భరితమ్ములచే హరుద్దమనీ

మాధవీ మాలతీ నవమల్లికా వనజాతీ జాతీ విష్ణువర్ణములు, తులసీ కృష్ణ తులసీ లక్ష తులసులు, కరవీరక నంద్యావర్త శృంగ బేర హరిద్ర కర్పూర జన్యాదులు పలుతెఱగుల తావులు విరజిమ్ము పూలమొక్కలచే లతలచే నిండి నీరంధ్రమై శరీరామోదము, మనః ప్రమోదము గూర్చు దివ్యాద్భుతము, శుకపిక శారికాది పక్షికుల కలకలనినాదానంద వర్ధకము, మయూరనృత్యక్రేంకార వినోద వర్ధితము. అందాలకందమగు వనమును ఆ సుందరవన మధ్యమున శతవర్ణ సహస్ర పర్ణ కమలకల్హార జల పుష్పలతాసంశోభితము క్రౌంచకారండవ హంస సారస సరస్వరములతో కల్హార కమలానీక మధుమత్తమధు వ్రతమ్ముదు గీతా నినాదములతో, సర్వామోదమును బ్రహ్మానందమును, గూర్చు స్వామి పుష్కరిణిని, పరంధామునకును పరమ ప్రియంబయిన దానిని మనోమోదముగ గాంచిరి.

## దేవుతలంపు - ప్రార్థన - విమాన దర్శనము.

పుష్కరిణీ పుణ్యాతటమున నాబ్రహ్మాది దేవతలట్లే కొంత తడవు తన్మయులై నిలిచిరి. అంతనంత నాపాల్కడలి పట్టి యొక్క నెయ్యంపు నెచ్చెలి పలుకులు మదిఁదలంపుకొని లక్ష్మికినిలయమగువాని, శ్రీనివాసు, శ్రీవత్సాంకు, శ్రీ భూసంసేవితు, శ్రీ కంఠసంసేవితు, హితు, నేకైకు యెడందనిడుకొని; ఏకాయన విధుల, ఏకాంత ధ్యాననిష్ఠుల హృదంతర్నివాసు, యజుర్వేద ధ్యాననిష్ఠులకు, సదాచారులకు నాత్మవిభూతిం బరమపదము నిచ్చువాని, మదికిందెచ్చుకొని, ముమ్మూర్తులవాని, త్రిగుణాధీశు, త్రిగుణాతీతు, త్రివిధాత్మకు, త్రికాల స్వరూపు, త్రికాలజ్ఞు శాంతు నాల్గుమూర్తుల, నిరువది నాల్గు మూర్తుల నొప్పువాని, చతుర్వర్గ ఫల ప్రదాతను ధ్యానమ్మున నిడికొని, పంచోపనిషదాత్ము, పంచరాత్ర ప్రవర్తకు, పంచాధర్వ శిరోమణిని, పంచమూర్తిధరు, పరము పరంధాము, భావమున నుంచికొని షడధ్వమయచక్రస్థు షట్కోటి గ్రమేదిని అగ్ని పంజరవాసు, హంసు, పరమహంసు, అష్టాంగయోగవిజ్ఞు సిద్ధజన హృదబ్జ మధుకరు, చరమోపాయ సుగము, చరాచరగురుహరి నాత్మనుంచి, గంగాజన్మగృహాంగుష్ఠ పాదపంకజ వైభవు, ప్రణతార్తిహరు, ప్రణవార్ణ ప్రభావ సంపన్ను, ప్రాజ్ఞు, నవ్యాజ మిత్రు, శత్రుఘ్ను, శరణార్థ శరణ్యు, జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్యతేజోవిజృంభితు, సత్వరజస్తమోగుణత్రయ విమోహిత జగత్రయు, సృష్టిస్థితి సంహారు, నిగ్రహానుగ్రహాత్మకు, పవిత్రమనమ్మునఁ జింతించిన భక్తినాచరించిన మాత్రాన భక్తులకు మోక్షానందము నిచ్చువాని, సర్వమున నాకాశమట్టుల నభివ్యాప్తుడై యున్నవాని, శుద్ధ, సూక్ష్మ నిరంజను, నిరవద్యు నిరాకారు, నిర్బాధు, నిరామయు, నిరాశ్రయు, నిస్తరంగ నీరరాశినిభు, విభు, అతీంద్రియు, పరబ్రహ్మమును, మదినెంచి, తలంచి, యింద్రియముల నెఱింగి కనుంగొను నాకాంక్ష కడుంగడు గలిగిన దేవగణములవారు, సముత్సాహులై వ్యాహాత్మక సూక్తము, నుదాత్తోచ్చ ప్లుతస్వరమ్ముల, శాంతస్థిరమతులై యిట్లు కీర్తింపసాగిరి.

పుండరీకనయన దండముల్దండముల్, సారసాక్షజయము సదయహృదయ. విశ్వ భావన హరి విజయంబు విజయంబు. విశ్వనాథ వినతి విశ్వమూర్తి. విశ్వ భావన విశ్వేశ వేడుకోలు. జయము శ్రీవత్స లాంఛన జలజనేత్ర. మ్రొక్కులివె హృషీకేశ! ప్రమోదహృదయ. జయము విజయమ్ము కేశవ! సారసాక్ష! వేంకటేశ ఈశ! సంకట హరదేవ! పంకజాక్ష వరద పరమపురుష, మాధవ, యలమేలుమంగా మనోహర దయనుగొనుము. గొనుము దండములివె. స్వామి పుష్కరిణీ తటవాస శ్రీనివాస, కేశవ భక్తహృత్పద్మవాస, పద్మావతీ మనోహరుఁడ, గరుడగమన కరివరదా వందనములుగొనుము.

ఈరీతిని ఆనందోత్ఫుల్లలోచనముల ప్రమోదహృదయమ్ముల, వికసితముఖ పద్మముల నొప్పుచు నాదేవవరులు దేవదేవుం బలువిధముల ప్రార్థనలు నొనరించు చుండ వ్యగ్రమానసులగు నవ్వారల యెట్టయెదుట ఆ పుష్కరిణీ పశ్చిమతటమ్మున అన్యంబులగు తేజంబులనెల్ల నిస్తేజంబు నొనరించు మహాతేజంబున నిర్మలోజ్వలకాంతులఁ గన్నులకు హర్షోత్పాదకంబగు దివ్యమూర్తిని మహద్విమానము, ఆలయముతోచెను. నలువైపుల దివ్య దుందుభ్యాది మంగళవాద్య ధ్వనులు చెలంగఁబూలజల్లులు పొలుచుచు నెల్ల తావులఁ దావులలముచుండెను. జయ జయ నాదమ్ముల దిక్కులు పిక్కటిల్లు చుండెను. దానింగాంచినంత నెల్లరుఁగొంత తడవు దమక నచ్చెరువున నట్టె నిలిచి యుండిరి. అంతన తెలివంది దేవుని పరిపరివిధముల నిట్టులు కీర్తింపందొడంగిరి.

జయము విశ్వేశ విశ్వాత్మ జయము విష్ణు! జయము శ్రీకంఠపూజిత జయమనంత సత్య నిత్య నిరంజనా జయము జయము. అచ్చుతా పూజ్య యనిరుద్ధ యప్రమేయ. సర్వలోక జీవనదాత! జయము దేవ! జయము భగవంత ఆత్మేశ భయహర హరి. వందన శతంబు లేవేళఁబరమ పురుష, భక్తసంత్రాణ పరయీశ ప్రణతి ప్రణుతి.

వారి యీ సంస్తుతులాలించి ప్రసన్నచిత్తుండై యా విమానోపరివేవేల సూర్యప్రభలతో, చంద్ర సౌమ్యకాంతులతో, నగ్నిప్రదీప్తులతో, ముఖమునఁబ్రేమ ప్రసన్నభావము తొణికిసలాడుచుండఁగనులఁ గారుణ్య రసము కాలువలు గట్ట నవరత్న మణి మాణిక్య రంజిత సువర్ణ కిరీటముతో, శంఖ చక్రగదా శార్ఙ్గములు దాల్చి యుభయ వరప్రదాన సూచకములగు నాలుగు భుజములతో నారాయణుడు వైకుంఠుఁడు దైత్యారి దర్శనంబిచ్చెను. ఆ దేవురూపమునేమి చెప్పవలెను? ఉరమున శ్రీవత్సము, నా ప్రక్కను లోకమాత కమలాలయ, ఆటనే రతనాల పేరులతో వైజయంతీమాల యెంతయు సొంపు గూర్చుచుండెను. కరములఁగంకణములు, భుజకీర్తులు, వ్రేళ్లనంగుళీయకములు, చెవుల

మకర కుండలములు, నింకను ఏమేమియో యందాలకెళ్ళనందములై నిగ్గులుధేలు నాభరణములతో, బంగరు పట్టుపీతాంబరము దాల్చి భక్తుల భావాను కూల రీతుల వింతసోయగమునఁదోఁచుచుండెను. ఈ యాభరణములన్నియు పేరునకె. అందాలమూర్తికా దేవునకిట్టి యాభరణములేల? ఇది భక్తుల కనువేదురు తీర్పనే. అట్టులు తోచి, వెఱఁగునం దన్నుఁగనుచున్న యా బ్రహ్మాదులంగని, చిరునవ్వులు తొలకరించుచు, భక్తజన హృత్పద్మోద మూర్తి భగవానుఁడల్లన నిట్టులనియె. దేవ వరులారా ! ఇంద్రాది ప్రముఖలారా ! మీకెల్లరకిదే స్వాగతము. పితామహుబమ్మదేవరను ముందిడు కొని యిటకు మీవచ్చిన పనియేమి ? అకారణ శత్రువులచే నిప్పుడు మీకేమియు నిక్కట్టులు చేకూరలేదు కదా ? అనికేశిమర్దనుడు కేశవుడు తమ్మునడిగి నంత విబుధ శ్రేష్ఠుండు చతుర్ముఖుండు దేవాది దేవునకు భగవంతునకు ప్రణమిల్లి అల్లన నిట్టులనియె. ఓ తండ్రీ లోకపితా ! మా క్షేమము నిప్పుడు మీతోనేమని విన్నవించునది ? మీరిటనుండ, నట మాకడగండ్లకు మేరయేలేకపోవుచున్నది. మేమెల్లర మిపుడిదే మీపాలఁబడితిమి. ఓయసురారీ ! మా యుసురులకిప్పుడేమియుఁ గుశలములేదు. ఇదో యీ యింద్రాదులు స్వస్థానంబులు పాసి వివర్ణవదనులై, యస్వస్థహృదయులైయున్నవారలు. వారల ఎడందల ఉత్సాహంబెక్కడ ? ఈ ద్వాదశాదిత్యులు అంధకారమ్మున యణగిన తేజస్సులు కలవారైఅణఁగి మణఁగి రాహు గ్రస్తులట్టులు ప్రభలుడిగి ప్రకాశింపకయున్నవారలు. అదో ఆ అష్టవసువులు నశ్వినీ కుమారులును కాంతులు తొలగి యెండిన వనములట్టుల వాడియున్నవారు. వేయికన్నులవాని నెన్నికంగొనక నిర్జించి ముల్లోకములం గడ్డిపోచలుగ నెన్నుచు మన్నుమిన్ను గానక వర్తించుచున్న యమరారి యననొప్పు దైత్యవల్లభుండు దీనికంతకుఁగారణంబు. దుర్వినీతుండు దుష్టగణనాయకుండు అతఁడు శంకరుం గూర్చి ఘోరాతి ఘోరముగ తపమునొనరించెను. వాని యాదుష్కర తపస్సునకు యంతయుం దనిసిన పినాకపాణి ఫాలలోచనుఁడు శంకరుఁడు అతనికింప్రత్యక్షంబై అమరులచే నమరాధిపులచే నింకనుగల బలాతిబలులచే జయింపబడకుండను, వధింపబడకుండను వానికోరిన వరంబులొసంగి సంతృప్తు నొనరించెను.

ఆ దుష్టుఁడమరారి నామకుఁడెల్ల దేవతల దేవాధిపుల, సజ్జనుల విశేషించి దీనజనుల, దరిద్ర మానవుల ద్వేషించుచు ముల్లోకమ్ముల వేధించుచు దిరుగుచున్నాడు. వాని కట్టడులు పెక్కురువానికిఁ జేదోడు వాదోడునై యెల్లరను అమితముగఁ బీడించుచున్నవారు. ఓ దేవ ! చక్రధరా ! శార్ఙధనుర్ధారీ ! సజ్జనావనా ! సాధురక్షకా ! సర్వాంతర్యామి ! భగవంతా నీవుకాక మాకిపుడు వేరుపాయము కానరాదు. లేదు. నీవే మాకు శరణ్యము. ఓ కమలాకాంతా ! కమలలోచనా ! నీకివే నమస్కృతులు. కాలస్వరూపా!

కైమోడ్పులు. దుష్ట దానవుచే దేవ విరోధిచే బెక్కు తెఱంగుల వేధింపబడుచున్న మాకు నీవ రక్షకుఁడవు. లేలెమ్ము రక్షింపుము. రక్షింపుము. ఇట్టులు సుఖమును కళ్యాణమును గోరి ప్రార్ధించుచున్న అమర వరులఁ గారుణ్యామృత వారాశి కల్లోల తరంగితాక్షులఁ దిలకించుచు మందస్మితకాంతుల నింపుచు అల్లన విష్ణు పరమాత్మ భగవానుఁడు వేల్పు పెద్దను దమ్మిచూలి, అమరులగని యిట్టులనియెను. విబుధవరులారా ! విచారింపకుఁడు శాంతింబొందుఁడు. మీయిడుమలనెల్లం దొలగించందగు ప్రతిక్రియనేనిపుడె యోచించిపొనర్తును. మీ కష్టములెల్లం దొలగిపోగలవు. మీరు మీ మీ పదవులు పొంది సుఖమందుదురు. సందియములేదు. ముల్లోకములకును గంటకమై కష్టములొసంగుచున్న యాదేవవైరి శంకరుచే ఎన్నెన్ని వరములు పొందినను సపరివారముగ వధింపంబడును. నిక్కము. యిట్టులు వచించి దేవదేవుండిందిరా రమణుడు పరమ ప్రసన్నమతి నింగితాకార చేష్టల నెల్ల నెఱుంగంగన్న భగవానుడటు గణాధ్యక్షు కుముదాక్షు వైపునకుం గనుంగొనెను. శ్రీవత్స కౌస్తుభంబులు విడిచి మిగిలిన సకల వైభవములతో నాతనికిం దన సారూప్య సంపద నొసంగి విష్వక్సేనుఁడను బిరుదనామంబొసంగి సేనాధిపతిగనొనర్చెను. దేవగణములతోఁబోయి యిప్పుడేయమరారిని, రాక్షస గణములను సంహరింపుమని నియోగించెను. అటు తమతమ భాగ్యముల పదముల నందఁగోరుచున్న యాయమరవరుల వీక్షించి సల్లాపముల నభయమొసంగి యాశీర్వాదము లొసంగి నవ్వుమొగంబున, ఆలోకానందకురుఁడు దయామయుఁడు కనుమఱంగెను. అటుపిమ్మట భగవానుని హితవచనమ్ము లాలించిన దేవవరులు ప్రసన్న మానసులై శిరముల నంజలులు ఘటించి భక్తి వినమ్ర భావముల నాయెడఁ బ్రదక్షిణము లొనరించుచునట నుండి యల్లనల్లన వెడలిపోయిరి.

కల్పాదిని కృతయుగమున జంబూద్వీపమున భరత వర్షమున గంగానదికి దక్షిణదిశను రెండువందల యోజనముల దూరమునఁ దూరుపుసంద్రమునకుంబడమటి దెస నైదుయోజనముల దూరమున నారాయణాద్రియందున స్వామి పుష్కరిణీ పశ్చిమతటమ్మునందున భాద్రపదమాసమున శుద్ధపక్షమున ఏకాదశి తిధిని శ్రవణ నక్షత్రయుక్త సిద్ధి యోగమున సోమవారమున దేవగణములచేఁ బ్రార్ధితుండై లోకరక్షకుఁడు పరమపురుషఁడు శ్రీనివాస భగవానుఁడారీతి యవతరించి వారలకుంబ్రత్యక్ష మైయనుగ్రహించెను.

విష్వక్సేనుఁడు సపరివారుఁడై పోయి యెల్లెడఁదానయై యసుర సముదయములగు నాదుశ్చరితులతో అమరారిందుదముట్టించి దేశమును, ముల్లోకములను. సుఖసంపన్నము లొనరించెను. దేవవరులు వారి వారి పదముల సుఖముండిరి. సాదు

సజ్జనులు శాంత జీవితములు వెళ్లబుచ్చుచుండ, దీన జనంబుల కానందోదయమాయెను. యెల్లెడ అధర్మ పరులు వినాశమొంద ధర్మ సంస్థాపన మాయెను. యెప్పుడెప్పు డెచ్చడెచ్చట ధర్మవినాశమగు, అధర్మంబు పెచ్చు పెరుగు నచ్చటచ్చట అధర్మమును నాశమొనరించి ధర్మమునుద్ధరింప, దుష్టుల శిక్షించి నాశమొనరింప భగవంతుఁడు తానవతరింతుననెను గదా.

## శ్రీ పద్మా సరోవర మాహాత్మ్యము

నాడు భృగు మహర్షి వచ్చి విష్ణువు హృదయమున పదాఘాతమొనరింప నాపాద ధూళి తనపైఁబడుటచేఁ గోపించినదై లోకమాత, భార్గవియట విష్ణునురమును వీడి వైకుంఠమును బాసి పాతాళమున కుంబోయెను. అటఁగపిల మునివరుచేఁ బూజా సత్కారములు పొంది చిరకాలము వసించెను.

అట భగవానుఁడు హృషీకేశుడు భృగుముని వరునర్చించి సమ్మానించి సంతుష్టునొనరించి పంపెను. అటుపిమ్మట భగవానుఁడు నీలాదేవినట వైకుంఠముననె యుంచి ధరణీదేవిని వెంట నిడుకొని శంఖచక్రగదాధారియై లీలాపద్మమును జేఁబట్టి వినోదవేసమ్మున భూమికిందిగి వచ్చి వివిధానేక రూపమ్ముల ఆయమ్మను లోకమాతను మంగళదేవతను క్షీరసాగర కన్యను అన్వేషింపసాగెను. ఎల్లదేశమ్ములు ఎల్లప్రాంతములు నెమకుచు నెమకుచు కొల్హాపురమునకు వచ్చి అటనత్యంతోత్తమాలయముగ నగస్త్యమహర్షిచే సంస్థానితయై పూజితయగుచున్న యర్చారూపముననున్న శ్రీమహాలక్ష్మిని గనుంగొనెను. (భృగు మహర్షి భార్య ఖ్యాతి. ఆ పుణ్యదంపతుల పుత్రి లక్ష్మికావుననే భార్గవియాయెను). అటనాముని తల్లజానిచే నర్చింపబడుచున్న యా పద్మాలయను మహాలక్ష్మిని గాంచి తానును నటనే యా కలుముల జవరాలి నర్చించుచుఁబది వత్సరములుండెను.

అంత నొక్క దినంబున నశరీర వాణి యాకసమున నుండి యా దేవునకు విననాయెను. ఓ భగవానుఁడా ! విష్ణుదేవా! అనుగ్రహింపుము. లక్ష్మీదర్శన లాలసా శ్రీనివాసా ప్రసన్నుఁడవగుము. ఓ దేవ దేవా! యిటనుండి దక్షిణ దిశకుం జనుము. అటఁగృష్ణవేణి నదికి దక్షిణంపు దెసను ముప్పదిరెండు యోజనముల దూరమునంగల సువర్ణముఖరీ నదీ తీరముంబొందుము. మునివర సంసేవితమగు దాని యుత్తర తీర సామీప్యమున కుంతమునం (ఈటెతో) ద్రవ్వి సరమునొనరింపుము. దేవలోకమునుండి సువర్ణ కమలములను గొని వచ్చి అందున బాగుగనాటుము. దాని

తటమ్మునఁబలు విధమ్ములగు నుత్తమములగు పూదీవెల, పూలమొక్కలఁగొని వచ్చి యందముగఁపాతుము. పద్మామనోహరా! తత్తీరముననే యది వసించుచుఁదపము నొనరింపందగును. పద్మనాభా! పద్మావతీ! ఏకాక్షర, సహస్రాక్షర మంత్రముల ఇందిరా రమణిని జపింపఁదగును. ఇట్లు దేవి నారాధించుచు నట పండ్రెండువత్సరములు సుఖనివాస మొనరింపనగును. ఓ దేవ దేవా! దానిచే నెంతయు బ్రసన్న యా పద్మాలయ పద్మమునందున బదునైదు వత్సరముల లేఁబడంతిగాఁ దోచి మిమ్మందరిని తనియించి తనియును. ఇటనుండి యిప్పుడే యోలోకపితా! సువర్ణముఖరీ నదీ తటమ్మునకుందయచేయుఁడు.

ఆ సౌమ్యవచనములెల్ల ఆలించిన పుండరీకాక్షుఁడు ప్రఫుల్ల హృదయుండై యప్పుడె గరుడారూఢుండై సువర్ణముఖీ నదియొడ్డునకైపోయెను. తెలుపున జనపదమ్ముల, కొండల, నడవుల, వనముల, వింత వింతల, పావనమ్ములంగనుంగొనుచు భూవరాహమునకుం జెంగట గరుడునిం దిగి స్వామి పుష్కరిణిని తానమ్ములాడి యచటి వైఖానసులచే మునివరులచే నాతిథ్యముంబొంది సంపూజితుండాయెను. రాజరూపముననున్న యాతని వారెవరును గుర్తింప జాలరైరి. ఆ పిమ్మట మఱునాఁడు దుయమున ఆ తపోధనులచే ఉద్బోధితుఁడై యశ్వాకారమున నున్న గరుడు నధిరోహించి పురుషోత్తముఁడు ముందునకుసాగెను. పోయిపోయి యట బంగరు కమలముల నిండి కనులపండు నొనరించు సువర్ణముఖరింగని కడుంగడు నచ్చెరువంది అశ్వరూపు గరుడుందిగి అటనొకయెడ సమతలమున నెంతయుజతనమ్మున తాఁగొని వచ్చిన కుంతమున (బాగుగ త్రవ్వెను. ఆపైనటనొక సుందర సరోవరము కావింపంబడెను. అంత నెమ్మనమునం దలపోసినంత వాయువటకు వచ్చెను. వచ్చిన సమీరుంగని సచ్చిదానందుండిట్లులనియెను. ఓ సదాగతీ ! నీవిపుడె పోయి యింద్రునను మతింగొని సురనదింగల సువర్ణ పద్మలతలఁగొని రమ్ము. వానిఁగడలి రాచూలి పూజలకై యీ సరమున బాగుగనాటి పెంచఁగలను. అది విన్న యాగాలి దేవర, ఇందున్న యియ్యవియు బంగరు పద్మములెకదా. మఱల నాకమ్మునమండి వానింగొని తేరంబనియేమి? యనెను. దేవుండిట్టులనియెను. ఓ పవనా! నాడట కొల్హాపురమున దేవపురమున నుండి పైడితమ్మి తీవెలందెచ్చి యిటనాటి ఆ పూలతో లచ్చిని పూజింపుమని యశరీరవాణి వాక్రుచ్చియున్నది. కావున ఓ వాయుదేవా! స్వర్గమున నుండి నీవాస్వర్ణాబ్జల తలఁగొనిరమ్ము పొమ్ము అనియెను. అంత ననిలుఁడమర పురికింజని, సహస్రనయను ననుమతింగొని కాంచన సరోజలతలఁగొని వచ్చెను. వానిని దేవుండా సరోవరమున

నొప్పుగ నాటి యట సరస్తటమ్మున సూర్య ప్రతిష్ఠ నొనర్చి యర్చించుచుఁదొలుత శక్తి బీజముతో, లక్ష్మీ బీజమును పిదపఁగామ బీజముంజేర్చి ప్రణవ సంయుతమొనర్చి అక్షర త్రయ సంపుటమును మంత్రమును త్రిసహస్రమును నిత్యమును జపించుచు అందు దశాంశము, తర్పణమ్మొలొనరించుచు నగణ్య నాకాబ్జముల నాకమలాలయం బూజించుచుండెను. ఉషఃకాలమ్మున సరోవరజలములతోఁ దర్పణమ్ము లొనరించుచుండెను. కేవలము క్షీరములే యాహారములుగఁ గొనుచు లక్ష్మీపూజా తత్పరుఁడై యనన్యమనస్కుఁడై పంద్రెండ్రు వత్సరమ్ము లెడతెగని తపోదీక్షనుండెను.

## ఇంద్రునిచే దేవు తపోభంగ యత్నము.

తమ్మియింటి గరితంబ్రసన్నం జేసికొన అట్లు దీక్షను దపంబొనరించుచున్న విష్ణు భగవాను సామాన్య రాజమాత్రునిగ నెంచి మాయామోహితులగు దేవతలెంతయు వ్యాకులులైరి. ఆపార్థివేంద్రు తపమ్మును భంగం బొనరింపందలకొనిరి. ఆ దేవు తపమునకు అమిత పంక్షుబ్దుండగు, పదవీ వ్యామోహితుఁడా నాకాధిపుఁడు వేయికన్నుల వాఁడు ఇంద్రుడప్పుడు అప్సరసలం బిలిపించి వారలతో నిట్టులనియెను. ఓ యచ్చర మచ్చెకంటులారా! మీరిప్పుడు భూలోకమ్మునకు నంజనాద్రి సమీపమునకుంబొండు. అటమునిజన సంసేవితము సువర్ణముఖరీ నదికి నుత్తరపు ఒడ్డున నగస్త్యమహర్షి యొక్క యాశ్రమమ్ము కలదు. ఆ యాశ్రమమునకుందూరుపు దెసగఁగొండొక రాజు తపస్సు చేయుచునున్నవాడు. నాల్గుభుజములు దాల్చి త్రైలోక్య లక్ష్మినింబొందు నాకాంక్షను పద్మాసరోవర తీరమున సూర్యసమ్ముఖుఁడై దుష్కరతపమ్మొనరించుచున్నవాఁడు. మీరటకుంబోయి వాని మీ మధురగాన లయతానంబుల శృంగార చేష్టల సంక్షుభితుంబొనరింపుడు. పొండు.

ఇట్లు దేవాధిపుచేఁ బ్రబోధితులై యచ్చర మచ్చెకంటులప్పుడు బయలువెడలిరి. వారి వెనువెంటనె వసంతుఁడును జనెను. అటవనమున నవవసంత వికాసమాయెను. ఆవనమున వారా విచిత్రరూపు నాల్గుభుజముల వానింగాంచిరి. ఆ తెలుగంటి తలోదరులు మాయలమారి యయ్యను పుండరీకనయను నెఱుంగం జాలక అటవింత చేష్టలు నొనరింపసాగిరి. వీణాదులు మీటుచు వింత స్వరముల రాగాలాపముల ఆటల పాటల సింగారపు చేతల నొయ్యారంపు పులుకులు చూపసాగిరి.

ఇది యెంతయు నోరగంటి చూపులంగనుచున్న యాటక్కరి చక్కనయ్య యొయ్యనఁదనమాయ నా తెలుగంటి తెలవలపైకిందెలలించెను. ఆ మాయన్మునిగిన

వారు తమ్ము తామే మఱచిరి. తమవచ్చిన పనియె తలంపుకొనకుండిరి. అటదేవుండు పద్మాసరోవరమున దిగి తమ్మి పూలంగొని వచ్చి యెప్పటియట్ల తనపూజల నిర్వికార నిరంజనుఁడై కొనసాగించుచుంట గాంచి తమచేతగాని తనమునకు సిగ్గిలిరి. మఱేమిచేయును దోచక యణఁగి మణఁగి వారలాకసమునకెగిరి వచ్చిన తెన్నుంబట్టిరి. అది గన్న వెన్నుండు తనచేఁ గలిగిన యామాయా దేవింగనుంగొని యల్లన నిట్లనియెను. మానినీ ! మజ్జాతవు నీవులోక పూజ్యవుకాఁగలవు. శంఖ చక్రగదా చాపములు ధరించుదానవై కమలాది పుష్పములతో నలంకృతవై, పత్రపుష్పములచే, దధిక్షీరములచేఁబూజితురాలవై భక్తులకుఁ జతుర్వర్గ ప్రదమ ధర్మార్ధ కామ మోక్షముల నిచ్చుదానవు కాఁగలవు. అనియామెను వీడ్కొలిపి తాను మఱల నెప్పటి యట్టుల లక్ష్మీ పూజ లొనరింపసాగెను. ఇట్లు బంద్రెంద్రు వత్సరములు గడిచెను. పదమూడవ వత్సరమున కార్తిక శుద్ధ పంచమిని శుక్రవారమున మంత్రనామక ముహూర్తమున సుఖదమ్ములు మందమలయా నిలమ్ములంతట వీచుచుండెను. ఎల్ల యెడల జలములు స్వచ్ఛములు పావనములునై యలరారెను. సుఖద సుప్రభల భానుఁడు వెలుగు చుండెను. యెల్లర మనంబులు ప్రసన్నంబులై ప్రమోద భరితమ్ములై యుండెను. అత్తరి నాపద్మా సరోవర మధ్యమున నొక దివ్యతేజము అత్యంత దివ్య కాంతిపుంజముతోచి యలమెను. తన్మధ్యమున బాలభాను సహస్రాభము, సువర్ణ సుందరము, రధమొండు నలువైపుల నాలుగు మదగజములు పూన్చి యుండఁ బద్మహస్తలగు సుందర వనితలతోఁదోచెను. తన్మధ్యమున సహస్రదళ సుందర పద్మము కనువిందాయెను. దాని కర్ణికార మధ్యమునఁ బద్మాననయు, బద్మహస్తయునై పద్మనేత్ర, రక్తపదపద్మద్వయమందస్మితానన మనోజ్ఞాంగి కమల ముఖి తోచెను.

వికసిత పద్మ మకరంద సుగంధమ్ములం జిమ్ము ఉఛ్వాసములతో చిరునవ్వు వెన్నెలలతోఁబక్వ బింబాధరముతో లక్ష్మీ సంపత్తుల కిరవులగు కనుదమ్ములతో, సర్వ మణి రంజిత సువర్ణా భరణములతో నందములకెల్ల నందమై యొప్పులకుప్ప చెవులఁగమలములట్టి కమలములు ఉదరమున ముత్తెముల పేర్లు చేతుల బంగరు కంకణములు, నుదుట నుఱుకులిడు నలకలు, ననువులగు చెంపస్వరములు, వింతశోభ నిచ్చుచుండెను. మెఱపులట్టి కాంతుల నొప్పు పుట్టంబులంగట్టి కామరూపిణి యా మహాలక్ష్మి యటఁదోచి కపురంపు తావుల నలమిన కల్హారంపు మాలతో సుగంధిత తులసీ దూర్వామధూకముల మాలను చేగొని భగవాను మాధవు సాదరమున నట్టె చూచుచు నిలిచెను.

## శ్రీ దేవతా ప్రాదుర్భావము పద్మాసరోవర ప్రశస్తి

అంతనంతన యట లోకమాత యావిర్భావము నెఱింగిన యమరులంబర తలము జేరి దివ్య కుశమముల కురియసాగిరి. దేవతలు దివ్య దుందుభులు మొఱయింపసాగిరి. శంఖములు పూరించుచు వీణాది స్వరములు దెసలలమించిరి. గంధర్వులు షడ్జాది స్వరములు సమతాలముల వెలయింప స్వరగీత లాలస లప్సరసలు వానికనుకూలముగ నృత్యంబులు పొనరింపసాగిరి. తూర్యనాదములు ముజ్జగముల నలమి యానంద ప్రపూర్ణమొనర్చెను. అన్నాదమ్ము లాలించి జగదంబ పాల్కడలి పట్టి ప్రభవించుట యెఱింగి తల్లిందర్శించు తమినప్పుడె హంసారూఢుండై మునితల్లజాలతోఁ బరమేష్ఠి నలువయునటకుం జేరెను. కైలాసనాథుఁడు పత్ని పర్వత తన్థతో ప్రమధగణములతో నయ్యెడకు వచ్చి చేరెను. అది యాలించిన సురనాథుఁడను శచీదేవితో లోకపాలురతో పరుగున వచ్చి యటకుంజేరెను. వసిష్టాది మునివరులు, సనకాదియోగి తల్లజులు నంతలోననవచ్చి పద్మా సరోవరమును పద్మనాథాశ్రమమును జేరిరి. పద్మ రధ స్థితను సర్వలోకేశ్వరిని హరిప్రియను గాంచి వింత నందుచు నానందమున నట్టెనిలిచి హాసవికసిత వదనులై దేవతలెల్లరు అట్టే యుండిపోయిరి. దైత్య దానవులు నాగలోకవాసులుంగూడ అటజేరి లోకమాతను జగద్ధాత్రిని కనుంగొనుచు నభిలాషలు ముమ్మరముగఁ గామ మోహితులై యెవరికి వారు తమ్మె యామెపొందునని యువ్విళ్లూరు చుంగాంచుచుండిరి. వారట్లెల్లరు దన్మయబావులై తన్నుంగనుచున్న తఱినట్టె లేచి యామంగళదేవత రమామాత మోమునఁజిఱునవ్వు వెన్నలలుగాయు చుండఁదొందర తొందరగ విష్ణు భగవాను చంగటకుంజేరి కల్హార పుష్పమాల నట్టెతీసి యెత్తి పుండరీకాక్షు మెడను వైచి యాలింగన మొనర్చి యెల్లరంగనుచు నాదేవుఁడెందమునఁ బొందుకొనెను. హృషీకేశు హృదయస్థిత నాజగన్మాత గాంచి తమస్థితిని, మనికిని గ్రహించిన వారై యెల్లరుంబరిజ్ఞానమునంది నిలిచిపోయిరి. కమలాలయం పొందిన కమలాపతియు నెల్ల విధములఁగృతార్థుండాయెను.

భగవంతుండు శ్రీహరి పద్మా సరోవరమును గాంచి ఇట్లుపలికెను. ఓ సరోవరమా! నీ యీ తటమ్మున సూర్యునెదుట నింతవరకూ నిరతము తపమ్మొనరించి నేను కృతకృత్యుడనైతిని. హృదయ నాయకిని మనోహరిని రమాదేవిని పొందఁగంటిని. కావున ఇంతటి నుండియు నీవు పద్మములచే నిండి అలంకృతవై లక్ష్మికిం పద్మాలయకుం గూర్చు దానవై హృదయంగమవై పద్మసరము, పద్మాసరోవరము అనఁబడుచు త్రిలోకమ్ముల విఖ్యాతినందఁగలవు. అనిపలికి సిరివల్లభుడు గరుడనధిరోహించి శేషాచలమున స్వామి

పుష్కరిణీ తటమ్మునకుంజేరి అట నత్యంతము రమణీయమగు తానములగలుముల జవరాలితో వినోదములంబుచ్చు చుండెను. ఇదియంతయుంగనిన వినినమునులు, ఋషివరులు తపోధనులు పద్మాసరోవరమును అత్యంతము వినుతింపసాగిరి.

## మహర్షాదులు పద్మాసరోవర ప్రభావమును బ్రస్తుతించుట

నిర్మలమతింజేరి యీ పద్మా సరోవరమున స్నానమొనరించు వారలు ఏడేడు జన్మముల పాపములు నాశముకాగా వైకుంఠునట్లు పావనులై యెల్ల యైశ్వర్యములు నొంది సుఖింతురని దేవర్షి నారదుడు పలికెను. అది విన్న వశిష్ఠ మహర్షియును, మరీచ్యత్రి మునులును నాసరోవరమాహాత్మ్యం బిట్లని నుతించిరి. ఈ స్వర్ణముఖరీ నదీ తటమున వెలసిన యీ పద్మా సరోవరమున మునుకలిడు నాతడు ధన్యుఁడు. కడచిన యెల్ల పుట్టువు లందలి పాపములు పాసి లక్ష్మీయుతులై సుఖింతురు. ఇందున సంశయ మావంతయులేదు.

గమలాలయయు మనో నాధునకుం బ్రణతులొనరించి నాధా ! నా తొందర పాటు కంతయు సిగ్గిలుచున్నాను. కొంతకాలము మీ యనుమతిని కరవీరపురమున నుండి ఆ యడంగల భక్తజనులను అనుగ్రహించి తనియించి తొంటియట్ల మిమ్ముంజేరి తరింతును. అని పతిదేవునను మతింబొంది ఆ జగన్మాత కరవీర పురముంజేరి పావనభక్తజనుల తనియించుచుఁదనియు చుండెను.

ఇంతయు నాలించిన శౌనకాదులు సూతమహర్షింగని యిట్లనిరి. కృపానిధానా ! భృగుమహర్షి విష్ణుదేవు నురమున నేమికారణమునఁ బాదఘాత మొనరించెను ? పిమ్మట లక్ష్మీమాత మఱలనెప్పుడెట్లు పతిదేవుంజేరి తనిసి తనియించెను ? ఆకతయెల్ల సవిస్తరముగంజెప్పి మమ్ము దనియింపరేఅన్న వారికా రౌమహర్షణి యిట్లనెను. తొల్లి కశ్యపాది మహామును లెల్లరుంగూడి ప్రమోదమ్మునఁబవిత్ర భాగీరథీ తీరమ్మున నొక మహా యజ్ఞమును కొనసాగించుచుండిరి. అత్తరి నారద ముని వరుండు ఒక దినంబున జన్న మొనరించుచున్న యా యడకుంజేరి యా మునివరులంగాంచి యిట్లని ప్రశ్నించెను. ఓ ముని తల్లజులారా ! యీ క్రతురాజమును మీరెందుల కాచరించుచుండిరి? ఎవరింగూర్చి పొనరించుచుండిరి. ఈ యజ్ఞవల మెవ్వరి కర్పింపనున్నారు. ఈ యజ్ఞఫలమును బొంద నర్హుడగు దేవోత్తముఁడెవ్వరు? ఆరాధనార్హుండెవ్వరు ? అనెను. ఇట్లనుచున్న యాకలహాశను పలుకు లాలించి యాతాపసులెల్లరును బెద్దదగు సందియమునంబడి యొండొరుల మోములం జూచి కొనసాగిరి. పిదప నొకయెడ సభ

దీరి సందేహమును నివర్తించి కొనందలంచిరి. ఏకకంఠమున నెల్లరు బ్రహ్మవిదు, నుత్తము భృగుముని సత్తముంగని భక్తి వినమ్రులై యిట్లనిరి. ఓ మునిదేవరా! ఇదో మేము శిరములంజేతు లుంచి మ్రొక్కి కోరుచున్నాము. ఇప్పుడ కదలి పొమ్ము. దేవతలకు దేవుడై యజ్ఞ ఫల భోక్తయై పూజల కర్హుండగు వేలుపుల వేలుపుందెలియుము. తెలియంజేయుము. మనమా దేవునే యర్చింతముగాత అనిరి.

## భృగుమహర్షి దేవదేవుం దెలసికొనుట

అది విన్నయాతపసితల్లజుడు భృగువప్పుడ పయనమై సత్యలోకముంజేరి శతానందు నిసదనమునఁబ్రవేశించెను, అటఁజతురానను అష్టభుజు, నుదారాకారు, విరించింగనెను. నలుమొగంబుల వేదనాదములుప్పొంగులుచు నుండ దిక్పాలాదిదేవతలిరు దెసల బలిసి కొలువ, మణిమయకిరీటములు మస్తకముల శోభిల్ల, జెంగట సరస్వతి, ముందట మునులు, మొగిసియుండ ననామయునారాయణు జగన్నాథున్నస్తుతు లొనరించుచున్నా యాయజ్ఞయోనికిం భక్తి భావమునఁబ్రణమిల్లెను. సాష్టాంగనమస్కృతులొనర్చు నాసంయమి నాశతధృతి పలుకరింపనేలేదు సరికదా కన్నెత్తియైనఁగాంచిన వాఁడు కాడాయెను. అది గన్నయామునిపుంగవుఁడీతడున్మదుఁడు నిండు జ్ఞానములేమి కారణమునఁ బూజల కర్హుడు కాడని యెంచిలేచి వచ్చిన పనినెఱవేఱమిందిరుగు మొగమునగైలాసముంగూర్చిపోయెను.

అటనభ్యంతర మందిరమున నభవుఁడద్రిజతోవినోదించుచుండెను. పార్వతీ ప్రణయమున బరవశుఁడైయున్న యా పశుపతి మునియాగమనము దెలియకయేయుండెను. మునివరుని గన్న యాహైమవతి లజ్జావనత వదనయై పతిదేవునింగని నాథా! నాథా! నన్ను వీడుము. అదిగో మునివఁరుడు వచ్చియున్నవాడు. అనుచున్న భవానిని విన్న ముక్కంటి బొమలు ముడివడ గనులెఱ్ఱవడ నామునింగొట్టి దండింప ముందున కురికివరువిడెను. మీఁదిమీదికి వచ్చుచున్న యామినుసిగవానింగాంచిన యోగిపుంగవుఁడు నిలువరించి నీవు కోపివి లోకము నంబూజలకుదగవు. కాముకు డవగునీవు లింగపూజల చేతనే తనియింపఁబడుదువు. లింగారాధనమే నీకారాధనమగును. నీనిజమూర్తికి బూజలుండవని పలికి యట నుండి వెడలి వైకుంఠ నగరమునకుంబోయెను.

ఆవైకుంఠము ప్రాకారగోపురభూషితము నలుదిక్కుల నాలుగు సుందర విశాల ద్వారంబుల నొప్పియున్నది. నలువైపుల ద్వారములు ద్వారపాలురచే సురక్షితములు, నవతోరణ మంజులములు. తీర్చి దిద్దిన విశాల వీధులు, పరిమళజలములచే నెప్పుడుఁ

దడుపఁబడి ధూళిలేక సువాసితములైయున్నవి. అవే యున్నతోన్నత విశాలభవనములు. ఆపత్తనమును జొచ్చినముని యందలి వింతల వినోదములయెడ దృష్టినిడక తిన్నగ మాధవుమందిరముం దరిసి యందున జొరఁబడెను. అట నంబుజనాభుఁడు శేషశయ్యనుబరుండి, సిరి కలుములజవరాలు పాదములొత్తుచుండఁ బార్షదులు గరుడాదులొదిగి నిలిచియుండ నిత్యానందమూర్తియై యుండెను. అప్పుడె యాము నియాతరిగట్టుదారిని తొందర తొందరగఁదరిసి సిరుల కిరవగు నావెన్ను పెన్నురమునఁ గాలాచి తాచెను. తాపువడిన యా గరుడధ్వజుఁడు చటాలునలేచి నిలిచి భక్తి వినమ్రుఁడై మునిపాదముల కెఱఁగిలేచి నిలిచెను. ఆమునినట్టె కౌగలించికొని విడిచి యల్లననిట్లనెను.

అయ్యయో ! ఋషివరా ! ఇదియేమి ? ఈనావక్షము వజ్రమునకంటెను బెక్కుమడుగులు కఠోరమైనది, దేవదానవులకును నభేద్యము. మీపాదతల మో, మిగుల మృదులము. దీనిందాకి మీపదతలమెంత నొప్పి నొందినదోకదా ! మెత్తని యీయడుగు దమ్మినినిటఁదన్నవలసిన పనియేమి కలిగెను ? నా వలన నేమి యపరాధమాయెను ? అనుచు నాభగవంతుఁడు శ్రీనివాసుఁడాముని పాదతలముంబట్టి యొత్తుచుఁగటకటా యెంతకందినదో ? యనుచునుష్ణోదకము లందెప్పించి కడిగి, మహర్షులు, దర్శనమాత్రముననే ముల్లోకములఁ బావనముచేయుదురన, స్పర్శన భాగ్యముంబొందిన నాయదృష్టమేమనవలె ! నమయాపాదోదకములు సభక్తికముగ శిరమునఁ దాల్చెను. అంతనా విప్రవరుఁడును నాదేవునకు వినమ్రుఁడై వందనమాచరించి తన్నుక్షమించి యనుగ్రహింపుమనుచు ననుమతింగొని యటనుండి వెడలిపోయెను. వేవేగభూమికిందిగి వచ్చి మునులు సవనమొనరించుతావుంజేరి సభగూడిన వారందరికిని తనపోయివచ్చిన వృత్తము, హరిహర హిరణ్యగర్భులతోడి సమావేశము నంతయుంబూస గ్రుచ్చినయట్లు వివరించెను. పిమ్మట నాతండిట్లనియెను. దేవదానవమానవులందెల్ల శ్రీహరియు యుత్తమోత్తముఁడు. లక్ష్మీయుతుఁడగు నాతఁడెయందఱి పూజలఁదొలుదొల్త నందఁదగినవాఁడు. అతడెశాంత సజ్జనుఁడు, సత్యమూర్తి, ఆ తరువాత నెన్నందగినవారు వాణీ విధాతలు, పిమ్మటి వారు పార్వతీపరమేశులు. ఆతరువాయివారె యితరవేల్పులు. అని చెప్పిన వినియెంతయుముదమంది, యామునులావాసుదేవు నెల్లరశ్రేష్ఠుడుగాఁ బూజ్యుఁడుగా నిర్ణయించి యజ్ఞఫలమాదేవునకెయర్పించి సంతృప్తి నందిరి.

ఆర్యులారా ! యిందొక వింత సందేశమిమిడియున్నది. ఎంతటి ఘనులైనను తమచేసిన తప్పులకుఁ బొరపాటులకుఁ దగుఫల మనుభవింపవలసినవారే. కావుననే దేవాది దేవులై త్రిమూర్త్యాత్మకులే యైనను భవుఁడును నజుఁడును దమకృతులకుఁ దగుఫలమందిరి. ఇంతియకాదు లోకాతీత తపస్సంపన్నుఁడయ్యు భృగుమహర్షి పూజ్యాని

బుండరీకాక్షుందన్ని యవమానించిన దానిఫలితముగనె తనపాదతలమందలి జ్ఞాననేత్రము చితికి చిదుపలుకాగా వెతనందెను. కావున నెల్లరు మెలకువనంది తప్పుదారులంబడక మంచినేనియుం జెడుగున సాధింపంబూనక మంచిని మంచిచేతనే సాధించుచు జీవయాత్ర సాగింపనేర్వవలెను. సన్మార్గమే, సత్కృతియే సద్గతికిం జేర్చును.

## లక్ష్మి కరవీరపురమునకుం బోవుట

భృగుమహర్షి వెడలిన పిమ్మట లక్ష్మీనారాయణు లేకాంతమునఁ దమమందిరమున నున్నతఱిఁ బాలమున్నీటిపట్టి యాపదివేనములసామితోఁ బ్రేమంపుజగడమున నిట్లనిపలికెను. మనోనాయకా! నేనిప్పుడె మిమ్ములవిడిచి పోవుచున్నాను. మీయెద హత్తి యున్నచో నాకాజడదారి బాపనిచేఁ గాలితాపుల దినవలసి వచ్చెడిదేకదా! ఇట్టి యవ మానముతో నిటఁబడియుంటకంటెఁ బవిత్రక్షేత్రమగు కరవీరపురంబునకుం బోయి యుంటయే నాకు మేలుగాఁ దోచెడినియని యా జగన్మయి జగన్నాధు గరుడధ్వజు నెడఁబాసి యాహరిప్రియ దివ్యక్షేత్రము, కరవీరపురమును జేరంబోయెను.

పచ్చవిల్తుతల్లి తన్నుంబాసి వెడలినపిదప నాపచ్చబట్టతాల్పు మాయలాడు దివ్యలీలల లోకాలనేలువాఁడు, ద్వాపరాంతమునఁ బదునెన్మిదవ కలియుగమున మనమున నిట్లనితలపోసెను. ఆ పద్మాలయ ప్రణయకోపము దేన నెప్పుడెట్లు శాంతించునో యప్పటికిఁ దగివయాపని నొనర్చియామె మనసుంజల్లపఱచెదఁగాక. అనియా మాయలమారి గోవిందుఁడు తలంచి పరమానందమున వైకుంఠమును వీడి బయలుదేరి పవిత్ర జాహ్నవీ నదికి దక్షిణమున శతత్రయ యోజనదూరమున నదులనెల్ల శ్రేష్ఠమును నగస్త్యముని పూజితమును, శుకునకు వరదాయినియునైన సువర్ణముఖరీ నదికుత్తరపుందెస రెండున్నర కోసులదూరమున, సుందరవనములతోఁ బవిత్రపుష్కరిణులతోఁ గూడిన శేషునితోడి జగడమున వాయువుచే గొనిరాబడి యుంచఁబడిన సాక్షాత్తుశేషావతారమగు వైకుంఠసదృశమగు మూడుయోజనముల వెడల్పును ముప్పదియోజనముల పొడవును గల పవిత్రనగమును దేవుఁడెన్నుకొనెను. అద్దాని పూర్వభాగము వేంకటగిరియనియు, మధ్యభాగము నృసింహాద్రియనియు, వెనుకభాగము శ్రీశైలమనియుఁ బిలువంబడును. సుందరోన్నత ఫలవృక్షములచేతను, తావులంజిమ్ము పుష్పలతావితానముల చేతను, తమ్మిపూకొలకులచేతను, కలువల నెలవులగు సరస్సులచేతను, తియ్యతియ్యని కలకలధ్వనుల వీనుల విందొనర్చు పక్షికులములచేతను, లేళ్లు, కుందేళ్లు కస్తూరి మృగములు ఖడ్గమృగములు మదమత్తగజములాది జంతుసంతతులచేతను నది యెంతయు మనోహరము. దానిపవిత్రతకు నందచందములకు మురిసి దేవగణములే

యటకు వచ్చి వృక్షలతాకృతుల నొంది, జంతుసంతతులట్ల రూపంది నిలిచియున్నారు. మునులందున మృగములయట్ల విహరింతురు. పితృదేవతలు పక్షుల యాకృతులంది యటమసలుచుఁ దనియుదురు. యక్షకిన్నర కింపురుష గంధర్వాదులును నట శిలాఖండములట్ల చేరియుందురు. ఆ పవిత్రగిరినుంటయే తమభాగ్యమని వారెల్లరును తమతమ నెలవులు మాని యట పలురూపములొంది వినోదించుచున్నారు. ఇఁక మనుజుల మాట వేరేచెప్పనేల? అందుఁజేరి పవిత్రజీవితములను నడుపుకొను వారలే ధన్యజీవులు; వారలేపుణ్యమానవులు. ఆ కొండకే వచ్చి దేవుఁడట దననెలవును జేసికొనెను. దాని మాహాత్మ్యముం బ్రహ్మేంద్రాదు లేయెఱుంగలేరన్న నల్పసత్వులు నల్పాయువులు నల్పజ్ఞానులు నగుమానవులమాట పల్కుటేల?

## స్వామి పుష్కరిణీ మాహాత్మ్యము

అట్టియాదివ్య పావన పర్వతరాజ శిఖరమున శుభసంవర్ధనము పుణ్యప్రదము స్వామిపుష్కరిణి యలరారును. అందుఁగల హంసాది సుందరపక్షులు, కచ్ఛపాది జలజీవులు కమలోత్పలాది పుష్పములు నొప్పియొప్పులు కులుకుచుండును. తటములఁ జూతామ్లకపిత్థ పనసాది వృక్షరాజము లాకసముతో మంతనములాడుచు, ఫలభారమున భూమిని ముద్దిడుకొమ్మలతో నలరారును. మల్లిమొల్లజాజి, విరజాజి మొదలగు పూలమొక్కలు పూలసౌరభములు నలుదిక్కుల విఱజిమ్ముచు నలమియుండును. అందు మునుకలిడు మనుజులు పుణ్యధనులు, ధన్యజీవులునుగదా. ధనుర్మాసమున ననగాఁ బుష్యమాసమున శుక్లపక్షమున ద్వాదశీ తిథిని నరుణోదయకాలమున దేవవరులును నందున స్నానము లొనరింపనాసక్తి పడుచుందురన మానవులందు మునుకలిడఁ గోరికపడుదురని వేరె చెప్పనేల? ఇందెవ్వరు భక్తిశ్రద్ధలతోఁ బితరులకు శ్రాద్ధము లొనర్చిపిండప్రదానము లొనర్తురో వారిపితరులు సంతృప్తులై విష్ణుమందిరమున వేడుకలనంది యాడితరింతురు. ఇట మానవులెట్టి పుట్టువునందిననేమి యాపవిత్రతీర్థమున భక్తిశ్రద్ధలతో, పావనమతి దానములు, తానములు, పానములు నొనరించువారలెంతయు భాగ్యశీలురు సుడీ. ఆతీర్థమాహాత్మ్యమెంతని వర్ణించునది? మును శంఖుఁడను, నరపాలుడిందలి స్నానమాత్రముననే పోయిన రాజ్యమును దిరిగిపొందెను. అంగిరసుఁడను బ్రాహ్మణుని పుత్రుఁడు నారాయణుఁడను వాఁడిందున మునుకలిడి తన్మాహాత్మ్యమున భగవంతు శ్రీహరి దర్శనముం బొంది వరములంది తుదిని వైకుంఠధామముం బడసెను. పూర్వమున శ్రీరామచంద్రుఁడీతీర్థమున స్నానమొనర్చియెడఁబాసిన భార్యారత్నమును, సీతామతల్లిని జేకొన్నవాఁడాయెను. ఎల్లతీర్థములకుం గాణాచియుఁ దొలిమొదలునగు నాస్వామిపుష్కరిణికిఁ బశ్చిమదిశను నారాయణాంశసంభవుఁడు వరాహమూర్తి యొకరావి

(పిప్పలి) చెట్టునకుం గ్రింద వల్మీకమున నివాసముగనున్నవాఁడు. అట్టి పావనాధికమగు ననేకానేక తీర్థముల కావాసమగు నావేంకటాచలమును జేరి భగవానుఁడు వాసుదేవుఁడు హృషీకేశుఁడు దానివైకుంఠమున కన్నమిన్నయని మనమున మెచ్చుచునటఁ దన యునికికిఁ దగు స్థానమునకై తలపోయసాగెను. తగినతావునకై తడవులాడుచున్న యాదేవునకట స్వామిపుష్కరిణీ దక్షిణతీరమున నొక్కయున్నతోన్నతమగు చింతచెట్టును దానిక్రింది నీడలనెత్తయి నిర్మలమును, బావనమునయి యొప్పునొక వల్మీకమును గాంచెను. ఆపుట్టనె తనకునికి పట్టుగఁ జేసికొన నెంతయుఁ దనరియున్నదని యెంచి యందునఁ బ్రవేశించి యనేకానేక వత్సరములందె యావాసముగ నొదిగియుండెను.

## చోళరాజు చరిత్రము

ద్వాపరముకడచెను. కలియుగ మాసన్నమాయెను. ఆకాలముననొక నాగకన్యా గర్భోద్భవుఁడు, నిర్మలచరితుఁడు, చోళమండలమునకు రాజై ప్రజానురంజకముగ ధర్మపాలనమును సాగించుచుండెను. ఆతని ధర్మపాలనమున యుక్తకాలముల ననుకూలవర్షములతోఁ బ్రకృతిమనోరంజకమైయుండెను. భూమి సస్యశ్యామలమై ఫలపుష్పభరిత వృక్షములతో నలరారుచుండెను. గోవులు కుండలవంటి పొదుగులతోఁ గుంచముల కొలఁదిగఁబాలుకుఱియుచుండెను. ప్రజలెల్లనీతినియమముల ధర్మానురక్తులై ప్రవర్తిల్లుచు నిత్యకళ్యాణము పచ్చతోరణముగ సుఖసమృద్ధి నొప్పుచుండిరి. మాతాపితల యెడఁ బ్రేమానురాగములుమించ నయవినయములఁ దనరుసంతానము, బిడ్డల ధర్మవర్తనములఁ దీర్చి దిద్ది వాత్సల్యము మీఱునెసగు తలిదండ్రులు, పతివ్రతలగు వనితలు, సతీవ్రతులగు మగవారు, నన్యోన్యానురాగమున నిల్లుస్వర్గముగ నొనరించు నాలుమగలు, పరస్పరానురాగముల, సహకారసానుభూతుల నొప్పుజనములు, బిడ్డలకన్న మిన్నగ శిష్యులనాదరించి విద్యాబుద్ధులు సెప్పుగురువులు, గురువుల దైవములుగనెంచి భయభక్తులనొప్పు, విద్యామలవర్తనముల మిక్కిలిగ పొంది మించు శిష్యసంఘములు గలిగియాతని రాజ్యము రామరాజ్యముగ వెలయుచుండెను.

తనకై వైకుంఠమును విడిచివచ్చెనని తెలిసి పుండరీకాక్షు నన్వేషింపఁ బద్మాలయ గొల్లయవ్వగ నాయెను. బ్రహ్మయు గోరూపమంద శంకరుఁడు వత్సమాయెను. ఆ గోవత్సములం దోలుకొని యాలోకమాత పతిదేవుని వెదకుచు వెదకుచుఁ జోళరాజ్యమునకు వచ్చి రాజున కాయావుదూడల నమ్మివమూల్య ధనమునుగొని తననెలవునకు వెడలిపోయెను. ముద్దులుగుల్కు దూడతో నాయందాల యావుం గాంచి యారాజదంపతులెంతయు ముదమంది తనియుచుండిరి. పుష్టికరములు నారోగ్యవర్ధకములునని యాయావుపాలనే

తమబిడ్డలకుం ద్రావించుచుండిరి. ఆలకాపరియు నాయావును దక్కుంగల గోవులతోఁ జేర్చి మేతలకు వేంకటాచలమునకుం దినదినము తోలికొని పోవుచుండెను. గోరూపధారి యగు బ్రహ్మయటఁ దిరుమల నందందుఁ దిరుగుచు నాపదివేసములసామి యునికిపట్టునకై వెదకులాడుచుండెను. కతిపయ దినములిట్లులే కడచెను. ఒక్కదినమున నాయావు స్వామిపుష్కరిణీ తటమ్మునఁ ద్రిమ్మరుచు భూమిని చూచుచు నటవల్మీకస్థుఁడగు శ్రీహరి నెఱింగెను. దాన నాతనుపొందిన యానందమునకు మేరయే లేకపోయెను. పొదుగునఁ బాలుపెల్లుగఁజేపెను. ఆదొడుకు పాలుకురిసి యాపుట్టనెల్లఁ దడిపెను. లోనున్న శ్రీనాధుని పాలుకురిసి సంతృప్తిని జేసెను. ఇట్లుమందతోఁ బోయి నాడునాడాధేనువు భక్తిపెల్లుమీఱ పాలుకురిసి దేవుని దనియించుచుండెను. అటనిటచేరి యొకబొట్టేని పాలీయకుండెను. అట్లుకొన్ని దినములు కడచిన పిమ్మట మొదవుపాలీయకుంట కనిరాజపత్ని మిగులకోపము కలదాయెను. ఆయమ యాలకాపరింబిలిచి ఏమిరా! ఆవుపాలిచ్చుటలేదు? ఏమాయెను? ముచ్చునైనీవేమేని త్రాగివేయుచుంటివా? దూడత్రాగుచుండెనా? అని గద్దించియడిగెను. అదివిన్న యాపశువులకాపరి గడగడవణకుచు గొంతుతొట్రువడ, అమ్మా! నేనేపాపమెఱుఁగను. నేనేమియుం బాలుత్రాగుటలేదు. దూడత్రాగుచుండెనో? ఆయావేతనపాలు తానేకుడుచుచుండెనో, నేనెఱుంగను. నేనిజమాడుచుంటిని. మీరు విచారింపఁదగును. కారణమేమియో యికకనిపెట్టిచూతును అనిభయవిహ్వలుఁడై పలికెను. అదివిన్న రాజ్ఞియాగ్రహమధికము కాగాఁ గొరడాత్రాడున వానిఁజితుకబాదెను. వాఁడును గోడుగోడున నేడ్చియటనుండిపోయెను. మఱునాడు వాఁడాయావుమెడకును గాలికిని ద్రాటిని జేర్చికట్టి మందతోఁ గలిపివిడిచి దానివెన్నాడి తానును నడువసాగెను. ఆయావును బోయిపోయి శ్రీనివాసాలయమై యొప్పునాపుట్టంజేరి పాలుకురిసి తడపి లోనఁగార్చి మంథరధరు దనియింపఁ జేయుచుండెను. అదిగన్న యాగొల్లని కోపమున కంతులేకపోయెను. అప్పుడ తనచేతిగొడ్డలి నెత్తి దాన నామొదవుం గొట్టనుద్యోగించెను.

పుట్టలోపట్టె తన యునికి పట్టుగనున్న యాపచ్చబట్టగలాఁడప్పుడ యదియెఱింగి యిట్లని తలపోసెను. భక్తుఁడు తనకై యిడుమపడుచుండఁ జూచుచునుపేక్షించి యూరకుండు నతఁడు సూర్యచంద్రులు కలంతవరకు నరకమునఁ బడియుండును. ఈ దుష్టగోపాలకుఁడు నాకై యీగోవును బ్రహరింపఁ బోవుచున్నాఁడు. భక్తినిండిన డెందముతో నాకొకతులసిదళమేని పూజగనర్పించిన భక్తునెల్ల విధముల నాదుకొని నేరక్షింతును. ఇదియ నాప్రతిన. ఈగోరత్నమన్ననో ప్రతిదినము భక్తి మీఱ నన్నుఁదనక్షీరధారలఁ దడుపుచుఁ దనియుచున్నది. ఇట్లని యారమాకాంతుఁడు శ్రీనివాసుఁడు నిర్వికారుడు గోవిందుఁడా పుట్టవెడలి వచ్చియాగొడ్డలి పెట్టునకుఁ దనతలనడ్డము పెట్టెను.

ఆకుఠారాఘాతంబున కాదేవుతల పగులగ రక్తము చిమ్మనక్రోవులఁ జిమ్మునట్లు నలునైపులకుఁ దాళప్రమాణమున నెగసిపడసాగెను. అదిగన్న యాపసులకాపరి కనులకు భైరవము క్రమ్మ మొదలునఱికిన చెట్టువలెనేలఁబడి యుసురులవీడెను. అదియంతయుఁ గనుచున్న యావింత తొడుకప్పుడ తొందరతొందరగ నాకొండదిగిపోయెను. పోయినయాగిడ్డి రాజమందిరముం జేరి రాజునెదుట నిలిచి కన్నులనీరు కార్చుచు నంబాయంబాయని బిడ్డను గోలుపోయిన దానివలె దీనముగ నఱచుచు నేలఁబడి పొఱలాడెను. దానింగన్న రాజు హృదయము చెఱువాయెను. మంద ఏమాయెను? మందను వీడియిది యేలవచ్చెను? గొల్లడేమాయెను? దీనికిం గలిగిన కీడేమి? అనిరాజు పరిపరివిధములఁ జింతించి యప్పుడె చారులం బిలిపించి దీనివెనుకం బోయి మందంజేర్చి విషయము తెలిసిరండని యానయిడెను. వారును ఆగోవు వెనువెంటనె నడచిరి. అది వేంకటగిరికిం బోయి వల్మీకముందరిసి నిలిచెను. చారులును జచ్చి పడియున్న గోపాలుని వానిచేతి రక్తసిక్తమగు గొడ్డలిని పుట్టలోనుండి వెలికిం జిమ్ము రక్తధారలు, నలునైపులం గల రక్తపుమడుగులు గాంచిపోయి రాజుతోఁ దాముగన్న దానినెల్లఁ బూసగ్రుచ్చినయట్లు చెప్పివినిపించిరి. అదియంతయు నాలించిన రాజబ్బురపాటున గొబ్బున లేచి తగుయానమునఁ గొద్దిపరివారముతో వారింగొనిపోయి కొండ నాపుటనా ప్రాంతమునకుం జేరియదియెల్లం గాంచి యిట్లుచింతించెను. అయ్యో! యిటనీపసులకాపరి మరణమేమి? పుట్టనుండి యీరక్తధారలేమి? ఇట్టి యీఘోరమున కొడిగట్టినదెవరు? ఎంతకష్టమెంత కష్టము? ఈ విపద్గాధనంతయు నీగోవునాకడకు వచ్చి తెలుపుటయేమి? అనిమిగుల వ్యాకులతతోఁ బలుకుచున్నతేని పలుకులు వినిన శ్రీవేంకటేశుఁడా వల్మీకమునుండి నాల్గుభుజములతో, శంఖచక్రములతో, రక్తపుటోడికలతో బయటకు వచ్చి, యీరక్తనేత్రముల నలమిన యశ్రుజలములతో, వ్యాకుల పాటొందిన ముఖమండలముతో, గద్గదమగు కంఠమున నాచోలరాజుంగని నిష్ఠురవచనముల నిట్లని పలికెను.

ఓం శ్రీ హరిచందన గోత్రేంద్రస్వామినే శ్రీ వేంకటేశాయ నమః

ఓం శంఖరాజన్య నేత్రాబ్జవిషయాయ శ్రీ వేంకటేశాయ నమః

## భగవంతుఁడు చోళరాజునకు శాపంబిచ్చుట

ఓరీపాపి! దురాచారా! రాజ్యమదమున నొడలుతెలియకున్నావు. నేనోయనాధుఁడను; బంధుజనహీనుఁడను; దరిద్రవనచరుఁడను. నాకు మాతాపితలులేరు; సోదరులులేరు; భార్యచే బంధువులచే విడువఁబడినవాఁడను. అట్టినన్ను నీదుష్టుఁడు నీపశుపాలకుఁడు కడు వాడియగు గొడ్డటఁదలచితుకఁ గొట్టెనుగదా! ఈబాధనాకెంత యసహనీయమై యున్నదోయెటింగితివా! యజమాని సేవకులచేతల నెప్పటికప్పుడు పరిశీలించి తెలిసికొని వారల సక్రమమున నడుపవలయును. వారి దుష్టములగు చేతలనరయక పడియుండు ప్రభువు వారొనర్చు పాపముల ఫలములనెల్ల ననుభవింపవలసియుండును. బిడ్డల నదుపునఁ బెట్టలేని తలిదండ్రులు వారొనర్చు చెడుగుల ఫలములఁ గుడుతురు. కుటుంబపాలకుఁడు, తన కుటుంబమునంతను స్త్రీలఁ బురుషులఁ బిన్నలఁ బెద్దల ధర్మవర్తననుంచుకొనవలెను. అట్లుంచికొనఁ జాలనివాఁడు వారివారి పాపఫలములఁ దానుంగడుచును. అట్లేగ్రామపాలకుఁడును, రాజ్యపాలకుఁడును. దుష్టప్రజాదౌష్ట్య ఫలములఁ దాము ననుభవింతురు. ఓయీ నిర్దయుడా! దుర్బుద్ధీ! యీనీపసుల కాపరినాతల పగులఁగొట్టెను. దానిఫలితముగ నీవు పిశాచమవైయుండుము. అనినంత నాశాపవచనములు విన్న రాజాశోకవికలుఁడై మూర్ఛిల్లి నేలఁబడి కొంతవడికిఁ దేటికొని లేచి యాభగవానునితో నిట్లనెను. ఓదేవదేవా! జగన్నాథా! వెనుకముందాలోచింపక నిరపరాధుడనగు నన్నిట్లేల నీవు శాపసంతప్తునిగ నొనర్చితివి? నీకు దుఃఖమును, బాధను గలిగించు పనినేనేమి యొనర్చితిని? వీడేమొనర్చెనో నేనేమియు నెఱుఁగనే. అదివిచారింపనే నేనిటకు వచ్చితింగదా. హాప్రభువరా! నీకెంత కష్టమాయెను? ఇదియంతయు నెట్లు సంభవించెను? అనివిచారించుచున్న రాజుంగని జగత్పతి రమాపతి కనికరమున దుఃఖితుఁడై యాశాపవి కలుంగని యల్లనల్లన నిట్లనియెను. అయ్యయో రాజా! నీకన్యాయమే జరిగెను. నేనాలోచనమాని తొందరపడిన వాడనేయైతిని. నిజమే నీవకారణముగ శపింపంబడితివి. కానియేమి చేయునది? నాయన్నవలుకులు తప్పునవికావు; జరిగితీరవలసినదే. అవియసత్యములుకారాదు. కావు. భక్తవాత్సల్యదోషము నన్నుగట్టిగఁ బట్టియున్నది. భక్తుల యార్తింగన్న, విన్న నామనసు మనసుననుండదు. నిజముగ నేనట్టియెడన విచారుఁడనేయగుదును. వారి పరిరక్షణకై నేనేమేని చేయుదును. అందు నేనేమియు వెనుక ముందాడను. వినుము. నీకీశాపావధి నొసంగుచున్నాఁడను. చిరకాలము నీవాపిశాచ రూపమునునే యుండుము. ముమ్ముందాకాశరాజను నృపవరుడుద్భవింపఁగలఁడు. అతఁడు తనకుమార్తెను పద్మావతియను నామెను నాకిచ్చి పెండ్లి యొనర్పంగలవాఁడు. వివాహకాలమున మాన్యవరుఁడు నాకు వరదక్షణగ నవరత్నఘటిత సువర్ణ కిరీటము

నొసంగును. దానినానాఁడు శుక్రవారమున సాయాహ్నమున ధరింతును. ఆకిరీటముం దాల్చిన యారుఘడియలు దనుక నాకనుల నానందాశ్రులు నిండియుండును. అత్తఱిఁ గిరీటశోభితమగు నాముఖమును నానందాశ్రుభరిత నేత్రములను గాంచి నంతనె నీకెంతయు సుఖమును మేలుననగును. నీపిశాచతపాయుటయేకాదు? నీవు నాలోకమును బొందితరింతువు. ఇట్లని భగవంతుడు రాజునకు శాపకాలమును, విముక్తిని జెప్పి తనయవతార ప్రయోజనమును, గలియుగమునఁ గన్యాకరగ్రహణ మహోత్సవమును జెప్పి రాజుంబుచ్చెను. పిమ్మట నాదేవుఁడు వైద్యశాస్త్రనిపుణు దేవగురు బృహస్పతిం దలంచెను. అప్పుడ గురుఁడే తెంచి దేవునెదుట వినమ్రుఁడై కైమోడ్పులొనరించుచు నిల్చెను. అంతట దేవుఁడు తనతలగాయము సురగురునకుం జూపి తొందరగ నదిమానుమందుం జెప్పుమనెను. దేవదేవా! నీయెఱుంగనిదేమున్నది? మమ్ముం బెద్దఁజేయుటకె నీయీచేతలు. నీయాజ్ఞనాకు శిరోధార్యముకదా! మేడిపాలు తెచ్చియందున జిల్లేడుదూదిని ముంచి గాయమున కంటింపుము. దానిచే బుండుమాని సుఖమగును. అనిచెప్పి దేవుననుమతింగొని సురగురుఁడు వెడలెను. దేవుఁడును గురువరుడు చెప్పినయట్లు యొనర్చుచు ముదమందెను.

## శ్రీవేంకటేశు వినోదలీలలు:-

దేవునిలీలలు పరమాద్భుతములు. ఒకప్పుడా శ్రీహరి, వల్మీకము కౌసల్యగా, తింత్రిణియే దశరథుఁడుగా , శేషశైలమే యయోధ్యగాఁ దానుశ్రీరాముఁడుగా వినోదించును. మఱియొకప్పుడు వల్మీకము దేవకిగాఁ దింత్రిణి వసుదేవుఁడుగా, శేషగిరి బలరాముఁడుగా మహాగిరియే మధురగా, స్వామిపుష్కరిణియే యమునానదిగా దానుగృష్ణుఁడై యాదవులె మృగములుగా బక్షులెగోపికలుగ వినోద క్రీడల వెలయించుచుండును.

దేవుని దనయందిముడ్చుకొనిన వేదమయమగు నావేంకటాచలము వైకుంఠమునకు మిన్నయై పుష్కరిణి విరజానదికుద్దియై యొప్పును. ముక్తజనులు సనత్కుమారాదులుగ నందలి జంతుజాలములొప్పును. మానవజన్మమెత్తినందుల కెవఁడా వేంకటగిరికిం బోవనిచ్చించునో, సంకల్పించునో వాఁడెధన్యుఁడు, పుణ్యజీవి, యెల్లసత్కార్యముల నాచరించినవాఁడు. వానిచే నారమాపతి సర్వదేవవంద్యుఁడెంతయుఁ బ్రసన్నుఁడగును. ఆవేంకటాద్రి మాహాత్మ్యమును బ్రహ్మశివేంద్రాదులే తెలియఁజాలరన్న నావేంకటదేవు, వేంకటేశు నావాస మాశైలరాజముం దెలియ నల్పసత్వులు, నల్పాయువులు నల్పజ్ఞానులు మానవులు తెలియనెంతమాత్రులు. ఆమాగురుదేవు నక్కటిక; నేమేమియో కొంతకొంత చెప్పుచున్నాడను; చెప్పితిని.

## శ్రీనివాస వరాహదేవుల కలయిక

ఒకదినమున శ్రీనివాసదేవుఁడు తనగాయమునకు మందునుదేరఁ దన వల్మీకాలయమును వీడివచ్చి వేంకటనగమునఁ దిరుగాడుచుండెను. అప్పుడె వరాహమూర్తియుఁ దనపరివారముతో వెడలి శ్యామాకసస్యముఁ గాఁజేయవచ్చిన వృషభదైత్యుని దునుమాడివచ్చుచు నొకయెడ నావైకుంఠుంగాంచెను. వెంటనున్న పరివారజన మాదేవదేవుంగాంచి యెవ్వడీతఁడెవ్వడని తొందరగఁ దరియవచ్చిరి. అంతలోనన యాయబ్జనాభుం డంతర్ధానము కాగా నదియంతయుఁగనుచున్న వరాహమూర్తి యాతని బరమపురుషుగా నెఱింగియట్టె చూచుచుండెను. అబ్జనాభుఁడును నాత్మాంశసంభూతు నాదివరాహదేవునిందెలిసి యట మనుజరూపమున నెదుటందోఁచెను. అన్యోన్య సందర్శనముల వారికండ్లనానందాశ్రులు నిండిపాఱెను. ఏకస్వరూపుఁడయ్యును నిర్వురుగఁదోచిన వారట భక్తులకానంద దాయకముగ దుష్టులకు భక్తిహీనులకు శంకావర్ధకముగ లోకానుకరణ మొనర్చుచు వింతసంభాషణ వెలయించిరి. కన్నులపండువుగ, వీనులవిందుగ నదికనుచు వినుచున్న బ్రహ్మాదిదేవతలు వియత్పథమున నుండి వారిర్వురిపైఁ బూలజల్లులు గురియుచుఁ బలువిధముల నోరారఁగ నుతులు పొగించుచు నిలిచిరి.

తే॥ ఆదిమధ్యాంతములు లేకయలరువాని ।
నొక్కఁడయ్యును నిర్వురై చక్కదోఁచి ॥
మాయలోకాలముంచి తన్మాయ కవల ।
నుండుదేవుని గీర్తింతు మొప్పుభక్తి ॥

**వరాహమూర్తి:-** దేవదేవా! వైకుంఠనాథా మీరా వైకుంఠముం బాసి యిటకేల నరుదెంచితిరి? వినఁదగిన దేని నాకదితెలియఁ జెప్పుడు.

**శ్రీనివాసుడు:-** ఆదివరాహమూర్తీ! నీవినరానిది నీవెఱుఁగనిదేమున్నది? అడిగినాఁడవు కావునఁ జెప్పుచున్నాఁడను. భృగుమహర్షి కార్యార్థమై వచ్చిమదీయ వక్షమునం దన్నిపోవుటంగన్న యున్నుమిన్న కలుములపైదలి పద్మాలయ నాపైఁగినిసియటనుండి నన్ను నెడఁబాసి వచ్చి కోల్హాపురమున కాపురమువెట్టినది. ఆకమలాలయ లేనికాపురము కష్టముకాగా నేనును బురమువెడలి వచ్చితిని. వచ్చియట నీనివాసమునకు దక్షిణమున వల్మీకాంతరమున నెలవుచేసికొని యుంటిని. దైవయోగమున నటకువచ్చి యొకగొల్లఁడు, పశులకాపరి నాతలపైఁ గఠోర కుఠారాఘాతమొనర్చెను. ఆదెబ్బవలని బాధ నాకోర్వరానిది కాగా మందుమాకుల వెదకుచు నిట నీకొండ దినదినముఁ దిరుగాడుచుంటిని. నేడు

దైవయోగమున నోభూరమణా! వరాహదేవా! నీదర్శనమిటనాయెను. ఏదియైనను మనమేలునకేగదా. ఈకలియుగాంతము దనుక నేనీకొండనేయుండ నభిలషించుచున్నాను. ఈ నాసంకల్పమున కనుకూలముగ నీధరాధరమున నాకుండనింత తావొసంగుమని యాధరాకాంతుని నిన్ననేఁ గోరుచున్నవాఁడను. ఇట్లనుచున్న యాదేవున కావరాహమూర్తి యిట్లనెను.

వరాహమూర్తి:- ఓదేవా! ఇదేమి మహాభాగ్యము? తగుమూల్యమిచ్చి మీకువలయు భూభాగము మీరుండం దీసికొనుఁడు.

అన్న నావరాహదేవునితో నాదినారాయణుండు మధురమధురముగ నిట్లనియెను.

శ్రీనివాసుడు:- అగునగునదియుక్తము. ఏవస్తువునుగాని ఏరివద్దనుండి గాని యూరకతీసికొంట భావ్యముకాదుకదా. మీయిచ్చుభూమికి నేవిలువనీయనేవలయును. మీకోరిన యట్లుగఁ దగునర్ఘమేనిచ్చెదను. దానికి మీరు తప్పకయంగీకరింతురే యనికొందును. ఓ పృధ్వీకాంతా! ప్రప్రధమదర్శనము, క్షీరాభిషేకము, నైవేద్యము. ఈయవియే నేనిచ్చువెల. ఓకృపానిధానా! ఇంతకుమించిన వెలయేముండును?

అనిన యావైకుంఠ దేవునకాతనికోరిన భూమి నాయాదివరాహదేవుఁడొసంగెను. వారపుడొండొరులఁ గడుంగడుగఁ బ్రశంసించికొనుచు నెంతయు వినోదించిరి. అది మొదలుగ నాకొండనున్న యావేంకటేశునకు సేవలంజేయ నావరాహగిరీశుఁడు కోలపతి వకుళమాలికయను కన్యారత్నమును నియోగించెను. ఆయమయునేమరకయ శ్రీనివాసు సేవలఁ బొనరించుచుఁ దనియించుచుఁ దనియుచుండెను. దినదినము నేత నున్నుకుండ నావరాహదేవుఁ డావకుళమాలికచేతన దేవునకు శ్యామాకాన్నమును, మధుయుక్తముగ భోజనార్థము పంపుచుండెను. ఆయమ్మయు నాదరమున నాపుండరీకాక్షునకు నన్నపానము లిచ్చుచు నౌషధంబిడుచుఁ దగుసేవలఁ జేయుచు సమ్మదమందుచుండెను. అనవిని యామునులు సూతునిట్లనియడిగిరి. ఓమహాభాగా! దేవునిదానుగా దగ్గరనుండి సేవింపంగన్న యావకుళమాలిక భాగ్యమేభాగ్యము. ఆయమయెవరు? తొలిజామున నామెయొనర్చిన పున్నెములేమి? ఏమిపుణ్యమున నామెయట్టి మహద్భాగ్యముం బొందెనో చెప్పి మమ్మనుగ్రహింపవే యనవారికి రౌమహర్షణి యిట్లనియెను.

**వకుళమాలికా చరితము:-** నాయనలారా! మునివరులారా! ఆవకుళమాలిక తొలిపుట్టువునఁ గృష్ణదేవువాత్సల్యము మీఱఁబెంచి పెద్దచేసిన యశోదామాతయ. శ్రీకృష్ణుని యనంతరూపుని బాలక్రీడలందనిసియు నాతల్లి తనపుత్రుని గోపాలబాలుని శ్రీకృష్ణుని వైవాహికోత్సవమును గండ్లారఁగాంచి యానందించు భాగ్యముంబొందఁజాలకపోయెను.

ఆయమయొకనాఁడా దేవుంగాంచి యిట్లుపలికెను. నాయనా! శ్రీకృష్ణా నీపెండ్లి వైభవమును గండ్లారఁగాంచి ముదమందనేనెంతయుఁ గోరికపడుచుంటిని. ఆభాగ్యమింత దనుక నాకుంగలుగకపోయెంగదా! కొడుకుపెండ్లి మనసారంగాంచు తల్లిభాగ్యమేభాగ్యము. ఆనందవర్ధనా! లక్ష్మీమనోహరా! పవిత్రమును బుణ్యవర్ధనమునునగు నీకళ్యాణ మహోత్సవమును నాకుంగనులారం గాంచుభాగ్యముం గలిగింపవే యననాయమతో నామాయలాడు గోపాలుఁడు మృదుమధురవచనముల నిట్లనియెను. అమ్మా! నీమనోరథమిప్పు డీడేరునదికాదు. కొద్దికాలమునకుం బిమ్మట మఱుజన్మమున శ్రీశైలముననది సఫలము చేయఁగలను. అనెను. ఇట్లునందనందనుఁడు పలికినవెనుకఁ గొంతకాలమున కానందుని ప్రేమంపుటిల్లాలు తనువుంబాసెను. ఆమెయె ఆదేవువరమున నీకలియుగమున వేంకటనగమున వకుళమాలికగా జన్మించెను. తల్లికిచ్చిన వరమును దలఁచి తలఁచి పుట్టువెఱుఁగని దేవుఁడు భక్తవరదుఁడు భూమికిం దిగివచ్చి యానందవర్ధనుఁడై వింతలీలల నాకొండను వెలయఁజేసెను. అజ్జారే! ఆదేవులీలలేమని చెప్పునది? జగత్కళ్యాణకారుఁడు జగదీశ్వరుఁడు యశోదామాత కానందముం గూర్పనెంచి వేంకటగిరిని వెలసెను. దైత్యులవంచింపను, దేవతలకు మోదముంగూర్పను, భక్తులకు హితమొనరింపను, విరక్తులకుముక్తి నొసంగను, సద్వర్తనముల నమ్మినడిచికొను వారికి సుఖములు కలిగింపను నటవెలసి ప్రాకృత మానవునట్లు వింతలీలలు వెలయించెను. భగవంతుని యనుగ్రహమునే పొందఁగలుగుటయేమియది? ఆవకుళమాలికయెంతయు భాగ్యశాలినిగదా! ధన్యురాలుకదా!

భగవంతుని లీలలు,క్రీడలద్భుతముల వాఙ్మానసగోచరములు. జగత్పావనములగు నాభగవల్లీలల నెవఁడు వర్ణింపనోపును? నాడట హనుమంతునిచే నిత్యపూజితుఁడై యవిరళసేవలందిన యాశ్రీహరియే యిటనర్జునునకు సారథియై వింతసేవలనందించెను. ఈనిత్యశుద్ధ తత్త్వంబునను దేవదేవుని భక్తిశ్రద్ధల నభివాదనలఁ బూజించువారెవ్వరైనను బుణ్యభాజనులై తరింతురు. మహామునులైనను దేవునెడ శ్రద్ధాభక్తులు మానిన దోషసంప్రాప్తినందుదురు. కావుననే సత్యజ్ఞానమునందిన ఋషులు రాజులు పితరులు బ్రాహ్మణాది యెల్లమానవులు, రాక్షసులు నెల్లరును నాశ్రీహరి పూజలంజేయనర్హులై. అందఱిపూజల నాతఁడందుకొనును. హృదయమిచ్చిన వారికెల్లరకాతఁడు హృదయమిచ్చి తరింపజేయును. పవిత్రహృదయమే దేవునకిరవు.

కలియుగమున మానవులల్పసత్త్వులు నల్పజ్ఞానులు, పాపకర్మాసక్తులునై యుంట వారిందరింపం జేయ నాదేవు డిందిరారమణుఁ డనుకంపఁ బ్రకృతమానవునట్ల చరించుచున్నాఁడు. అధర్మమునణఁచి, ధర్మగ్లానిం దొలఁచి, ధర్మాభ్యుదయమును జేయుచున్నాఁడు. పాపులరాక్షస భావుల మోహమగ్నుల నున్మూలించి సాధుసజ్జనులకు దివ్యభావులకుఁ బ్రమోదమును గూర్చును. బాలకులలో బాలకుఁడై, పెద్దలఁ బెద్దయై

వినోదించును. జగన్మోహన సౌందర్యమున లీలామానుష విగ్రహుఁడై విహరించును. ఆరూపమాతనిదే, ఆతఁడు కల్పించికొన్నదే. ఏ బ్రహ్మయు, నేవిశ్వకర్మయు నాతనికై కల్పించినది కానేకాదు. తనకుఁదానై యాతఁడందినదా దివ్యమోహన మనోహరరూపము.

ఆక్షేత్రమహిమము, నాతీర్థవైభవము, దివ్యము ననంతము. అట సాక్షాద్రమాకాంతుఁడు వినోదవిహారముల నానందించుచుండ నద్దానిపుణ్యము ప్రభావమునేమని చెప్పునది. బహుజన్మార్జిత సుకృతఫలముననే యా క్షేత్రసందర్శనము సంప్రాప్తము కాఁగలదు. ముక్తిప్రదాయినియగు నావేంకటాచల సందర్శన భాగ్యము దేవతలకును దుర్లభమనవలయునుగదా. దానిం దర్శింపంగన్న తద్దర్శన భాగ్యమున నెడఁదలఁగడిగికొని, పాపచింతల మాని, పవిత్రభావులు కాఁగలిగిన మానవులే మానవులు. వారి భాగ్యమే భాగ్యము.

అన్న నామునులు రౌమహర్షణిం గాంచి సూతమునివరా! దయానిధానా! సర్వశాస్త్రసమ్యగ్జ్ఞానా మహాశయా! నీయనుగ్రహమున పాపనాశనకరమగు వేంకటేశ మాహాత్మ్యమును, అవతార ప్రభావమును, చోళరాజచరిత్రమును, దేవుడు వైకుంఠమును వీడి వేంకటాచలమున కరుదెంచుటయునాదిగా దివ్యకథలనెన్నేని యాలించితిమి. ఎంతవిన్నను మనసునకుం దనివియేకాకున్నది. శిష్యవత్సలా! యలౌకికమై తనరు నాదేవుదివ్యగాథల మాకుశ్రవణపేయముగా నింకను వినుపింపవే. దేవుడు తాను పద్మావతిం బెండ్లాడను, తల్లికిం దనపెండ్లివేడుక చూపను నీకొండకుం దిగెనంటిరి. శ్రీనివాసు కాపద్మావతితోడి పెండ్లియెట్లాయెను? ఆరాజవరునకా దేవదేవుఁడెట్లల్లుడాయెను? ఆయాకాశరాజు చరితమేమి? ఆతని యొనర్చిన సుకృతములేమి? అవియన్నియు మాకు వీనులవిందుగ జరిగినది జరిగినట్లుగ విశదముగ వినుపింపవే యనుగ్రహింపవే యననాసూత తపోధన తల్లజుఁడు ఆనందమున వినయభూషణుఁడై, భక్తితన్మయుఁడై యిట్లని పలుకసాగెను. ఓ మునివరులారా! మీరు ధన్యులు, నన్నును ధన్యునొనరించుచున్నారు. శ్రీవేంకట గిరివరనాధుని కథాసాగరమున, మహిమాంబుధిని నిరతము మునిగితేలు ధన్యజీవులు పుణ్యవర్ధనులు. మీరడిగినదానినే నెరింగినంతవట్టును వివరముగ నెఱింగించెద.

ఓం శ్రీ భక్తజనానురక్త హృదయాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ సనకాది మహాయోగిపూజితాయ శ్రీ వేంకటేశాయ నమః

# ద్వితీయాధ్యాయము

## ఆకాశరాజునకుఁ బద్మావతీప్రాప్తి - పుత్రోదయము

నాలుగు మహాయుగములు కడచెను. కడపటి ద్వాపరాంతమున మహాభారతయుద్ధమును నడచిపోయెను. అటుపిమ్మట విక్రమాదిత్యాది నృపవరులు శకాది మహాపురుషులు, శూద్రకాదిరాజవరులు తమతమ పునీతవర్తనములఁ గొందఱు తమ్మెఱింగియుఁ గొందఱెఱుంగకయుం గూడ స్వర్గముంబొందిరి. అదియొకకాలము. తుండీరమండలమును బాలించుచుఁ జంద్రవంశోద్భవుఁడు సువీరుఁడను రాజవరుఁడు విశ్రుతనాముఁడాయెను. నారీరత్నము నందని యనునామె యాతనిపట్టపురాణి. ఆనృపశ్రేష్ఠుని కుమారరత్నము మిత్రవర్ముఁడను మహాభాగుఁడు. ఆమహారథుఁడు నారాయణపురము రాజధానిగ వసించుచు ప్రజాపాలన మొనరించుచుండెను. ఆపృథ్వీపతి ధర్మమున ధరణీపాలన మొనరించుచుండ నెలనాల్గువానలు వలయునటులఁ గురియుచుండెను. ధరణిసస్యశ్యామలమై యెల్లపంటలఁ గొల్లగనీయసాగెను. గోవులు పాలు కుండలకొలఁదిగఁ గురియుచుండెను. ప్రజలెల్లరును నీతినియమములం దప్పక యన్యోన్యప్రేమలతిశయింప యీతిబాధలు, శారీరక మానసిక బాదలు లేక లేమియనున దెఱుంగక కష్టము లెఱుంగక యీభూమియందుననె స్వర్గసుఖములను భవించుచుండిరి. తనధర్మ పరిపాలనచే నాతండు సుధర్ముండని పొగడందెను. పాండ్యరాజపుత్రి మనోరమ యాతనిధర్మపత్ని యాతని కన్నివిధముల ననుకూలవతి. ఆపుణ్యదంపతులకు నాకాశుఁడు, తొండమానుఁడు నను నిర్వురు కుమారులుదితులైరి. వారుపెరిగి పెద్దవారై విద్యావినయ సంపన్నులు, వంశోద్ధారకులు, కులదీపకులునైరి. అందు జ్యేష్ఠుఁడాకాశరాజు నారాయణదేవ భక్తిపరాయణుఁడు, ధర్మపరుఁడు, వానిధర్మపత్ని శకవంశజ, ధరణీయను తరుణీలలామ. ఈశ్వరునకద్రిజాతవలె నామెపతికి నిజముగ నర్థాంగియేయాయెను. బ్రహ్మకు వాణియట్లుయామె పతిపలుకు జాడలనె నడుచుకొనుచుండెను. వారిదాంపత్యమే దాంపత్యమని ప్రజలువేనోళ్లఁ గొనియాడుచుండిరి. వారింగాంచి మురిసికుమరునందు రాజ్యభారముంచి నిశ్చింతుఁడై మిత్రవర్మ పత్నీయుతుఁడై పరమపునీతము వేంకటాద్రిం గలతపోవనమునకుం బోయెను. తొండమానుఁడన్నివిధముల నన్న కనుయాయుడై ధర్మనిష్ఠను ధైర్యోత్సాహముల నన్నకుం గుడిభుజమైయుండెను.

ఇపుడాకాశరాజు సార్వభౌముఁడు ప్రజానుకూలముగఁ బాలన కొనసాగించు చుండెను. దరణీతరుణిపట్టమహిషికాగా నేకపత్నీవ్రతుఁడై ధర్మవ్రతుఁడన నొప్పియుండెను. ఆతఁడు ధర్మపాలనమునఁ దండ్రిని మఱపించి మించి ప్రజారంజకుఁడై యుండెను.

ఆటపురుషులెల్లరేక పత్నీవ్రతులు, పడతులు పతివ్రతలు, బిడ్డలు మాతాపితృభక్తులు, విద్యార్థుల విద్యానురక్తి, గురుభక్తి వేనోళ్లంబొగడఁదగు గురువులుం శిష్యులం బుత్రులుగఁ నెంచుచు వారలంగల దేవునెఱింగి విద్యాబుద్ధులం బోధించి తనియుచుండిరి. రక్షణ శిక్షణలలోఁ బ్రజలకెల్లరికిం దండ్రియై వారలతండ్రుల మఱపించుచు నాకాశరాజుపాలన కొనసాగించుచుండెను.

చిరకాలరాజ్య భోగములనుభవించియు సంతానలాభముం బొందఁ జాలని యావియన్నృపాలుడు నిజగురునిపాలికిం బోయి వినమ్రుఁడై దుఃఖాతిరేకమున నిట్లనియెను. గురువరా! ఏమనిమీతోఁ బలుకంగలను? మీయనుగ్రహముననె ధనకనక వస్తువాహన పరిపూర్ణమగు పాడిపంటలనిండిన ఘనమగు రాజ్యమును బొంది రాజ్యభోగముల ననుభవించుచున్నాడను. దానధర్మములు పొనర్చితిని; తీర్థముల సేవించితిని. పుణ్యక్షేత్రములకేగి దేవునారాధించితిని. కాని నేనేజన్మమున నేమిపాప మొనర్చితినో, పితృదేవులకు ముక్తిని జేకూర్చుపుత్రుని ముఖపద్మమును గండ్లారగఁ గాంచివీనులారగఁ గుమరుముద్దు పల్కులాలించి యానందించు భాగ్యమునొందఁజాలకపోతిని.

పుత్రహీనులకు మాకునెట్టి దుర్గతులు సంప్రాప్తములు కానున్నవో కదా! సుధర్మయుతమును, సుందరపవిత్రము నగు వంశమున నాపుట్టువోటికుండ యటులవ్యర్థమాయెను. నేనెంతయు గులపాంసనుఁడనైతిని. కడుంగడు పుణ్యవంతులకే చేకూరంగల సుపుత్రలాభము నావంటి వానికెట్లు చేకూరంగలదు? కడకు ముద్దుల మూటగట్టు నొక కుమరితయైనను గలుగకపోయెనే --

ఆ.వె॥ వరద వాసుదేవ, వైకుంఠపురవాస
రామకృష్ణ కేశవా మురారి
తలను జేతులుంచి దండంబులిడుదును
వేంకటేశ బ్రోవవే రమేశ॥

ఆ॥ నారదాది వినుత నారాయణా! హరీ!
పాలితామరవర! పరమపురుష!
రంగనాథ యీశ! రాజీవలోచన!
మ్రొక్కులిడుదు బ్రేమఁబ్రోవరావె.

తే॥ అభవ! యచ్యుత! రంగేశ! యాదిదేవ!
ఓ జగద్గురు! కరుణానిధీ! జనార్ద
నా! నమస్కృతు లేవేళ నేనొనర్తు
దీర్పఁగదవె శ్రీరంగేశఁ దీమకోర్కి

కం॥ ఈశుని, సుబ్రహ్మణ్యుర
మేశుని, స్వర్ణాధు భక్తినెడఁదఁదలంతున్
దోసంబులు తొలగించియుఁ
జేసికృతార్థునిగ నన్నుఁ జేబట్టంగన్

ఆ॥ మ్రొక్కులంది నీవు మోదమందెదవట
కోరుకోర్కు లెల్లఁ దీరుతువట
వేంకటాద్రివాస సంకటహరదేవ
చేరి మ్రొక్కులిడుదు శ్రీనివాస

ఆ॥ నీవెప్రాపుమాకు నీవెమాదిక్కయ్య
నీరజాక్ష భక్తపారిజాత
సదయహృదయ! మాకు సత్పుత్రుఁగులదీప
కుని, నొసంగి; ముదము కూర్పుమయ్య

ఆ॥ వేంకటాద్రివాస వేవేలుదండముల్
శేషశైలవాస చేమొగుపులు
వాసవాదివినుత వందనశతములు
పద్మనాభ వరద ప్రాంజలింతు

ఓ వరద! అచ్యుత, శ్రీరంగేశ, జగన్నాధా! జగద్గురూ! హేసుబ్రహ్మణ్యా, సురాధీశ! శ్రీరామచంద్రా! శ్రీకృష్ణదేవా! ఇవేనమస్కారములు. దేవాదిదేవ! అఖిలదేవస్వరూపా! శ్రీ వేంకటేశా! రమాకాంతా! వరాహముఖా! నారాయణా నమస్కృతులు. ఓదయానిధీ నాయందుఁ గనికరముచూపుము. బిడ్డలులేనివాఁడను; కడుదుఃఖితుఁడను. నేనీభవ సాగరము నెట్టులు తరింతును? ఓకరుణానిధానా! యక్కటికచూపుము. నాప్రార్థన లంగీకరింపుము. నన్నుద్ధరింపుము అనిదేవదేవు పరిపరివిధములఁ బ్రార్థించుచునటు గురునింగాంచి, ఓ గురూత్తమా! అనపత్యుఁడ నాకెట్టిగతులు కలుగనున్నవో? ఎట్టినరకంబు లొదవునో? పుత్రలాభముం బొందనే దేనియుపాయము కలదేని చెప్పిదాన నన్నుద్ధరింపవే. అనుచున్న యారాజా నాలించి గురుండాదరమున నిట్లనెను. ఓరాజా! చింతనెడచేయుము. నృపశ్రేష్ఠా! పుత్రకామేష్టి నొనరింపుము. దాననీకు సుపుత్రలాభ మొదవఁగలదు. అన్న గురువరునాలించి రాజవరుఁడు జన్నము నొనరింపసంకల్పించెను.

పుత్రకామేష్టి నొనరింపం బూనిన రాజొకదినమున శుభముహూర్తమున మంత్రివరులు బ్రాహ్మణశ్రేష్ఠులు తన్నుబలిసియుండ గురునానతిం బోయి యారణీనదీతీరమున నొక సంశోభితానుకూల తలంబున సువర్ణమయ హలముతోఁ

దాన దున్నుచు గుప్పెడుగింజల జల్లెనో లేదో నాలుగుచాళ్లు త్రిప్పెనో లేదో! అదేమివింతయో! ఒక్కెడవృషభరాజము లట్టెయాగిపోయెను. ఇదేమని కనినంత హలాగ్రమున వికసిత కనక కమల మధ్యమున నొకశిశు వందాలబరణి కాలుసేతు లాడించుచుఁ గననాయెను. రాజాడెందమునఁ బలుయోచనలాయెను. జలములనుండు పద్మమీనేల వికసించి యుంటయేమి? అందీయందాల పసికందేమి? ఇదియంతయు నాదేవునిమాయయే. అనుకొనుచుఁ గనులు మిఱుమిట్లుకొనుచుండఁ బోతపోసిన పుత్తడిబొమ్మయన గననయిన యాపసికందును గన్నరాజు డెందమానందకందళిత మాయెను. బిడ్డలు లేని రాజాయాడు బిడ్డనట్టెయెత్తి యొడింజేర్చి సహస్రదళముల నొప్పు నీకమలమునఁ గూర్చుకొని, కమలాసనయై సర్వశుభలక్షణ సంపన్నయై నాయొడిం జేరిన యీబిడ్డ నాబిడ్డయ దేవుఁడేయనుగ్రహించి నాకుం బ్రసాదించెను. అనుకొంచు మాటిమాటికి ముద్దాడసాగెను. అంతలో నాకాశవాణి వానికిట్లని విననాయెను. అగునగునాపె నీ బిడ్డయె. నిక్కము. ఆ సులోచనను గమలాసనగ నెంచి కడుంగడుగఁ బ్రేమమిగులఁ బెంచి పెద్దచేయుము, నీకెంతయు మేలగును. ఆవాక్కులు విన్నరాజుముదితమానసుఁడై బిడ్డనెత్తికొనిపోయి యంతిపురమున నిల్లాలిని రాణినిధరణీరమణిని గని బిడ్డనామెచేతికిచ్చి, బిడ్డలు లేనిమనకీ బిడ్డ నీశ్వరుఁడు కనికరించి ప్రసాదించెను. పృథ్వీతలమునఁ దమ్మిపూసెజ్జం గూర్చుచు దొరికిన దీముద్దుబిడ్డ కనుమనెను. ఆమెయు నాపసికందు నందుకొని, తనిసెను. పద్మమున నుద్భవించుట దానిఁ బద్మినియనియుఁ బద్మావతియనియుఁ బిలుచుచు వారిద్దరు గారాబమునఁ బరమప్రీతిమానసులైరి. పిమ్మట గురునానతిని జన్మమును సుసంపన్నమాయెను. ఆదంపతులల్లారు ముద్దుగఁ బెంచుచుండ నాబిడ్డయు దినదినప్రవర్థమానయై తలిదండ్రులకెకాదు కన్నవారికెల్లఁ గనువిందై యెడందలకు ముదముంగూర్చుచుండెను.

## ఆకాశరాజునకుం బుత్రోదయము

ఆబిడ్డయిలుసేరిన మూరుతమెట్టిదియో, కొలఁదికాలముననే రాజపత్ని గర్భవతియాయెను. గర్భసంశోభిత తరుణింగన్న రాజెంతయోతనిసిన మనమున నిన్నాళ్లకు నాతరుణీలత ఫలించినదని యుప్పొంగిపోయెను. రాజాగర్భవతికిఁ బుంసవన సీమంతాది శుభసంస్కారములు యథావిధిగా జరిపించెను. ఇట్లు నెలలు నిండగ నాధరణీ సుందరి సువిశాలలోచన, యత్యంత శుభముహూర్తమున నెల్లగ్రహములు శుభోన్నత స్థానంబుల నుండ సూర్యుఁడు కన్యారాశినుండ రోహిణీ నక్షత్రమున దశమి తిథిని, శుక్లపక్షమున గురువారమునఁ బుత్రరత్నమును బ్రసవించెను. అత్తఱి దేవదుందుభులు మొఱసెను;

భవనము నందంతటఁ బూలజల్లులు పెల్లుపడెను. పిల్లతెమ్మెరలొడళ్లకుఁ బెల్లుసుఖమిచ్చుచు వీచెను. ఈ శుభవార్తను జెప్పవచ్చిన వారికెల్లరాజుకాన్కల వారిగఁ గురిసెను. పుత్రోత్సాహమున మునిగిన రాజు ఛత్రచామరములు వెలిగా సర్వస్వమడిగిన వారికి లేదనక యెక్కుడుగనిచ్చి తనియించెను. కోట్లకొలఁదిగ గోవ్రాతములు, వృషభరాజములు, గజాశ్వవాహనములు దానములొసర్చెను. పదునొకండవదినమున మోదము ముప్పిరిగొన రాజుశిశువునకు జాతకర్మాదులు నివర్తింపఁజేసి వసుదానుడు అనినామకరణమొనర్చెను. ఆతఁడు వసుదాతయనియుఁ బిలువఁబడుచుండెను. ఆబిడ్డడు శుక్లపక్షమునందలి చందమామయట్టుల, నాకన్నెలమిన్న పాల్కడలి పట్టియట్టుల దినదినము నెదుగుచు విరాజిల్లుచుండిరి. దినదిన ప్రవర్థమానులగు నాబిడ్డల పొలుపుగనుచు నాదంపతులు పొందు నానందంబంతింతన నలవికాకుండెను. వినయాది సద్గుణసంపన్నుఁడా బిడ్డడు వసుదానుడు పవీతుఁడై సద్గురువుల కడనెల్ల విద్దెల నామూలముగ నేరిచెను. తండ్రికడన శస్త్రాస్త్రవిద్యల, గజాశ్వారోహణాది యుద్ధవిద్యల నాటితేరెను. చతుర్వేదములు, వేదాంగములు, నుపాంగములు, శాస్త్రములు నేర్చి రాజనీతి తెలిసి, సమరతంత్రము లెఱింగి యన్నిట నంతటివాఁడు మఱిలేఁడనిపించుకొనెను. వేసఁగినాటి వేయిచేతుల వానివలె శత్రువులకు దుర్నిరీక్షుఁడుగనుండెను. అన్ని సద్గుణములఁ దండ్రిని మించియొప్పెను.

## పద్మావతీ వనవిహారము - నారదుఁడు శుభలక్షణములు చెప్పుట

ఆ పద్మినియు దినదిన ప్రవర్థమానయగుచు నిండుజవ్వని కాగాఁ జూచి యారాజామెకుం దగువరునికై యన్వేషింపఁదొరకొనెను. ఆతనికెందుం దృప్తిలేకుండెను.

ఆ॥వె॥ వెదకి వెదకి రాజువేసారి వేసారి
తగినపెండ్లికొడుకు తన తనయకు,
నెందుఁగనగ, నగునొ యుపుడంచుఁ గడుచింత
మానకుండెనెపుడు, మానసమున ॥

ఆకన్నియమిన్న యొకనాడు సఖీజనముతో గూడి, శుకపిక శారికాదుల కలకల నినాదముల మనోహరమై, తేనెలొలుకు, విరిసితావులు విరజిమ్ము పూలజాలుల నొప్పిన యుద్యానవనమున విహరింపం బోయెను. అవ్వేళదైవవశమున నటునుండి పోవుచున్న నారదమహర్షి వర్యుఁడు వనలక్ష్మిం బోలినదానిం, బద్మావతిం గాంచి యబ్బురమున మునింగి, ముసలిమునిరూపమున నటఁజేరి యిట్లనెను. బిడ్డా నీవెవ్వతెవు? ఎవ్వరి

బిడ్డవు? ఏదినీయుఁఅచేతి నిటుచూపుము. అననంత నాయమసిబ్బితి యుబ్బున నాహస్తమును జూచి మీరేమిచేతురు?నే నీపురమేలు వియద్రాజసుతను. పద్మావతి యనుదానను. అన నామునివరుఁడును అమ్మా! నేను నీతండ్రిం బోలినవాఁడను నిన్నుంజూచినంతన నీచేయిచూచి శుభలక్షణములు తెలిసి చెప్పవలయునను కోరికిపొడమినది అనెను. అంతనారాచ కన్నెయు బ్రాహ్మణవరా! ఇదో నాచేయి చూచి లక్షణములు దయచేసియున్న వున్నట్లుగ వచింపుడు అనెను. అదివిన్న నారదుఁడామె లక్షణములం గాంచి యిట్లనెను.

ఓ యంగనా! సుందరీ సులోచనా! నీ సులక్షణముల నేనేమని చెప్పవలెను. అయిన నాలింపుము వచించెద. నీవంచబోధలకు నడకలు నేర్పుచున్నావుకదా. నీపదములెట్టితామర పూరేకులన మృదువులై స్వస్తిక యుక్తములైయున్నవి. పాదాంగుళు లెట్టిననై యున్నతములగు నరుణారుణ నఖములనొప్పుచు నందమిచ్చుచున్నవి. చీలమండలు (గుల్ఫములు) గూఢములై సమంబులైయున్నవి. నడుమున్నదా లేదాయను సందియముం గలిగించుచు సింగపునడుము నందమున జవ్వాడుచున్నది. నాభిలోతైన సుడిగుండమే నీయీ దక్షిణావర్తనాభి నిజముగ గంగానదీ జలావర్తమ. ఉదరమతి సూక్ష్మము. అంబుజాననా! నీయరజేతులారక్తములై పద్మరేఖలం గూడి సుందరములు సూక్ష్మములునగు కణుపులు గలిగి చిలుకముక్కును బోలు సునిశిత సుందరారుణ నఖముల నలరారుచున్నవి. ఆరెండుబాహువులు సుకోమలములు, సుదీర్ఘములు నైపూలదండల బోలియున్నవి. కంబుగళము సుందరరేఖలఁ జెలఁగుచుఁ జెన్నయియున్నది. ముఖముసంతత ప్రసన్నమై కళంకములేని నిండుచందురు. బింబమట్టులలరారుచున్నది. బంగరుటద్దములట్లున్నవీ చెక్కిళ్లు అందు కుండల కాంతులు కులుకుచున్నవి. నువుపూవునందమును బుడికి పుచ్చుకొన్నది గదా నీనాసిక. ఓశుభాననా! అష్టమినాటి చందురునట్లతి మనోహరమై యొప్పుచున్న నీ లలాటభాగము. ఆపైన నీలాలకలూగులాడుచు జాబిల్లిలోని యిట్టిం దలపించుచు సొగసును గూర్చుచున్నవి. అదొకనుబొమలు, ధనుషాకారమున నొప్పెడిని, చెవులు శ్రీకారములు చుట్టినట్లున్నవికదే. నీమస్తకము నందమేమనవలయును. స్నిగ్ధమై తెగబారెడు నల్లనల్లని శిరోజములచే నలంకృతమై నీకు నీవసాటియని చెప్పుచున్నవి. దాడిమగింజలంబోలు నాపండ్లవరుస, చిఱునవ్వుల వెన్నెలలు, బింబఫలములం బోలు పెదవులపై నటించుచుండ నీమోమందముంగన నోయవ్వా! నీవు నిశ్చయముగ నావిష్ణుదేవునకిల్లాలివి కాదగుదువని తోచుచున్నది. అగునగు నిక్కముగ నీవు క్షీరసాగరమధ్యమున నుద్భవించిన సాక్షాలక్ష్మిని దలపింపఁజేయుచున్నావు. అనిపల్కి యామునివరుఁడా ముగ్ధలచే సంపూజితుండై యటనుండి వెడలిపోయెను.

ఇదియెంతయు వినుచున్న చెలికత్తెలు పద్మినిం గాంచియిట్లనిరి. ఔనేయం దాలభరిణీ! ఆముదుసలి ముని మాటలలో మునిఁగిపోయి యట్లేయుండిపోతివే. ఆనల్లనయ్యకీనాఁడే పెండ్లికూతువైపోయినట్లుంటివే. పదపద. మనమువచ్చి తడవైనది. అటవారి వింతచేష్టలకు, వినోదములకు, కులుకుపలుకుల మెలకువలకు మేరలేకానరాకుండెను.

సీ॥ కోమలికాంచితే కోవిదారంబదే
కులుకుచున్నది పూలుగుబురుకొనఁగ
అటుచూడవే యంబు జాననా! యబ్జము
ల్విఁటిసికొలంకున మునిఁయుచుండె
ఆపొంతఁజూడు కల్హారంపు మొగ్గలు
తమదెయందంబంచుఁ దనియుచుండె
మొల్లలగంది యా మల్లెలఁ జూడవే
విట్టివీగెడిఁ బూల విరిసిమునిఁసి

ఆ॥ కుందరదన కంటె సింధువారము సొంపు
విరు లశోకమందు విరిసెఁగనుము
పారిభద్రముఁగను పాటలగంధిరో
రెమ్మ రెమ్మఁబూలు గ్రమ్మికొనియె.

తే॥ కొమ్మ! మోదుగునదె కనుగొమ్మ! కొమ్మ
కొమ్మ కనులెత్తిగాఁ గనుగొనుచునుండె
పాటలంబుల నేరవే పద్మనయన!
పూలముసుగున బిబ్బిగఁ బొలుచుచుండె

ఆ॥ గున్నమావి పొంత గుమిగూడి చూడరే
చిగురుకేలు లూపిచేరఁబిలుచుఁ
దావులొలుకు పూలఁదనువెల్ల కనులుగాఁ
దనిసి చూచుచుండెఁ దరుణులార!

తే॥ వెదకిపట్టుఁడు కేతకి స్వెలదులార!
దాగితావులఁ జిమ్ముచుఁదన్నునెవరు
తెలియలేరంచు ఁగనితన్నుఁ దీయరనుచు
ముండ్లయాకుల ముసుగున మురియుచుండె

ఇట్లు కులుకుచు నులుకుచు నొండొరులఁ బిలుచుచు హేళనంబు లొనర్చుకొనుచుఁ జెట్టు చెట్టునకుఁ గొమ్మ కొమ్మకు నేగుచు నానందంపు బొమ్మలోయన రాజపుత్రి పద్మావతితో గూడియాచేడియలెల్లరు వనమున (బూలుగోయుచు విరులు విరియఁ జిమ్మికొనుచు నలరుల తావుల కలరుచు వినోదించుచుండిరి.

ఇంతలో నెటనుండియో యొకగజరాజు దీర్ఘమగు తొండమున కిరుప్రక్కలఁ దెల్లని కాంతులీను దంతములొప్పుచుండఁ జెక్కిళ్ల మదజలధారలోడి కల్లుగ జాలువారుచుండ మిగులనెత్తయి యొడలెల్లం బూడిదంజల్లికొని తొండమునఁ బట్టిన నీటినిజల్లుకొనుచు నిరుకెలంకులఁ గరేణుకలు బలిసికొలువ వెనుకముందుల కూగులాడుచు మెల్లని నడకలవచ్చుచు వారికంటఁబడెను. గజయూధముంగన్న యాజవ్వనుల కుల్లములు ఝల్లన బరుగుపరుగునఁ బోయి యాపొంతలనొక మట్టికడంజేరి నిలిచిరి.

## శ్రీనివాసురాక - పద్మావతింగనుట

అంతలో నిష్కళంక రాకానిశాకరునట్టుల ధవళమై సువర్ణాభూషణాలంకృతమై మెఱుగుతోడి శారదాభ్రమనఁ దమవైపునకు వచ్చుచున్న తురగోత్తమంబొండు వారికిఁ గాననాయెను. అద్దానిం గాంచిన యాముగుదలు తబ్బిబ్బులై తమలోఁదామిట్లని మాటాడుకొనసాగిరి. అదిగదిగో ఆగుఱ్ఱముంగంటిరే? అదియశ్వరాజమేనా? రూపందిన వాయుదేవుఁడా? దానిజవసత్త్వములకు సదాగతియు బిడియమంది వెనుకడుగు వేయునేమో! అదే యాయశ్వరాజముపైఁ గంటిరే? యొడలొందిన మదనుఁడేయేమో? కాదుకాదు. ఆ యనంగునకింతయందమా? ఇంతగాంభీర్యమా? ఇంతసౌమ్య సౌభాగ్యములా? ఆనల్లని యొడలికాంతులకదిగో నెమళ్లు మేఘభ్రమను బురులు విప్పికేంకరించుచు నాట్యములు సేయుచున్నవి. కనుచుంటిరే. ఆచెవులు శ్రీకారములేకదా! ఆ వీనులనేదో గుసగుస లాడుచుఁ జెప్పుచున్నట్టున్నవే తమ్మిపూరేకులట్టి యాసువిశాల దీర్ఘనయనములు. నిద్దంపుటద్దంబు నొద్దికనుంచు నాచెక్కిళ్లు వానిపై పద్మరాగాదిమణులు పొదిగిన కనక కుండలముల కాంతులు గంతులిడుచున్నవికదే. శంఖమునకు వంకలుదిద్దు నాకంఠముసొంపు, సువిశాలమై యున్నతమగు నాయురంబునొప్పు, చూడనొప్పునే కానిచెప్పఁదీరదుగదా. విఱిచికట్టిన బంగరుచేలము నుండి వెడలివచ్చు నీలాభ శరీరరుచులు వింతసోయగము నిచ్చుచున్నవి. అంచులఁ బూలతల యద్దకమున నొప్పుతెల్లని కండువా వలెవాటువైచినాఁడు. మొలఁజుట్టిన వింతరంగుల నొప్పు నాకాసెకోక యందము జోకలేనిదికదా. ఆజానులంబిత బాహువుల నొక్కట సుదీర్ఘోజ్జ్వల సుదృఢధనస్సును బట్టి

వేరొంట సుతీక్ష్ణబాణంబును బూనియున్నవాడుగదే. వెనుక నిరువైపుల నమ్ముల పొదు లమరియున్నవిగదా ? మొలపట్టుదట్టిని వ్రేలు, రతనాలజతనందివ్రేలాడు, బంగరుటొర వజ్రముష్టి నొప్పు ఖడ్గరాజమదే. దానికిం దోడుగ వజ్రంపు పిడిగలబాకును, అటవీపున నాల్గుబారల యీటెయు, గొంతుల నీనుచుఁ జేరియున్నవి. వృషస్కంధమున నుండి విశాలోరస్థలంబున వ్రేలాడు నుజ్జ్వలయజ్ఞోపవీతమును, ముఖమునఁ దిరుమణితిరు చూర్ణములఁ దీర్చిదిద్దిన యూర్ధ్వపుండ్రము నొకవింతసోయగము నొడఁగూర్చుచుండెను. రమణీయ రత్నమయాలంకారముల, కనకమయాంగదములఁ జూడనొప్పుచున్నవాఁడే. కండలు మెలికలు తిరిగిన భుజములు, హొసరేఖలు చిమ్ము సుందరాస్యము, కంబుకంఠము నుండి యంబుజోదరము మీదుగ వ్రేలుచు నృత్యములు సలుపు తులసిదళములతోడి పూలమాల పొదుపు, పాదముల బంగరుపాదుకల సొంపు, రూపొంది న శౌర్యోత్సాహములన శృంగారరసమేయన నొప్పుచున్నవాఁడే, యనుకొనుచు వారొండొరులఁ జూడవే చూడవేయనుకొనుచు నుండునంతలో నాతనికెదుట నడకొండయనఁ దోచునొక మదమత్తద్విరదరాజమును గాంచినదాని నావీరవరేణ్యుఁడు బాణముసారించి కొట్టఁ బోయెను. అదియును వెఱచినయదియుంబలె, భక్తితన్మయమట్టుల నంతనప్రణామ మొనరించునదియుంబోలెఁ దొండమునెత్తి ముంగాళ్లు మోకరించి చిన్నగ ఘీంకరించి లేచి మెల్లఁగఁ గరేణుసంఘంబుతో వెనుదిరిగిపోయెను. అదిగనుచున్న యాయంగనల యబ్బురపాటేమనవలయును. అప్పుడె తొందర తొందరగ నావీరవరేణ్యుఁడును వారికడకే వచ్చి, యశ్వమునాపి తొయ్యలులారా! ఇటు నీహొమృగమొండు పాఱివచ్చినది. ఎటుపోయెనా? మీరేమేని కాంచితిరా? యని ప్రశ్నించెను.

## శ్రీనివాస పద్మావతుల ప్రథమసమావేశము

అతని పలుకులు విన్నయాపద్మావతీ సఖులాతని కిట్లనిరి. ఓ వీరవరా ! మీరన్న యామృగమును మేమేమియుం గనినవారముగాము. మీరెవరు? ఎందలివారలు? మీపవిత్రనామధేయమేమి? ఇచటికి మీరేల నరుగుదెంచితిరి? ఇదియాకాశరాజ పరిపాలితవనము, తత్పుత్రీ విహరణోద్యానము. ఇందలి జంతువు లవధ్యములు, ఇందుఁ బురుషులు విహరింపరారాదు. ఇందుండి మీరు దయచేసి శీఘ్రముగ వెడలిపొండు. అనుచున్న వారిపలుకులు విన్న యాయోధవరుఁడప్పుడె హయరాజము నుండి దిగి నిలిచి యిట్లనెను. ఓయంగనారత్నములారా! మీరందఱెవ్వరు ? స్వర్ణకమలమట్ల మనోహరయై, సర్వాంగసుందరియైన యాయున్నత వక్షస్థల చంద్రనిభానన యెవ్వరు? మీవాగమృతముం గ్రోలి యిప్పుడె నానెలవునకు శైలతలమునకుం బోఁగల ననుచుండ నదివిన్న ధరణ్యాత్మజ,

పద్మావతి, ప్రేరేప, నాపె చెలికత్తియ యొకపద్మలోచన యాపార్వత్యవీరుంగని యిట్లనెను. అయ్యావీరవరా! ఈయమయాకాశరాజతనయ. వసుధాతలమున నుద్భవించినది. మాకెల్లరకేలిక. ఈమె పద్మినియనుపేరనొప్పును. అన విన్న యావీరవరుఁడల్లనఁ జిఱునగవు మోమునఁ దొణకిసలాడ నిట్లనెను.

ఓతలిరుబోడులారా! తెలిసిన పెద్దలు నన్ను నేకులమువాఁడనుటకును సందియమందుదురు నాకొకకులమనలేదు. అన్నికులములు నాయవియే. నానామము లనంతములు, పవిత్రములు, వేదవిద్రోహులు, బ్రహ్మవిద్వేషులునగు సురవైరులకు నెవ్వనిచేతి చక్రము భయముం గొలుపునో ఎవనిపాంచ జన్యశంఖధ్వని చెవులఁబడినంత వైరిజనములు గుండెచెదరఁ దబ్బిబ్బగుదురో, యెవ్వాని ధనస్సునకు శార్ఙమునకు మఱిసాటిలేదో, యాదేవు, వేంకటాచలవాసు, వీర జననాయకు నన్నుఁ గృష్ణవర్ణుఁ గృష్ణనామంబునఁ దపస్విజనులు, జ్ఞానివరులునగు విబుధ జనులెల్లరు పిలుతురు. నాశేషశైలము నుండియే యచటి నిషాదవీరులు వెంటనంటిరా వేటకని బయలువెడలి తిరుగుచు నాగాంచిన మృగమొండీదెసకు వాయువేగమునఁ బాఱిరాగా దానివెన్నాడి మీయీ యుద్యానమునకు నరుదెంచినాడను. అదియింతలోనన కనుమఱిగెను. మీరును మీయేలిక రాణి మృగీనయనయుఁ గనులకు విందొనర్చిరి. ఈమెంగాంచిన నామనమదోతీరుగనై పోయినది. మదనుఁడదను జూచికొని యెదఁబదునగు తలిరు ములుకులునాటుచున్నాఁడు. ఏమి! నేను మీరాజపుత్రింబొందఁగల్గుదునా? అనినంత నామానవతులెల్లరుం గినుక యనుమడింప నిట్లనిరి. చాలుచాలు! రాజుగారు విన్న నిప్పుడె మిమ్ముఁ బట్టిబంధించి కఠిననిర్బంధమున నుంపఁగలరు. అట్టిదు జరుగక మున్నెయిటనుండి సగౌరవముగ నెటనుండి వచ్చిరోయటకు వెడలిపొండు; అనుచు జంకించుచుండ నంతయుం గనుచువినుచున్న పద్మావతి మిగులఁ దలవంచియనెను. అమ్మలారా! యిప్పుడె యాపూజ్యుఁ బయటకునేగుమనుఁడమ్మా! కన్నెలుండు చోటంజేరుటయెతప్పు. అందున మనలుట మఱియుందగదు. అదిచాలక యిట్టిమాటలాడుట తగవరులకుం దగనిపనియెకదమ్మా. అదివిని యాయాశ్విక వరుండిట్టులనియెను. అగునగు కన్నియవగుట, నన్నివిధములఁ దగినదానవగుట నీమనసేమో తెలియనేవలయు ననియే నేనిట్లాడితిని. పరాంగనలతో వికటముగఁ బలుకుట కంతకంత నీతితెలియని వాడనుగాను. అన్నఁ బద్మావతియిట్టులనియెను. అమ్మలారా! ఇంతకే సంభాషణ చాలవరకుఁ బెరిగినది. తండ్రిగారు విన్న మనలంగోపింతురు; వారికిని నపాయము; కఠినదండనకుం బాలుపఱతురు. తొందరగ నిటనుండి తొలఁగిపోవుట వారికిని మనకును నెంతయుమేలు. అనవాలించిన శ్రీనివాసుఁడిటులనియెను.

ఓయువతీలలామలారా! తప్పును జేయుటకును, ధర్మముందప్పుటకు మేమెంతయు జంకుదుము. కాని ఎవరో ఏదో దండింతురని వెఱచి పాఱుటకు మేమంత పిఱికిపందలముకాము. అనఁబద్మావతియనెను. అగునగు మీరు ధర్మవర్తనులే కావచ్చును. అట్లనియెఱింగియే యింతవరకు మీతోమేముమాటాడినది. ఇప్పుడు మేము చెప్పుచున్నది. మేము తలిదండ్రుల చాటుపిల్లలముకదా. మీరేమేని యడుంగం దలంచినఁ బెద్దలనడుగుటయె తగున్యాయము. అనఁ దానికాతండిట్లనెను. అగునగు నన్నులమిన్నా! నీవన్నదెంతయు నెన్నఁదగినదియె. అదినీమేటి పుట్టువున కభిజాత్యమునకెంతయుం దగినదియ. ఇంతవరకును గడుంగడుగ, జనువు తీసికొని మసలిమాటాడినందులకేమియు మఱియొకరీతి ననుకొనకుందురుగాత. మేమిదే వెడలుచున్నారము. అనిచిఱునవ్వు మోమునం దొంగలింప నాతఁడప్పుడె ద్రుతగామియగు తనయశ్వరాజము నెక్కి మాటిమాటికి వెనుదిరిగి కనుఁగొనుచుఁ బోయి తనవారింగలిసికొని వారితోఁ దనగిరి వివరమునకుం బోయెను.

ఇటఁ బద్మావతియు నేమేమియో తలంపులంబడి తమినొడలు మఱచియున్న తన్నుంబట్టిలేవనెత్తిన చెలిమికత్తెలం గూడి యల్లనల్లన నడుగులిడుచు నావనమునుండి యంతిపురమునకు వెడలిపోయెను.

## వకుళమాలికరాక - శ్రీనివాసుతో సంభాషణ

శ్రీనివాసుఁడు వెనుదిరిగి పరివారముతోఁ దన దివ్యావాసముం జేరి తనుఁ గొలిచి యున్న కిరాతరూపధారుల కమరవరులకు వారివారి నెలవులకుంబోయి విశ్రమింప ననుమతి యిచ్చి, వారివెడలిన పిమ్మటఁ దాను వెనుదిరిగిపోయి తనహయరాజముం దిగి దాని గుఱ్ఱాలశాలం జేర్పించి తనభవనముంజేరఁబోయెను. మెలమెల్లన మణిమయ సోపానముల నడుగులిడుచుఁ బోయి ముత్తెముల భవనమున నవరత్నఖచితమగు బంగరుపట్టెల మంచమున హంసతూలికా తల్పమున నట్టేమేను వాల్చెను. అట నాతని కాపద్మావతియే మనసునఁ బట్టియుండెను. అందమగు చిఱునవ్వు వెన్నెలలఁ జిలకరించునామోము, పిడికిట నిమిడిపోవు నానెన్నడుము, నెడఁద నాటికొనిన యాబేడిసచూపులు, నున్నతోన్నతోరస్థలి సొంపు, పిరుదులయందము నచ్చుగుద్దినటులా రూపమే మనసునఁ గనులకెదుటఁ దోచుచుండెను. ఆమెనే, ఆపె యాయందమునే తలపోయుచు నాసెజ్జ నాదేవుఁడట్టె పడియుండెను.

అది మధ్యాహ్నము. దివ్యము నుత్తమమునగు భోజనము సిద్ధమాయెను. సన్నబియ్యపుటన్నము, పాయసములు, పప్పులు, పిండివంటలు, శాకపాకములు గుమగుమ పరిమళించుచుండెను. అప్పములు, పూరీలు, వడలు, ఆవడలు, నింకను నేమేమియో

తీయతీయని పానీయములు, కమ్మకమ్మని పచ్చడులు, చేసి వకుళమాలిక యింతకే దేవుఁడలసి యాకలితో నుండవచ్చునని తొందరతోఁ బిలువవచ్చెను. తోడవచ్చిన యంగనారత్నములఁ బద్మాక్షీ, పద్మమాలా, పద్మాననల నట గుమ్మముకడనిలిపి యుంచి తానులోనికిఁ బ్రభుని దరియంబోయెను. లోనికింబోయిన యామెదేవునకు నమస్కరించి చూచెనుగదా యాతఁడు కనులు మూసికొని యేదియో చింతించుచుండెను. వివశతఁ జింతమ్మగ్నియున్న వానింగాంచిన యామె చిఱునవ్వొలయ మెల్లన నిట్లనెను. ఓదేవదేవా! ఇంకను నిదురయేనా? లెండు లెండు. పరమాన్నములు సిద్ధములైయున్నవి. చల్లారిన బాగుండవు. లేచిరండు; భుజింతురుగాని. ఎల్లలోకాల దుఃఖాలఁ దొలగించునో రమాధవా! ఇదియేమి? మీరుచింతను మున్గినట్టున్నారు? వేటలాడఁబోయిన మీరావనమున నేమేని గాంచితిరా? ఎవ్వరేని భక్తులార్తింబ్రుంగిరా? దుష్టులెవరేని సాధులవిపన్నుల నొనర్చిరా? దానికింత వంతయేల? ధర్మహీనుల దుష్టులదండించుటయు, సాధుసజ్జనుల భక్తజనులఁ బాలించుటయు మీ నిరంతర కార్యములేకదా! లెండు, భుజింపుడు. పిదపఁగర్తవ్యమునకుం గడంగుడు. కాని మీయాతీరు గనుగొన్న నేదోప్రేమను జిక్కికొన్నటులు తోచుచున్నది. కాముకవాసనలు కనవచ్చుచున్నవి. మీమనసు నిటుల నాహరించిన యాకన్నియ దేవమానవ నాగకన్నెలం దెవ్వరైయుండును? ఓ జగన్నాటక సూత్రధారీ! లోకంబులనెల్ల నాడించు నిన్నే యిట్లాడించుచున్న యావన్నెలాడియెవరో? ఆమెచరితను నాకుం గొంత తెలుపుడు. అనియామె యనుచుండ శ్రీనివాసుఁడు తల్లీ వకుళమాలికామ తల్లీ! నీవన్నదంతయు నిజము. కాని యామెనాగకన్నెయుంగాదు, రాక్షసాంగనయుంగాదు. ఏ సుర కిన్నర గంధర్వకామినియుంగాదు వినుము. నేను వేటతమకంబునం బోయిపోయి యాపొంతల నాకాశ రాజపాలిత నారాయణపుర ప్రాంత కాంతారంబులం జేరంబోయితిని. అటనొక యుద్యానమున నారాజతనయ పద్మావతి తనచెలికత్తియలతో వినోద విహారంబులం జరియించుచు నాకండ్లంబడినది. ఆమెను గన్నదాదిగ నామనసున ననురాగవేదన యతిశయించి యలయించుచున్నయది. ఆమెలేక నేనొక్కనిమిషమేని గడపంజాలను అనెను. అదివిన్న యావకుళమాలిక యిట్లనెను. ఓ రమాధవా! ఎంతటి మాయలాడవయా? ఈ మాయామానవ నటన లేలనయా? ఆమెయెంతటి సుందరాంగియైనను నీవేకోరినఁ జేరినివ్వరింపకుండునా? ఆరాజడుగకయె నీకుం గూతునిచ్చి కూర్మిచూపకుండునా ఈనటనలన్నియు మమ్ముద్ధరింపనే యనుకొందును. నాయనా! నన్నేమి చేయుమందువు? నీవేమిచెప్పినఁదలతో జేయసంసిద్ధురాలను. నాయనా ఇంతకు నీమనసునుగూడ నాకర్షించి నీచేనిన్నియాటలాడించుచున్న యాయొయ్యారి యెట్టిదోగదా? ఆపె పూర్వజన్మ సుకృత మేమియోకదా! అననామెతోఁ బురుషోత్తముఁడు మెల్లననిట్లనెను. అమ్మా వకుళమాలికా! నేచెప్పుదాని మనసుంచి యాలింపుము.

## పద్మావతీ పూర్వజన్మ వృత్తాంతము - వేదవతీ చరిత్ర

పూర్వమొకప్పుడు త్రేతాయుగమున వేదవతియను నొక రాకన్నియ కలదు. ఆమె శ్రీహరింబతిగఁ గోరి ఘోరతపస్సు గావించుచుండెను. అత్తరి లంకాపతి రావణుఁడు, లోకవిద్రావణుఁడు సర్వలోక విజేతకావలెనని యెంచి తిరుగుచు నాయమ తప మాచరించు చున్న యెడకు వచ్చి యామెంగాంచి మోహవివశుఁడై పట్టఁబోయెను. ఆమెయు వానియపవిత్ర హస్తముల తాకుడున మైలవడిన యాతనువు దేవునకుం దగదని యెంతయు నొచ్చి, పాపీ! ననుదాకి మైలపఱచిన నిన్ను నీవంశము మొదలంట నాశమొనరింపంగలను. చూడుమని పలుకుచు యొగాగ్నిని దనయాశరీరము నాహుతి యొనర్చికొని దివ్యదేహము నొందెను. పిదప లక్ష్మి సీతారూపమున జనకపుత్రియై నను జెట్టపట్టెను. మేమానాడడవుల నుండ నేను మారీచుమాయామృగరూపు వెంటాడిపోతిని. ఆవెనువెంటనే సీతాప్రేరితుఁడై లక్ష్మణుఁడును నన్నువెన్నాడెను. రావణోద్యోగ మెఱిఁగిన వహ్నిపంచవటికిం బోయి సీతను గొనిపోయి స్వాహాదేవి రక్షణమునఁ బాతాళమున నుంచెను. ఇట వేదవతిని సీతా రూపమునఁ బంచవటిని బర్ణశాలనుంచెను. ఈరీతి నావేదవతి రావణుచే బట్టువడి లంకను బలుపాట్లుపడి సీతారూపునంది లక్ష్మికిం గడుసాయవడినది. రావణ వధానంతరమున నామె యగ్నిందూకినది. అగ్నియు నంతసీతను స్వాహాదేవి కడనున్న దానినిగొని వచ్చి నాకిచ్చెను. అటుపిమ్మట నావైశ్వానరుఁడు నన్నుంగాంచి వేదవతిం జూపుచు, ఓదేవా! పురాణపురుషా! ఈ వేదవతి నిన్నేపతిగాఁ బడయం గోరి తపమొనర్చుచు రావణకర స్పర్శచే మైలవడిన శరీరమున నినుబొంద నిష్టములేనిదై యోగాగ్ని నా తనువుంగాల్చి వైచికొని ననుంజేరెను. నేనీపెనుస్వాహ కడనుంచితిని. పిదప నానాడు రావణోద్యమమెఱింగిన నేను సీతను గొనివచ్చి స్వాహకర్పించి యీవేదవతి నట బర్ణశాలను సీతారూపమున నుంచితిని. ఈ లచ్చికై యీమెయట రావణులంకను బడరానిపాట్లుపడి యెంతయు నుపకృతి యొనర్చినది. ఈమెయందనుగ్రహముంచి నిజపత్నిగా గ్రహింపుమనెను. ధరణిజాత సీత యాకమలోద్భవయు, దనకామె యొనర్చిన మేలునకు నవ్యాజప్రేమను, తనకై యామెపడిన పాట్లకు, నెంతయు, బ్రసన్నయై, యీమెం బెండ్లాడుమనెను. అప్పుడు నేనువారి మూవురికోరికలను మన్నించి, నేనిపు డేకపత్నీవ్రతమున నున్నవాడను. కావున నిపుడీమెం బెండ్లాడఁదీరదు. కలియుగమున మీకోర్కులు దీర్తును. అంతవరకీమె బ్రహ్మలోకమున నిర్జరవరులచేఁ బూజలనందుచు నుండును. పిమ్మటఁ గలియుగమురాగా నీమె ధరణితనయయై యాకాశరాజునకుం బుత్రి కాఁగలదు. అప్పుడు నేనీమెం బరిణయ మాడఁగలవాఁడనంటిని. ఇందిరయు నామెకట్టులె యనుగ్రహించెను. ఆమెకొఱకె యిప్పటి నాయిచ్చటి యీ నివాసమని యెఱుంగుము. నాటి మా పలుకుల

చొప్పున నిపుడు నారాయణపురమున వేదవతి పద్మావతి యన నుద్భవించెను. ఆమె యట నుద్యానవనమున, సదృశరూపవతుల సంగడి కత్తెలంగూడి విహరించుచుఁ బుష్పాపచయ మొనరించుచుండెను. మృగయాసక్తుఁడనై పోయిన నేనట నామెంగాంచి ముగ్ధుఁడనైతిని. ఆమె సౌందర్యాభివర్ణన మొనరింప నూరునూరువత్సరములును నాకుంజాలవు. రమాకాంత యట్టుల నామెనాకు లభ్యమైన నే యీప్రాణములు స్వస్థములు కాఁగలవు. ఇది ముమ్మాటికినిజము. దీనిని నీవె యెఱుంగుము. ఇప్పుడె నీవాపత్తనమునకుం బొమ్ము. ఆకన్యకారత్నముం బొడకాంచుము. అప్పుడు రూపలావణ్యమున నామె నాకుందగిన దేయని నీకుం దెలిసిరాఁగలదు. అనుచున్న మోహమగ్న మానసు,నంబుజాక్షుం గనుంగొని యామె యిట్లనెను. ఓ దేవా! నేనిపుడె యటకుం బోవుచున్నాను. అనుచు నాయనా! ఇప్పటికె చాలగనలసి యాకలికొనియుంటివి. ముందీతెచ్చిన భోజనమొనరించి స్థిమితపడుము. పిదప నోయిందిరా రమణా! నాకడకుం బోవ సరియగు తెన్నుం దెలియఁ జెప్పుము. అన్న నాదేవుఁడంత సంతృప్తిగ భుజియించి హాయిగఁ గూరుచుండి మెల్లగ నామెతోనిట్లనియెను.

## వకుళమాలికకుం జెప్పిన నారాయణపుర మార్గము

ఓ మహాభాగ్యవతీ! ఇటనుండి నీవుతిన్నగ నృసింహగిరి గుహకుంబొమ్ము. అట మనోహరమగు నాపర్వతరాజము నుండి దిగుచుంబోయి యగస్త్యమునివరు పవిత్రాశ్రమముం జేరుము. అటఁబవిత్ర సువర్ణముఖరీనదీ తీరమున నామునివరుచేఁ బూజింపఁబడుచు నగస్త్యేశ్వరుఁడన నొప్పు శివదేవుని పవిత్రలింగము నర్చించి నమస్కరింపుము. ఆనదీతటమున నుండియే పోయినఁగొలఁది దూరమున బ్రహ్మర్షి వర్యుండగు శుకదేవుని వనమొప్పును. అందా నదిం దర్శించుచునే ముందునకు సాగిన నటఁ దమ్మిపూకొలను పద్మసరమను నదతి పవిత్రమొప్పుచుండును. ఆతటాకమున మునుకలిడి యటఁదప మొనరించికొనుచున్న మునిసత్తము చాయాశుకు దర్శించి నమస్కరింపుము. అట నామునివరుచేఁ బూజింపఁబడు బలభద్రయుతునింద్ర నీలమణి శ్యాముని సుందర పీతాంబరధరుని శ్రీకృష్ణుని, తీర్థయాత్రాపరుఁడై తెల్లని యొడలికాంతులతో నీలాంబరధారియై మంత్రోపాసన నొనరించుచు నాణిముత్తెముల సరములట్టి కరకమలములతోఁ బదములనెత్తగు పావలఁదొడిగియున్న బలభద్రుం గాంచుము. ఆయిర్వురు సోదరులకు సిరమువంచి నమస్కరింపుము. ఆ తామరకొలకునంగల తమ్మిపూల పూజలఁదనియింపుము. అటనుండి నదులు, నుపనదులు, వనములు దాటిపోయి యారణీనదీతీరముం బొందుము. అటఁగొంత

తడవు విశ్రమించి ముందునకుం బోయిన నారాయణ పురముం గాంచఁగలవు. దానింగాంచిన నీకెంతయో యబ్బుర పాటొదవవున్న వింతగాదు. అందలివనములు, నుపవనములు,(గిసలయ పుష్పఫల సంభరితములై యెల్లవేళల నొకేతీరున మనోహరములై కనుల విందొనరించు వృక్షలతాకుంజముల నొప్పారుచుండును. ఋతువులన్నియు నచటనే కాపురముండెనా యనిపించుచు మెండుగ సుఖముం గూర్చును. ఆపురమున లేనివృక్షరాజములు మఱెందును లేవేమోయనవచ్చును. యచట దొరకనిపూలు మఱెచటలేవు. నెమళ్లయాటలచే, జిలుకలపలుకులుచే, గోకిలలకూతలచే, శారికారావములచే, హంసలనడకల బెడంగులచే నాపురవనములు పొల్చుచుండును. వనములు ద్యానములు గాంచుచు నాయరణీనదీ తీరమ్మున నమందానందమ్మునబొమ్ము. పురవీధులు పూలజల్లులఁ దావుతావుల మెత్తనైతావులు చిమ్ముచుండును. గజయూథములచే, హయరాజములచే గోవృషభములచే నాపత్తనపు టెత్తునకెత్తులేదు. అందలి వారెల్లరాత్మీయులట్ల యన్నదమ్ములట్ల యక్కసెల్లెండ్రవలె భేదమెఱుంగక యుందురు. వారి జాతులు వృత్తిబోధకములే కాని హెచ్చుతగ్గుల భావములకందున తావేలేదు. ఈర్ష్యాద్వేషములు వారి నిఘంటువుననేలేవు. రాజునట్లెల్లరును సుఖులు. అందున దినఁ దిండియుఁ బండ మంచమును నుండ నిల్లును లేనివారులేరు. అందెవ్వరికి వేడుకలకు వినోదములకు వెలితిలేదు. అందున నిజముగ లేమికిలేమి పట్టినది. పాలకులు ధర్మపరులైనఁ బ్రజలందునను ధర్మము పాదుకొనును. ప్రజలు ధర్మస్థితులైన భూమియే స్వర్గమగును. అమరతరంగిణిచే సురపురియట్టు లారణీనదీమతల్లిచేఁ జుట్టఁబడిన యాయాకాశరాజ నగరికిం బోయి యటనీకుందగునని తోచిన తెఱంగునఁ జేయుము. పోయిరమ్ము. ఇటుల నా సురాధీశుఁడు శ్రీనివాసుఁడు వకులమాలిక కానతిచ్చి సాగనంపి తాను వల్లనవరిగి తలిదులసెజ్జ నొరిగెను.

ఆవకుళమాలికయు దేవాధిదేవునకు వేంకటగిరివాసున కట్టెవందన మొనరించి పోయి గురువిందమట్లు కడుంగడు నెట్టనై యందమగు బాబాపైనెక్కి పయనమై తిన్నని తెన్నున నడకసాగించెను. నెమ్మదిగ నాకొండదిగి యాపాదునఁ గల కపిలతీర్థమున మునిగి కపిలేశ్వరుఁ బూజించి ముందునకు సాగెను. అరుగునపుడా తెన్నున నెన్నేని వింతదృశ్యములంజూచుచుఁ బ్రమోదింపసాగెను. పలువిధములగు మృగములు, వింతవింత చెయిదములఁ జిత్తమలరించుచుండెను. నల్లనినడకొండలట్టుండి మదధారల సెలయేళ్లు జాలువారఁ దెల్లని దంతముల మిసమిసలు దెసలలుముకొనుచుండ నాడయేనికలంటి నడువఁజనువేనుగు గున్నలఁగనువిందుగఁ గనుఁగొనుచు, (బిల్లల తోడియాడు సింగము వెంటరా గంభీరముగ నడుచుచు మెడ నుబ్బులమగుజూలు వాలుగ ముందునకుం

బోవుచున్న మృగరాజు దర్పమెడందకుఁ గడిందిగ నెంచుచుఁ బులులబొబ్బల కులుకక శరభములకు, గవయములకు మఱుఁగక, కుందేళ్లకుప్పి గంతులకుఁ గృష్ణసారముల కేరింతలకు, సంతసించుచు, వనమయూరముల యొయ్యారంపు నటనలకు, శుకపికశారికల కులుకుపలుకులకు నలరుచుఁ బలుజాతుల ఫలపుష్పముల, సుమలతికల, యింపు సొంపునకు సొంపిలుచునటఁ, బద్మసరోవరముం జేరి యందున స్నానమొనరించి తత్సరోజాతముల బలరామకృష్ణుల నర్చించి యటనుండిపోయి సువర్ణముఖరీనదిని మున్గితరించి యటదేవునారాధించి పోయిపోయి యరణీనదీ పశ్చిమతీరమునకుం జేరెను. అటనామె తనయశ్వరాజమట్టెదిగి యగస్త్యేశ్వర క్షేత్రమునం జేరి యరణీ నదీజలముల స్నానమొనరించి యగస్త్యారాధితమగు నగస్త్యేశ్వర లింగముం దర్శించి పూజలొనరించి దండములిడి యటనొకయెడ విశ్రమించియుండెను. ఇంతలోనటకు వచ్చిన యువతీమండలిం గాంచి లేచిమెలమెల్లన నటకు వారికడకుం బోయి వారిచరితలు దెలియనిటులడిగెను. వింతవింతలరంగు బెళుకుల వస్త్రాభరణ భూషితలగునో యొయ్యారి తొయ్యలులారా ! మీరందరెవ్వరు? ఎక్కడివారు? ఓ సుముఖులారా! మీరెల్లరిటకేమి పనికై వచ్చియున్నారట? అనుచున్న యామెను వినివారలు మోముదమ్ములం జిరునవ్వు లొలయుచుండ నందొకప్రౌఢ యిట్లనెను.

## పద్మావతీ చెలికత్తెలు వకుళమాలికతో నచటిచరితలు చెప్పుట

ఓ దేవీ! మాచెప్పునది చెవియొగ్గి యాలింపుము. మేమాకాశ రాజేంద్రు నంతిపుర వాసినులము. వారిముద్దులబిడ్డ పద్మావతి యనుగు చెలికత్తెలము. ఇంతకుమున్నొక దినమున మేమారాకుమారి వెంటనిడికొని యొకవనమునకు విహరింపఁబోతిమి. అటఁబిల్ల తెమ్మెరల మలయుచు నలరులు గోయుచునలసిసొలసి యొక తరువరచ్ఛాయ వసించి విశ్రమించియున్న రాకుమారింజేరి మేముంటిమి. అటఁదలపులన్ముంగి యున్న మా కడ కెటనుండియో యింద్రనీలమణి శ్యామల శరీరుఁడు శ్రీవిలసిత విశాలోన్నతోరస్థలుఁడు, నాజానులంబిత సుందరసుకుమార భుజుఁడు, చిఱునవ్వు వెన్నెలలఁ జిలకరించు నిండుచందురు మోమువాఁడు పచ్చనిబంగరుచేలము మొలనలరుచుండఁ, దలమణిమయ కిరీటమొప్ప, ధనుర్బాణములు తనరఁబట్టి, హారకేయూరాది పలువిధాభరణ భూషితుఁడగు యువకవీరావతంసుం డొకండు చనుదెంచి యందఱకుం గనువిందొనరించెను. వచ్చిన యాతఁడు మమ్ములం బలుకరించి యంతలోనన వెడలిపోయెను. మాచెలి పద్మాలయ వానినింతలు కనులుగాఁ గాంచి యాతని పోయినంతనెవివశయై పడిపోయెను. ఆమెనెట్లెట్లో తెలివికిం దెచ్చి మేము గృహముం జేర్చితిమి. నిజతనయ యవస్థంగన్న రాజాదైవజ్ఞు

నప్పుడ పిలిపించి తనబిడ్డ గ్రహబలముంజెప్పుమ యనికోరెను. బృహస్పతియట్టి జూచి వివరు(డప్పుడె గ్రహములు గుణించి యిట్లుపలికెను. ఓ రాజచంద్రమా! గ్రహము లన్నియు ననుకూలస్థితినున్నయవి. కానియెల్లపుడేదో కొంతభ్రాంతి కారకమయ్యే యుండును. అని మఱియు( బ్రశ్నకాలముం జింతించి, లగ్నము గుణించి, ఛాయల లెక్కించిచూచి యిట్లనెను. నరవరా! లగ్నాధిపతి చంద్రు(డు లగ్నముననున్నవా(డు. బృహస్పతి గురు(డు కేంద్రమున నలరుచుండెను. దినపక్షియన్ననో నిద్రయందున్నది. జనప్రశ్న కాలమందలి పక్షిరాజ్యకారకమైయున్నది. ఇవియన్నియు గుణించిచూచిన నోధరాపతీ! యెంతయు మేలుకలిమియేతో(చుచున్నది. ఓనరలోకనాథా! వినుము. ఇంతకు మున్నొక మహాపురుషు(డు నీపుత్రికయున్నెడకు వచ్చెను. అతనింగన్న యామెప్రేమ వివశురాలాయెను. ఆత(డే నీతనయకుం బతి కా(గల(డు. సత్యము సత్యము. ఇందేమియు సందియములేదు. కొద్దికాలములోనె యాధన్యునిచే( బంప(బడిన యొకకన్నియ మీకడకురానైయున్నది. ఆమె చెప్పునదెల్ల మీమేలునకేయగును. నే(జెప్పుదీని మననుంచి విని యాచరింపుము. నేడే భూసురశ్రేష్ఠులం బంపి యగస్త్య లింగమున కభిషేక పూజాదికముల నొనరింపంజేయుము. దాననెల్ల యర్థములు సమకూర(గలవు. ఎల్ల విఘ్నవ్యాధులుం దొల(గును. నే(జెప్పునిది నీపుత్రికెంతయు సుఖోత్పాదకము. ఇవియెఱుంగుమని యాత(డానరవరుకడ సెలవునొంది తననివాసమునకుం జనియెను. అప్పుడానృపాలుడు వేదవిదుల( బావనచరితుల ధరామరుల రప్పించి యర్థవిధుల( బూజించి సన్మానించి పలికెను. ఓ బ్రాహ్మణవరులారా! ఇపుడె మీరుపోయి, యగస్త్య క్షేత్రమున దేవాలయమున దేవు మహాలింగు మంత్రపూర్వకముగ మహాభిషేకము బూజాదికము నొనరింపుడు. పొండు. అనివారింబంపి పిమ్మట మమ్ములరావించి యానృపవరుండు ఓకన్యకలారా! మహాభిషేకాదికములకుం గావలయు సంబారముల నెల్ల సమకూర్చికొని యాలయమునకుం గొనిపొండని యాజ్ఞాపించెను. ఆరాజవరు నాజ్ఞలమేరకు మేమెల్లర మిటకీ దేవాలయమున కరుదెంచితిమి. మాకథ యెల్లం జెప్పితిమికదా. ఇ(క నోసుందరీ ! నీవెవ్వరు? ఏమిపనికై వచ్చితివి? ఎచటికిం బోవుచున్నావు? నీచరితము నెల్ల మాకెఱింగింపుము.ఈ దివ్యాశ్వము నధిరోహించి నీవు నిజముగ దేవలోకముననుండి యేవచ్చితివా యనిపించుచున్నది. అనుచున్న వారి పలుకులకు నెంతయు ముదితమానసురాలైన వకుళమాలిక వారితో( దీయతీయని పలుకుల నిట్లని చెప్పసాగెను.

ఓ బాలామణులారా! నన్ను వకుళమాలిక యందురు. నే వేంకటాద్రినుండు దానను. ధరణీదేవిని దర్శింపవలయునను కోరికతో నేనటనుండి యిటువచ్చితిని. దైవయోగమున మీతో నాకిట సమావేశమాయెను. ఓ ముద్దియలారా! ఆరాజభవనమున నాదేవిం దర్శింపమాటాడ నాకు వీలగునా! అన్న నాపె పలుకుల కాయువతులు

సంతసమున నోతలోదరీ! మావెంట వచ్చిన నీకాదేవిం గాంచి మాటాడనగును. అనినంతఁ బూజలకు నాలయమునకు బయలు వెడలిన వారితో నామెయును జని యగస్త్యేశ మందిరముం జేరెను.

## వేంకట నాథుని లీలా వినోదము - ఎఱుకత వేషము

తనయాజ్ఞను వకుళమాలిక వెడలిపోయిన పిమ్మట వేంకటనాధుడిట్లు తలపోసెను. ఒకేయొక పుత్రుఁడు కలవాఁడపుత్రుకుఁడే. ఒకకన్నున్నను లేనియట్ల, మగువల మంత్రాలోచనలచే కార్యము నెఱవేరుటయు దుర్లభమె. అనియెంచి లీలగఁ దానొక యెఱుకత రూపముంబూనెను. నారదాది మునివరుల వందనములందుకొను నారాయణుడెఱుకల సానియై చినిగిన త్రికందొడిఁగి, యందందుఁ దూట్లుపడిన ప్రాతచీరను గట్టెను; బొడ్డు తమ్మిని పొడమినయయ్యను జంటిబిడ్డగఁజేఁగొని వలెవాటు నుయ్యేలంబండఁ బెట్టికొనెను. శంకరు, భక్తవశంకరు నెఱుకదండము సేసి చేతంబట్టుకొని బ్రహ్మాండమె బుట్టగఁ జంకనిటికించెను. జుట్టువీపున విరియఁ జిమ్మియుండ సంకుపూసల దండలు మెడను నుఱమున నొప్పుచుండ నారాయణపుర వీధుల నెఱుక చెప్పెదనని వెడలెను. పొట్టవ్రేలాడుచుండెను. పండ్లుకొన్ని కొన్ని యూడి బోసి నోరుననొప్పి ముడుతలుపడిన ముఖముతో ధర్మదేవతయన నడుచుచుండెను. చిక్కియాకట నకనకలాడుచున్న బిడ్డయేడ్చుచుండఁ బయ్యెదకొంగునఁ బట్టికొని యాడుచుఁ బాడుచు నా మాయల మారియవ్వ వినోదించుచుండెను. "అవ్వోయవ్వ! యెఱుకచెపుతా నవ్వ! చెదిరిపోయిన యాలుమగలఁ జేరిదను. బిడ్డలవెతలన్ని తొలగించెదను. చుట్టాలనొకపట్టునను చేర్చెదను.' అంచునేమేమియో బిగ్గరగ నఱచి పలుకుచుండెను. పురవనితలా యవ్వం జేరి తమవెతలెల్లం జెప్పికొని యాకెయెఱుకకు నొడలెఱుఁగక తనివిమిగులఁ గొందఱు రాణిదరింజేరి అమ్మా! నరనారాయణాశ్రమము నుండి వచ్చెనట. పేరు ధర్మదేవతయట, ఎవ్వరేమడిగిన నున్నదున్నట్లే చెప్పుచున్నది. కలిగిన దుఃఖములకుం గారణములం జెప్పి తొలగించుకొను నుపాయముం జెప్పుచున్నది. మితభాషిణియగు నాముదసలి యెఱుకలసానిని ధర్మదేవిని పిలిపించి బిడ్డదుఃఖముం జెప్పి నివారణోపాయము నెఱుంగఁ దగునని చెప్పసాగిరి. వారిపలుకులు విన్న రాజ్ఞీమణి ధరణీదేవియు నదియుఁ దనభాగ్యమేయని, వీధింబడి తొమ్ముకుడుచు చంటిబిడ్డను వలెవాటున నుఱమున నదిమికట్టికొని పెద్దయెఱుకలబుట్టను మోచేతితోఁ జంక నదిమికొని భూతభవిష్యద్వర్త మానముల నిక్కముగఁ జెప్పెదనని యఱచుచుం బోవుచున్న యాకోయపడుచుం జూచి పిలిపింపనాపెయుటకుం జేరెను. రాణియుపుడ తానమాడి యాభరణముల నొప్పుగఁ దాల్చి వచ్చి యా యెఱుకత యెదుట బంగరుచేటను మూడుమూడుమానికల మంచిముత్తెములు దాసులుగఁ బోసి మందస్మిత

మాననమందునఁ దొలకాడ నో కోయసానీ! ఏదీ, చూతము చెప్పుము భూతమో భవిష్యతో, వర్తమానమో! అనెను. దానికా యెఱుకుసాని యిట్లని పలుకసాగెను.

యెఱుక:- ఎఱుకసెపుతానవ్వ యెఱకసెపుతాను. నిజము సెపుతానవ్వ నిజముసెపుతాను. నీమనసులో పెద్దకోరికుం దవ్వ - ఉన్నదున్నట్టులే నేసెపుతనవ్వ - దిగులు నీమనసులో బుగులుకొన్నాది.

అడ్డాలనాబిడ్డ సూడుమోయవ్వ - ఒక్కకబళము బువ్వయింత పెట్టవ్వ - నా బిడ్డకడుపింతగా సల్లనైతె - అవ్వ నీయిల్లంత సల్లనౌతాది - అనియామె యన్నంత యాపట్టమహిషి హేమపాత్రమున నింతయన్నమును, బరమాన్నముతోఁ బిండివంటలతోఁ దెప్పించి యిచ్చెను. అదియా పుళిందాంగన బిడ్డకుం దినం బెట్టిమఱల నిట్లనసాగెను. అవ్వోయవ్వ! కూతురి కోసమే కుమిలిపోయేవు - మగగాలి తగిలింది మగువ కోయవ్వ చింతలో బడియవ్వ సిక్కుతుండాది - ఏమంటవోయవ్వ యెఱుఁగసెప్పవ్వ.

అదివిన్న రాణి యౌనన్నట్టు తలనూపెను. అవ్వోయవ్వ - ఏమౌతదోయన్న దిగులు నీకవ్వ - దిగులు నీకెందుకో యవ్వ యీయేళ మాయందమైనోడు మాయలాడవ్వ-బమ్మాదులకుఁ గూడఁ బట్టరాడవ్వ - ఏల్పులందటి కాతఁడే యేలుపవ్వ - పాదాలకడచేరి పట్టుతారవ్వ - అవ్వోయవ్వ - నీకూతు బాగ్గెమే బాగ్గెమోయవ్వ - అతడల్లుడేయైన అదెబాగ్గెమవ్వ - అవ్వోయవ్వ - అనుచుండగనే కొందఱు జవ్వనులాయెడకుం జేరి రాణిన్మ్రొక్కి యొక్కయెడనిలిచిరి. ఆకోయవెలుదుక పలుకులు వినియందొక గడుసరి కలికి, అయిననాతఁడెవరు? ఎట్లు మారాకుమారిం బెండ్లాడఁగలఁడు? కులగోత్రములేమి? అనియడిగెను. అదివిన్న యాటవికాంగన యిట్లని పలుకసాగెను. అవ్వోయవ్వ - యెఱుకసెపుతానవ్వ యెఱుకసెపుతాను - ఔనౌనెయోయవ్వ ఔనె ఓయవ్వ - తోటలో మీరంత కూటువైచేరి - కేరింతలను పూవులేరుచునుండ - అవ్వోయవ్వ - గుఱ్ఱంబుపై నాడు కులుకుతొచ్చేడె - సొగసుగానిని మీరు సూసినార్గాదె - అవ్వోయవ్వ - కనువేదురయ్యె నాకన్నెకు సాల- ప్రేమబాదనుసాల వేగుతున్నాది - సీపురుపుల్లయ్యె సింతలోమున్గి - అవ్వోయవ్వ - ఆయెంకటాద్రిని యాతఁడుండవ్వ - కొండకేలికనంచు కులుకుతాడవ్వ-లచ్చియాతని సేరియిడవబోదవ్వ - అవ్వోయవ్వ - కులమేమో, జాతేమొ, గుణమేమొ కాని - అన్నికులాల వారతని సేవింత్రు - అందమంతంతయు నతనిదేయవ్వ - ఆతడే ఆనందమానందమవ్వ - అవ్వోయవ్వ - ఓయవ్వ నీకూతురేం తక్కువవ్వ - తనకె కావాలంట దాయందమంత - తనదే యానందమంతయు నంట దవ్వ - అవ్వో యవ్వ-ఆయడవాయడ వట్టట్టె తిరిగి ఏటాడుటాడుచు వెనుబడి యొక్కమెకమునె యెదకుచు మీబిడ్డయొక్క - మెకమునె యెదకుచు మీబిడ్డయున్న - ఆయెడ కాయయ్య యరుదెంచి

వింత - నీబిడ్డనిలువెల్ల నెగదిగ సూసి - లచ్చియట్టున్నదం చెచ్చుగనెంచి - పేమలోముగ్గి నీబిడ్డకోసమ్మె - అంతవాడింతౌచు, నెఱిగిసింతించి - అపుడె మీసెంతకు నతివనొక్కతెను- పంపెఁ పెండ్లికి రాయబారాలు నడప - నేసెప్పినది యంతనిక్కమేయవ్వ-బాగ్గేలు బోగ్గేలు బాగౌనేయవ్వ - అవ్వోయవ్వ - ఎఱుకసెపుతానవ్వ యెఱుకసెపుతాను.

అని యూరకున్నంత మహారాజ్ఞి యా యవ్వకుఁ దృప్తిగ భోజనము పెట్టిపెక్కులు సూడిదలిచ్చి తనియించిపంపెను.

తానందున్న తనవారితోఁ దనకూతురున్నెడకుం బోయి బిడ్డను బ్రేమాతురను వివశనుగాంచి, యమ్మా! పద్మా! నీకై నేనేమి చేయుదును? నీకేమికావలెను? నీకిష్టమగునదేమి? ఎందులకు నీకీచింత? నీమనసునంగల వంతయేమి? నీకోరికయేమియో నాకుంజెప్పుము. కూతునకుం గన్నతల్లికంటెఁ జుట్టమెవరు? నావద్ద దాచవలసిన దేమియులేదు తల్లీ! మంచియోచెడ్డయో! నంకోచింపక నాతోవచింపుము. నీమనోవాంఛితము నేను నెఱవేర్తును. ఇట్లెందులకుఁ గ్రుంగి కృశించుచున్నావమ్మా ఇదియంతయు నాయభాగ్యముగదమ్మా! అనుచుఁ గన్నుల నీరుగ్రుక్కుచు రాణియట్టె నిలిచెను. కన్నుల నీరుకార్చు కన్నతల్లింగన్న పద్మావతి యల్లనల్లనఁ దనకన్న తల్లితో - అమ్మా ! నీతోనేనేమని చెప్పుదును? అనియట్టె యూరకుండెను. అపుడొక నెచ్చెలియల్లన నిట్లనెను.

ఓరాజ్ఞీమణీ! ఆనాఁడు మీయనుమతింగొని పోయిన మేముద్యానమునఁ బూలం గోయుచుఁ దిరుగుచుంటిమి. ఇంతలో నెటనుండియో యొకవృద్ధ తాపసియటకు వచ్చి యీయమచేతినంది పుచ్చికొని, సాక్షాల్లక్ష్మియేయని, శ్రీకృష్ణునే చెట్టఁబట్టంగలదని యేమేమియో చెప్పివెడలిపోయెను. అదేమో! అప్పుడే యొకవైపున నుండి యొకసొగసులాడు సుందరాశ్వము నెక్కి వేటలాడుచునటకుం జేరెను. అతనింగన్న గజరాజ మొండువానికి వందన మాచరించి ఘీంకరించుచు వెడలిపోయెను. అతండు మమ్ముఁలఁగనియేమేమో పలికి మనపద్మావతిని బెండ్లాడెదననెను. అదివిని పెద్దలున్నారు. వారింగలిసి యడుగుడు, వారి యిష్టమమాయిష్టము. మేము పెద్దలచాటువారము. అనియీయమ చెప్పినది. అదివిన్న యాతఁడును బాగుబాగని పలుకుచు వెడలిపోయెను. ఆతఁడు కుడిచేతఁ జక్రము నెడమచేతశంఖమును బట్టియుండెను. పచ్చని బట్టకట్టిన యాయయ్య వెడలిపోయినదాదిగ నీయమ తనలోఁ దానులేదు; వేదురెత్తిన యట్లయినది. అటనుండి యిటకీమెం గొనివచ్చుటయే మాకుంబెద్దకష్టమాయెను.అనెను. అదివిన్న తల్లి బిడ్డయవస్థకు నేమియుం దోచక యట్టెనిలిచియుండెను. తల్లినింగన్న తనయమెల్లన నిట్లనెను. అమ్మా నన్నువినుము.

సీ॥ ఎల్లలోకాలను నెవ్వండుకనువిందు
వెదవిందునై ప్రోచునెసగు ప్రేమ
సాధుసజ్జన కోటిసతతంబు నెవ్వాని
ప్రేమించి యెనలేని ప్రేమనందు
బ్రహ్మాదిసురలు సర్వాత్ముని నెవ్వాని
నఖిలేశు దర్శింప నభిలషింత్రు
తేజోధికుల నెల్లఁదేజోధికుండెవం
డెవ్వాఁడు దేవుండు నెల్లరకును

తే॥ భక్తవరులకు నెవ్వండు ప్రాప్తుండగునొ
భక్తిహీనులకెవ్వండు పట్టువడడొ
యాపరాత్పరునెడ, మదిహత్తుకొనియె
వరదునాతని దెలియఁగా వలయుఁ దల్లి.

అనుచున్న కూతునాలించి యాధరణీదేవి బిడ్డా ! దేవుఁడు భక్తవరదుఁడు, భక్తులకుం దొరుకునంటివి. ఆ భక్తులెట్టివారు? వారి లక్షణములెట్టివియెవ్వి? ఎట్టిభక్తులకాతండు పట్టువడును చెప్పుమ యనెను. అదివిన్న పద్మావతి తల్లికి నల్లన భక్తవరుల లక్షణముల నిట్లని చెప్పం దొడంగెను.

## వైష్ణవ లక్షణములు.

అమ్మా! భక్తులు దేవునాకారమే పొందఁగోరుదురు. కావుననే వారలు భుజముల శంఖచక్రాంకితములం బొందుదురు. ఆ భుజముల రెంటను నూర్ధ్వపుండ్రముల నొప్పుగఁదాల్తురు. ఇట్లువారు భక్తిశ్రద్ధల పావనమతి భగవంతుని కేశవాది నామంబుల స్మరియించుచు ద్వాదశోర్ధ్వపుండ్రములం దాల్తురు.

లలాటమున, నుదరమున, హృదయమున, గంఠమున నెదుట వెనుక, పొట్ట కిరువైపుల, బార్శ్వముల, రెండు భుజముల, వీపున, నిఱుపాదముల సీలమండల వారూర్ధ్వ పుండ్రములు దాల్తురు. తాల్చుతటి ఓమ్‌కేశావాయ నమః, ఓమ్ నారాయణాయనమః, ఇట్లుగా ప్రణవముతో నమః శబ్దముతోడి భగవన్నామముల మనసుంచి ధ్యానింతురు. ఇవియెల్ల బాహ్యచిహ్నములు మాత్రమే. ఇవ్వి మనసున సుస్థిరభక్తి నెలవుకొనుటకు సాధనములు. అట్టిసుస్థిర అనన్య భక్తినందుకొనలేక కేవలమిట్టి చిహ్నములచే నేమియు, గవ్వంతయు లాభములేదు. పవిత్రమగు నెడఁదను దేవుని

దివ్యచరితను బాగుగ హత్తించికొని, అంతరంగిక శుద్ధిని బొందుచు దేవునాజ్ఞలఁ బాలింపంగన్న వాఁడేభక్తుడు. మఱికొందఱీ బాహ్యచిహ్నముల జోలికింబోనైనఁ బోరు. హృదయమే యాహరికిల్లుగ నిచ్చి తదాజ్ఞలు పాలించి తనియుదురు. ఆజ్ఞాపాలకులే దేవు నిజమగు భక్తులు.

అమ్మా! నిజమగు తరింపఁగల నాపవిత్రహృదయుల భక్తవరుల లక్షణములం జెప్పెదవినుము. గురుడు, నాప్తుఁడునగు తండ్రిచేఁగాని శిష్టజనుడగు నన్యాచార్యునిచేఁగాని, స్వకీయమగు గుహ్యసూత్రవిధిచే విద్వాంసుఁడగు వాడగ్నింగొని వచ్చి చక్రాద్యాయుధ మంత్రములచేఁ బదునారు పదునారాహుతులు వ్రేల్చవలయును. తరువాత మూల మంత్రము చేతను, ఆపై, బురుషసూక్తకముచేతను, దరువాత నగ్నిమంత్రముచేతను నూటయెన్మిది. నూటయెన్మిది మాఱులుగ వ్యాహుతులచే వైశ్వానరు నర్చింపవలయును. అట నాపవిత్రవహ్నిని చక్రాదుల సహింపనగునటులుగ వేడిచేయవలెను. ఆపైగురుఁడు మంత్రోచ్చారణ మొనరించుచుండ విబుధుఁడగు వాఁడు చక్రాదిముద్రల నాయాతావుల ధరింపవలెను. ఇరుభుజముల శంఖచక్రములయు, మూర్ధమున శరశార్ఙ్గచాపములయు, లలాటమున, గౌమోదకీగదయుఁ హృదయమున నందకఖడ్గము యొక్కయు ముద్రలనై దాటిని మోక్షముంబడయుఁ గోరు విష్ణుభక్తుఁడు తాల్పవలయును. కనీసము భుజముల శంఖచక్రములనేని ధరింపవలయును. ఇట్టి సర్వలక్షణలక్షితుఁడగు భక్తవరునే విష్ణుభక్తుడు వైష్ణవుఁడన నొప్పును. ~~ఈ~~ బాహ్యచిహ్నధారణము భక్తునకొక విధమగు హృదయానందము తన్మయముం గూర్చును. అందులకే వానినాతఁడు తాల్చునది.

ఒడలెల్లం గాల్చికొనినంత మాత్రమునఁ గాడు వైష్ణవుఁడు భక్తుడు, హృదయ మాదేవునకు సర్వార్పిత మొనర్చినవాడు కావలెను. వానికి జాతి,మత,కుల భేదములు లేవు. ఎల్లరందనయందును, నెల్లరందునఁ దన్నుంగాంచుచు, సర్వమున విష్ణుంగాంచుచు నంతయు విష్ణుమయమని యెఱింగి వర్తింపవలయును. అట్టివానికే యాచక్రాద్యంకితము లెంతయు మేలుగూర్చును. ఆంతరంగిక భక్తిని, పవిత్రతను పెంపొందించుటకే యీచిహ్నములు; అప్పుడే వానికలిమికి సార్థకత. ఇద్దియే భక్తునిరూపము. రూపమెట్టిదిగ నున్నను పవిత్రమగు భక్తిభావముం గల్గువాని, ఇట్టియీ వేషభాషలచే బొందఁదగు భక్తవరు భావముల, లక్షణముల, వర్తనులఁ జెప్పెద నాలింపుము.

ఓం శ్రీ శేషపర్వతరూపత్వ ప్రకాశనపరాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ శంఖచక్రవరానమ్రలసత్కరతలాయ శ్రీ వేంకటేశాయ నమః

## భక్తవరు లక్షణములు

భక్తుఁడాతఁడు సర్వసముఁడు. ఆతనిచే లోకము వ్యాకులమందదు, లోకముచే నాతఁడు వ్యాకులమందఁడు, భయసంక్షోభము లొందఁడు. లాభాలాభములు, కష్టసుఖములు, జయాపజయములు, కలిమిలేములు మొదలగు ద్వంద్వముల కాతఁడతీతుఁడు. కష్టము కలిగెనని వెతనందడు, సుఖమయ్యెనని యుబ్బి తబ్బిబ్బుకాడు. ఆతడు సమభావుడు. నిర్మముడు, నిరహంకారుడు, నిత్యతృప్తుడు. ఆతఁడు కర్తవ్యకర్మల నెల్లవిడువక యాదేవుని కార్యములుగా, దేవునికొఱకే చేయును. కావున వానిఫలితమున కాతఁడాశింపడు. అదియా దేవునకే దేవదేవునకే విడుచును. కావుననే యాతని కార్యసంకల్పమునఁ గాని, యాచరణమునం గాని కలుషితమంటదు. ఆతని యాకర్మ సమ్యగా చరితమగును, కొఱతగలుగదు. అట్టి యాభక్తుఁడు కర్మబంధితుఁడు గాడు. ఆతఁడు కర్మంజేసియుఁ జేయనివాఁడే. దానిచే నేమికలిగిన నాఫలమును కష్టమైనను సుఖమైనను, లాభమైనను నష్టమైనను, ఏమైనను దైవార్పితమని ముదమునఁ బొందియనుభవించును. సుఖమైన, లాభమైన ఉబ్బితబ్బిబ్బుగాడు. కష్టమని కలతపడడు, ఏమియుంజేపడకున్న చింతింపడు. దైవభక్తున కేవారియందున నీర్ష్యాద్వేషములుండవు. అతని హృదయము స్నేహమయము, ప్రేమమయము. ఎల్లర భగవదంశల నొప్పువారనియే యెంచి సమాదరించి ప్రేమించును. అతని ప్రేమకు హెచ్చుతగ్గులులేవు. సత్యమాతని కారాధ్యదైవము. ఎట్టివేళలంగాని యాతఁడు సత్యమును వీడడు. అనృతమాడుట యాతనికెఱుకయే యుండదు. సత్యమే యాతని కారాధ్యదైవము. నారాయణుడు భక్తుఁడెవ్వరియెడ నేకాలమున నసూయను బొందఁడు. ఇతరుల వస్తువులఁ జిన్నవైనను బెద్దవైనను, ధనధాన్యాదులను గోరఁడు. హరింపడు. తనకుంగల దానితోఁ దనియుచుఁ గలిగినయంతలో నితరుల కింత తనియనిచ్చును. తనియును. ఆతఁడు పరనారుల, గన్నెత్తియైన జూడడు, వనితలయినచో పరపురుమందలంపనేని తలంపరు. తండ్రిగ సోదరులుగనెంచి యాదరింతురు. భక్తులేవారిం గూర్చియు మది జెడ్డగఁ దలంపనై నందలంపరు. భక్తులు పరనిందం జేయరు. ఆత్మస్తుతియొనర్చికొనరు. నిజమగు దైవభక్తుడి తరుల యిక్కట్టుల నెఱింగి తనవిగానెంచి వారికి సానుభూతితో సాయపడును. వారికి సుఖానందములు కలుగునంత దనుక నాతఁడు శాంతింబొందఁడు. బొందంజాలరు. వారి సుఖానందములె యాతని సుఖానందములు. ఆతడితరుల కేరికిని మానసికముగ గాని, శారీరికముగ గాని, యేవిధమగు హింసను నపకృతిని గలిగింపడు. మానవసేవయే మాధవసేవగఁ దలంచి యెల్లమానవుల ముఖ్యముగ దీనజనముల సేవలం దనియించి ముదముం గూర్చును. ఆతఁడు సర్వభూతహితుఁడు సర్వభూత దయాపరుఁడునై

పరమేశ్వరుం బాడుచుందన్నుఁదామఱచి యుండును. ఆతడు స్వదారారతుఁడై వీతరాగభయక్రోధుఁడై శాంతిగనుండును. ఆతనికి స్వార్థమనునదిలేదు. కోర్కులచే నిండిన మనసున దేవునకుం దావులేదు. దేవుడుండు మనమునఁ జింతలుండవు. భక్తురాండ్ర వనితలు నిట్టుల వర్తించువారే. కావుననే భక్తులు నిశ్చింతులు. జ్ఞానముత్కృష్టము. జ్ఞానమునకంటె ధ్యానముమేలు. ధ్యానమున కంటెను కర్మఫలత్యాగము శ్రేష్ఠము. ఆత్యాగము భగవదర్థమైన మఱియుమేలు. ఆత్యాగమువలన సంసారబంధములు తెగి మోక్షముసిద్ధించును. అమ్మా! భక్తవనితలు, పవిత్రభక్తురాండ్రునిట్టులే యుందురు సుమా ! పవిత్ర భక్తిని స్త్రీపురుషబేధము, జాతి మత కుల భేదములేదు సుమా. స్త్రీపురుష బేధము లేని వాడు భగవంతుడు, అట్టి భగవంతునర్చించు భక్తుల నాభేదమెట్లుండ గలదు? భగవంతుడు చూచునది పవిత్ర భక్తి హృదయమే; తక్కినవాతని దృష్టికి రావురావు. ఎండల కెండక, వానలకు నదులకలయికకుంబొంగక యొకే రీతినుండు సముద్రమట్టుల భక్తుఁలు కడుంగడు గంభీరుఁలు. కలిగెనని యుబ్బితబ్బిబ్బుకారు. లేదని పలవింపరు. కష్టములు, దుఃఖములు ప్రాప్తించినను జింతింపరు, భగవదత్తములని శాంతచిత్తమున స్వీకరింతురు. వారికి శత్రుమిత్రభావములేదు. వారికి నందఱు సమానులు, నాదరణీయులును. నిందాస్తుతులువారికి సమములు. సువ్యవస్థగల చిత్తమున నిశ్చలముగ నుందురు. అట్టివారే యాపరాత్పరునకు బ్రియతములు. వారి నా శ్రీహరితానే చేయూత నిచ్చి తరింపజేయును. కూర్మము తన యవయవములు లోనికి ముడిచికొని యుండు నట్టింద్రియముల, నింద్రియార్థముల వశమున నుంచికొని విషయములందగులు కొనక పరమాత్మయందే, తదాజ్ఞాపాలన మందే మగ్నుడగు నాతడే భక్తవరుఁడు. సత్వరజస్తమోగుణముల కతీతులైవానికింజిక్కక మనసుచే నింద్రియముల నదుపున, నియమమున నుంచి వశము చేసికొన్నవాఁరే యుక్తులగువారే భక్తులు; కర్మయోగులు అట్టి యామెయే భక్తురాలు, కర్మయోగిని. అట్టివాడే భక్తుడు, కర్మయోగి. యంతఃకరణమును స్వాధీనమున నుంచికొనినవాఁడు, మనసును జిక్కబట్టినవాడు, రాగద్వేషములుమానిన, స్వాధీనములైన యింద్రియములచేఁ సహజప్రాప్తముల విషయములఁ జరించుచుండియుఁ బ్రసన్నచిత్తుఁడగును. చిత్తము ప్రసన్నమైన దుఃఖములెల్ల నశించును, బుద్ధి సుస్థిరమగును. సుస్థిర బుద్ధికలవానికే శాంతియును సుఖమును. యోగముక్తుఁడు కానివానికి సుస్థిరబుద్ధియు భావనయులేదు. అట్టి దృఢబుద్ధియు నిష్ఠయు లేనివానికి శాంతియును లేదు సుఖమును లేదు. భగవంతు నందేచిత్తముంచి సేవించుచుఁబూజించు భక్తుఁడా దేవదేవునేపొందును. ఎల్లధర్మములా భగవంతుఁడేయని నమ్మిచరించుచు నాదేవునేచేరును. వాని నాదేవుడు తరింపంజేయును.

కామక్రోధములనువీడి భగవంతునాశ్రయించి తన్మయులై జ్ఞానతపస్సున బవిత్రులగు వారు బ్రహ్మభావమును మోక్షమును బొందఁగలరు. భక్తులు వివేకబుద్ధి నెల్ల కర్మలఫలము భగవంతునకే యర్పించి యెట్టికోర్కియులేక మమకారాహంకారములు మాని దుఃఖమునంటక కర్మల నాచరింతురు. భగవంతుని మతమును భక్తిశ్రద్ధలతో అసూయలేనివారై యవలంబించువారు మోక్షమునందుదురు. ఇందునమ్మకములేక, కార్యాచరణలేక, నిందించు మూఢులుపూర్తిగఁజెడుదురు. ఆత్మజ్ఞానములేనివారు, గురునివాక్యములందును, శాస్త్రములందును నమ్మకములేనివారు భగవంతునెడ భక్తియు శ్రద్ధయు విశ్వాసమును లేనివారు నశింతురు. సంశయాత్ములకీ లోకమునఁగాని పరలోకమునంగాని సుఖశాంతులులేవు. కావున జ్ఞానవాసనచే, నజ్ఞానోద్భవములగు నవిశ్వాసమును,సంశయమును ఖండించి, తొలఁగించికొని యోగస్థులై కర్మలఁజేయవలెను. బ్రహ్మమునందున మనసుంచిన భక్తులు భ్రాంతిని బాసి స్థిరబుద్ధులై మంచికలిగినదని యుబ్బిపోరు, హాని, చెడుగు కలిగెనని దుఃఖింపరు. కర్తవ్యములను గర్తవ్యములుగా మానకపానరింతురు.

బాహ్యములగు సుఖములనాశింపక యంతఃకరణమునందే సుఖము ననుభవించుచు తనలోదానే యామోదమునొందు, నంతఃప్రకాశమునొందిన కర్మయోగి, భక్తుడు బ్రహ్మస్వరూపుడగును. అతనికే బ్రహ్మ నిర్వాణము, బ్రహ్మము నంగలియుట, యనమోక్షము సంప్రాప్తమగును. ఎవరు బాహ్యవిషయముల వదలి భ్రూమధ్యమునందు దృష్టినిలిపి ప్రాణవాయువును, నపానవాయువును నాసికాభ్యంతరమునందు సంచరించు లాగున సమముచేసి, యింద్రియములను, మనసును, బుద్ధిని నియమించికొని అదుపున నుంచికొని మననశీలురై మెక్షమునందాసక్తికలవారై, కోరికలు, భయము, క్రోధము విడిచిన వారైయుందురో వారు సదాముక్తులేయగుదురు. భగవంతునే యజ్ఞములను, దపములను, ననుభవించువానిగను, సమస్తలోకములకును బ్రభువుగను, సర్వభూతములకును స్నేహితునిగను దెలిసికొని భక్తుఁడు శాంతిని బొందును. కర్మఫలమున పేక్షింపక భగవదర్పితముగఁ జేయవలసిన కర్మలను, జేయునతఁడే భక్తుఁడు; అతడే సన్యాసియును, యోగియును. కాని కర్తవ్యములను జేయక కాలుసేతులుముడిచికొని యుండున కర్మణ్యుడు, ఇతరుల కష్టసముపార్జితముంగుడిచి మురియు నాతఁడు సన్యాసియుంగాడు, యోగియును గాఁడు, అతఁడు భక్తుఁడునుగాఁడు.

తన్నుఁదనయాత్మను దానేయుద్ధరించికొనవలెను. ఆత్మనాశమొనరించికొనరాదు. స్వాధీనమున నుంచికొనిన మనసే, యాత్మయే బంధువు. స్వాధీనమునలేనిచో నదియేతన శత్రువు. యోగయుక్తిని మనో నిగ్రహముంబొందినవాఁడు, భగవంతునందులగ్నమై మోక్షమే పరమావధిగాఁ గల శాంతిని బొందును. చిత్తవృత్తిని నిరోధించి పరమాత్మునందెల్ల

భూతములను, ఎల్లభూతములందునఁ బరమాత్మను, తనయందెల్ల భూతములఁను బరమాత్మను, వాని యందెల్లం దున్నను గాంచిసమదృష్టినొందిన వానికి భగవంతుడును, భగవంతునకాతఁడును దగ్గరయై యొండొరులంగాంచుచునే యుందురు. భగవంతు నందే మనసుంచి, భగవంతునే పూజించుచు, భగవంతునే నమస్కరించుచు, నాప్రభునియందేయాసక్తుఁడగు భక్తుఁడు, భక్తురాలు పరమానందస్వరూపుఁడను భక్తుఁడు, భక్తురాలు, పరమానంద స్వరూపుఁడగు భగవంతునే పొందుదురు.

భగవంతుఁడవ్యయుఁడు, నిరాకారుఁడు, నిర్వికారుడు నిత్యుడును నిర్వి కల్పుఁడును. అవ్యక్తుఁడును నప్రమేయుఁడు నగు నావాసుదేవుఁడు నామరహితుఁడు జ్ఞానులగు కొందఱా నిర్గుణునే నిరాకారునే నిశ్చల భక్తినెంచి సేవింతురు. వారేనిర్గుణోపాసకులు. మఱికొందరు రామకృష్ణాది నామముల, సుందరరూపమును మదినూహించి యుంచికొని భజింతురు. వారుసగుణోపాసకులు. భక్తులు సగుణోపాసకులైనను నిర్గుణోపాసకులైనను భజియించి సేవించున దొక్కనినే; పొందునదియు నాపరంధామునే, పరమానందమునే. మార్గములువేరైన వారిని వేరుగా హెచ్చుతగ్గులుగా నెన్నంబనిలేదు. భగవదారాధన మేరీతిగఁజేసినను హృదయపవిత్రత, సత్యనిష్ఠ, సర్వసమభావము, సేవాభావము కావలయును అవియే భక్తికిదేవునారాధనకు। జిహ్నములు. అట్టిపరమపూజ్య పవిత్రలక్షణములుగల భక్తవరులు భగవంతునకే ప్రియుమైన వారగుచుండ మానవులకెల్లరకు సమాదరణీయులు, ప్రేమపాత్రులు ననివేరె చెప్పనేల?

ఈర్ష్యాద్వేషములు మొదలగు వాని విడిచి యెవ్వఁడచలుడైయుండునో యట్టి శాంత చిత్తుఁడే భక్తవరుఁడే భగవంతునకుం గూర్చు నిష్టుఁడగు భక్తవరుఁడు. భక్తుఁడు నిస్పృహుఁడును. బాహ్యాభ్యంతరముల శుచియును, సర్వసమర్థుండును, సముడును, పక్షపాతములేనివాఁడును, సమదర్శియును, దుఃఖాతీతుఁడును, త్రికరణములనగు కర్మలయందుఁ గర్వతాహంకారమును బాసియుండు వాఁడును, వానిశక్తి వంచనలేక పవిత్రముగఁజేయువాఁడునునై భగవంతుని మనసును చూరఁగొని వానికిష్టుఁడగును.

అమానిత్వము, దంభాహంకారములు లేకుండుట, అక్షోభము, అహింస, ఎవ్వరియెడను ద్రోహముతలంపమి, చేయమి; ఓరిమి, ఆర్జవము (ఋజువర్తనము) ఆచార్యోపాసనము, శౌచము, స్థైర్యము, ఆత్మనిగ్రహము, విషయములందున వైరాగ్యము, చావుపుట్టువుల, వ్యాధులగల దుఃఖదోషములెఱింగి యవి యంటక యుండుట, అనవానిచే వెతనందకుండుట, అనాసక్తి, సత్యము, పుత్రదారగృహాదుల మమత్వము లేకుండుట. అనవారియెడలం జేయవలసిన కర్తవ్యముల మానుట కాదు నిర్వికారముగ పవిత్రముగ భగవత్సేవఁ జేయుటయె. నిష్టానిష్ట ప్రాప్తుల సమచిత్తముననుండుట,

పరమేశ్వరునందు సర్వాత్మ దృష్టిచే నేకాంత భక్తిని గలిగియుండుట, శాంతిమయమును నీరవమును నగునే కాంతస్థానమునను నికియు ప్రాకృత జనులయెడలఁ బ్రేమయు, మోక్షాసక్తియును నీగుణ సముదాయమే జ్ఞానము. భక్తుఁడీ దైవగుణములం గలిగియుండును. ఆతనికంటె జ్ఞాని వేరొకడులేడు. ఆతఁడు దైవాంశసంభూతుఁడు. ఆతఁడు సర్వభూతములందున సమానమున వ్యాపించిన సర్వేశ్వరుని గ్రహించును. సర్వభూతములునశించినను సర్వాత్ముఁడఖిలేశుడు నశింపఁడని యెఱింగియా ప్రభుని బొందును. సత్వరజస్తమముల నతిక్రమించి జ్ఞానియగు భక్తుఁడు ప్రళయకాలమునను నశింపఁడు. సృష్టి కాలమున జననమందఁడు. అనగా జావుపుట్టువులు లేనివాడై మోక్షసంప్రాప్తి నొంది బ్రహ్మానందరూపుఁడై యుండును.

బ్రహ్మముపరుడు, నపరుఁడునని ద్వివిధంబులగు. అందున, నపరుఁడు క్షరుడు,నక్షరుడునని మఱియు రెండుతెఱంగులగును. లోకములఁబ్రకృతింగల, నశ్వరములగు నెల్లభూతములును క్షరుడనంబడును. కూటస్థుడు అనగా నాభూతము లన్నిట సమముగ వ్యాపించియవ్యక్తుఁడై యనశ్వరుఁడగు నాతఁడే, యాత్మస్వరూపుఁడగు నాతఁడే యక్షరుఁడు. వీరిద్దరికంటెను బరుఁడెయుత్తముఁడై యొప్పు నాతఁడు పరుడు, పరాత్పరుడు, ఆతఁడవ్యయుఁడు. ఆపరుడే, పరమాత్మయే, ఈశ్వరుఁడేయెల్ల లోకముల వ్యాపించి పోషించుచున్నాఁడు, అన్నింట నుండి శాసించుచున్నాడు.

మోహదూరుఁడై యాపురుషోత్తము పరమాత్ము నెఱింగి భజించువాఁడే సర్వజ్ఞుఁడు ఆతఁడే భక్తుఁడు; కృతకృత్యుఁడై తరించువాఁడు. సమాధి యోగంబున నాతఁడే శ్రీవేంకటాధీశుని భగవానుని భజించి సాయుజ్య మందఁగలవాఁడు. అట్టిసదాచార సంయుతులగు భక్తులకే యాబ్రహ్మము వైకుంఠధాముఁడు సుగమ్యుడు.

## పద్మావతికోర్కిరాణికిందెలియుట - వకుళమాలికా సందేశము

అమ్మా! ఆపరంధామునందే నామనసులగ్నమై యున్నది. ఆశ్రీహరింబొందనే నామనసిచ్ఛించుచున్నది. ఆయంబుజాక్షునందే నాప్రేమ. ఆవిష్ణునింగాక నాచిత్తము మఱియన్యుంజేరఁబోదు. ఆగోవిందు శ్రీనివాసునే నేనేవేళ స్మరించుచుందును. ఆశ్యామలాంగునచ్యుతు భగవంతుననవరతము పాడుదును భజింతును. ఓతల్లీ ఆతడనాజీవము, నాబ్రతుకు, నన్నేరీతినేని వానింజేర్చనేయుపాయము, జతనము నొనరింపుడు. అని జననికి దీనముగఁబలికి యాపద్మానన పద్మాసన మఱిపలుకక మౌనమూనియుండెను. అదివిన్న కన్నతల్లి ధరణీదేవి. యాదేవుఁడెట్లులఁ బ్రసన్నుఁడగునా? తనముద్దుల పట్టినెట్లుల జేపట్టునా? యనిచింతింప సాగెను.

ఇంతలోనన యాపద్మావతీ ప్రాణసఖులు నగస్త్యేశుఁబూజింపనేగినవారు, వకుళమాలికను వెంటనిడికొని బ్రాహ్మణవరులతో నగరునకుఁ జనుదెంచిరి. అటకువచ్చిన విప్రవరులెల్లరు బాగుగ నాదర సన్మానముల గంధపుష్పాక్షతల నర్చనల, పరితృప్తిగ భోజనాదికముల, వివిధ వస్త్రాభూషణముల నమూల్య దక్షిణలఁ దనివి నందింపఁబడిరి. వారును రాకుమారికిఁ దన్మాతకు నభీష్టములెల్ల నేకొంతయు లేక నెఱవేర నాశీర్వదించి ఘనమగు వీడ్కోలు నంది తమతమ నెలవులకుంబోయిరి. పూజలు సేసియాలయము నుండి వచ్చిన తనకుమరితయనుంగు సంగడికత్తెలంగాంచి వారివెంటనున్న వకుళ మాలికంగూర్చి రాణియిట్లనియడిగెను.

ఓ బిడ్డలారా! మీవెంటవచ్చిన యీయమయెవరు? ఎక్కడ నుండియెందులకై వచ్చియున్నది? ఈ పూజ్యురాలింగూర్చి యెఱుంగంగోరుచున్నాను. అనియడిగినంత ఆ యువతు లిట్లనిరి. ఓదేవీ! ఈదివ్యాంగన, మహాభాగ మీకొఱకునై యేవచ్చి యున్నది. ఈయమ మమ్మట నాలయమున శివదేవు సమక్షమునఁగలిసినది మాయడిగి నంత ధరిత్రీ దేవింజూడఁ బోవుచున్నాననియు, నంతః పురమున నాదేవినిగలిసి మాటాడనగునా? యనియునడిగెను. మేమును నీయమతో మేమంతఃపురమునకు పోవువారము. మావెంటనేరమ్ము. మేమందలివారలమే. అంటిమి, కాననంతట నీపై దలిమావెంటనిటకు వచ్చినది. ఆమెవచ్చిన పనియేమో, ఆమెయెవ్వరో మీరే యామె నడుగఁదగునని యూరకొనిరి. అదివిన్నయాదేవి వకుళమాలికంగని యోదేవీ! మీరెవ్వరు? నాకడనేమి పనికై యరుగుదెంచితిరి? సెలవిండు తలతో నొనరింపంగలను. అనెను.

నేనువేంకటాద్రినుండి వచ్చిన దానను. నాపేరు వకుళమాలిక. మాస్వామి నారాయణదేవుఁ డా తిరుమలనెయుండును. ఒకదినమున మాప్రభువు మనోజవంబగు నంచయట్లు తెల్లనగు హయరాజమునెక్కివేటకై పరిసరారణ్య భూములకుందరలిపోయెను. ఈవసంతాగమనమున ఫలపుష్ప కిసలయభరితములైన వృక్షలతాకుంజములచే మనోహరములగు వనముల, సింహశరభ శార్దూలములను గవయఖడ్గములను, రురుమృగముల, లేళ్లగుంపుల, నింకను బలుతెఱంగుల మృగంబులంగనుచు శుకపికశారికాదుల పలుకులకులుకుచుఁ బోవుచొనొక యెడఁగరేణుకా సమితిచే నావృతయై మదజలధారల నొప్పునొకమదగజ రాజముంగని యానందించెను.

ఓం శ్రీ చంద్రలావణ్యదాయినే శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ నారాయణనగేశాయ శ్రీ వేంకటేశాయ నమః

# తృతీయాధ్యాయము

## దేవునితో కన్యకా వివాహ నిశ్చయము

ఆవనము నావనముం దిరిగి యావేలుపులవేలుపారణీ నదీతీరముంజేరెను. అటనశ్వరాజముందిగి చల్లనిపిల్ల తెమ్మెరెల నలసటన పనయించి కొనుచు విహరించుచో నదీతరంగ సీకరబిందువుల బరువై పూలతావులనొప్పి పిల్ల తెమ్మెరలు వచ్చితన్ను సేవింపఁబూలరాల్చి తరువరములు తన్నారాధింప నందందు దిరుగుచు నారమావల్లభుఁడు గజరాజారాధితుఁడై కనికరించి యట నొక తరువరచ్ఛాయను మేఘమాలిక యందలి శతహ్రదల యట్లు సుందర సువేషోల్లసితలఁ గన్నియల వారినడుమ నతిమనోహర నిందిరారమణి యట్టిదాని బుత్తడి బొమ్మయన నొప్పు నొక యొప్పులకుప్పం గాంచెను. కాంచిన యాతఁడా బిత్తరియందహత్తిన చిత్తముకలవాఁడాయెను.

ఆజేజేయాయలరు బోడిం బెండిలియాడు నభిలాషను దోడనున్నవారి నీమె యెవ్వరితనయ యనియడిగి పవిత్రచరిత్రుఁ డాకాశరాజ తనయ యని యెఱింగెను. అప్పుడెయాతఁడు తనహయరాజమధిరోహించి తన పవిత్రాలయమునకు దయచేసెను. అటస్వామి పుష్కరిణీతటమునఁ దన దివ్యాలయముంజేరి నన్నుంబిలువనంపి యిట్లని యాదేశించెను. ఓవకుళమాలికా! ఇప్పుడే వియద్రాజపురమునకుంబొమ్ము. రాజాంతః పురము సొచ్చిధరణీ దేవితోడి మహారాజుందర్శించి కుశలమునడుగుము. నాకై వారి తనయను రుచిరాంగిని కమలాలయను బద్మావతిని యాచింపుము. రాజదంపతుల యభిమతమునెఱింగిరమ్ము. సుందరీ! తొందరగఁ బోయిరమ్ము. నా యీశ్వరేశ్వరు ననుమతిని మీగృహమునకేగుదెంచిన దానను. ఓదేవీ! మంత్రివరుల తోడిరాజచంద్రుని యొక్కయు, గన్యకామణి యొక్కయు నభిమతముల నెఱుంగుడు మీయిచ్ఛంజెప్పి వేగమున నన్నంపుడు అనెను.

వకుళమాలిక యొక్క యాపలుకు లెల్ల నాలించిన రాణి ధరణీదేవి మోదసంభరితు రాలాయెను. అప్పుడే మంత్రివరులతోనున్న రాజును బిలువనంపి వచ్చిన వారితో నాయుదంతమంతయు వినిపించెను. అదివిన్న రాజును బ్రమోదభరితుఁడై మంత్రులకుఁ బరోహితులకు నిట్లని చెప్పసాగెను. పూజ్యులారా! నాబిడ్డపరమ పావన; కమలాలయ, అయోనిజ, దివ్యసుందరి పద్మావతిని పృద్వీసంభవను దేవదేవుడు భగవంతుఁడు వేంకటాద్రీశుఁడు పెండ్లాడఁ గోరియున్నాఁడు. నేడునామనోరధము నిక్కముగ సఫలమాయెను. ఇందు మీయందఱి యభిప్రాయమేమియో చెప్పఁగోరెదను. అన్న

యారాజుపలుకులు విన్న వారానందకందళిత హృదయులైయిట్లనిరి. ఓరాజవరా! ఈపెండ్లిచే నీవును నీ వంశమునె కాదు మేమును మావంశములును దరించును సర్వోన్నతములగును. ఎనలేనినీ సుందరి సుకుమారినీకుమారి క్షీరసాగర కన్యతో సిరిచెలువతోఁగలసి మెలసి వర్తింపంగలదు. శార్ఙ్గధనుర్ధారికి బరమాత్మున కాదేవదేవునకు గుమారినిచ్చుటయే మాయభిమతము. ఇది వసంతము. కార్యానుకూలము. శుభస్యశీఘ్రము కదా. దేవగురునిప్పుడె పిలిపించి వివాహముహూర్తము నిర్ణయించునది. అనవారి విన్నరాజునపుడే దేవదేవునకు శ్రీనివాసునకుఁ దనపుత్రి బద్మావతినిచ్చి పెండ్లిచేయ సంకల్పించి తదర్థమై పరామర్శింప దేవలోకమునుండి ధిషణుని సాదరమునఁ బిలిపించి వధూవరులకు వివాహయోగ్యమగు శుభలగ్నమును నిర్ణయింపంగోరెను.

## దేవగురుడు బృహస్పతిరాక - శుకమునివరురాక

రాజవరుఁడపుడె తనకుమారరత్నమును వసుదాతను నమరావతికింబంపెను. చంద్రాంశ సంభూతుండగు నాతండును వాయు వేగమనోవేగములఁ దొందర తొందరగఁ బోయి గురునిసందర్శించి వందనములాచరించి యట ధిషణుచేనాదర సత్కారములంది సుఖాసనోపవిష్టుండై, తనరాకకుంగారణమును, దనపితృదేవుని కోర్కెయుంజెప్పి పురమునకురాగోరెను. గురుఁడును నెంతయు హర్షపులకితుఁడై మఘవునకుంజెప్పి తక్షణమె యారాకుమారునితో బయల్వెడలి భూమికిందిగివచ్చి యాకాశరాజ నగరముం జేరెను. వచ్చిన వాచస్పతికి రాజవరుడు ప్రత్యుత్థానాది సత్కారముల స్వాగత మొనర్చివందన మొనర్చి యర్ఘ్యపాద్యములిచ్చి పూజించి యున్నతాసనమున నుపవిష్టుం జేసెను. పిదపరాజు గురువరులతో నిట్లనెను.

ఓగురువరా! నాచేసినపూర్వ పుణ్యఫలముననే పద్మావతి నాకుంగుమార్తెయైనది. మీ శుభానుమతమున నాతనయను వేంకటాధీశునకుం, గృష్ణునకు నిచ్చి వివాహమొనర్ప నభిలషించుచున్నాను. ఆశ్రీనివాసదేవునుండి సందేశముంగొని యొక పవిత్రాంగనవచ్చి యున్నది.అనవిని సురాచార్యుఁడిట్లనియెను. ఓరాజా! సుఫలసంభరితమగు మహావృక్షము నాశ్రయించి పలుజీవరాసులు జీవించుచున్నవి. అట్లే పుణ్యభాగుడవగు నిన్నాశ్రయించి, దీనికైయే మేమున్నారము. కాని నేనప్పుడప్పుడె దివినుండి యీభువికిందిగి వచ్చుచున్నవాఁడను. కావున నాకావేంకటనగాధి నాధు పరిచయమంతగాలేదు. శుకమునివరుఁడన్ననో, యెల్లపుడా దేవునాశ్రయమున నివసించుచున్నవాఁడు ఆతఁడే యాశార్ఙ్గధరు శ్రీనివాసదేవుంగూర్చి బాగుగనెఱింగినవాఁడు. వృత్తాంతమెల్ల

వ్యాసపుత్రునకు శుకదేవునకుం దెలియఁజెప్పుము. ఆతని నిపుడె యిటకు రప్పింపుము. ఆమునివరుం డిటకు నుత్తరపుదెసను నేబదికోసులదూరమున నిజాశ్రమమున నివసించును. అనినంత నృపవరుఁడు తనసోదరు తొండమాను నామునివరు దేవ నుద్బోధించి పంపెను. ఆతఁడును వాయువేగములగు నశ్వరాజములంబూన్చిన యరదమునెక్కిపోయి ధ్యానయోగము నుండి యప్పుడె లేచిన యాతాపసివరునకు మ్రొక్కియిట్లనెను. ఓ ఋషివరా! మాయన్నయాకాశ రాజవరుడు తమతోఁజెప్పుమని నన్నంపిన విషయమాలింపుఁడు. కుమారీరత్నము పద్మావతీ వివాహము శ్రీగిరివాసు శ్రీనివాసునితో నొనర్ప సంకల్పింపంబడెను. దానికై సువిచారమునుసల్ప దేవగురులు రప్పింపబడిరి. అందులకైయే మిమ్ములం గొనిరమ్మని నన్నుంబంపిరి. మీయనుమతిన యావివాహము, సుసంపన్నముకాఁగలదు. అన విన్న యాతపోధన తల్లజుఁడు కొంతదనుక యానందమునఁదన్నుందామఱచెను. కొంతవడికి దనలోనికిఁదావచ్చిన యాతఁడల్లన నిట్లనెను.

లోకపవిత్రకరునకు, లోకోద్ధరునకు, దేవదేవునకు శ్రీనివాసునకే కన్యాదానముం జేయనున్న మీయన్న యాకాశభూవరునకు నాదేవునను గ్రహమున దినదినము నభ్యుదయ మగుంగావుతమని పల్కుచులేచిపోయి పద్మతీర్థమున స్నానమొనర్చి మధ్యాహ్న సంధ్య, నెఱవేర్చెను. మడుగులంగట్టి కుశనిర్మితము శిరస్త్రాణముందాల్చి తులసి పూసల మాలమెడను, జేతులఁబూని మృగచర్మమున నొడలు కప్పుకొనెను. పుడమిపతియనుగుం దోబుట్టువు తొండమానుఁడు కొనివచ్చిన యరదమునెక్కి బయలుదేరెను. వచ్చుచున్న మునిసత్తమునకు శుకదేవునకు గురునితో బలములతోఁ గుశపుష్పాక్షతలు తోడి పూజాద్రవ్యములతో రాజస్వాగతమొనరింప వచ్చెను. వచ్చిన రాజు మునివరునకు సాష్టాంగదండ ప్రణామమొనరించి యర్ఘ్యపాద్యముల నర్చించి యేన్గుపైనెక్కించి పురమేగుచు రాజభవనమునకుంగొని వచ్చి యుచితోన్నతాసనో పవిష్టుంగాఁ బొనర్చి యిట్లనిపలికెను. ఓ మునిదేవా! మీయొక్కయుగురువరుల యొక్కయు ననుమోదముం గొని నాకుమరితను బద్మావతిని వేంకటగిరివాసునకు శ్రీనివాసునకు సాలంకృత కన్యాదాన మొసంగి కళ్యాణమొనరింపనిశ్చయించితిని. మీయుభయులకివే నా నమోవాకములు. కర్తవ్యముంబోధించి నన్నుంగృతార్థుంజేయుఁడని యూరకుండెను. అదియాలించిన శుకముని సత్తముం డిట్టులనియెను.

ఓనృపశిరోమణీ, ధన్యులము, ధన్యులము. ఓయుదారవిచారా! ఎంతయు యుక్తములగు పలుకులు పలికితివి. పురుషార్థసాధనమైనవాఁడు, ఫలదుడు, నెల్లలోకపాలన కర్తయునగు శ్రీనివాసునకు వేంకటేశునకుఁ గన్యాదానమొనర్ప సంకల్పించితివి. నీయీసంకల్పమున నీకులము పవిత్రమైనది. పితరులెల్లందరించిరి.వెనుకముందాడకుము.

ఈపవిత్రోదారకార్యమున సందియమెందులకు? తొలిజామున నీవేదియో మహత్పుణ్య మొనర్చితివి. సాధుసజ్జనులకు సద్గతియైనవాఁడు, లోకారాధ్యుడు, లోకాధారుడు శ్రీహరి కమలనాభుఁడు నీకల్లుడు కానున్నాడు. ఇంత కంటెనుగావలసినదేమి? నిన్నుమించిన యదృష్టవంతుడేడునులేడు. "శుభస్యశీఘ్రం" ఆలసింపకుము. నీసావాసమున మేమును ధన్యులమైతిమి. ఆశలవీడి భోగములంబాసి కందమూల ఫలాదులే యశనముగఁ దరుమూల స్థితులమై యాదేవునకై తపించు మేమును నాదేవుదర్శింపఁజాలకున్నాము. నీసత్సంగతిచే మేమిక లక్ష్మీయుతు నాదేవదేవుఁ బరమేశుం గండ్లారంగాంచఁగలము. ఎల్లవేళల జన్మజన్మల నీశుభసంగతి మాకుంజేకురును గాత! మనుచు నామునితల్లజుఁడు తన్మయత నట్టే యూరకుండెను.

## పద్మావతీ వేంకటేశుల కళ్యాణ ముహూర్తము

ఓగురువరా! మునివరా! వందనశతమ్ములు నేనెంతయుధన్యుఁడను. అత్రి గోత్రోద్భవయగు నీకన్యాజన్మనక్షత్రము మృగశీర్షయని యెఱుక. దేవదేవుని నక్షత్రము శ్రవణమని యోగిపుంగవుల యోచన. ఆదేవదేవు వసిష్ట గోత్రోద్భవుఁడందురు. అంతయు నెటింగినమీకిది నేవేరె చెప్పవలయునే? తారాబలచంద్ర బలములు బాగుగ శోధించి శుభముహూర్తమునుంపఁగోరెదనని యాకాశరాజు పలుక దేవగురుండాలించి, చింతించి యిట్లనెను. రాజా! వీరల వివాహమునకెంతయు నుత్తరఫల్గునీయుక్త శుభలగ్నము తగియున్నది. అయ్యదిసుఖసమృద్ధికరము. నాడీకూట సూత్రకూటము లత్యంత యుక్తములైయున్నది. యోనికూటము ననుకూలమైయొప్పుచున్నది. గ్రహములెల్లను శుభదృష్టి నలరారుచున్నవి. ఇయ్యదిభగవచ్చింతనా పరులగు దైవజ్ఞుల నిర్ణయము. కావున వచ్చువైశాఖమాసమున నుత్తరఫల్గునీ నక్షత్రమున వీరి వివాహము విధి పూర్వకముగ సుసంపన్నముగావలెను. ఇట్లని గురువరుడు సుముహూర్తము నుంచెను. అటు పిమ్మట గురునానతి మంత్రి పురోహితుల, బంధుమిత్రుల సామంతులఁబరిజనుల నెల్లరరావించి కొలువుదీరి వారల నిండుననుమోదమున శ్రీవేంకటేశ దేవునకుఁదన కూతునిచ్చి పెండ్లి చేయ సంకల్పించి విప్రవరులచేఁ బుణ్యాహవాచనముచేయించి విఘ్ననాథు పూజలం జరిపించి సదక్షిణ తాంబూలదానముల, సత్కారముల నెల్లర సంతృప్తులంజేసిపంపెను. పిమ్మటఁ దదనంతర కర్తవ్యముందెలుపుండన గురుదేవుండు దేవుని పేరశుభలగ్న పత్రికం బంపవలెనని చెప్ప రాజు గురు ననుమతమున లగ్నపత్రిక నిట్లుగ వ్రాసెను.

ఓం శ్రీ వామదేవప్రియాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ నీలమేఘానిభాయ శ్రీ వేంకటేశాయ నమః

## కన్యాదాత వ్రాసిన శుభలగ్నపత్రిక

ఓం తత్సత్ శుభమస్తు

స్వస్తిశ్రీ అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండును, నిత్యుండును, నిరవద్యుండును, అప్రాకృతుండును, నద్వితీయుండును, సచ్చిదానంద స్వరూపుండును, స్వతంత్రుండును, భక్తప్రియుండును, భక్త్యైకవేద్యుండును, శార్ఙ కోదండధరుండును, వేదాంతవేద్యుండును, అనంతగుణ గణుండును, నగు శ్రీవేంకటనగనివాసునకు శ్రీనివాసునకు, శ్రీకృష్ణునకు, విష్ణుదేవునకుమీకును నాకును గల్గిన బంధుత్వ కారణమున, మీపాదపద్మ సందర్శన కుతూహలుండను ఆకాశరాజను నేజేయు నాశీర్వాదములతో వ్రాయు శుభలేఖార్థములు.

ఓ యుమాధవ సంసేవిత పాదపద్మా! రమాధవా! భవదీయకరుణారస వృష్టి సంసేచనమున నిటనారాయణపురమున బంధుమిత్రులతోఁ బరివారముతో మేమెల్లరము నెంతయు సుఖమున్నవారము. అటమీయెల్లరికుశలముందలంచి ముదమందుచు మున్నారము.

మదీయపుత్రికారత్నమును బద్మావతీ కన్యను మీకు ధర్మపత్నిగా నర్ధాంగిగా నర్పింపనభిలషించి సంకల్పించి మేమిచైత్ర శుద్ధత్రయోదశిని నీశుభలేఖను వ్రాయు చున్నారము.

ఓగోవిందా,ముకుందా! విద్యుక్తమగు నీవివాహమును మీరంగీకరింతురుగాక. గురువరులును, శుకదేవులును నాహృదయమునెల్ల నామూలాగ్రమెఱుంగుదురు. ఓసర్వాంతర్యామీ హృదయాంతర్వాసీ! నాడెందము మీరెఱుంగనిదికాదు.

స్వస్తిశ్రీ ఏతత్శుభసంవత్సర వైశాఖశుద్ధ దశమీ శుభవాసరమున నుత్తరఫల్గునీ శుభనక్షత్రయుక్త శుభలగ్నమున మీకళ్యాణముంజరుపఁ బూజ్యులగు దైవజ్ఞులును బెద్దలును నిర్ణయించినారు. కావున నేతత్శుభముహూర్తమునకు మీరును, బంధుమిత్రపరివారముతో నేతెంచి హృదయపూర్వకముగ మేమిచ్చు కన్యాదానమును గ్రహించి, మదీయ కన్యాపాణిగ్రహణంబొనర్చి కళ్యాణమహోత్సవమును మహోత్సాహమున సుసంపన్న మొనర్చి సబంధుమిత్ర పరివారముగ మమ్ముల నెల్లరం గృతార్థులంజేసి యుద్ధరింపం గోరుచున్నారము.

*పుండరీకనయనా! పురుషోత్తమా! హరే!*
*కేశవా! మురారి! వాసుదేవ*
*భవ్యగుణ సముద్ర పాలింపు మబ్జాక్ష!*
*దీనసలివెయంది దేవదేవ!*

ఇదియ మా వ్రాయుశుభలేఖ

భవదీయ
ఆకాశరాజు

ఇట్లీశుభపత్రికను లిఖించి యానృపాలుడు పద్మావతీకుమారికి నెంతయు నిష్టుఁడును, బూజ్యుఁడు నగుశుకయోగివర్యుని జగదీశుసన్నిధికిఁ దగు మర్యాదలతో, ప్రభునాహ్వానింపఁదగు పెద్దలందోడుగ నిచ్చిపంపెను. తానును బుత్రుఁడును, బంధుమిత్రులతో నామునివెంటనంటి యొక కోశముదూరము సాగనంపఁ బోయివెంటనున్నవారి నటనిలిపి తాను శుకమునివరుఁతోఁ యిట్లనెను.

మునివరా!యెట్లేని యాదేవునొప్పించి నాకన్యతో వివాహమునకు సమ్మతింపం జేయుము. ఎంతేని కోరిన దానికిన్నించి వరకట్నమును, కానుకలను, నీయగలను. నేనేమియు వెనుదీయను. అనిపలికి వారిని సాగనంపి తానును వెను దిరిగి వచ్చి తనవారిం జేరి వారితో బురముంబ్రవేశించెను.

అప్పుడ నృపాలుఁడంతిపురమునకుంబోయి వకుళమాలికాము తల్లింగాంచి యిట్లనెను. ఓ సుప్రతీ! నీవిపుడె, దేవునాలయమునకుం దయచేయుము. దేవుని కళ్యాణము వైశాఖమాసమున సుసంపన్నము కాఁగలదు. వైవాహికయోగ్యములగు సాధన సంపత్తులనెల్ల సమకూర్చికొని పరివారముతో నాటికిందరలిరావలసినదిగా నాకోర్కియని దేవునితో వచింపుమని ముహూర్త పత్రిక నిచ్చిపంపెను. రాజదంపతులయుఁ బద్మావతి యొక్కయు సాదరసత్కారములతోవీడ్కోలునంది వకుళమాలికయు వేంకటాచలమున కుం దన హయరాజమునెక్కి వెడలి పోయెను. పోయినయామె మునివరునితోఁ జేరి పయనించెను.

వారు వెడలిన పిమ్మట నాధిషణుని రాజాపూజించి యాదర సత్కారములొనరించి వీడ్కొలిపెను. ఆ గురుని వెంటఁ దనకుమారునప్పుడ దేవేంద్రాదులను పెండ్లికి నాహ్వానించికొని తీరఁబంపెను. అటుపిమ్మట విశ్వకర్మయు నటకు రావింపఁబడెను. కళ్యాణ మంటపమును తరలి పెండ్లివారికి బంధుమిత్రులకుఁదగు వసతులుతో గృహములతోడి కళ్యాణ నగరమును ద్వరలో నిర్మింపఁజేయ గోరబడెను. రాజా కోరిక మేరకుఁదగు కాలముననే సర్వాంగ సుందర ములునగు గృహములతో సుందరవీధి కలతో నుపవనోద్యానములతో గళ్యాణ నగరము నిర్మితమాయెను. ఇంద్రుడు పూలజల్లుల నగరమంతయుఁదావులనిండించి రాజమార్గములు నుమ్మదులము లొనరించి యైశ్వర్యవంతము లొనర్చెను. పురమున గంధర్వుల పాటలు నచ్చరలేమల యాటలు వేడుకలు కూర్చుచుండెను. కుబేరుననుమతంబున గృహములన్నియు నవనిధులతోనిండి విరాజిల్లెను. యముఁడాపురముననే కాదు భూమి నంతట జనముల రోగాది భాదలులేని వారినిగా జేసెను. వరుణుండు నాణి ముత్తెముల జాలరులతోఁబురమెల్ల నలంకరించెను.

ఇట్టెల్ల దేవతలాకళ్యాణ నగరమును సర్వసమృద్ధమును, సౌఖ్యవంతము నొనర్చి వృషాచలమునకు నేగిరి.

ఇఁకనటఁగలుగఁబోవు దేవు సందర్శనమునకుఁదమియు నానందము క్షణక్షణము నుప్పొంగుచుండ నడచిన దారియు, ఁగడచిన కాలమును నెఱుంగకయే దినకరుఁడు గగనతల మధ్యముంజేరుసరికి మునితల్లజుడును, దోడివారును, వకుళ మాలికయు వేంకటాచలమును జేరి, దేవుమందిరాంతర్భాగమునకుంబోయిరి.

ఈలోఁ దడవగుటయు మాతృమూర్తి వకుళమాలికయింతదనుక రాకుంటయుం దలంచి శ్రీనివాసదేవుఁడు విచారించుచుండెను. అంతలోననే పరాశరాత్మజుం డెదురఁ దోచెను, తలఁజేతులు చేర్చి మొగిడ్చి వందనమొనర్చుచు నిలిచెను. వచ్చిన మునివరు నుత్సాహ వదనుంగాంచి పుండరీక దళాక్షుఁడు ప్రమోద పులకిత తనుడై యాసనమున నుండి లేచి నాలుగడుగులెదుఱ వైచి రాజు కడనుండియే వచ్చెనని తెలిసి యాదరాభిమానముల నిట్లనియెను. ఓ విప్రవరా! ఋషివరా! నాదగుకార్యము పండా, కాయా ? యన్న నది యాలించినతాపసియు, నోదయాసముద్రుఁడా మీకార్యమెల్లవిధముల నెంతయుఁబండేయగును. అందున సందియమేముండును? అని దండప్రణామం బాచరించినంతన యాశుభవాక్కులనాలించిన ప్రభుండు శుకదేవునట్టె గ్రుచ్చి యెత్తి కౌగలించికొని హర్షపులకిత గాత్రు భక్తి వివశుఁదాపసి ప్రతాండుంగాంచి ప్రసన్నుండై యిట్లనియెను. ఆనాడు మదర్థ మై సామీరి యాంజనేయుఁడు సముద్రముందాటి జనకజా శుభవార్తంగొని వచ్చి నాకెంతయు ముదమ్ముంగూర్చెను. నేడు నీవాతని యట్ల శుభవార్తంగొని వచ్చినాకుంబ్రమోదముంగూర్చుచున్నావు. మీరిద్దరు నాకెంతయుఁ గూర్చువారు. మీకు మించి నాకుం బ్రియులు లేరన నతిశయోక్తికాదు. అనియూరకున్న మునివరుఁడు సమ్మోదమతిశయింప దానుకొని వచ్చిన రాజవరుఁడిచ్చిన లగ్నపత్రికను నమస్కృతులతో ప్రభుని కరములనిడి "దేవదేవా! యిది యాకాశరాజు వ్రాసియిచ్చిన శుభలేఖ, దీనింగొనదగును" అనినంత నాపరంధాముడద్దాని సాదరమున నందికొని, కనులకద్దికొని, సిరమున నిడికొని, చేఁబట్టి, యాపత్రికం జదివి ప్రసన్నచిత్తముననిలిచి "మునివరా ! రాజవరుఁడు భార్యా పుత్రులతోఁబరివారముతో గుశలమే కదా? రాజ్యమున బ్రజలును నేయీతి బాధలు లేక సుఖమున్నారుగదా ? అనినంతనాశుకముని వరుండు ఓ సర్వాత్మా మీకునేఁజెప్పవలసిన దేమున్నది? మీయనుగ్రహమున నంతయుం గుశలమే. ఆకాశరాజ ప్రియతనూజ పద్మావతి, ప్రభూ ఆ కన్నియమిమ్మే పెండ్లియాడం గోరుచున్నది. నృపచంద్రుడును మిమ్మునట్లని గోరియున్నాడు మీరుకోరిన వరకట్నములు, లాంచనములు నేమేని మీకర్పింప సంసిద్ధుఁడనని పలికి యున్నాడు.

అననది విన్న శ్రీనివాస ప్రభువరుఁడు మునివరుంగాంచి యల్లన నిట్లనెను.

ఓ మునివరా! కన్నియ వరుంగోరుటయుఁబెద్దలయనుమతి.బెండ్లియగుటయు సహజము. తండ్రి కూతునకుం దగు వరుంజూచి వివాహమొనర్పంబూనుటయు సాజమ. కాని వరుడు కాని, వరునకుం గావలసిన పెద్దలు కాని మాకీ కట్నములు, కానుకలు కావలయును నీలాంఛనములు కావలయును, విత్తంబులు మొత్తంబులు కావలయును అని కోరుట ధర్మవిరుద్ధము.

యథాశక్తిగ సాలంకృతమగు కన్యాదానమొనర్పబడుటయు, నట్టి కన్యాపాణి గ్రహణమునే ధర్మము, శాస్త్రసమ్మతము, మానవతా లక్షణము ననదగును. కావున నోమునివరా! నేనా రాజచంద్రుని గోరునదేమియులేదు. మేమా కన్యాపాణి గ్రహణము నంగీకరించితిమి. కావున సాదర సన్మానములఁ గన్యాదానమొనర్చుటయె తగునని యా పృధ్వీవల్లభునకు నివేదింపుడు. అదియవారికిని మాకును గౌరవమును బ్రతిష్టయును నగును అనుచు ఇదో మేమును వియన్నృపాలుపేరవారి హర్షాభివృది కరముగఁ బ్రత్యుత్తరము వ్రాసి యిచ్చుచున్నారము. దానింగొనిపోయి యాప్రభువరున కందఁజేయుదురుగాత యని తాన్నుస్వయముగ నా పురుహూతమిత్రుఁడాకాశరాజు పేర నంగీకారపత్రమును వ్రాసియిచ్చెను. మునియును దానినందికొని యమందానందముం బొందెను.

## శ్రీనివాసరచిత శుభాంగీకార పత్రిక

### శుభమస్తు

శ్రీమాన్ రాజాధిరాజ పూజ్యాలును, మహారాజమకుటులును, మణిరంజిత పాదపద్మలును, గుణగణగరిష్ఠులును, పరిపాలనా దక్షులును, సుధర్మ తనయులునునగు నాకాశమహీపాలురకు భక్తియుక్త నమోవాకములతో వేంకటాద్రీశుఁడ శ్రీనివాసాఖ్యుఁడ నేఁజేయు శుభవిజ్ఞప్తి.

ఓపూజ్యపాదా! బంధువరా! మీవ్రాసిన యట్లనే వచ్చివైశాఖశుద్ధ దశమీ భృగువాసరమున శుభమహొత్సవమున నేను తమకన్యకారత్నము పద్మావతీదేవి పాణిగ్రహణమొనర్పఁగలవాఁడను. తొల్లి సుధాసాగరుఁడు పుండరీకాక్షునకుం గన్యాదానమొనర్చి మహొజ్వల కీర్తిసంపన్నుఁడైనట్లే నాకొనర్చు నీకన్యాదానమున మీరు మహొన్నత యశోలాభమునంది యానందింతురుగాక. నాడు జనకభూపాలుఁడు

శ్రీరామభద్రునకు భూమిజను సీతాకాంతను సాలంకృత కన్యాదానమొనర్చినటుల, దానినారాఘువులు గ్రహించినటుల మీచేయు సాలంకృత కన్యాదానమును నేఁ బ్రమోద భరిత మానసమున గ్రహింపనున్నాను. దీన నుభయవంశములు పూర్వపూర్వులతోఁ దరింతురుగాత. విశేషించి వ్రాయనేల? మీయనుమతియెట్లట్లయన్నియు నుపపన్నము కాఁగలవని దానికినేనన్నివిధముల పంసిద్ధుఁడనని వ్రాయుటకెంతయు సంతసించు చున్నాఁడను. ఇట్లు

**భవదీయ శ్రీనివాసుఁడు**

ఇట్లు పరంధాముడు శ్రీనివాసుడు తన శుభాంగీకారమును వ్రాసి యాపత్రిక శుకమునివరునకు నారాయణపురమున కాకాశరాజచంద్రునికడకుఁగొనిపోనిచ్చి యిట్లనెను. ఓమునిచంద్రమా! నాకొకయిల్లు వాకిలిలేదు. నాకుల గోత్రములేమోనాకే తెలియవు. అట్టి నాకారాజవరుఁడు కన్నియనీయ నెట్లునంకల్పించెనో నాకే వింతకొల్పుచున్నది. అదివిన్న శుకయోగీంద్రుడు మోమునఁజిఱునవ్వుదోప నిట్లనియెను. ఓదేవా! యెందులకీ విడంబనలు, మాయానటనలు? ఈవులకెల్లఁదావైనదీ బ్రహ్మాండము. ఇట్టి బ్రహ్మాండములకెల్ల నిల్లయిన యీయనంతమే నీటెంకి. ఈయనంతమునకే యీవనంతము. ఈవులకెల్లనీవతావు, ఈకులగోత్రములన్నియు నెటనుండి వచ్చినవి? ఈ సర్వమునకీవమూలముకదా. ఏకులగోత్రములు లేనివాడవీవ. అన్నియునీవయన్నఁ గాదనఁగలవారెవరు? ఓదేవదేవా! యనంతా! చావుపుట్టువులు, వృద్ధిక్షయములు, నాదిమధ్యాంతములు లేనివాఁడవు. అంతకు నాశ్రయమీవ. నీకాశ్రయమేమి? పరమపురుషా! ఈమాయామానుష లీలలుమాని మమ్మనుగ్రహించి తిన్నని తెన్ను నమమ్ముం జేర్చికొనుము. అనియేమేమో ప్రార్థనలు పొనరించి దేవు దర్శనలాభంబునె మదిఁదలంచికొనుచు దనియుచుండెను.

అంతటనటు శ్రీనివాసుఁడు అటకుంజేరిన మాతృమూర్తినివకుళమాలికను గని నమస్కరించి, తల్లీ నీరాకయింత తడవగుటకుంగారణమేమి ? యనివినయ వినమిత మస్తకుండై ప్రశ్నించెను. అంత వకుళమాలికయు వినయవినమితయై యిట్లనియెను. ఓయచ్యుతా! ఆదిదేవా! మీయానమేరకు నేనాకాశరాజపురమునకుంబోయి వచ్చితిని. అటనెల్ల కార్యములు మంగళయుతముగ సఫలమాయెను. దేవుని పెండ్లికందఱుం బెద్దలెయందురుకదా. అటకునరనారాయణ వనమునుండి యొకయెఱుకత వచ్చి మీ పెండ్లికెంతయు మేలువునాదులువైచెను. పద్మావతీ కన్యయుదాను నీకైయే యుంటిననియు, నీవ తనకుం దగిన వరుఁడ వనియు నొక్కి పలికినది. ఆమెమీయందె

మనసుంచినది. ఆమెయుఁదనమనోభీష్టము మునివరునకుంజెప్పి పంపెను. అనియెను. శుకముని సురగురుల పల్కులువిని రాణికోర్కియు మన్నించి రాజుపేరోలగమున మీకెకన్నియ నీయ దీక్షాబంధురుఁడాయెను. అచ్చటి కళ్యాణ వార్తలు చెప్పనేయీ పూజ్యుఁడు శుకయోగిపుంగవుఁడున్నాడన, నదియాలించిన యాతొలిజేజే శుకముని పుంగవుం గాంచి, యాదరమున, ఓఋషివరా! ఇంకను మీచెప్పునదేమేనియున్న యానతిండన నాయోగిపుంగవుఁడా దేవునకు వందనమొనర్చియిట్లని చెప్పసాగెను.

దేవదేవా! దివ్య ప్రభావా! దీనరక్షకా! నాచెప్పునదేమున్నది? ఆపృధ్వీతనయ పద్మావతీ కన్యక వినయవినమితోత్త మాంగయైయిట్లని మనవిచేయుచున్నది. రమాధవా! భక్తవరదా! ఆర్తజనావనా! యాకర్ణింపుమయని యామెపలుకుల నిట్లనివచియించెను.

మాధవా! నాప్రార్ధన మంగీకరించి నన్నుంజేపట్టుము. దినదినము మీ నామస్మరణమె యొనర్చుకొనుచున్నదానను. మీదివ్యసుందర విగ్రహమునే మనము ననుంచికొని యర్చించికొనుచున్నదానను. ఓ సిరివల్లభా! మీశుభచిహ్నముల శంఖచక్రాదుల నాతనువునందెల్లఁదాల్చితనియుచున్నదానను, పంచ సంస్కారధారుల బవిత్రహృదయులఁదమ భక్తజనుల నెల్లవుడు నారాధించియలరుచున్నదానను. ఓమధుసూదనా! శ్రీనివాసా నేచేయు కర్మలన్నియు, మీకొఱకె మీప్రీతికొఱకె. నాపూజలనంగీకరింపుము. నన్ననుగ్రహింపుడు. మాజనకులయనుమతంబుననే యోదేవదేవేశా! నన్నుంగనికరించిగైకొనుడు. ఎల్లవిధముల మీరనాకేడుగడలు నాసర్వస్వము మీరె మిమ్మకాక యేనన్యమెఱుఁగను. దేవా! ఇయ్యదియ యాకన్నియ మిన్నవినతి. ఆమె మీకై యొసంగినదికొనుడు. అని తమ్మిపూమాల దేవుకరముననిడి మునివరుఁడూరకుండెను.

దేవుఁడామాల నాదరముననందిపుచ్చికొని మెడనిడికొని శుకయోగి కిట్లనెను. ఓమునివరా! నీవిప్పుడెపోయి యాకన్నెమిన్నతో నాపలుకులుగనిట్లువచింపుము. ఆమెపలుకులు నాకెంతయు ననుమోదములు. దేవవరులతో మునిగణములతో వచ్చియామె పాణిగ్రహణమొనర్తునను. అనుచు నొకతులసిమాల నామెకిమ్మని దేవుఁడు మునిదేవునకొసంగెను. అదిగైకొని మునివరుఁడు దామోదరు కడ ననుమతింగొని యప్పుడే యాకాశరాజపురమునకుం బోయి, రాజునకు దేవునను మతింజెప్పి దేవుననుమతి పత్రమునిచ్చి దేవదత్తమగు కస్తూరి కాకలమోదయుత తులసి మాలిక పద్మావతి కొసంగెను. ఆయమ ప్రభునంగీకారమునకుఁ బ్రమోదంబంది యాతులసిమాలిక కైకొని సిరమున నిడికొని కనులకద్దికొని హృదయమునఁదాల్చి తన్మయతనందెను. ఎప్పుడు మూరుతము

వచ్చునా? దేవుఁడెప్పుడు వచ్చునా! యని యెడలెల్లఁగనులుగా నామె ప్రభునిరాకకైదారి తెన్నులుచూచుచుండెను. తనువెల్లడెందముగా నువ్విళ్లూరుచుండెను. ఆకాశ నృపవరుండును ప్రభుదేవునంగీకారము వినియెంతయు హర్షాన్వితుఁడాయెను. రాణియానందమునకు మేరలేదు.

అప్పటినుండియు రాజువివాహ కార్యములఁ గొనసాగింపసాగెను. తొలుత జాబిల్లిని బిలిచి యానందమున సన్మానించి చందమామా! మాయందనుగ్రహింపుము. దేవుపెండ్లికి నీవును చేయివేయుము. షడ్రసోపేతముగ నన్నముల పిండివంటల శాకపాకముల, పంచవిధ భక్ష్యభోజ్యముల నొనర్పంగోరెదను. విష్ణుదేవున కభీష్టములగు పరమాన్నముల నొనర్పుము. మునివరులకు, దేవమానవులకు వారి వారి యిష్టములకు రుచులకు దగునట్లుగ వంటకములెల్ల రుచివంతములుగ సమకూర్పుము. ఎల్లపదార్థముల నమృతతుల్యములై, సుగందితములై, పలుతెఱంగులగు వానిరసపూర్ణముల నొనరింపుము. అని నియోగించి యింకను వలయు నాయాపరికరములెల్ల సమకూర్పయోగ్యుల నప్పుడె నియోగించి పురమెల్ల నలంకరించి దేవితో మంత్రివరులతో దేవుని రాకకై యెదురుతెన్నులు చూచుచుండెను.

## పద్మావతిం బెండ్లి కూతుంజేయుట

రాణితోడి పుణ్యస్త్రీల వెంటనిడికొని, మంగళవాద్యములతోఁ బురమునఁ బుణ్యాంగనలఁ బేరంటమునకుఁ బిలిచికొనివచ్చెను. వచ్చిన పుణ్యస్త్రీ లెల్లరుంగూడి, మంచి సమయముంజూచి పద్మావతిని బెండ్లికూతుంజేయఁబూని కొనివచ్చి పెండ్లిపీటమీద కూర్చుండఁబెట్టిరి. ఆమె ప్రక్కనే తోడిపెండ్లికూతుంగూర్చుండఁ బెట్టిరి. కన్నెకు ముందటఁ బసుపుపూతలఁ బావనమైన మంగళ మయమగు బంగరురోటిందెచ్చి యుంచిరి. రోటఁబసుపుకొమ్ములుంచి పైఁడి రోకళ్లఁబట్టి పేరటాండ్రొయ్యారమున పాటలుపాడుచు దంపసాగిరి. ముగుదనెత్తిమీద ముసలిముత్తైదువ మంచినూనె పెట్టి యక్షతలు వేసిదీవించినది. పిమ్మటఁ బేరటాండ్రందఱునక్షతలా పద్మావతి సిరమునఁ జిలకరించి యాశీర్వాదములగిలుకరించిరి. మంగళగీతములు పాడుచు బంగరు పళ్లెరమున నీరాజనంబెత్తి హారతులిచ్చిరి. డోలుసన్నాయులాది మంగళవాద్యములు సెనలుము చుండబోరుకలంగెను. పసుపు, చందనము, కస్తురి కలపములనాపె కొదలెల్లవలుగులు పెట్టి పన్నీటి జలకమార్చిరి. ఒడలెల్లఁ దడియార్చి బంగరుజలతారు వలిపెమును గట్టఁబెట్టిరి, దివ్యాభరణముల రత్నజటితముల నలంకరించిరి, వారామె

మోమునఁ గళ్యాణతిలకము దిద్ది బుగ్గను గాటుకబొట్టు నుంచిరి. వనువు పారాణిపాదాలనలదిరి. తల్లియుందండ్రియు వచ్చిపెండ్లికూతు హొయలుసూచి పెద్దయుముటియుచు మూర్ధమున నక్షతలుంచి దీవనలుంచిరి రాజ్ఞీమణి యావచ్చిన పేరటాండ్ర నెల్లర నుచిత రీతుల నాదరించి పూజించి తాంబూలములుపండ్లు పూవులు నొసంగియమూల్యాభరణములు కానుకలు దక్షిణలు నొసఁగి వీడుకొలిపెను. వారునుదేవునెయల్లు నిగఁబొందనున్నరాజు,రాణుల భాగ్యమునకుం బొంగుచు బద్మావతిని సాక్షాలక్ష్మియే యనినుతించుచుఁ దమ యదృష్టమునకు, లక్ష్మీనారాయణులఁ గాంచంగలుగు బాగ్యమునకుందనియుచు ముదమున నొండొరులహెచ్చరించి కొనుచుఁ దమతమ నెలవులకుం జనిరి.

## వేంకటనాథుఁడు బందుగుల బిలువనంపుట

అటదేవునికతయెట్టిదొ యెఱిగింపఁగోరెదమన శౌనకాదులకు రౌమహర్షణి యిట్లనియెను.ఆనందమయుఁడు,నిర్వికారుఁడు,నిర్వికల్పుఁడు, నయ్యు, నాయాది దేవుఁడు మానవుల నను గ్రహింప సామాన్య మానవునట్టుల నటనలొనర్ప సాగెను. వకుళమాలికా శుకదేవులు చెప్పినదంతయు నాలించిన శ్రీనివాసుడు తల్లివకుళమాలికతో నిట్లనెను. అమ్మా యీపెండ్లి యెట్టులు సుసంపన్నముకాఁగలదోకదా? కయ్యమైనను నెయ్యమైనను వియ్యమైనను సమానులందరాణించును. నేనొక్కరుఁడను. నావారనువారెవ్వరునులేరు. ఇట్టి యీ యేకైకునితో నాబహుబంధు వర్గుఁడగు మిత్ర సామంత పరివారుండగు రాజవర్యునకు నెట్టులు చుట్టరికమందగించును. నేనొక్కరుఁడనై తరలిపోయిన నానరపాలుని మనసెంత యొరియునోకదా ? అనునదియనావంత. అనుచుండ నాతని కా యంబ యిట్లనియెను. ఓయచ్యుతా! ఎందులకయ్యా యీ మాయా నటనలు? అటదేవగురుఁడు, నామీద తపోధన తల్లఁజుఁడు శుకయోగియు నిన్నేయెన్ని పలికిరన్నవారి మాటలు కల్లయొనర్తువా? నీవోవసుధైక కుటుంబుఁడవు, ఒంటరిగాడవెట్ల గుదువు. ఇదియంతయు నీమాయాలీల. తనయనుంగు కూతునకు నిన్నేతగిన వరునిగా వరించిన యారాజు నాశలు నిరాశలు సేతువా? ఇంతకు సత్యస్వరూపుడవునీవు. కావున యెల్లరును సత్యమే ధర్మముల కెల్ల మూలమని వచింతురు. ఇంతకుమున్నేకదా పెండ్లికివత్తు ననిపలికి పంపితివి. నీపలికిన పలుకులు వితథములెట్లగును. నీవారలెవ్వరును లేరనుచుంటివే నీకుంబెరవారలెవ్వరోముందుగఁజెప్పుము. ఆపైనీవారెవ్వరో చూడవచ్చును. ఏకైకుండవానీవు? నిక్కమె. ఈయనేకులలోనీవెవ్వరియందు లేవోయానతీయుము. నీబొడ్డు తమ్మిం బుట్టిన పుత్రరత్నమును బమ్మను రమ్మనుము. నీవేయాతఁడుగా

నాతఁడే యీవుగానున్నభక్తవ శంకరుని శంకరుని బిలువ నంపుము భక్తవరునిజ సోదరుపురందరుని, లోకపాలురను సపరివారులుగఁజేరఁ బిలువుము. తపోనిరతుల ఋషిముని ప్రకాండుల నాహ్వానింపుము. నీవేమిటనెందుఁ దక్కువయా? కొడుకులు, కోడండ్రు మనుమలు, మనుమరాండ్రు, సోదరులు తత్పుత్త్రులు, మిత్రులు భక్తులు గంపెడు బలగము గలవాడవు. నీకుంగల వారేమితక్కువయా? అనుచుండగా నాశేషశైలాధీశు నెమ్మోమునఁజిఱునవ్వు వెన్నెలలు చిందులాడ సాగెను.

అప్పుడే యాదేవుఁడు దీనజనావనుఁడు సాధుజనపరిత్రాత శ్రీనివాసుఁడ నంతు నాదిశేషుని, ఖగకులేశ్వరు గరుఁడుని నెమ్మనమునందలపోసినంత నాయిర్వురును వచ్చి సమ్ముఖముగఁ గ రయుగములుమోడ్చి భక్తి వినమ్రులై యాజ్ఞలకై నిలిచియుండిరి. ఎదుట నిలిచినవారింగాంచి పురాణపురుషుఁడిట్లని పలికెను. వైనతేయా! ఇప్పుడె సత్య లోకమ్మునకుం బమ్మ పాలికింబొమ్ము. వాణీ సమేతు సపరివారముగాఁ గొనిరమ్ము. ఓ సహస్రఫణా! యహికుల భూషణా! వెండికొండ కుంబోయి యుమాసహితు నాయహిభూషణ భూషితు శంకరుని గొనిరమ్ము. అనుచుఁ బెండ్లిపిలుపు పత్రికల నిర్వురకును వ్రాయించియిచ్చెను. వారును నామంగళపత్రికలంగ్రై కొనిరమానాధునకుం బ్రణామములొనరించి యనుమతింగొని యప్పుడ కదలి పోయిరి.

## హిరణ్యగర్భుని పెండ్లి ప్రయాణము

అట్టులుపోయిన యావైనతేయుడు సత్యలోకముంజేరి బమ్మదేవరంజేరి నమస్కరించి నిలిచెను. అట్లుతనయెదుట నిలిచిన తార్క్ష్యుంగాంచి పరమేష్ఠి మోదమ్మున సమ్మానమ్ము లొనరించి కూరుచుండ నుచితాసనముం జూప సుపర్ణుండాదేవు చేతఁ దాఁగొనివచ్చిన తమ్మికంటి పెండ్లిపిలుపు కమ్మను బత్తితో నిడి తాకూరుచుండెను. ధాతయు నదియందికొని యిట్లనియెను. ఓకశ్యపాత్మజా, గరుత్మంతా! చాలకాలమున కాయెంగదానీరాక. అందఱును గుశలమేకదా? మాపూజ్యులగు తండ్రిగారు శ్రీనివాసులు వాసుదేవులెందుననెట్లున్నవారు? అనిపలుకరించెను. అదివిన్నయాగరుడుండిట్లనియెను. ఓనలుమొగంబుల సామీ! ఆవెన్నుఁడు వేలుపులవేలుపిపుడు భూమండలమున వేంకటనగరాజము కొప్పున నివసించియున్నవాఁడు. ఆదేవుడిపుడు పెండ్లికొడుకైనాదు. ఆదేవుని పెండ్లికింబిలువనే యిపుడునేనిటకు వచ్చియున్నవాఁడను. ఆనారాయణదేవుఁ డిచ్చిన యా శుభలేఖయే నేమీకరమ్మున నిడితిని దానింజదివికొనుఁడు. అంతయు మీకె విశదము కాఁగలదు. అని నంతన చతుర్ముఖుండా పత్రికను విప్పియెంతయు నుత్సాహమున నిట్లని చదివెను.

సీ॥ శ్రీరస్తు శుభమస్తు శేషసంపద్వైభ
వోస్తంచు దీవించియబ్జజునకు
చిరజీవికజునకు శేషశైలేశుఁడు
వ్రాసెడి శుభలేక ఫణితియిద్ధి
ఆకాశరాజు నారాయణ పురపతి
తనపుత్రిపద్మావతిని నొసంగి
శుభవత్సరంబున శుద్ధవైశాఖాన
దశమిని శుభలగ్న తరుణమందు।

తే॥ బెద్దవారలయనుమతి నొద్దికఁగొని
పెండ్లినాకు నొనర్పగా వేడ్కనుండె
బంధుమిత్రులతో బరివారయుతము
గాగఁజనుదెంచి మోదంబుగాంచఁగనుమ

వేంకటాద్రి నాధుని శ్రీనివాసుని పెండ్లిపిలుపునందికొన్న యాచదువులవేలుపు ముదముప్పిరియై, యెదను గ్రందుకొనఁగఁ గొంతతడవుదనుకనట్లే మాటాడకయుఱ మోడ్పుకన్నుల నుండిపోయెను. పిదపనల్లంతసేపు నకుందేఱుకొని, కమల దళనయను కళ్యాణదర్శన కౌతుకము కడలుకొనఁ జెంతనుగల దండధరులంగనుంగొని పెండ్లి పయనమునకు సంసిద్ధులై వచ్చుటకుఁగా నప్పుడె పయనంపుభేరిని వాయింపంజెప్పి పంపెను. అపుడె సత్యలోకమునల్లడలఁ బ్రతిధ్వనులతో భేరీదుందుభులు నౌబతు నగారాలు మంగళధ్వనులీనుచుఁ బెల్లుగమ్రోగెను. అప్పుడె యదివిన్న పౌరులు సహచరులతో ననుచరులతో నాలుబిడ్డలతో బంధుమిత్రులతోఁ బరివారములతో, దండనాధులు హుటాహుటినడకల నరుగుదెంచిరి. మునులు, తపసులు, ఋషివరులు సజ్జనులును గుములుగట్టి యరుదెంచిరి. వచ్చిన పెద్దలు కొందఱీపయనంపు సన్నాహ మెక్కడికనియడుగ నిలువనగు మొగమున నిట్లనియెను. అయ్యలారా! భూమండలమున జంబూద్వీపంబున భరతవర్షంబున వేంకటాఖ్యనగంబున జగత్పాలకుడు విశ్వపితయేకైక దేవుఁడు శ్రీనివాసుఁడేగి నెలవుకొనియున్నవాఁడు. వారికట నాకాశరాజు తన పుత్రిని పద్మావతినిచ్చి పెండిలిసేయనుండెను. ఆవివాహమునకిపుడు మనమందఱము పోవలసియున్నది. దానికే మిమ్ములనెల్లర నిటుల రావింపవలసివచ్చినది. అనియపుడె తగువేగరులం దేవపతిని బాకశాసనుని, దిక్పాలురను, దేవగణములతోఁ బిలిచికొనిరాఁ బంపెను. వారును సమ్ముదంబధికమ్ముగఁ దరలివచ్చిరి. మణికిరీటములవారు, పట్టుకుచ్చుల తలపాగలవారు, వివిధాభరణములందాలిచి వేడుకలు మీఱనొండొరులం బిలిచికొనుచు, హెచ్చరికలు చేసికొనుచు, హాస్యంపుఁబలుకులు నులికించుకొనుచు

తండోపతండంబులుగవచ్చి సత్యలోకనగరమునంజేరిరి. ఏడుకొండల దేవుపెండ్లికి నేగుంతమి గమికొన, గుములుకట్టి పురముననెల్లెడఁ దామెయై తిరుగుచు నుబ్బి తబ్బిబ్బగుచునుండిరి.

పరమేష్ఠియు నొకతలను నవరత్నజటిత సువర్ణమయ కిరీటమును, నొకట రతనాల మెఱయు కలికిపట్టు తురాయితోడి యుష్ణీషమును, మఱియొకట వింతరంగుల తలపాగయు, వేరొకటఁ గనువిందగునందల శిరోవేష్టనమును దాల్చెను. నీలమౌక్తిక మణిరంజిత మకరకుండల విభూషితములయి కర్ణములు కరము మనోహరములై యుండెను.

స్త్రీలనక పురుషులనక, చిన్నలనక పెద్దలనక, యెల్లవారలు నవరత్న జటిత సువర్ణాభరణమ్ములు నొడలికిమ్ముగ ధరించి తళుకుబెళుకుల పలువర్ణముల వలిపములు, పట్టుపుట్టములు ధరించి చదువులవేలుపు ననుసరించి పురము వెడలిరి. నలువయుఁ బలుకువెలఁదితో, బుత్రపౌత్రులతో, బరివారములతో నెల్లరంగదలించి మంగళధ్వనులు మోయింపజేయుచు ముందునకు సాగెను. వేల్పుదొరలెల్లఁ దమతమ పరివారములు బలిసికొలువఁదమతమ వాహనంబుల నధిరోహించి పైఁబైఁబతాకల నెగురవేయుచు ముందునకుసాగిరి. ఆత్రిదశతలోదరీమణులు దివ్య విమానములనెక్కి కదలిరి. వారి నడుమన సిందుచందురు పండువెన్నెలంబలుకరించు వెలికాంతుల రాయంచనెక్కి చతురాననుడు, మణిముక్తారంజితమగు నొడ్డాణముతో, నొఅపగుహారములు దాల్చి యొప్పుభారతీరమణివామ పార్శ్వముననలరారుచుండఁ దెల్లని జెండాపై టెపటెపలాడుచు నాకసంబునకును నొకవింత సోయగమును గలిగించుచుండఁ గదలిపోవుచుండెను. ఆదేవతలపై బంగరు దండముగల్గి పైరత్నకుంభమొప్పు శ్వేత చ్ఛత్రమొఱపైయుండెను. ఆయుజ్జయోనియట నాకసంబునఁదారకా గణమధ్యమున రాకాని శాకరునట్లు విరాజిల్లు చుండెను.

ఒకవంక ననేకానేకములు భేరీదుందుభులు, మృదంగపణవానక గోముఖములు, ఢక్కాడమరువిస్ఫాణములు, మురజాడ్డవీణారుఝర్ఝరములు, నాదిగవాద్యములు శ్రవణపేయములుగ మ్రోయుచు రోదసికుహరమెల్లనిండి యుండెను. స్వరలయతాల యుక్తములగు రాగములు దశదిశలలుము కొనంబాములును దలలెత్తి పడగలాడించుచు పైమఱచుచుండెను. వీణాదుల సుఖధ్వనులు పొరించుచు వాయించుచు గంధర్వులును, కంఠములెత్తియింపుగఁ బాడుచుఁగిన్నరులును, వాద్యగీతములకు ననుకూలముగ తమవాహనంబుల నృత్యములు పొనరించునచ్చర లేమలును, నటగాయకోత్తములు హాహా, హూహూ, తుంబురాదులు, వందిమాగధులు బలిసి కొలువ నలువ బృందారక

బృందములతో ముందునకుసాగి పోవుచునుండెను. ఆదేవుఁడు సత్యలోకముననుండి, కదిలి, వరుసగఁదపోలోకము, జనలోకము, మహర్లోకము, సువర్ణాకము, స్వర్గలోకముల మీదుగ మహీతలమునకు వచ్చుచో నాయాలోకములవారు తపోధనులు, పుణ్యవర్ధనులు, సపరివారుఁడగు నాహిరణ్య గర్భుని సురజ్యేష్ఠు నగ్నితేజుంగాంచిరి. వారుతొందరగవచ్చి, తొందరగ బోవువారి, దేవువారిం దరిసి, యయ్యలారా! పితామహుండు, హిరణ్యగర్భుండేమి పనిమీఁద నెచ్చటి కిందఱితోఁ గూడిపోవుచున్నవాఁడని యడిగిన వారికి నవ్వుమోములనా విబుధవరులిట్లనిరి. అయ్యలారా! భూమండలమున శ్రీనివాసదేవు కళ్యాణముకానున్నది. దానికై యాహ్వానింపఁబడినమేమెల్లరమేగు చున్నవారము. అదివిన్నవారెల్లరును దేవుని పెండ్లికెల్లరుంబెద్దలేయని తామును జూడవెంటఁబడిరి. మునులు, ఋషులు, విప్రవరులాదిగ గల వారును దమతమ యగ్నుల సతీసుతుల శిష్యజనుల వెంటఁగొని వచ్చి యాపోవువారింజేరి నడిచిరి. ఇట్లుమహావైభవంబునఁజని చనియాప్రజాపతి దుంధుభినిస్వనములు కొండలనీరైదుకడల నిండఁగా శ్రీవేంకటాచలమును దరిసెను యొకచారుండు వేంకటేశుకడ కేతెంచి దేవునెదుటఁ గరములు మొగిచినిలిచెను. వానిం జూచినంతనవురుషోత్తముండునుమిగులనానందంబంది.ఓయీ! మాకుమారుఁ డెందున్నవాఁడు? నిన్నిటకుంబంపినదెవరు? అనియడుగ నాతండిట్లనియెను. ఓగోవిందా! అరవిందనయనా! మీసుతుఁడు విధాత్యఁడు వచ్చుచునేయున్నవాడు. వారిపంపుననే నిటకు వచ్చినవాఁడను, ఇంతకువారు గంగనుదాటియుందురు. అనుచున్నంతలో మఱియొకదూతవచ్చి వేల్పు వేల్పున కొఱఁగిసామీ! జేజేలపెద్దపరివారముతో గోదావరీనదీమతల్లిని దాటివచ్చిరి. తమరాకను బిత్రుదేవులకు మీకుఁదెలుపుమనియె నన్నంపిరి. అనవిని, యాపసిడిపుట్టముదాలుపు బిట్టుముదంబంది యుండునంతఁ దనపంపిన గరుడుండు నటకువచ్చిచేరి, తలంజేతులు చేర్చి మ్రొక్కియిట్లనెను.

రమాకాంతా, వైకుంఠాధి నాధా! తమతనుజుఁడు పితామహుఁడు కృష్ణవేణిని దరియించి, శ్రీశైలముందరిసి, యటనుండి యహోబిలముంజేరెను. అటనాదేవుఁ డనుమతింప నేనిటకు హుటాహుటినేగు దెంచితిని. అనుచున్నంత విష్వక్సేనుండును నటకు వచ్చిచేరెను. ఆతండు దామోదరునకుంబ్రణమిల్లి భక్తివినమితోత్తమాంగుడై యిట్లనెను. మహాప్రభూ! నారాయణా! హృషీకేశా! మీయాత్మజుండబ్జ భవుఁడిదే వచ్చున్నాఁడు. బ్రహ్మయు నప్పుడ తనయెక్కినయంచల రాయుని నుండి దిగికాలినడకన పితృదేవునకెదురుగ వచ్చిభక్తిని సాష్టాంగదండ ప్రణామంబొనరించిన నాచతుర్ముఖునప్పుడ యాచతుర్భుజుండు గరుడునిదిగి నాల్గుభుజములంబట్టి యెత్తియెదఁ జేర్చియెంతయు నొడలు గగుర్పొడువ నానందమున మైమఱచినవాఁడాయెను. పిదపనెదుట కరములు

మొగిచినిలిచిన తనయుంగాంచి తాతలకుందాత తరిగట్టుదారియల్లన నిట్లనియెను. నాయనా! రమ్ము! ఇటురమ్ము! నీకుమేలగుఁగాక. నీకైనిన్నుఁజూచుటకై నేనెంతయా తురతనందుచుంటి నోతేలియకున్నావుకదా? ఇటుచూడుము తడవులనుండియు నిన్నెప్పుడు చూతునా? యెప్పుడుచూతునా? యనినామనసువ్విళ్లూరుచున్నది సుమా! నిన్నుంజూడ నాకన్నులుకాయలుకాయు చున్నవికదా. అయ్యో! నన్నుంగాంచ నీమనసేలఁగోరుట లేదాయని నాకువింతయగుచున్నది. మాకెల్లరకు నీవప్రాణము, జీవితము, అనినంత నాయిర్వురుంగొత తడవట్లే మౌనముందాల్చియుండిరి. ఇరువురికండ్లానందాశ్రుజలముల నిండిమోముదమ్ములానందోత్ఫుల్ల ములాయెను. ఆతండ్రి కొడుకు లొండొరులట్లె చూచుకొనుచుండిరి. అప్పుడు వారుపొందిన యానందమమందము. వారిర్వురి యాప్రేమమయ చరిత్రను గన్నయాసభనున్న వారెల్లరెంతయుఁ దన్మయులైరి. అవ్యక్తానందమున వారిట్లనిపలుకసాగిరి. ఈలోకమున, నేలోకమున నీతండ్రిని బోలుతండ్రి లేడు. ఈతఁడేకొడుకు, వీనింబోలు కొడుకొండుండఁ బోడు.

## బందుగులెల్లరు వేంకటాద్రిని జేరుట

పిమ్మట హరియుఁ బుత్రుని జతురానను ననునయించి తననాల్గుచేతుల నతనికన్నీరును దుడిచి, నాతనిచేతింబట్టి కొనితనయిరవునకుం గొనివచ్చి తనచెంతనె కూరుచుండంబెట్టుకొని యిట్లనెను. నాయనా! నీకుంగుశలమా? కోడలును బుత్రపౌత్రులును నెల్లవారును సుఖమున్నవారె? అనవిని నలువయిట్లనియెను. పితృదేవా! కేశవా! మీయనుగ్రహమున మాకెల్లరకును గుశలమే. తమయనుగ్రహము కలుగమాకే కొఱఁతయు నెట్లుకలుగును? అయిన నోపురుషోత్తమా! పురాణపురుషా! తమ కుశలమెట్లున్నదో సెలవీయఁగోరెదను.

నాయనా! చతురాననా! నాక్షేమమునీకేమని తెలుపుదును ?అలనాఁడు మేము వైకుంఠమున నుండ నాభృగుమహర్షివర్యుండు తావచ్చినావక్షంబునం దన్నెను. అదిచూచిన మీయమ్మ పద్మాలయ నాపైఁ గోపించి ననువిడిచిపోయి యిటభూమిని కరవీర పురమునఁ గాపురముపెట్టినది. ఆమెతోడి వియోగమునాకొక దుర్యోగముకాగా నాకునాపురమున నుంటయే దుర్భరమై యిటకు వచ్చియుంటిని. నిలువననుకూలమగు నిలయమొండు కానమి నిలువనీడయు లేక యీపుట్టపట్టే యునికిపట్టుంజేసికొని యున్నవాఁడను. అదియేమి దుర్ఘటనయో తనయావు పాలీయలేదని చోళరాజమహిషి తన్నుం గోపించి దండింప నాయాలకాపరి యిటవచ్చినన్నుఁ గ్రూరకుఠారాఘాతమునఁ దలఁబగులఁగొట్టెను.

ఆబృహస్పతి దయందలంచి చూచియిచ్చిన యౌషధమున నాబాధనివారితమైనది. అనియటనున్న వకుళమాలికంజూపి యాదేవుండిట్లనెను. అప్పటి యాకష్టకాలమున నన్నాదుకొనియీయమ్మయ నాకెంతయు వాత్సల్యమున మందుమాకిచ్చి యనుపానముల సమకూర్చి సాకినది. కష్టకాలమున నాదుకొన్నవారె తలిదండ్రులు, గురువులు, వారెంతయుఁ బూజనీయులు. అనవిన్న యాహిరణ్యగర్భుఁడా వకులాంబకు నంజలించి భక్తిని నమస్కరించెను. మఱల నాశ్రీహరి యిట్లనియెను. తొలిబామున, నాయనా! ఆయమనాయమ్మ యశోదయ, ఇప్పుడిట వేంకటాచలమున నిట్లుగవచ్చి నన్ను సాకుచున్నది. అటులుండి యుండి యొకనాఁడు నేను వేటాడుకోరికతోఁ బద్మతీర్థము పరిసరముల కుంబోతిని. అటనొకప్రమదోద్యానమున విహరింపవచ్చిన కన్యకామణు లందున నాకాశరాజతనయను బద్మావతిని గాంచినామనసెంతయుఁదబ్బిబ్బైనది. ఆమెను బెండ్లాడనే మనసువ్విళ్లూరసాగెను. ఆయమపితృదేవుఁడును దానికంగీకరించెను. దానికైయేమీరెల్లరుంబిలువఁబడితిరి. నీవునా పెద్దకొమరుఁడవు. ఈపెండ్లి కార్యము నఫలమొనర్పఁగడంగుము. నుదుటి వ్రాతలఁ బదిలపఱచువాఁడవు నీవకదా! అనుచున్నంతన మంగళతరవాద్యనాదములు వారికి వినవచ్చెను. ఎవరు వచ్చిరా? అని వారనుకొనుచుండ శంకరుఁడర్ధాంగి నర్వమంగళ పార్వతితోఁగుమారులుగ జాననషడాననులతో నిజపరిజనులు ప్రమథులతో నటకు వచ్చెను. చంద్రశేఖరుడు సకుటుంబముగ లోనికివచ్చి హృషీకేశునకుఁ బ్రేమయు భక్తియు, నొప్ప నమస్కరించెను. పశుపతిగీప్పతులన్యోన్యము నభివాదములతో నామహేశుంగౌగలించికొని తనచెంతనే యాతనింగూర్చుండబెట్టికొని యంబికంగాంచి, అమ్మా! అమ్మలగన్నమ్మా! మాముద్దుల చెల్లెమ్మా! నీకైమాశంకరుడు సగమైనాఁడు గదమ్మా! మంచిగ మఱపించిమనుచుంటివా? రమ్మా! ఇటమావానిచెంతనే కూర్చుండుము అనినవ్వుచు, ఓ బొజ్జయ్యా! తమ్మునితో నీవీపజ్జనయుపవసింపుము. నీతిన్ననిచూపుల మాపనులు సుసంపన్నము చేయుము. అనిచూడునంతలో ధనదుడు సతీసుతులతో మిత్రులతో యక్షకిన్నరాది పరివారముతో నటకువచ్చిచేరెను. లోనికి వచ్చిన మ్రొక్కినిల్చిన కుబేరునిగాంచి గోవిందుఁడు దినదినము ధనరాశులఁ బెనుపందుము. మాబోంట్ల కప్పిచ్చి వృద్ధి పొందుము అన నాత్ర్యంబక నఖుడునవ్వుచు లక్ష్మీపతికి మీకు నేనిచ్చుటయేమిసామీ! అనుచు నాప్రభువుచూపిన యాసనమున మెల్లనఁగూరుచుండెను. అంతలోననే సపరివారుడై స్వాహాస్వధలతో మేషవాహనారూఢుఁడై వైశ్వానరుండును, నిజసతీ సుతపరివారముతో నిజవాహనారూఢుఁడు ప్రేతపతి, ధర్మదేవతయముఁడును నటకువచ్చిరి. వారితోఁ జిత్రగుప్తుఁడును నటకు వచ్చిచేరెను. వచ్చిన భక్తివినమ్రులైన వారినెల్లనాజగన్నాథుఁడు రమానాథుఁడు స్వాగతమిచ్చి యాలింగనముల నాదరించెను. వచ్చితిరా? నాయనలారా! రండురండు అనుచునిటనిటయని ప్రేమాతిరేకమునఁ వారలనెల్లరఁ గూర్చుండంజేసెను. అదేసమయమున భక్తిమయుఁడు వరుణదేవుఁడు సపత్నీ సపరివారుఁడు ననేకానేక

రత్నరాసులు కొనివచ్చియు, నింద్రాణీయుతుఁడమరేంద్రుఁడు విబుధయుతుఁడునైయు నారాయణాద్రి నటకుంజేరిరి. వచ్చిన వారినెల్లరనాదేవుఁడుందగురీతుల నాదర సన్మానమ్ములఁ బరితృప్తులంజేసెను. అట్లే గంధవహుఁడు నెత్తావులంజిమ్ముచు నాకొండం గుభాళించుచు వచ్చెను. కోణవుడు నిర్భతియు, భక్తిసంభరితుఁడై వచ్చెను. ఇట్టులొక్కరొక్కరెయాహ్వానితులెల్లరు వచ్చి యానగ రాజమున నాదేవుచేఁ దనిసి, యందెవిడిసి, యుండిరి. అదే కాలముననటకు దినకరహిమకరులు గ్రహతారకలతోడను, రతీసతీయుక్తుఁడై వసంతాది మిత్రులతో బరివారముతో రూపందిన రూపదర్పితుఁడు కందర్పుఁడును. నాగిరిరాజమునకు వచ్చిచేరిరి ఆ వెనుకనె కశ్యపాత్రి భరద్వాజులు వామదేవ గింతములు, వసిష్ట విశ్వామిత్రులు, పులహపులస్త్యులు, దధీచిజమదగ్నులు, వ్యాసవాల్మీకులు, గార్గ్యగాలవులు, శునశ్శేపజామదగ్నులు, నాదిగాగల మహామునులు నటకు వచ్చిచేరిరి. దేవాది దేవుడు దేవతలు నెల్లరు వారల సాదరమున సముపస్థితులుఁ జేసిరి. సిద్ధ సాధ్యగరుఁడోరగ గంధర్వాప్సరసలు నాదిగ నెల్లరయ్యెడకు గిరిరాజమునకు వచ్చిచేరిరి. అట్లు మహర్షులు, దేవతలు, రాజులు ప్రజలు దేవుని పెండ్లి కన్నుల విందుగఁ గనువేడుక సందడింపదొందర తొందరగ నటకు వచ్చి చేరిరి. గోవిందుఁడును వచ్చిన వారి నెల్ల దగురీతుల నాదరించి తనియించి యందంద విడియించెను.

అంతనొక్క సమయమున శేషాద్రివాసుడు శేషశయనుఁడు కళ్యాణ సందర్శనార్థమువచ్చిన తనవారినెల్లంజేర్చి సుఖసంభాషణముల నుండెను. పిమ్మట నాపరమాత్ముని, దృష్టియందున్న విశ్వకర్మమీదకుం బోయెను. అప్పుడె వానింబలుకరించి దరికింబిలిచి యిట్లనెను. అయ్యో! నీ విచటనె యుంటివె. నీవుండియు నీవచ్చిన వారెల్లరు నుండ నెలవు లేక యింతదనుక నెంతెంతగఁ గష్టమునందిరో కదా? ఇప్పుడేని తొందరపడుము. లెమ్ము లెమ్ము. ఈ వచ్చిన వారి కెల్ల వారి వారికిం దగునట్లుగ నెల్లవసతుల సమృద్ధమగునట్లుగ నివాసముల సుఖావాసములఁ గల్పించి యందు విడియించుమా అనెను. అది విన్న యాదేవశిల్పి యెంతయు సిగ్గునంది భయవిహ్వలుఁడై చేతులు జోడించి వందనం బాచరించి దేవదేవా నన్ను క్షమింపుడు. మీరు చెప్పకయమున్న మీయను మోద మెంతింగి నేనేకార్యమెల్ల నెఱవేర్చియుండవలసినది. కాని మీదర్శనానందమువలన తన్మయుడనై యొడలు మరచియుంటిని. కావున మందబుద్ధినై మీ చెప్పునంత దనుక నాయీ కర్తవ్యమును దలంపునకే తెచ్చికొన జాలకపోతిని. నాయీ యజ్ఞానమునకు మన్నింపఁగోరెదను. కరుణానిధీ! ఇప్పుడుపోయి యెల్లకార్యము నెఱవేర్తును. అతఁడట నొక నూతన మహానగరమునే నిర్మించి కనువారి కనులకు విందు, డెందముల కానందము కలిగించెను. ఎల్లభవనములు, సర్వాలంకారశోభితములు, సర్వవస్తుసంభరితములు, వలసిన వస్తువులెల్లనందున్న వారికిఁ గోరకయే లభించునవైయుండెను. వానింగన్న వారెల్లరు నద్దిరా! యని పెదవులపై వ్రేలిడికొననివారు లేరు. ఎవ్వరా యీ వింతశిల్పి? యనుకొని యబ్బురమందు వారేయైరి ఏమని చెప్పునది.

మిట్టపల్లములు సమముచేయబడి, నూతనోద్యానములు నిర్మితములాయెను. దివ్యసౌధములు దేదీప్యమానములయ్యెను. అందములెల్ల నటగ్రందుకొనియుండెను. మణిరంజిత ద్వారబంధములు, కనకకవాటములు, ముక్తామణి మాణిక్యశోభిత స్తంభంబులు, నంతకుమించి సంయమిత శీతోష్ణములు, గలవై యెవరికి గావలసినటుల వారికి నటులె సుఖమునిచ్చునవియై యుండెను. ఆయా చోటుల బటకుటీరములు, మేలుకట్టుల పందిళ్లు నిర్మితములాయెను. ఆవత్తనమంతయు మణి మంజుల మంగళతోరణములతో రత్నదీపములతో సమలంకృతమైయుండెను. బాపురే! యావివాహమండపము నందలి యా పెండ్లి యరుగు దానియందమేయందము. ఆయాతావుల హయరథగజశాలలు సుమనోహరములై యుండెను. ఎక్కడికక్కడనే వలయు సుఖములు కోరకయే లభ్యములైయుండెను. ఆప్రోలున నంతట రంగురంగుల దీపముల మాలలు శోభనిచ్చుచుండెను. కొన్ని యెడల దీపికలు వరుసగనడుచుచుండెను. రంగులు మారుచు వలయురూపములు పెక్కులుగ నందుచుఁగనువారికి వింతగొలుపు చుండెను.

అట దేవశిల్పితో దేవపతి వెడలిన పిమ్మట నొకదినమున పేరోలగమున త్రివిక్రముంగని పరమేష్ఠియిట్లనియెను. ఓదయాసాగరా! మీయెఱుంగని దేమియులేదు. సర్వజ్ఞులు, సత్యసంకల్పులు. అయినను నావిధినినేను నెఱవేర్చవలయును గదా! వివాహ శుభసంకల్పమునకుందొలుదొల్త పుణ్యాహవాచనముంబొనర్పవలెను. దానికనుమతి యిండు; అనెను. శ్రీహరినప్పుడవసిష్ఠముని వరుం బిలిచి మాన్యవరా! మీరెల్ల యజ్ఞవిధినిర్ణేతలు,కావునయజుర్వేదమహామంత్రములతో స్వస్తివాచకము నెఱవేర్ప వలయును. ఇక్కార్యమున మీరు పురోహితులు గనుండి సర్వము సుసంపన్న మొనర్పుం డనెను. పిమ్మట వచ్చిన సురమునివరులాదిగనెల్లర నర్హవిధుల సన్మానింప నీశ్వరుని, వారినెల్ల నాహ్వానింప గార్తికేయుని, వచ్చిన వారికి స్వాగతంబిచ్చి కొనిరా సూనశరుని, నియోగించెను. అటు పిమ్మట నగ్నిహోత్రునింజేరం బిలిచి యిట్లనెను. హవ్యవాహా! నన్ను వినుము. నీవొనర్చిన పాకములెల్ల ఋషిముని వరులకు దేవమానవులకు నెల్లరకు నభిరుచియగు. కావున స్వాహాస్వధలతో గూడి మేటివంటకముల ననుకూలముగ నొనరింపుము. అన్న వైశ్వానరుఁడు వల్లెయని నతమస్తకుఁడాయెను. ఆవెనుక జలగ్రహణాదులకు వరుణుని, శిష్టజనరక్షణ, దుష్టజన శిక్షణలకుయముని, నెల్లతావులఁ దావు లంజిమ్మసుగంధితములొనరింప గంధవహుని, వెలుగులు గుఱియింప శీతకరుని నియోగించెను. ఆ వెనుక నష్టవసువులు, గ్రహములు, మొదలగు తక్కింగలవారలు నాయాపనులకు ననుకూలముగ నియుక్తులై ముదమున దత్త్వేవాకార్యములు దక్షతనెఱవేర్పంగడంగిరి. అంతట బ్రహ్మయిట్లనియెను. నారాయణ దేవా! మంగళస్నానములంబొనరింపుడు పుణ్యాహవాచన పూర్వకముగఁగులదేవతా ప్రతిష్ఠాపనయు నిష్టదేవతా పూజయుఁదక్కుంగల శుభకర్మలు విధి పూర్వకముగ నాచరింపుడు లెండు. అనెను.

# పెండ్లికి కరవీర పురవాసిని లక్ష్మి రాక

చతుర్ముఖుని పలుకులాలించిన చతుర్భుజుండల్లన దలవంచికనుల నీరునించి యేమియో చింతించుచున్నటులుండెను. అది గన్న నలువకు మనసది యొక తీరుగనయ్యెను. ఇదియేమి ప్రాకృత జనునట్లు లోకారాధ్యుడు లోకేశుఁడు కనుల నీరునింపుచున్నాడు ? దేవుని లీలలద్భుతములు, అస్మదాదులకు మననవగాహ్యములన్న నితరులంగూర్చి చెప్పవలసినదేమున్నది? అనుకొనుచునప్పుడె తరిగట్టు దారింగనుంగొని, రమారమణా! రాజీవలోచనా! నన్నుంగన్న తండ్రీ! ఇదియేమి ? మిమ్ములంగన్న నాకును గడుపుచుమ్మలు చుట్టుచున్నది. మీరిట్లుంటకుంగతమేమి; మీమనసున నేదియో పెనువగదగిలి యున్నటులఁ దోఁచుచున్నది. నాయెడ గనికరముంచి చెప్పదగునేని చెప్పుడు. శక్తి కొలదిగ నేసేవచేసికొందుననెను. అదివిన్న యా పక్కిడాల్వేలు పల్లన నిట్లనియెను. ఓయీ! బొడ్డు తమ్మి చూలీ! నీకేమని చెప్పుదును? మీయమ్మ యబ్జనిలయ నాపైఁగోపించి ననువిడచి కరవీరపురమునకుం బోయి కాపురము పెట్టినది. ఆమెతోడి యెడబాటునకెడఁ దఁగుందియే నేవైకుంఠపురము వీడి వచ్చియుటనెలవుకొంటిని. కాని యామెలేక యీ వేడుకవేడుకగలేదు. ఇంటికందమిల్లాలె. ఇల్లాలెసుఖము. ఇల్లాలు లేని యిల్లిల్లె కాదు. ఆలుమగల యన్యోన్య ప్రేమయే యానందము. అదియే సౌఖ్యము. ఆనాడేదో యావేశమున దొందరపడిపోయినదే కాని యామెకు మాత్రమట సుఖమా, సంతోషమా? అటనామెయు నావియోగమునకు నటమట చెందుచునేయుండును. వారి వారి దేవేరులంగూడి దేవవరులెల్లరు నిటకు వచ్చి యమందానందమ్మున నున్నవారే కాని, యదేమియో నాస్వాంతమున కింతయుఁబరి తృప్తికానరాకున్నది. ఆకమలాసన లేక యీతరలిపోక నాకేమియు భవ్యముగఁదోచుట లేదు. అన్ననది యంతయు వినుచున్న యుమాపతి రమాపతింగని యల్లన నిట్లనియెను. ఓ యక్రూర వరదా! యార్త జనావనా! యవ్యయానందరూపా! యప్రమేయ! యొందులకీ వ్యర్థమగు వంత? అన్న, విన్న వెన్నుఁడు నుదుటి కన్నువాని కిట్లనియెను. ఓయుగ్రవిరాగీ! నీ కేమి తెలియును. అనుకూలవతి యగు నర్ధాంగితోడి యానందము? కల్పాంతమునను నెల్లరునను బాసిపోయిన తటినామెయేకదా పాలమున్నీట శేషతల్పమున నాదరినుండి కంటకమగు నొంటరి పాటుందోపనీక మనసున కూఱటయు నుల్లాసమును గలిగించినది. అట్టియర్ధాంగి, సదానుచరి దరిలేక నెమ్మది నెమ్మది నెట్టుకుదురుకొనును. అది విన్నశివుఁడు, చిఱునగవున, ఔరా! నాకేమి తెలియునా? అది యెఱిఁగియే యర్ధాంగి నర్ధాంగముననే యమర్చుకొన్నాను. అనియెను. శివకేశవులయా వింత సంభాషణ నాలించుచున్నయా హిరణ్య గర్భుఁడు కమల గర్భుంగనుంగొని వినమితోత్తమాంగుండైయిట్లనియెను.

ఓలోకబంధూ! పుండరీక నయనా! తొల్తగ మీరు నాకీ విషయమేల చెప్పియుండలేదు. నేనును మందమతినై యమ్మయేదనియాలోచింపనైతిని. ఇప్పుడేపోయి లోకమాతను మాతను గొనివత్తునన నాగుమాగుము. నీవుపోనక్కరలేదు. అనియప్పుడె సూర్యునటకు రావించెను. ఆదిత్యుఁడును నటకు వచ్చి భక్తిని నయవినమితోత్తమాంగుండై యెదుటఁ గరకమలములు మకుళించి నిలిచెను. ఆకమల బంధుంగనుంగొని కమలాక్షుం డిట్లనియెను. ఓయీ విభాకరా! సుగుణాకరా! నీవిప్పుడ కరవీరపురమ్మునకుంబొమ్ము. అట జగన్మాతపాల్కడలి పట్టియున్నది. నామాటగఁజెప్పి యాయమనిపుడే నీవెంట నిటకు నాయంతికమ్మునకుం గొనిరమ్ము పొమ్ము క్షణమేని యాలసింపకుము. యట్లయని యబ్జనాభుంగని మ్రొక్కి భాస్కరుఁడు "దేవదేవ! ఆ తల్లిని నేనేమని చెప్పి తీసికొని రాఁగలను? ఆయమ్మ నన్నెట్లు విశ్వసించును? అన ఆగోవిందుడు మార్తాండున కిట్లనియెను. కోపము ఆవేశమును, తొందరపాటును గలిగించును. తొందరపాటువారలకే కాక తోడివారలకును వెతలవంతల గలిగించును పాపమానాఁడా సిరిచెలువ దురుసుగ విరస మంది యరిగినదేకాని వెడలుటాదిగ నటగుందుచునే యుండును. పిలువక తిరిగివెళ్ళుట యెట్లని యభిమానమున నటనిలిచియుండును. నీవేగినఁ దప్పక యాదరించును. నీతోనిటకు వచ్చును. సందియమందంబనిలేదు.

దివాకరుఁడు దేవుని కడ సెలవుగైకొని యేడు గుఱ్ఱాల తేరెక్కి బయల్వెడలి యప్పుడ కరవీరపురమునకుంబోయెను. అటనాతల్లి మందిరముంజేరి యా శ్రీహరి చెప్పినటులనే క్రమముగ నాచరించి పలికెను. ఆకరివేల్పు నిల్లాలును జిత్తమున మిగులఁ బరితపించి యప్పుడ బయలుదేరి దేవుముదల నౌదల నిడికొని మనోనాథుజూచుకోరిక సందడింప నహస్కరు వెంట బయలుదేరి వాయువేగమనో వేగముల పుండరీకాక్షుడున్న యెడకు వచ్చి చేరెను. ఆ మంగళ దేవతరాకను విన్న విష్టరశ్రవు డాకమలాలయంగను కాంక్ష చూపుచు నాజగన్నాటక సూత్రధారి లేచి బిక్కచిక్కిన వాఁడట్లు తడఁబడునటుగులఁ దనదేవి కెదురుగ భుజగభూషణుభుజమున నొక చేయియు వేల్పు పెద్దభుజముల వేరొక చేయియు నిడికొని యూతగఁగొని మెలమెల్లన నడచివచ్చెను. వచ్చుచున్న యా వాసుదేవునావింత వేషము. మాయనటనలుగని సురగరుడోరగాది దేవతలును దైత్యదానవులును, తపోధనులును, ఋషిమునియోగులును నెంతయు నబ్బురమున దన్మయులైరి.

అవ్విధమునఁదనకెదురుగ వచ్చుచున్న జగన్నాథు, నిజమనోనాథు గాంచి, లేఁజిరు నగవుపెదవుల మొలకలెత్తుచుండ నరదము నండి గొబ్బున దిగి మంద గమనమున గమలాలయ పతిదేవునకెదురుగఁబోయి తత్పాదసరోరుహములు చంపకములచేఁబూజించి

కరపల్లవముల నాపదపద్మములంబట్టి హృదయమునకు హత్తికొంచునట్టె కొంత తడవుండు నంత నా హృషీకేశుఁడా పద్మాలయను భుజములంబట్టి లేవనెత్తి యెదకు హత్తికొనెను. ఆ జగదంబయుఁదన్నుం గౌగలించికొన నా తన్మయత కాత్మకార్శ్యమంతయు బోగా జగత్ప్రతి నిండునుత్సాహమున నిలిచెను. వారొండారులగుశల ప్రశ్నలఁ దీయతీయని ప్రత్యుత్తరములఁదనిపి తనియించిరి. జగత్పితల, యా పురాణ దంపతుల లక్ష్మీ నారాయణుల పెంపొంది యాయుత్సాహముంగాంచిన యచ్చటి యెల్లవారును నిండు మోదము నంది స్వస్థ హృదయులై వారికి నౌదల గరతలములం జేర్చి వందనంబులు గావించిరి. కలుముల జవరాలు నలువయయ్యతో నిట్లనెను. నాథా! యవ్యయానంద రూపా!నాయందనుగ్రహించి నాతప్పు మన్నింపుడు. ఆ నాడేదో మునివరుండు నానెలవగునెడందందన్నెనని యదియెనాకవమానమని యెంచి యాగ్రహించిపోయితిని. కాని మీకు దూషణ భూషణ తిరస్కారములు లేవని, హృదయమే పట్టి చూతురని యెఱుంగం జాలనే పోతిని. నాయజ్ఞానమునకు నన్ను మన్నింతురుగాక. తొల్లిటి యట్ల, నాకుల్లమున దావిత్తురుగాత! మననా నల్లనయ్య మందమందస్మితవదనారవిందుండయి, కమలాలయా! అట్లనకుము. నాహృదయకమలమున నిన్నెయెప్పుడు దిరముగ నుంచి కొనియున్నాడను, నుంచికొందును. రమారమామణీ అలనాడు రామావతారమున సీతగ నీ పలికిన మాట స్మరణయున్నదేయను కొందును. వేదవతి జ్ఞాపకమున్నదా? ఆ వేదవతిం బెండ్లాడఁదగు కాలమాసన్నమైనది. ఆమెను పెండ్లియాడికొని వచ్చి నీతొడనేయుంప నభిలషించుచున్నాఁడను. అనునంత దొల్లిటి విషయములెల్ల దలంపునకు రాగా బద్మాలయ పద్మాక్షున కిట్లనియెను. సత్యస్వరూపా! జగదంతరాత్మా భక్తజనావనా హృషీకేశా!మీకు నే జెప్పెడిపాటిదాననా! ఆ నాటిమాటను నిజమొనర్పుడు. అని భక్తియు నాసక్తియు మీఱ నాపదిదేనములపామికి మ్రొక్కినిలిచెను. అదివిని దామోదరుఁడును బ్రసన్నుఁడై యాయుమలోఁబద్మావతీ వివాహోదంతమునంతవరకుం జరిగినదాని వచించెను. అది విన్న లచ్చియుఁగడుంగడుగ బ్రమోదాన్వితమాయెను.

ఓం శ్రీ మహతే శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీహృషీకేశాయ శ్రీ వేంకటేశాయ నమః

# చతుర్ధాధ్యాయము

## వివాహయత్నము - అంకురార్పణము

ప్రసన్నచిత్తుఁడగు శ్రీనివాసుఁడు హిరణ్య గర్భుంగని తనయా! చేయఁదగు కార్యముల నెల్లం దొందరగ జరిపింపుము. అనినంత నాచదువుల వేలుపు ప్రముదిత మానసుండయి గరుడాది దేవవరుల మంగళ కలశల దేనియోగింప వారును నప్పుడ పోయి వలయు సువర్ణ భాండములందెచ్చిరి. ఆ పాత్రలందన్నిట సుగంధిత పవిత్ర జలములంగొనివచ్చి వరుణ వాయువులు నింపిరి. మంగళ వస్త్రాభూషణాలంకృతమగు శచీ పార్వతీ సరస్వత్యాది పుణ్యావనిత లరుంధతీ యోషామతల్లినెదుట నిడికొని దేవవైఖానస పుణ్యాభామినులతో మంగళకలశలు, దివ్యదీపికలు, చేతులనిడికొని మంగళాశీర్వాదము లొనరించుచు నలుదెసల మంగళారోపణమొనర్చిరి. మంగళగీతములాలపించిరి. శ్రీ కృష్ణలీలలు వినోదముగఁబాడిరి. ఇట్లా వేంకటేశ్వర దేవు కళ్యాణమునకు౯నంకురార్పణము కావింపఁబడెను. నలువైపుల జలపూర్ణకలశ లారోపించి సూత్రవేష్టనముంగావించి వానినడుమ నొక పీటనుంచి యావేల్పువెలందుకలిట్లనిరి. ఓ పురుషోత్తమా లెండు, రండు. సూత్రమధ్యమున నీపీఠికనలంకరింపుడు.

కమలాదేవి కమలనయనుంగనుగొని యిట్లనియెను. ప్రాణప్రియా వేంకటా చలనాథా! మీహృదయమును నేనెఱింగితిని. పురుషవరా! మన్మనోహరా! మీ కుందైలాభిషేకమునేన చేయుదును, అభ్యంగనము చేయింతును. లేలెండు. రండిదో మంగళ పీఠమునఁగూర్చుండుఁడు; విచారమును విడువుడు. ఇట్లను చున్న రమామణిని విన్న కట్టినెచ్చెలి కరము ప్రసన్నుఁడై కన్నుల నానందాశ్రులు నించుచు గశ్యపాత్రి భరద్వాజ విశ్వామిత్రాదిమునుల కెల్ల బ్రమోదముంగలిగించుచు లోకసమ్మోహనంబుగ వసిష్టముని వరునకుం బ్రణామమొనర్చియిట్లనియెను. బ్రహ్మవరా! తపోధనా మంగళస్నానము నొనర్పనాకనుమతి నిండు. అన్నవినియరుంధతీ మనోనాథుఁడు, పురోహితుఁడు "అట్లె యగుగాత" మనియెను. శ్రీహరియుఁబత్నీయుతులను యతులను, వెలదులతోడి వేల్పులనుగనుంగొని వల్లెయనిపించికొని లేచి సింహగమనమున ముందునకుసాగెను. అప్పుడె యబ్ధిరాజతనయ లోకమాతయు దనచెలిమి కత్తెల వైపున కింతమోము త్రిప్పి కనుంగొనెను. వారును నాజగజ్జనని తలంపెఱింగి, వలయువస్తువుల సేకరించికొని వచ్చి కార్యాచరణమునకుంబూనికొనిరి. ప్రీతికన్నియ సుగంధతైలముంగొని వచ్చెను. శ్రుతి మృదుదుకూలముంబట్టికొని వచ్చి ప్రభుని జెంగట నిలిచెను. ప్రయోదమున స్మృతి సుందరాభరణములంగొని వచ్చెను. ధృతియద్దమును, కాంతి కస్తూరియు, లజ్జ యగరు కర్పూరాదియుంగొని వచ్చి యాహరి జెంగట నిలిచియుండిరి. కీరిటియు, దానుబంగరు పట్టుపుట్టమును, నవరత్నజటిత నవ్యజాంబూనదమయకిరీటమును దెచ్చి పుండరీకాక్షు

నందనిలిచెను. ఇంద్రాణి ఛత్రముంబట్ట గౌరీ సరస్వతులిరువైపుల జామరములఁబట్టి నిలిచిరి. జయవిజయలు వ్యజనంబులు విసరసాగిరి. తోడి తొయ్యలు లెల్లరుం దోతెంచుటంగన్న యాహరిప్రియయునందఱఁ దగురీతుల నాదరసన్మానములఁ బరితృప్తులం బొనర్చెను. పుణ్యవనితలును లక్ష్మీయుతులై యాదేవుం బూర్వాభిముఖముగ నారత్నపీఠమున గూర్చుండజేసిరి. సింధురాజ తనయయిందిరయు నా హృషీకేశు కేశములు, సిగవిప్పి విరియించి బంగరు గిన్నెలో సుగంధిత తైలముంగొని వచ్చి జగత్కల్యాణాభిలాషను వెలిబుచ్చుచు ముమ్మారా దేవుమూర్ధమునం బోసిత్రిప్పి మృదుకరములనలమెను. లోకకళ్యాణకరులకు మీకు నిత్యకళ్యాణము. జగత్కుటుంబికి మీకుఁబుత్రపౌత్రాభివృద్ధియు నిజకుటుంబాభివృద్ధియు నమితముగ నగుగాత. సర్వేశునకు సర్వాధినాయకునకు మీకు జతుర్దశభువనంబుల నేకఛత్రాధి పత్యంబయగుత; మనుచు బలికెను. ఆవెనుకఁబుష్యాంగనలొక్కరొక్కరే తైలాభిషేకముం బొనరించుచు నాశీర్వాదములు పలికిరి. దివ్యాంగనలప్పుడు దేవునొడలున సుగంధిత తైలములు జందనాగరు కస్తూర్యాది సుగంధద్రవ్యములంజేర్చి వనువున నలుగులిడిరి. గజరాజగమనలు తమకరంబులం గొని తెచ్చి యిచ్చిన కుందనపుంగుండిగల నాకాశగంగను, చతుస్సముద్ర జలముల బుణ్యతీర్థమ్ములంగొని యాకలుముల చెలియాదేవునకు జలకమార్చెను. పన్నీట నోలలాడించెను. నునుమెత్తని వస్త్రమునం దడియొత్తెను. దేవుని తనువల్లికి, శిరోజములకు నగరు సాంబ్రాణులు దూపము లిడి చెమ్మఁబోజేసిరి. తల్లి వకుళమాలిక నలిననాభుని నీలాంగకముల నపరంజి రజమ్మునఁ బొదివిన సురభిళసుగంధములలమెను. నలువరాణి గీర్వాణి మంగళ గీతములు పాడెను. సర్వమంగళమంగళ హారతి నొసంగెను. మొదలి ముత్తైదువ యరుంధతియాశీర్వదించెను. పాల్కడలిపట్టి కైదండనొసగి పీట నుండిదించెను. దివ్యమంగళ వాద్యములు తూర్యారావములు చెలంగుచుండ వేల్పులజేజే బంగరు మొలనూలుననొప్పు కటిని బంగరు పట్టుపీతాంబరమును నందముగగట్టికొనెను. ఆపైమొలను సువర్ణంబగు పట్టి యొప్పు, నంచుల నందమగు వలెవాటు నమరించుకొనెను. మూర్ధమున ముకుటముంపఁబడెను. పద్మాలయ యాదామోదరునొడలున నందాలతొడవులనిడియెను. ఉరమున శ్రీవత్సము, దానికింద్రక్కగ జింతామణి, కంఠమున వనమాలిక యొప్పుచుండ, నొక యంగనామణి యెదుట విలువుటద్దముంబట్టి చూపవేరొక తోయజాక్షి దర్పణస్ఫుటమగు తోయజాక్షు నొడలున మార్పపుంద్రములను దీర్చిదిద్దెను. రతియుశచియు జామరములు వీచిరి. ఊర్వసిశ్వేతచ్ఛత్రముంబట్టెను. ముద్దులకూతురు గంగామతల్లి మందాకిని పితృదేవుని మాధవుని పాదములకుం బాదుకలుతొడిగెను. భక్త జనుల శరణాగతుల దుఃఖములు దూరముగ జేయు, రాతినాతిగఁజేసిన పావన పదపద్మములను ధరణి నిడికొనుచు మెల్లని నడకలనాచల్లని దేవుడు వరాసనముకడకుం జేరెను.

బ్రహ్మాది దేవవరులు, నింద్రాది లోకపాలురు, గశ్యపాది మునిశ్రేష్ఠులు, వసిష్ఠాది తపోధనులు, సనక సనందనాది యోగివరులు, భృగ్వాది ఋషీశ్వరులు, నర్యమాది పితరులు, దుంబురాది గాయకోత్తములు, రంభాది నర్తకీమతల్లులు, సూతమాగధ వందీజనంబులును డెందమున నమందానందంబు కందలింపఁ గన్నుల విందుగఁ గనుఁగొనుచుఁ బరివేష్టించియుండ నటస్వామి పుష్కరిణీ దక్షిణతీరమున వరాసనమున నాపురుషోత్తముఁడు సుఖావిష్టుండాయెను. అప్పుడు దేవుని మాతృదేవత వకుళమాలిక తనకోడలిని లోకమాతను గలుముల జవరాలిని గని ఓ కళ్యాణీ మాయయ్య లలాట పట్టిం గుంకుమరేఖం దిద్దుమా ! యనన్నప్పుడె యామంగళదేవత పతిదేవుకడకుం బోయి నిద్దంపుటద్దంబు బట్టి యాదేవునుదుటఁ గుంకుమమున నందముగఁ గళ్యాణపుం బొట్టుతీర్చిదిద్దెను.

దైవజ్ఞులు గుణించిగణించి చెప్పిన, నప్పుడమంచి మూరుతమని యాలోకనుతుఁడు, లోకేశుఁడు, లోకకర్తలోకవిడంబనముగ గంభీర సింహగమనమున కశ్యపాత్రి భరద్వాజ వసిష్ఠాది మహామునులకుం బెద్దలకుం దరిసి పేరు పేరుగ వందనములాచరించెను. విద్యుక్తములగు సంధ్యోపాసనాదికములు నిర్వర్తించెను. సమయాను కూలములగు కర్మలెల్ల నెఱవేర్చి, ముమ్మరమ్మగు సమ్మదమ్మున బ్రహ్మవరు వసిష్ఠ భగవానుం బిలిచి యిట్లనెను.

మునిశ్రేష్ఠా! వసిష్ఠా! ముందు జరుగఁదగు కార్యముల నాచరింపుఁడు. అన్నవాసుదేవుని విని మంత్రవేది కార్యవేత్త యావసిష్ఠమునివరుఁడట నప్పుడె చతురస్రముగ,ముక్తాఫలాలంకృతముగ నవరత్న వేదికను రచించి యందు శ్రీనివాసు నుపవిష్టునొనరించెను. విధి పూర్వకముగ సంకల్పమొనరించి ద్విజవరులకు వరణమిచ్చి పుణ్యాహావాచముం గొనసాగించెను. తదనంతరమున సృష్టికర్తయగు పితామహుఁడష్టవర్గము సుసంపన్న మొనర్చెను. పిమ్మట విధియుతముగ వేదవిదులగు బ్రాహ్మణుల సత్కరించి మంగళవాద్యకారులఁ బెద్దగ నాదరించి సదక్షిణలతోఁ దాంబూలము లొసంగెను. అనంతరమునం దిక్కుంగల దేవునిష్టులు, నింకను గల భక్తవరులు వస్త్రాదికముల నెంతయు సత్కృతులైరి. ఇట్లు విధి విధానమునఁ గర్మలనెల్ల నిర్వర్తించి వసిష్ఠముని వరుఁడు శ్రీనివాసుతో "నోస్వయంభూ! మీకులదైవతమేమి? తత్ప్రతిష్ఠాపన మొనరింపవలయు వివరింపవే" యనిన విని పక్కిడాల్వేల్పు అరుంధతీ పతింగని యిట్లనియెను. ఓమునికుంజరా! మాకులదేవత కళ్యాణియగు శమి యని యెఱుంగుఁడు. మాకేకాదు పాండవులకును నాకళ్యాణియే కులదేవత. ఇందాలోచింపవలసినదేమియు లేదు. అనినంత నావృక్ష శ్రేష్ఠమెటనున్నదా? యనుకొనుచున్నంత వినిన కుంభసంభవుఁడగస్త్యముని వృషభుండల్లన నిట్లనియెను. పూజ్యులారా! ఇచ్చటి కుత్తర దిగ్భాగమునఁ గుమారతీర్థంబున నావృక్షరాజంబొండు కలదు. అటకుంబోయి దానింగొనిరాఁ దగును. అనునంతన వినియప్పుడ తనవారితోఁగదలిపోయి యాదేవదేవుఁడు కులదేవతయని యాశమీవృక్షమునకు ముమ్మారు ప్రదక్షిణ మొనరించి యిట్లని నమస్కరించెను.

ద్విపద :-

శమిమాదు పాపాల శమియింపుమమ్మ
శమి! శత్రునాశిని! శమిసౌఖ్యధాత్రి ॥
శ్రీరాము మెచ్చు, కిరీటివిల్దారి
కోరి మ్రొక్కెద భక్తి కూర్చుమా శుభము॥
అమరుల కిష్టమై యమరెడితల్లి
యమలమౌ మైత్రి మాకలరించు మిచట ॥
మాకు నారాజేంద్రు మధ్యనోతల్లి
ఏకలహములేమి లేకయుండుతను॥
తల్లి కళ్యాణంబు తగఁ గూర్పుమమ్మ
యెల్లరమదిఁదమి యెసఁగ మోదమ్ము॥

ఓ శమీమాపాపాల శమింపఁజేయుము. హేశమీ! శత్రునాశమొనరించు నోతల్లీ, అర్జును ధనుర్ధారిణీ! శ్రీరామునకుం బ్రియమగు నోశమీమాతా! విఘ్నములేమియుఁ గలుగకుండఁ గమాకుఁగళ్యాణమును గలిగింపుము. ఓ సురప్రియా! మాకు దేవతలకును, ఆరాజవరునకును నడుమనే విధములగు కలహములును గలుగకుండునుగాక!

ఇట్లు కులదేవతను, దేవార్చితను విధివిధానమున నర్చించి యాతరురాజము నుండి చిన్నకొమ్మనొకటి త్రుంచితీసి తలనిడికొని మంగళవాద్య ధ్వనులు రోదసి నిండుచుండఁ దనవారితో దంతిగమనమున మఱలి స్వసానమునకు వచ్చిచేరెను. అట్లు మఱలి వచ్చి, యాజేజేవసిష్ఠగుల బ్రాహ్మణుంగనుంగొని వినయమున "నో గురుదేవా! యీకులదైవతము నెచ్చటనుంచునది?" అనుచుండ వినియచ్చటనె యున్ననారదుఁడు తరిగట్టు దాని దరికింజని యిట్లనియెను. "తండ్రీ! దైత్యారీ! మనకుల దేవతనిట, మీరెవ్వరి నెలవుననెలవుకొని యున్నవారో యావరాహదేవునింటనే యుంచి పూజించునది. పూర్వము నుండియు విద్వజ్జనుల మతమిదియ తొలుత నాతొలివేలుపు నలువయు నట్లన నియమించెను. అను నారదుపలుకు లాలించి మధుసూదనుఁడు వసిష్ఠునితోఁగూడి యావరాహదేవు నింటికింజని యాదేవేశుతో నిట్లనియెను. గోవిందా! భూరమణా! మీయనుగ్రహముననే వివాహము చేసికొనుచున్నవాడను. మీరును ధరణీకాంతయు బయలుదేరి నాపెండ్లికి నారాయణపురమునకుం దయచేసి నన్నుంగృతార్థుం జేయుదురుగాత. అన్న శ్రీనివాసుని వినియచ్యుత దేవా!మీపెండ్లి వినియెంతయు నానందమాయెను. కాని యిటనాచేను పంటముఖమునకు వచ్చినది. అదివీడి వచ్చుట కవకాశమేమియు లేదు. నాకుమారుగ వసుధాంగనయు మాయింటిపెద్ద వకుళమాతయు రాఁగలరు. నావచ్చినట్లుగనె తలంచునది. అను నావరాహదేవు నాలించి వేంకటేశుం డిట్లనియెను. మంచిది మీయభీష్టమెట్లట్ల కానిండు. అయిన మీయెడ మాకులదేవతనుంప వచ్చితిని. దానికి మీరంగీకరింతురనియే యూహించుచున్నారమని వల్క నా వరాహదేవుఁడును వల్లె యనియెను. ఒక్కరయ్యు నిర్వురుగఁ దోచి పానరించువారి యీవినోద లీలకందఱి పెద్దలే ముగ్ధులై మురిసిరి. అంత రత్నాలంకృతమగు బంగరు

కలశయం దా కులదేవత నుంచి పట్టు పుట్టంబు చుట్టి విధియుతముగఁ బూజించి యటవరాహ భగవాను నింటనుంచి, తిరిగి తననెలవు పట్టుం జేరికొని యిట్లని చింతించెను. ఇప్పుడెపయనమయి నారాయణపురమునకుం బోవలయును. ఆలసింపనేమియుం దగదు. ఇట్లని యపుడ చతురానను లోకేశుంబిలిచి, తాత! ముహూర్తమా దరియుచున్నది. పోవలసిన దూరమా, చాలకలదు. తొందరగ మనవారినందఱి సంసిద్ధమొనర్పుము, పయనింపుము, వేవేగ నారాయణపురముం జేరవలయును. ఇటనేమియు నాలసింపఁదగదు. నా సురజ్యేష్ఠుఁడు పరమేష్ఠి మాధవుంగనుంగొని యిట్లనియెను. పితృదేవా! మనము తొందరగఁ బోవలయునంట నిక్కమే. అయినను బుణ్యాహవాచనమునకుం బిదప, గులదేవతా పూజానంతరమున నుపవాసముంటఁదగదు. అదియుం గాక యెల్లవారును నాకళ్లతోనున్నవారు. వెంటనే భోజనములకుం దగునేర్పాటులు చేయింపవలయును. భోజనానంతరముననే మనము కదలిపోవలయును. అనునంత నాదేవుండును అట్లనే కానిమ్ము. నీపలుకులెంతయు నొప్పియున్నవి. కావలసిన కార్యమంతయుఁ దగురీతిం దొందరగ నెఱవేర్చి పయనమున కెల్లర నాయత్తముచేయుము." అనగనప్పుడ భోజనములకు వలయునేర్పాటులన్నియు నతిత్వరితగతిం జరిగెను. ఎల్లరును దృప్తులైన పిమ్మట నెల్లవారును తరలిపోకకు సంసిద్ధులగుచుండిరి. అటవారటు పయనంబులగుచుండ నిట శ్రీనివాసుఁడు హరవిరించులతో నిట్లనెను. మనము పోవునది మహారాజుకడకు, వియ్యమునకు, వట్టిచేతులతోఁ బోయిన నదియెంతరాణించును? ఏమిబాగు? ఏ విషయముననను మనచేయి క్రిందుకాకుండ వారితో సరితూగినపుడే కదా! మనప్రతిష్ఠ.

అంత నాదేవుడప్పుడు గుహ్యకేశ్వరుం బిలిపించి యాతనితో వ్యోమపాదుం డిట్టులనియెను. యక్షరాజా! ఇప్పుడు నీతో మాకుంబని కలిగినది. ఈ పెండ్లికిం గావలసిన విత్తమును, వస్తుసామగ్రిని సమకూర్చిపెట్టుము. దానికగునాధనం బంతయుఁ ద్వరలోనే నీకుం చెల్లించికొందును. కాదనకుము. ఇప్పుడు మా మర్యాదయంతయు నీచేతులనున్నది. అననది వినుచున్న యాధనదున కేమనవలయునో తెలియరాదయ్యెను. మనసునకెంతయు దబ్బిబ్బు కాగా మెల్లననిట్లనియెను. దేవా! దేవాధిదేవ! ఎందులకీ విచిత్రసంభాషణలు? మేమెల్ల మీవారలము. మాదనునదియు మీయదియ. మేముమీరెట్లన్న నటులనే చేయువారలము. మాయనుకొను నీయంతయు మీరిచ్చినదియే. మాది మాకిచ్చుట మడిమాన్యములిచ్చుట, యన్నట్టుగ నున్నది. మీరిచ్చినది మీకిచ్చుటయు నప్పా? ఈ చరాచర జగత్తంతయు మీయధీనము. ఈ యందఱిలో, నేనొకఁడను. నేనేమాత్రము వాఁడను. మీయానచే నేనీధనమునకు రక్షకుఁడను మాత్రము. దానినిచ్చుటకుం గాని పుచ్చికొనుటకుంగాని నాకేమియధికారముకలదు? ఇచ్చునది మీరె, పుచ్చుకొనునది మీరలే. సర్వమునకు మీరలే యధికారులు. మీదిమీకప్పా? మఱలనది తీర్చుటయా? ఇట్లనుట యెల్లమాయెడ మీచిన్న చూపేమో? యని వెఱవగుచున్నది. అనవిని యాయేడుకొండల వాఁడిట్లనియెను. ఏమి? ఈ యంతయునేనిచ్చినదా? అబ్బురముగ నున్నదే. పోనీ యట్లేయనుకొందుము. నీమాట నెందులకుఁ గాదనవలెను.కాని యొకపరి నీకిచ్చినది నీదేయగును; ఇక మాదెట్లగును? అదీగాక నామాట నాలింపుము. నేను కాలానుసరణముగ నీభూమినవతరించితిని.

వచ్చునపుడు మద్గామము నుండియిటకు నొకకాసేనియు వెంటఁగొని రాలేదు; మఱలఁబోవునప్పుడొక్కకానియుం కొనిపోవువాడనుగాను. ఇట నిర్లిప్తుడుగ నుండి నిర్లిప్తుడుగాఁ బోవుటయే నాధర్మము. కావుననేమైన నీకార్యమును నీకార్యముగ గౌరవముగ గట్టెక్కించుము. అదియె మాకుంబదివేలు. ఇందేమియు వెనుకాడకుము; కొంకకుము, ఏమఱకుము. ఇదియమాకోరిక. నీవు తప్పక మాకీమాత్రము చేయుదువని యెంతయు నాసించుచున్నాము. అనవిని నరవాహనుఁ డిట్లనియెను. మాధవా! మీరేమేనియనుఁడు. ఇదియంతయు, మానవధర్మములు, మాకర్తవ్యములు, పొనరింప మాటలఁజెప్పక చేతలంజెప్పుటయె. మీయాన యెట్టులట్టులె చరించుట మావిధి. ఇప్పుడె పోయి నాశక్తికొలఁదిగ నాకర్తవ్యము పొనరింతును. ఎల్లవస్తువుల సమకూర్చికొని వత్తును. ఆపై నన్నింటికిని మీరేకలరు. అనుచునాదేవువద్ద సెలవుతీసికొని యాతఁడు వెడలిపోయెను. పోయియప్పుడ యాధనపతి వలయుధనమును, పరికరములు సేవకులచేఁ బట్టించికొని వచ్చి శ్రీనివాసునెదుట నుంచి లక్ష్మీపతి! మీరు సత్యస్వరూపులు, సత్యము లేనిచో నారాయణుఁడును లేడందురు. సత్యనారాయణ దేవా! ఇదిగో మీయడిగిన ధనమంతయు, వస్తువులన్నియు గొనిరాబడెను. వీనిగ్రహింపుడు. మమ్మనుగ్రహింపుడు అనెను.

అదియాలించి చూచిన సిరివల్లభుఁడు మందమందస్మితం బొనరించుచు నాయనా! వలయుసంబారములన్నియు నీవ యాధనముతో సమకూర్పవలయును. అప్పిట నీకుఁదగు చేదోడు వాదోడుగా నీ హిరణ్యగర్భుఁడు నాహైమవతీ నాథుఁడు నండగనుండఁగలరనుచు వారింగని మీముప్పురిప్పుడెకదలి తొందరగఁబోయి, బోజ్యపదార్థములు, మంగళద్రవ్యములు, వస్త్రాదికములు, దివ్యాభరణములు మొదలగునవి వలయునవెల్ల యోచించి, తీసికొనిరండు దయచేయుడు. ఎందును ఏకొఱంతయు రానీయకుఁడు. ఇదియ మీకర్తవ్యము. ఇదియంతయు మీద, మీద భాద్యత అనవారు ముప్పురును అట్లకావుతమని యుపేంద్రుకడ సెలవుకైకొని వెడలిపోయిరి.

అప్పుడె కుమారానీతుఁడైవచ్చిన వైశ్వానరుంగాంచి, స్వాహాదేవితోఁ గూడి యోవీతిహోత్రా! యిట నెల్లవారికిం గావలయు నిష్టపుష్ట భోజనములనిడవలయును. జాతవేదా! నీవును బత్నీయుతుండవై వేవేగవంటలఁ గావింపుము. తొందరపడుము. ఆలసింపకుము. ఇంతకేచాల సమయమైనది. అందఱుంగడుంగడుగ నాకలితోనున్నవారలని యా సర్వేశ్వరుండు పలికెను. అంతనావహ్ని దేవుండును నప్పుడ నిజదేవితోఁ గదలిపోయి పంచభక్ష్యపరమాన్నంబుల వందటి కన్నివిధంబుల సుయోగ్యంబులుగాఁ బచరించెను. అటఁ బదార్థంబు లేడేడు కొండలట్ల రాసులుగా విస్తరిల్లియు, సరోవరములట్ల వ్యాపించియునుండెను. భక్ష్య, భోజ్య, బోష్య, లేహ్య, పానీయము లెంతెంతయో యింపుగ, సొంపుగ, రుచ్యంబులుగ సమకూర్పంబడెను. దేవునిపెండ్లికేమి లోటగును. సన్నబియ్యపు టన్నము, మిరియన్నము, తియ్యన్నము, సెక్కరపొంగలి, పులిహోర, దధ్యోదనము, క్షీరాన్నము నాదిగవింత వింతయన్నములొకయెడ మండెను. వేరొకవంక చపాతీలు, పూరీలు, పుల్కాలు, అట్లు, బొబ్బట్లు, పాలకోవాలు, బజ్జీలు, కజ్జికాయలు, జిలేబులు, చంద్రాపురులు, లడ్డులు, మిఠాయిలు, మినపసున్నులు, సెనగసున్నులు, అమృతగుటకులు,

కొబ్బరిగుల్లలు, హల్వాలు, బిస్కట్లు, పూరీలును, మఱియొకదఱి వడలు, ఆవడలు, గారెలు, చిట్టిగారెలు, బూరెలు, అప్పములు, చేగోడీలు, పకోడీలు, ఇడ్లీలు, దోసెలు, మున్నగునవియును, ఇంకొకచో కూరలు, పచ్చడులు, పులుసులు, పప్పులు, మొదలగునవియు నివియవియేమియింకను నేమేమియో పేర్కొనవశముగాని, విన్నను, గన్నను నోరూరు, తినినంత ప్రాణములు లేచివచ్చుచవులుప్పతిల్లు వంటకము లమితముగ ననువుగ సమర్పబడియుండెను. వంటకములన్నియు సంసిద్ధము లయినంతనాధనంజయుండు సర్వము సంసిద్ధమని తరిగట్టు దొరికిం జెప్పెను. అంత నాతొలివేల్పును దగువారింబంపి యందఱిం భోజనములకు నాహ్వానింపఁజేసెను. సగౌరవముగఁ బిలుపులందిన కస్యపాదిమునులు, నింద్రాదిదేవతలు, నెల్లజనులు నందఱును దమకమున వచ్చి తమతమ కనుకూలములగు నాయాతావుల నాశనశుద్ధిగ, బంతులు తీరికూరుచుండిరి. పాత్రాభికారమాయెను. అగుటయే తడవుగ నెందుండి వచ్చిరోకదా! యావడ్డనకాంద్రు కనుమూసి తెఱచునంతలో విస్తళ్లన్నియు వడ్డనలై వంటకములతో నిండియుండెను. వింతయేమన నెవరికిఁగావలసినవి వలసినంతగ వారియెదుటం బాగుగ నమరియుండెను.

అంత వేంకటేశుఁడు సురజ్యేష్ఠుంగనుంగొని ఓయీ హిరణ్యగర్భా! తొలుదొల్త దివ్యార్చనము నొనరింపందగును. అంతఁదనుక నేరికి నివేదింపందగదు. అనిన కట్టినెచ్చెలితో జన్నిగట్టిట్లనియె. దేవా! నిన్నే దేవాదిదేవునిగా సర్వజ్ఞునిగా, సర్వభోక్తగా సర్వలోకేశునిగా నెఱుంగుదుము. నిన్నుంగాక యన్యులెఱుంగము. అట్టిచో మునుమున్ను నెవ్వని నర్చించి నివేదించునది? అనునజానకుఁ గమలాపతి, నీకునేఁజెప్పవలసినదేమున్నది? అయిన నాచెప్పునదివినుము. సదాచారమును గొనసాగింపనే వలయును. దానివమ్ము చేయుట మనకుందగదు. అహోబిల నృసింహదేవునిం దొలిపూజలఁ దనియించుటెంతయు మనకు నొప్పును. ఆ దేవునర్చించి నివేదన లర్పింతము అనియెను. అబ్జయోనియు మునివరుల యార్యులయనుమతింగొని నృసింహునర్చించెను. శ్రీనివాసుఁడును భక్తిశ్రద్ధలతో

శ్లో॥ ఏకోవిష్ణుర్మహద్భూతం ॥ పృథగ్భూతాన్యనేకశః ॥
త్రిలోకాన్ వ్యాప్యభూతాత్మా ॥ భుంక్తేవిశ్వభుగవ్యయః॥

తే॥ సర్వభూతాంతరాత్ముండు సర్వమయుఁడు
నొక్కఁడై పెక్కురూపాల నొప్పుదేవుఁ
డెల్లలోకాలు దనయందు, నెల్లఁదాను
నవ్యయుం డనన్యుండు నేకైకమూర్తి

గీ॥ విష్ణుఁడు విరాట్స్వ రూపుండు విశ్వభోక్త
యైన దేవునకును భక్తినప్పనంబు
ఒక్కడై తానెయన్నింటఁ బెక్కుగతుల
నలమియుంతయుఁ గొను దేవు నభినుతింతు

సర్వభూతాంతరాత్ముండును, నవ్యయుండును విశ్వభోక్తయునగు విరాట్స్వరూపుడు నన్యుండు, తానొక్కఁడె యెల్లలోకముల ననేకరూపముల ననేక విధముల వ్యాపించి యంతయు ననుభవించుచున్నాడు. అట్టియేకైక దేవునర్చించుచున్నాము. అనితలంచుచు నంతయు శ్రీకృష్ణార్పణమనుచు నర్చనవిధానమును జరిపెను. ఆమీద గ్రహములను, నారాధ్యదేవతలను, నావాహనమొనర్చి పుష్పాక్షతలతోఁ, బవిత్రజలములతో, సుగంధిత ధూపదీపములతో, గంధాద్యనులేపనములతో, బూజించి పరితృప్తుల నొనరించెను. ఆపై భూదేవులను విధివిహితముగఁ బూజించి తనియించెను.. అంతగోవిందుండు కశ్యపాదుల నెల్లర భోజనములకుపక్రమింప నర్చించెను. జ్ఞాన ప్రపూర్ణులు, సర్వజ్ఞులునగు మీయారాధనము నాచేనేమగును? కొండంత దేవునకుఁ గొండంత పత్రియా? ఎక్కడసాధ్యము నాచేయు నీకొద్దిపూజనే ఘనముగనెంచి, యిటనావలనఁ గలుగుకొరంతలు పరిగణింపక కొండంతలం గోరంతలుగఁ ద్రోసిపుచ్చి మన్నింతురుగాత. మనసుంచి భక్తితో నాయిచ్చు నీస్వల్పము నేమేరువుగ నెంచి పరితృప్తిగ భుజియించి·తనియుదురుగాక. నన్నుందనియింతురుగాక! మీతనియుటయె నాకుం బదివేలు. మిమ్మెల్లరం సంతృప్తినొందించుట కంటెను నాకిఁకఁ గావలసినదేమున్నది? అనుచు లోకమర్యాదను మర్యాదగఁబలుకుచున్న నాయలౌకికు దేవుదేవుంగని యాభూదేవులాత్మాభిజ్ఞులిట్లనిరి. ఓదేవదేవా! ఇదియంతయు మీవిడంబనంబు. ఇదియొక మాయానటన ఇయ్యది మీచేతల మానడతలుదిద్దు జతనమొక మఱియెండుకాదు. ఇదియెఱింగి నడుచుకొనంగలిగిన మేముధన్యులము. మాయావాగురులం జిక్కికొనకుండ మమ్ముంగాపాడుభారము మీయదియ మేమెవ్వరము? ఎక్కడివారము? మేమెంతవారము? మాగమ్యమేమి? అంతకుత్తరమొక్కటియ. మీర సర్వము. మీరె చాలు మీరిచ్చునీయన్న మనల్పము, అమృతము. ఇదియె ముక్తిసాధనము. ఈ కలికాలమున దీనిం బొందగన్న మేము ధన్యులము. కలిమలములంటక యుండఁగల్గుదుముగాత. ఇదియంతయు మీయనుగ్రహము కాకమఱేమి? అనుచు నాదేవుని, దేవునికుడుపును బరిపరి విధములనుతించుచు నాభక్తజనులెల్లరును తృప్తిగ భుజించి త్రేన్చి లేచిరి. భోజనానంతరమున నాశ్రీహరి యెల్లవారలకు యథార్హముగ దాంబూలములిచ్చి సత్కరించి యర్చించెను. బ్రాహ్మణార్చనమైన పిమ్మట నాగరుడ ధ్వజుఁడు భార్యాపుత్ర పౌత్రబంధు మిత్ర పరివారముతోఁ గూడితానును సంతుష్టిగ వినోదవచనము లాడికొనుచు భుజించిలేచెను. భోజనానంతరమున నెల్లరును బరిమళతాంబూల సేవనమొనరించిరి. ఆ పిమ్మట రాత్రికాగా నాయెడవారెల్లరు నర్హభవనముల హాయిగఁ బరుండి యాదేవువింతలీలలు, విచిత్రములు పలుకులు, తలంచికొనుచు మైమఱచినిదురించిరి. పయనంపు తొందర వేగిరింప నాయందఱు వేకువనె లేచి స్నానాదులందరి వస్త్రాభూషణాదుల నలంకృతులయి, చేరిబమ్మనుగూడి యామొదలివేలుపు మొదలుగ నాయాదినారాయణుదరిఁ జేరిరి. వైకుంఠుండును నప్పటికేయాలస్యమైనదని

పయనమునకుం దొందరించెను. అందందు రాకతడసిన వారింగరుడుండు పోయి వేగిరించి పయనములు గావించి తీసికొని వచ్చెను. ఎల్లవారును బెండ్లికొమరుని నడుమనుంచికొని త్వరితగతిని బయలుదేరిరి.

రథగజతురాది పలువిధ వాహనముల మీఁద వివిధాతిచిత్రవిమానముల మీఁద, నాపెండ్లి పరివారము మంగళ తూర్యరావములతో, వాద్యధ్వనులుతో బయలుదేరెను. హృషీకేశుఁడు గరుడు నారోహించి నడుచుచుండ నాకళ్యాణమూర్తికి ముందుగ హంసవాహనముపైనబ్జజుడు, నిఱుకెలంకుల నందివాహనుఁడును, నైరావతారూఢుఁడును నడచుచుండిరి. మదన వసంత జయంతాదులును, వరుణకుబేరాది దిక్పాలురును, పిరుందన నందమగు సంభాషణముల వేడుక నడకలు సాగించుచుండిరి. వసిష్టాది మునివరులు నత్రిభృగుకశ్యపాది తపోధనులు, సనకాదియోగి పుంగవులు, భక్తులు, భాగవతులు, నాదేవుం బలిసికొని వచ్చుచుండిరి. ఇరుకెలంకుల గంధర్వపతులు రాగము లాలపించుచుండిరి. ఎదుట నప్సరోగణములు తమవాహనములపైననే నృత్యములు చేయుచుండెను. దేవదుందుభులు పెల్లుగ్రమ్రోగసాగెను. ఋషిమునులు వేదవాక్కుల స్వస్తివాచకముల వల్లించుచు దేవువెన్నాడి నడుచుచుండిరి. విష్వక్సేనాది పార్షదులు నలువైపులఁ జేరియుండిరి. మయూరవాహనుఁడు నిజానుచరులతో నెచ్చటఁజూచినఁదనయై యెల్లర హెచ్చరించుచు జాగ్రతగమనముల సాగించుచుండెను. శచీవాణీ రుద్రాణీ కమలాలయాది కాంతామతల్లులు దివ్యములగు రథముల నలంకరించి వకుళాంబను బరివేష్టించి గమనములు సాగించుచుండిరి. ఇట్లా తరలిపెండ్లివా రాకాశ రాజపురంబు నారాయణ నగరమునకుఁ దరలిపోవుచుండ నాదేవుతలపై శేషుఁడు శశిప్రభమగు ఛత్రమునుబట్టెను. వాయువును గబేరుండును జామరములం బట్టివీచుచుండిరి. రత్నఖచిత సువర్ణదండముం గొనివరుణుఁడు వీవనవిసరుచుండెను. ఎందుచూచిన వాద్యగానములు, నావాద్యగానముల కనుకూలములగు నాటపాటలు నొప్పియుండెను. ఎల్లలోకానంద మిందేయిరవొంది నట్లుండెను ఇరవొందినట్లేమి? ఇరవొందియే యుండెను. జగదానందకరుని నారాయణుని పెండ్లిపరివారమున నానందమిరవుకొన్నదన్న వింతయేమి?

ఇందిరారమణుని పెండ్లిపరివారమిట్లు వేంకటనగరాజము నుండి కదలివింతనడకల సాగిపోవుచుండ నాతెరువున కిరుకెలంకులం గల గ్రామములవారిదేమా యని తెలిసియు, దెలియకయుఁ దెలియవలెనని కోరియుఁ జిన్నలుపెద్దలు స్త్రీలు, పురుషులు నాబాలగోపాల మాతెన్నునకుం బొంతలఁజేరి వెన్నుని, వెన్నుని పరివారముంగాంచి, ముదమంది తనిసితనిసి తనియుచుండిరి. మఱికొందఱు తాము నాపరివారమునం జేరి పెండ్లినడకలు సాగించిరి.

## దేవునకు శ్రీశుకుడాతిథ్య మిచ్చుట

ఇట్లా పెండ్లివారు స్త్రీలు పురుషులు, పిన్నలు పెద్దలు నేభావమున కాభావము వారు గుంపులై కూడియింపగు భాషణముల నానందమున ముందునకు సాగుచుండిరి. ఇసుకపోసిన రాలనట్లున్నదా సంఘము. నడుమ తిలమాత్రావకాశమును జిక్కనటు లుండెను. అటులు వారు పోయిపోయి పద్మతీర్థముం జేరిరి. ఋగ్యజుస్సా మాథర్వణ వేదములచే నెల్లవేళలఁ గీర్తింపంబడు జగత్కారణుడు, జగదభినుతుఁడు, జగత్కళ్యాణకరుఁడు జగదాది, జగద్గురుఁడు, సచ్చిదానంద స్వరూపుడు ఆసిరివల్లభుఁడు, సురాసుర సిద్ధసాధ్యగంధర్వ కిన్నరాప్సరోజనములతో మరుద్గణంబులతోఁ, దపోధనులగు ఋషిమునియోగిపుంగవులతోఁ గూడి గరుడారూఢుఁడై వచ్చుచోనాత్రిలోకాధి నాథువేంకటాధీశునకెదురేగి కాంచి శ్రీశుకదేవుడు మునితిలకుఁడు సాష్టాంగవందనము లాచరించి లేచి కరములు మొగిచి యిట్లని పలికెను.

దేవదేవా! పురుషోత్తమా! వేదాంతగోచరాఁ బ్రహ్మరుద్రేందాది దేవతలకును నగమ్యుఁడవు నగోచరుఁడవు. నజ్ఞేయుఁడవు నగు లక్ష్మీయుతుని నిన్నుఁబుత్రపౌత్ర మిత్రాదులతో, లోకపాలురతో, మహత్పరివారముతోఁ గండ్లారంగాంచఁ గలుగుచున్నాఁడను. నాయొనర్చిన తపమెల్ల సఫలమాయెను. నా భాగ్యమేభాగ్యము. దయామయా! దైవతముఖ్యా! నాప్రార్థన మాలింపుము. నాయొసంగెడు నాకందమూల ఫలముల సమ్మోదమ్మున నారగించి నాయిచ్చునీయాతిథ్య మంగీకరించి నాకున్మోదంబుం గూర్పుము. అనిన యాతనినాలించి శేషాద్రి వాసుఁడిట్లనెను. ఓ మునికులతిలకా! సరసజనసమ్మతములగు నాయీపలుకులాలింపుము. వేరొక తీరుగ నెంచకుము. నీవావిరాగివి, యేకాకివి, దుర్బలశరీరుఁడవు, బ్రహ్మచారివి, దృఢవ్రతుఁడవు. మేమన్ననో పలువురము, సంసారులము. ఇందుపెక్కురు భూసురోత్తములుంగలరు. అదియుంగాక మేమే నేడే యామహాత్ముని యాకాశరాజవరుని పురముం జేరియచటనే భోజనము చేయవలెనను నిశ్చయమున బయలువెడలితిమి. ఏమిచేయుమందువు? అనుచుండ నాదేవుంగాంచి మునిపుంగవుం డిట్లనియెను. ఓ యిందిరారమణా! నేనొకయకించనుఁడను. నీవన్ననోదీన దరిద్రజనముల యెడఁ బ్రేమానురక్తులం జూపువాడవు. తమరుభుజించి తనిసిన లోకములెల్ల నాకలి తీరితనియును. ఇందున శంకింపవలసినదేమియు లేదు. అనుచుండ వారి సంభాషణమెల్ల నాలించిన వకుళాదేవి యిట్లు పలికెను. నాయనా! శ్రీనివాసా! ఈమునివరుని మాట మన్నింపుము., కాదనకుము. ఆనాఁడాకాశ రాజునకు బాగుగ బోధించి నీవివాహ నిర్ణయమున వీరెంతయు జతనమునసలిపిరి. వీరిని సంతోషపెట్టుటయే మనకెంతయు నొప్పును. అనునామెను విని శ్రీనివాసుండు మోమునఁ జిఱునగవెలయ మునితల్లజునితో నల్లననిట్లనియెను.

ఓ తపోధనా! మీయాదర రసపానముననువాగమృత భోజనముననే నాకెంతయుం దృప్తియైనది. ఇఁక నీప్రాకృతికములగు పిండివంటలతోఁ బండ్లతో నన్నపానములతో నేమగును? అయినను మీపలుకులఁ దలనిడికొని భోజనమొనరింతుననుచు నప్పుడె గరుడుని మూపుననుండి దిగి సాంత్వనవచనములఁ బత్నితోఁ బుత్రులతో మునికుటీరమునం జేరెను. సుందరకుశాస్తరణంబుల వారెల్లరునుపస్థితులైరి. మునివల్లభుఁడును పద్మతీర్థంబున సుస్నాతుఁడయి వచ్చిభక్తి పూర్వకముగ నొనర్చినవంటకముల నివ్వరి బియ్యపుటన్నముతో రసవంతములగు పచ్చడులు నింపులగు చారు పులుసులు గూరలు పాయసాన్నములతోఁ బండ్లు దుంపలు నింకను నేమేమియో తొందరగ సమకూర్చికొని భక్తివినమ్రుఁడై తామరాకులు విస్తళ్లుగా బఱచినాయిచ్చు నీకొద్దిపాటి పూజంగ్రహించి నన్నుందనియింపం గోరుచున్నాడనని మనసంతయు అందుంచి వడ్డనసాగించెను. దేవుపదపద్మములు కడిగితుడిచి కూర్చుండఁబెట్టెను. మోమాటము పడకకుడువుండనుచు నడిగియడిగి వడ్డించెను. దేవుఁడును మౌనివరుప్రేమకు ముగ్ధుఁడై యెట్లు తినుచుండెనో, యేమితినుచుండెనో కూడతెలియకయె యా మునిజనోచిత భోజనమ్ము సొనరించి తన్మయుఁడాయెను. ప్రభునానుమతిని లక్ష్మియువకుళయు, నున్నవారును పరితృప్తిగ నారగించిలేచిరి. ఇట్టులు దైవారాధనమగుచుండ నటవెలుపల నెల్లరందగురీతుల నుపవిష్టులంజేసి మునిసత్కరింపం దలకొనెను. అందుఁగొందఱు తొందరపాటున వారికట మనకిటనా? యని యలిగి మునిని జంకించుచుఁ గడపటనగు మాకీసత్కారమువలదు. ఇదేపోవుదు మనియువ్వెత్తుగ లేచినిలిచిరి. అదికన్న తాపసవరుడించుకఁ తలకెను. అదియంతయు నెఱింగిన యాసర్వాంతర్యామి వాసుదేవుఁడు మనమున నవ్వుకొనుచు వారియజ్ఞానమునకుం గటకటంపడుచు, మెల్లగఁ గుటీరము వెలుపలికి వచ్చి ద్వారబంధముల నిరుచేతులఁబట్టి నిలిచి యటునిటు నెల్లరివైపునకుం బ్రేవని త్రేన్పుచుఁదలత్రిప్పిచూచెను. ఆచూపులోనన యెల్లరియుల్లములు పెల్లుగఁదనిసెను. ఉల్లములతో నుదరములును నిండినట్లాయెను. త్రేన్పులు వచ్చెను. దానితోఁ గొంతజ్ఞానోదయమునాయెను. అంతటఁదమ తప్పునెఱింగి యెడందంగుంది క్రుంగి దేవుంగీర్తించిరి. మునిజనతిలకు మఱిమఱి పొగడ్తల ముంచియెత్తిరి. ఇదియంతయు దేవుననుగ్రహమని యాశుకదేవుఁడాదేవదేవుంగనుచు, నెదనెంచుచు నుప్పొంగెను. అగునగు-

తే ॥ మెచ్చినను గిన్కనెవ్వరు మెచ్చుకున్నఁ
గడఁగియుడుమలఁ ద్రోయఁగాఁ గ్రందుకొన్న
నీశుఁడిటు ప్రేమదృక్కుల నిడియెనేని
సౌఖ్యసమ్మోదముల నిండు జనునిబ్రతుకు

తే॥ ఎవ్వఁడేమేని యనికొన్న, నేమిచేయఁ
బూనికొన్నను జింతింపఁ బోలదేమి?
ఉన్నదున్నట్లు కనివిని యొకటనెడఁద
నెటిగి తీర్పిచ్చుదేవుని దెలియఁగన్న

ఇట్లష్టమీ సౌమ్యవాసరమున నటనెయుండి మఱునాఁడు నవమీగురువారమున వేకువనె లేచి గరుడారూఢుఁడై సపరివారముగ హుటాహుటిం బయనమై దేవుడట నుండి కదలిపోయెను.

## శ్రీనివాసుని పెండ్లికి - యెదురు సన్నాహము

ఇట్లాదేవుఁడు వియద్రాజపురమ్మును సమలంకృతమ్మును దరిసెను. ఆనాడు సూర్యాస్తమయానంతరమున నట నారాయణపురమున నాకాశరాజు పుత్రికా కళ్యాణోత్సవోత్సాహ మెక్కుడు కాగాఁ దాను నష్టవర్గ మొనరించి కూతుపద్మావతికి సుగంధాను లేపనముల మంగళతైలాభ్యంగన మొనరింపంజేసి, దివ్యమాల్యాభరణాలంకృతం గావించెను. తరలిపెండ్లివారు పురముందరియు వచ్చుచుంట వినిరాజు కూతును దివ్యగజరాజాధిరోహణంగావించి, పుత్రమిత్ర పురోహితులు సోదరుఁడు తొండమానుఁడు పరివారము వెంటరాఁ జతురంగములతోఁ బ్రదక్షిణముగఁ బురమున నూరేగుచుఁ బెండ్లివారిని జూడనెదురుసన్నాహముగ వచ్చెను. అట్లు రథగజతురగ పదాతులతో భేరీమృదంగ తూర్యాది మంగళ వాద్యములు చెలంగ, నటగాయక జనుల సందడి దండడిలో, వందిమాగధస్తుతులు, మినుముట్ట సుందరపతాకలు వియత్తలమున నెగురుచుండ వచ్చు నారాజానాకాశమునఁ జుక్కలనడుమఁ జందురునట్లు విరాజిల్లుచుండెను. అట్లుచనిచని హితమిత సపరివారుఁడు రాజానగరగోపుర ద్వారముకడకుం జేరెను. అంతలో నటకు వచ్చిచేరిన పెండ్లివారికి ఘనముగ స్వాగతమిచ్చెను. సపరివారుఁడగు శ్రీనివాసుంగని ప్రమోదమందెను.

చ॥ అటఁజనికాంచెరాజు వికచాంబుజ దివ్యదళాయతాక్షును
త్కటరుచిజాలనీలతను గాంచన వస్త్రవిభాసితాంగు వేం
కటనగవాసుభక్తజనకల్ప తరువ్వరి దీనబంధును
ద్భట సురవైరి దారకుని దైవత, సైవతు శ్రీనివాసునిన్ .

కం॥ గరుడస్కంధారూఢుని
పరిపాలిత విబుధుఁ బాణిభాసిత చక్రున్
గరుణారస భరితుని సుం
దరునిం గోవిందు నద్రిధరునిం బరునిన్.

తే॥ కాంచె శ్రీరమ్యవక్షు లోకైక దక్షు
సచ్చిదానందుఁ గనువిందు సర్వలోక
బంధు, శక్రాది పాలక పరిజనవృతు
బుండరీకాక్షు, వైకుంఠు, బుధజనాక్షు.

ఉ॥ చల్లనిచూపువాఁడు, వెదచల్లెడు ప్రేమరసంబువాడు, పెం
పిల్లెడు తేజునం జగము లెల్లను నేలెడివాఁడు, నవ్వురా
జిల్లెడు మోమువాఁడు, విలసిల్లెడు నల్లని దేహయష్టిసొం
పిల్లెడివాఁడు, వేంకట గిరీశుడు దోచెను మోదమిచ్చుచున్.

దేవుని గనినంత రాజు రథావతరణం బట్టి యొనరించి బంధుమిత్రులతోఁ బరివారముతో నెదురేగి స్వాగతమ్ములొనరించెను. కేశవుం దర్శించుచు బలగమ్ముతోఁ దన్మయత నట్టేనిలిచెను. అప్పుడె శ్రీనివాస భగవానుఁడు యా కలుముల జవరాలును దమయెక్కిన వాహనములం దిగి ముందున కడుగులిడిరి. దేవునిం గాంచిన రాజు నేనుధన్యుడను, గృతకృత్యుఁడను, నాపుట్టువు పావనమైనది. అని నెమ్మనమునం దలంచుచు గజారూఢయై యున్న దనబిడ్డను బద్మావతిని మెల్లగఁ జేయూతయిచ్చి దింపి ముందుంచుకొని పురోహితునితో నెదురనడిచెను. శ్రీనివాసుడును దరినున్న నారదుతో దేవమునీ! ఈ యాకాశరాజుతో బాంధవ్యమును నెఱపుట నాజన్మధన్యమైనది. ఇంతకు మున్నే పున్నెముచేసితినో, నాకీరాజవరుతో సంబంధమాయెను. అనుచుండగనే వియన్నృపుడు తోరణద్వారము దాటివచ్చి, వరుఁడని, యల్లుడని, దేవునిగౌరవపురస్సరముగ నటనిడిన యాసనమునం గూర్చుండం జేసి గంధమాల్యాను లేపనంబులం బూజించెను. వస్త్రాభూషణములిచ్చి సత్కరించెను. తక్కుంగలవారును నాదరసత్కారములఁ దమతమకిడిన యాసనములం గూర్చుండిరి. అటనెదురు సన్నాహమునఁ దరలివారికిందగు మర్యాదల నెల్లరకును ఫలహారములతోఁ బానకములీయఁబడెను. పతిదేవుం జూచుకోర్కి మనసుకడుసందడి వెట్టుచుండ, సిబ్బితి నిబ్బరముం ద్రోసి మనమును వెనుకకు లాగుచుండ, నావరారోహపద్మావతీ కన్యమోము నెత్తియు నెత్తకయు వారచూపులఁబరపుచు వరునింజూచుచుండెను పతిదేవుఁడిటుతలఁ ద్రిప్పఁబోగ నావెంవంచినతన మోమటుత్రిప్పుచుండెను. అంతలోనన యిటు విశాలాక్షులం ద్రిప్పి మఱల్చి చూచుచుండెను. శ్రీనివాసుఁడును నాకమలనయనను గనులారఁ జూచుచుఁ జూపులు మఱలించుచునుండెను. ఇట్లా పద్మావతీ శ్రీనివాసులు పెద్దలనడుమనుండి దాగుడుమూత లాడుచున్నటులన్యోన్యముం గాంచుచు మురియుచునుండిరి. అందుఁ జేరిన యిరుపరివారముల వారును, నన్యోన్యాలింగనముల, గౌరవవాక్యములఁ బరిచయవాక్కుల

నెంతయుం దనిసిరి. అటనుండి వారెల్లరును దుర్గద్వారముకడనున్న దుర్గామందిరమునకుం జనిరి. పద్మావతి మునుముందుగ మందగమనమునఁ జనుచుండ, మాయలాడానల్లనయ్యి యావెనువెన్కనె యడుగుల నడుగులిడుచుఁ జనుచండెను. ఎల్లరును భక్తియుక్తులై గుడిని జేరిరి. ఆలయమునఁ బ్రవేశించిన శ్రీనివాసుఁడు కృత్తివాసురాణివాసము నాదుర్గాదేవింగని నమస్కరించి బత్తిహత్తినమదిని మాహేశ్వరీ జగన్మాతా! ఈ సుందరాంగిని బద్మసంభవను నాకునిల్లాలినిగా, ననుకూలవతిగాఁ జేయుము. అమ్మాయిదేవరమిమ్మా! యనెను.

కం॥ కైమోడ్పులు శర్వాణీ !
కైమోడ్పులు శంభురాణీ! కనుగొనుమమ్మా!
యీమానిని బద్మజ నా
భూమిని ననుకూలవతిగ పాలింపుమమా

కు॥ భర్గుని యిల్లాలిని నిను
దుర్గను నిరతంబు భక్తితోఁ దలఁతుమదిన్॥
మార్గంబులు తిన్నగ, జన
వర్గంబుల నడిపిజగతి భద్రత నిడుమా ।

అని నుతించెను. అంత నాసావిత్రీసమ పద్మపత్ర విశాలాక్షి పద్మావతియు నాదేవికి మ్రొక్కి "శంకరు రాణీ, కళ్యాణీ, సర్వమంగళా! ఈ శ్రీనివాసు, రమానాథు, జగన్మయు నాకుంబతిగ, ననుకూలునిగ, నేడుగడగ ననుగ్రహింపుముతల్లీ! భక్తజనకల్పవల్లీ, నిన్నేయేవేళ మదినమ్మియుంటినమ్మా అంబాజగదంబా!" యని ప్రార్థనలు సలిపెను. శంకరు రాణీ కళ్యాణీ! సర్వమంగళా యుమాసతీ! పంకజనయనా! హైమవతీ! పాయనిభక్తి నుతింతునినున్ పంకజనాభుని జగన్మయున్! బతిగ గతిగనొనరింపుము, నిశ్శంకను, దేవీ కాత్యాయనీ! భక్తజనకల్పకవల్లీ తల్లీ॥ అని కడుంగడుగ నుతించెను. అమీఁద వారాదేవినెద నిలిపికొనియె బయటకు వచ్చి వాహనముల నెక్కిలివిడుదులకు నడిచిరి. శ్రీనివాసుఁడా నారాయణపురవీధుల నూరేగుచుఁ పెండ్లినడకలు సాగించెను. వీధివీధుల సుందరదీపికలు వేనవేలలంకరింపఁబడెను. పూలతో, పత్రితో, నవరత్నములతో, మామిడాకులతోరణములు కూర్పఁబడెను. అందందు నందముగ గెలలతో నరంటిచెట్లను, నాకులతోఁజెఱుకుగడలు, నందంపు పోకమ్రాకులు నాటి నిలుపఁబడెను.

వందిగణములు స్తుతిగీతము లాలపించు చుండ విప్రవరులు మునితిలకులు వేదమంత్రా శీర్వాదములు వల్లెవేచుచుం వేణువీణాతూర్యాదికములు మృదంగఫణవాణకాదికములు మ్రోగుచుండ, గంధర్వులపాటలతో, నప్సరోగణముల

యాటలతో నాయూరేగింపుచూపఱ కనులకింపు గలిగించునదయ్యెను. రాజట్లా తరలివారి నూరేగింపునం గొనిపోయి యొకసుందర భవనమున వరుని నతనివారలవిడియించెను. వెంటఁగల తక్కుంగల యెల్లవారిని వారివారికిం దగు నందంబులగు మందిరంబుల విడియించెను. ఎల్లరకెల్ల సౌకర్యములు నందంద సమకూర్పంబడియుండెను. ఎవ్వరు నెందును గోరంతయుఁగొఱంతగనలేదు. ఎల్లర విడిదెల విడియించి యెల్లరకడ ననుమతింగొని రాజు నిజభవనంబునకుం జనెను. వారెల్లరును దమతమ నెలవుల నిరవుకొనియుండి, వినోదసంభాషణముల సుఖోపవిష్టులై యుండిరి. ఇంతలోనన తొండమాననృపవర్యుఁడు కొద్దిమంది పరివారముతో వచ్చి యెల్లయెడలకుం జనియెల్లర సమాదరంబున వంటలయినవి, వడ్డనలు సాగుచున్నవి. మీరాయలసివచ్చిరి. దూరంపుపయనము. రాత్రియు జాలగడిచినది. తొందరగ భోజనమునకు రాదగునని గంధాక్షతలతోఁ బిలుపులందించెను. మంత్రకరులు, మహర్షులు, వేదవిదుషులు, విప్రవరులు, సురసిద్ధచారణాదులు, తక్కుంగలవారలు, కాంతారత్నములతో, రాజభవనమునకుం బోయిరి. ఎల్లరికాదరసన్మానములతో ననుకూలభోజనములు షడ్రసోపేతముగ వడ్డింపంబడెను. అందఱుం దానఁదనిసి యావిందునందలి పొందిక నన్యోన్యము పొగడుచుఁ జెప్పుకొనుచుఁ దమతమ విడుదులకుం దాంబూలాదులతోఁ జేరిరి. ఇటరాజకుమారుడు వంటకములు, రుచికరములు, నలభీమపాకములు, పట్టించికొని వరుని విడిదెకుం జేరెను. అటనిందిరా శ్రీనివాసులు మాతవకుళమాలికతో శేషునితో, గరుడుతో విందారగించిరి.

సుఖభోజనంబులు తాంబూలసేవనంబులు నయినపిమ్మట నిష్టసంభాషణము లొనరిచుచునే యెల్లవారును మృదుశయ్యల మేనువాల్చిరి. అంతలోననే వారికిం దెలియకయ వచ్చి నిద్రాదేవి వారలం జోకొట్టికన్నులు మొగిపించెను. వారలకు నిదుర పోయినటులనే లేదు. ఇంతలోన వేగయ్యెను. నాఁడు దశమీ శుక్రవారము దేవుఁడును లేచి కాలకృత్యములం దీరి మంగళస్నానమొనరించి గురుదేవుడు వసిష్ఠునితో నిట్లనెను. పూజ్యగురువరా! నేఁడిటనేనును బాల్కడలి పట్టియును మాతయు, బురోహితులు మీరును నుపవాసము లుండవలయుంగదా! అటఁగన్యయుఁ గన్యాదాత రాజును, పతివ్రతామతల్లి రాజపత్నియు, రాజసోదరుఁడును, బురోహితుఁడును నుపవసించువారలు. ఇయ్యదియే శుభవివాహక్రమనియమము. ఇఁక, జెప్పునదేమన నేఁడు రాతిరి మూరుతము పది గడియలకు. బ్రాహ్మణులకు, మునులకు నాపైభోజనముతగదు. కావున భోజనాది కార్యములెల్ల నింతకుమున్నె పరిపూర్తికావలయును. అనిగురునమమతిని గుబేరుం బిలిచి రాజునకుం జెప్పఁబంపెను. గుహ్యకేశ్వరుఁడును నప్పుడపోయి యాకాశనృపతితో శ్రీనివాసుని పలుకులు వినిపించి మఱలివచ్చెను. అఁట రాజవరుఁడును వల్లెయని శ్రీనివాసుడు చెప్పినయటులనె యెల్లరకును ఘనముగ భోజనాదికముల నమర్చి

సదక్షిణతాంబూలాది సత్కారములతో సంతృప్తులం జేసెను. అటు పిమ్మటఁ జతురంగ బలములతోఁ గుమారుఁడు వసుదానుడు, సోదరుడు తొండమానుఁడు వెంటరాగా రత్నజాలరుల నందమగు నంబారితో, జిఱుగంటల మ్రోతలతో శరన్మేఘవర్ణమగు నైరావత గజరాజమును వెంట నిడికొని పెండ్లికొమరుని వివాహమంటపమునకు నాహ్వానించి కొనిపో బంధుమిత్రపరివారముతోఁ గేశవు విడిది భవనమునకు మంగళవాద్యములతో రాజవరుడు మందగమనముల వచ్చెను. వచ్చిన సపరివారు, రాజవరుఁ నటఁబెద్దలు సరససమంజసాదరమున నాహ్వానించి సభా మంటపమునకుం గొనిపోయిరి. అట మండపమును నవరత్నజటితములు, సువర్ణమయములునగు అనే స్తంభములతో సమ్యగ్రచితమై సహజకాంతుల మనోహరమై యలరారుచుండెను. దానినడుమ దివ్యవేదికకుఁ బురోహితప్రవరులతో వరుఁడు చేర్పంబడెను. ఆవేదిక చుట్టును బ్రహ్మేంద్రాది దేవతలు, విశ్వామిత్ర, భరద్వాజ, వసిష్టగౌతమ, భృగ్వత్రిపులస్త్య, వాల్మీకి, వైఖానస, దూర్వాసమార్కండేయ గాలవదధీచి, చ్యవనసనక సనందనాది మునులు భక్తవరులు, జటామకుటధారులు, మృగచర్మాంబరులు తేజోమయులుఁ గశ్యపమహర్షి నెదుట నిడికొని పరివేష్టించియుండిరి. తన్మధ్యంబున శ్రీనివాసుఁడు కనకాంబర సంశోభితుఁడై యలరుచుండఁ దత్సమక్షంబున నంజలిబద్ధుఁడై లోకపితామహుఁడు పితామహుఁడు చతుర్ముఖుఁడు కూర్చుండియుండెను. రాజును మండపద్వారముం దరిసెను. దగ్గరించిన రాజుంగని శ్రీనివాసుఁడు లేచి యెదురుగ వచ్చి కౌగిలించికొని ఓరాజశ్రేష్ఠా! మీరు పెద్దలు వచ్చినపనేమి? అన రాజును వివాహశుభలగ్నము సమీపించుచున్నయది. మిమ్ములనాహ్వానింప వచ్చినవాఁడనన విని శ్రీనివాసుఁడు మీరుపూజ్యులు వయోవృద్ధులు, గుణవృద్ధులు మమ్ముల నాహ్వానింప, నాదరములు జరుపమీరె రానక్కరలేదు. యువకుని వసుదాను నియోగింపుడు. అను శ్రీనివాసుని విని రాజానందమంది యట్లనే కానిత్తముగాత" మనియింకను విలంబనమేలను? మూరుతము సమీపించుచున్నది కదా! కార్యక్రమమునకుం దొందరపడుట మేలుకదా యనెను. అదివిన్న మునివరుడరుంధతీ వరుఁడు రాజ్ఞీమణి ధరణీరమణీమణితో నిట్లనెను. అంబఁ యరుంధతితోఁ బుణ్యాంగనలతోఁ గూడివరునారాధింపుము. శ్రీనివాసు రమాపతిం బూజింపుము. అన నారాణి యానందాశ్రులు కనులునిండ నప్పుడయటు మోముత్రిప్పి పెండ్లికొమరుని యాననముం గనుంగొనుచు హర్షాతిరేకమునఁ దన్నుంధన్యురాలినిగాఁ దలంచుచు భక్తిభావమెద మెదలుకొన దేవునిమూర్తి హృదంబుజమున నుంచికొని పూజించెను. ఆనందమునఁ దబ్బిబ్బగుచున్న యామెంగని యచటి యంగనలెల్ల రబ్బురపాటున సమ్మోదమందుచు నిట్లనిరి. తల్లీ ధరణీమతల్లీ! తొలుజామువనే చేసిన పున్నెములేమియోగదా! సచ్చిదానందరూపు సాక్షాన్నరాయణుపూజను. బ్రత్యక్షముగఁ

జేయుచుంటివి. ఇట్టి యీదేవార్చనకే యీవుపుట్టితివేమో. నీజన్మ సార్థకమాయెంజుమా! అనునంతతోయూరకొనక, తల్లీ! మాభాగ్యముం భాగ్యమే. ఇట్లేదేవుంగండ్లారంగాంచు నదృష్టము మాకబ్బినది. అనుచు వారెల్లరిట్లు ప్రశంసలు పొనరించుచుండ నారాణియుఁ గర్పూరగంధకిత తైలములతో, సుగంధిత చందనముతో, నానావిధరత్నాభరణములతో వస్త్రములతో నావికుంఠేశు, శ్రీవేంకటేశుఁ బూజించెను తదుపరిఁ బురోహితుపనుపునఁ బుణ్యపురుషుఁ బురుషోత్తములేపి రాజుగజరాజము నారోహింపం జేసెను. గౌరవముగ నాహ్వానితులై శివపరమేష్ఠులు, నింద్రాగ్ని వరుణాది దిక్పాలురు, దేవతలు వసిష్ఠాది మునులు, వనితా రత్నములు బందుమిత్రులు పరివేష్టించి వెంటరా వైకుంఠుండు కదలి బహువిధసుందర జనాకీర్ణము వివిధాలంకార శోభితము, వివిధానేక దీపసందోపితమునగు రాజభవనమును శ్రవణానందములు మంగళవాద్యముల నడుమఁజేరెను. రాజు, జామాతతో నగరునభ్యంతరమునకుంబో నుద్యమించుచుండ నింతలో, రాజుమరదలు, తొండమానుభార్య కళ్యాణి, కుంకుమమును జలపాత్రను గొనియెదురుగ వచ్చి వరుని బూజించెను. దిష్టులుదీసెను. ఆవెనుకనె పుండరీకాక్షుఁడు మందిరాభ్యంతరమునఁ బ్రవేశించెను. కళ్యాణమండపమున, రాజుచూపిన సుందర సువర్ణరత్నాసనమునఁ గూర్చుండెను. ఆదేవునిం జుట్టుయొకవైపున నయనానందకరుదామోదరుం గాంచుచు దేవవరులును, నొకతెన్నునఁ బరమపావనులు తపోధనులు మునిగణములును, నొకకెలన లలనాజనంబులును, వేరొకప్రక్కఁ బురజనులును గూరుచుండిరి. రాజభవనమది జనాకీర్ణమై యిసుకపోసిన రాలనట్లుండెను.

## శ్రీనివాస కల్యాణ మహోత్సవము

రాజదంపతులును సుగంధతైలములఁ బన్నీట మంగళస్నానము లొనరించి సమలంకృతులై యచటికరుదెంచిరి. సుస్నాతులైన పవిత్రబ్రాహ్మణులు స్వామిపుష్కరిణీ పావనజలంబుల హేమకుంభమునం గొనివచ్చిరి. పిల్లసన్నాయులు, డోలుమద్దెలలాదిగ మంగళవాద్యఘోషములొప్పుచుండ దేవదుందుభులు మ్రోయుచుండ వధూవరులకు మంగళస్నానములు చేయించఁబడెను. వరుఁడు వివాహమంటపమునకుం గొనిరాఁబడెను. బమ్మయు వశిష్టుడు బ్రహ్మలుగా నంకురార్పణతో వివాహకార్యక్రమము ప్రారంభ మాయెను. పసుపులందిన బంగారుతట్టను గూరుచుండం బెట్టిమేనమామ వధువుంగొనివచ్చి పెండ్లిపీటను గూర్చుండంబెట్టెను. విధిపూర్వకముగ సాదరమునఁ గన్యాదానమునకు సంకల్పము చేయఁబడెను. మధుపర్కము లొసంగంబడెను. పురోహితులు సెప్పిన మంత్ర రాజమును దానుచ్చరించుచు రాజవరుఁడు దివ్యజలములు రాజ్ఞీమణి మెల్లననొంచి పోయవరుని శ్రీనివాసుని కాళ్లుకడిగెను. ఆ పవిత్రపాదజలముల భక్తవరుఁడా రాజవరుఁడు

దనశిరమునం దాల్చి భార్యపుత్రసోదరుల శిరములను, భవనమునఁ గోశమున, గజాశ్వరథశాలల, నెల్లెడలఁ జిలకరింపంజేసెను. నేడు నాజన్మ సఫలమాయెను. నాపుట్టువే యొప్పులపుట్టువు. శ్రీనివాసదేవుని యాచరణోదకములచే నాపితరులును ప్రసన్నులై తరించిరనుచుఁ దన్మయతంబలుకుచు నానరపాలుడు శుభలగ్నమున సర్వాలంకార సంశోభితయగు నాకన్యారత్నముం గూతును దైవజ్ఞులు మంగళాష్టములు పలుకుచుండఁ గన్యాదానమొనర్చెను. కన్యాదానసమయమున నాన్నృపతి పెండ్లికొమరుం బూజించి సమాదరమున వేవేలు హేమనిష్కములు, నమూల్య వస్తువాహనములు కట్నములు చదివించియిచ్చెను. వానింగన్న వేంకటేశుఁడు ఏమిదిభూపా! ఇవియన్నియు మీరీయవలయునా? నేను మీబిడ్డడను. బిడ్డనికి మీరీయవలెనే. వీనితోనేమిపని? మీపవిత్రప్రేమయే మాకు మూల్యమగుకానుక. ఆదరకట్నమె మాకుంజాలును. వానితోడనే మనమనసులొకటయి సుఖానందముల మనగలము. ధనకనక వస్తువాహనములు కాదు. వరుడుకోరదగినది, పొందదగినది, పెద్దల యాదరాభిమానములు మాత్రమే. అనుచున్న దేవుని వినుచు రాజాదరమున నెన్నిన్నియో యాభరణములిచ్చి, యలంకరింపఁజేసెను. దివ్యామూల్య బహురత్నఖచిత కిరీటము, కంఠాభరణములు, భుజకీర్తులు, నంగదములు, దండకడియములు, కంకణములు, ముత్తెములకంఠ మాలలు, రత్నహారములు, మణిరంజితాంగుళీయకములు, కర్ణభూషలు, పాదుకలు, తొడిగియలంకరించెను. సర్వాంగభూషణభూషితుఁడగు నాదేవునకు రాజసాలంకృత కన్యాదాన మొసంగుచో బృహస్పతి గురుడు, తానుగాఁ గన్యాగోత్రప్రవరుల జెప్పుచుండెను. అత్రిగోత్రోద్భవయు, సువీరప్రపౌత్రియు, సుధర్మపౌత్రియు, నాకాశ రాజోద్భవయునగు కన్యారత్నమును పద్మావతీ నామను కమలనయనను గమలాక్షా! ధర్మపత్నిగా గ్రహింపుమా! అనినంత వసిష్ఠముని వరుండును. ఓ రాజవరా! వియన్నృపా! యయాతి ప్రభుప్రపౌత్రుండును, నద్భుతతేజోధికుండగు శూరసేనపౌత్రుండును, వసుదేవభూపతి కుమారుండునునగు వేంకటేశనామకునకు వసిష్ఠగోత్రోద్భవునకుగాను నత్రిగోత్రోద్భవయగు నీకన్యారత్నమును సర్వాభరణ భూషితను పద్మావతిని మేము గ్రహించుచున్నాము. వధూవరుల గోత్రప్రవరల నీరీతిని జెప్పినపిమ్మట ధర్మపత్ని ధరణీకాంతతోఁగూడ రాజు కన్యాదానతత్పరుఁడు, ప్రసన్నచిత్తుఁడు నగుచు శ్రీనివాసుతో నిట్లనెను.

పురుషోత్తమా! పుణ్యపురుషా! మదీయకన్యను బద్మావతిని నీకు నర్ధాంగిగా ధర్మపత్నిగా, ధర్మార్థకామముల సహచరిగా,ననుచరిగా నొసంగుచున్నాడను గ్రహింపుము. అనుచు ధరణీదేవి బంగరుకలశను బట్టి తనకుడిచేత విడిచిన పవిత్రమంత్రపూత స్వామిపుష్కరిణీ తీర్థజలధారను పొంగారుప్రేమధారతో శ్రీనివాసు దక్షిణహస్తమునం బోయుచుఁగన్యకా దక్షిణహస్తమునుంచి యర్పించి యర్పించెను. అటుపిమ్మట

రాజపురోహిత నిర్దేశమున, క్రమమున, వైవాహిక క్రియలన్నియు నెఱవేర్చెను. ఆ వెనుక వస్త్రగంధానులేపనముల శ్రీనివాసుని వరునిపూజగావించి యాదేవుని కరమున గంకణముం గట్టెను. ఆ పిమ్మటఁ బద్మావతీ కరమునఁ గంకణము కట్టఁబడెను. రాజును బ్రాహ్మణులును బవిత్రకరస్పర్శల నొనర్చియందియిచ్చిన పవిత్రమంగళసూత్రమును బుణ్యవనితలెల్లఁ దమతమ కరపల్లవములఁ దాకి సావిత్రింబలె నీవును నవిరళదీర్ఘసుమంగళివికమ్మ. బహుపుత్రవతివై లోకకళ్యాణము నొనర్పుము. అంచుదీవించుచు నొండొరుల చేతుల కందించిరి. శ్రీనివాసుండు గైకొని యామంగళసూత్రమును బద్మావతీ గళమునఁగట్టెను. ఇట్లు వైవాహిక బంధనమాయెను విడనిమూఁడు ముళ్లు ముచ్చటగఁబడెను. ఆమీఁద మునివరులును బండితవరులును, బురోహితప్రకాండుండు వసిష్టముని తల్లజుఁడును, పద్మావతీవధూరత్నము కరాంజలులనుండి గ్రహించిన, లాజలు యజుర్వేద మంత్ర పూతములుగ నగ్నిని యధావిధిగ హోమములొనరించిరి. వైవాహిక విధులన్నియుఁ జరిపింపఁబడెను. అయిదు దినములు పెండ్లి యధాక్రమముగ నానందముగ జరిగిపోయెను. ఇట్లు క్రమముగ వైవాహిక విధులు సుసంపన్నములు కాగా రాజపురోహితుఁడు స్వస్తి వాచకములతో మునిజనాంజలుల రత్నాక్షతలుంచెను. వారును వేదమంత్రములతో నాశీర్వాదములతోనవి, రాజదంపతుల శిరములపై వధూవరుల శిరములపై జల్లిరి. ఇట్లా పురవాసుల కెల్లరకు నాపెండ్లి యమితామితముదముగఁ గనుల విందుగ, వీనుల విందుగ హృదయామోదముం గలిగించెను. రాజును నానందకందళిత హృదయారవిందుఁడై సదక్షిణ తాంబూలముల బ్రహ్మవిధుల విప్రవరుల నెల్ల జనుల సన్మానించెను. లక్షలాదిగ సవత్సలగో రత్నములను, గజాశ్వములను వస్త్రాభరణముల వలయువారల కెల్ల నిచ్చి పరితృప్తుల నొనరించెను. ఇట్లట నాదశమి దినమున దేవు కళ్యాణోత్సవము పరిపూర్తి కాగా నెల్లరకు, బప్పన్నములు, తీయతీయని పాయసములు మిఠాయులు, హలువాలు, లడ్డులు ఫేణీలు నేమేమియో నవరసభరితములగు పిండివంటలతో భోజ్యములు వడ్డింపంబడెను.

వనితల మధ్యమున నూతన దంపతులకునేక పాత్రమున భోజనము వడ్డింపఁబడెను. దేవునకు నెడమ వైపునఁబెండ్లి కూతురుపవసింపఁ జేయఁబడెను. దేవునకటుప్రక్కగలక్ష్మియుఁదల్లివకుళ మాలికయు నింకను వలయువారును గూరుచుండిరి. అట్లేయట వధువునకుంజెంగట మాతృదేవిధరణీరమణియు, చెలికత్తెలుంగా వలసినవారుం గూరుచుండిరి.

భోజనములయిన పిమ్మట వేడుకగ వధూవరులచే, బంతులాడించిరి. జూదములాడించిరి. దేవునిచేఁబద్మావతీదేవికి బూలుముడిపించిరి. తాంబూలముల న్యోన్యమునందింపఁజేసిరి. మఱునాఁడుదయమున దేవిచే దేవునకు, నలుగులు పెట్టించి తలంటి నీరు పోయించివలిపంబున నొత్తించిరి. దేవునిచే దేవికి నీరందింపఁజేసిరి. ఇట్టులు

ముణ్యాంగనలు. నూతన దంపతులకు సిబ్బితుల నడుమనుబ్బునఁదబ్బిబ్బులు కూర్చుచు, నానందింపఁజేయుచు నానందించుచుండిరి. ఇట్లుగా నావివాహకార్యక్రమము అయిదు దినములు వేడుకలతో జరిగెను. మూడవదినమున సదస్యమున బూజ్యులగు నెల్లరకు సాదరమునఁబూజలతో గట్నములు కానుకలు నొసంగఁబడెను. పెద్దలయాశీస్సులు శుభాకాంక్షలు మిన్నుముట్టెను. ఆదేవు పెండ్లితో ముల్లోకములకుఁబెండ్లి వేడుకల మునిగి మురిసి నట్లాయెను. అగునగు దేవుడందఱివాఁడు గదా. అందఱ నానందస్వరూపమున వెలుగొందుచున్నవాఁడు. అందఱి కానందము కాకమఱేమి? చతుర్దశ భువనములు నానందరసమునఁబొంగిపొరలి వెల్లివిరిసెను. అయిదవదినమున నాకబలి సుసంపన్న మాయెను. దీపజ్వాలావిరాజితములగు నాలుగు కలశలు నాలుగు వైపుల నుంచఁబడెను. ఎదుట వధూవరులు రత్నాసనమున నుపవిష్టులు గావింపఁబడిరి. అనఘుడాకాశరాజు క్షీరపాత్రముంగొని యల్లు నర్చించి పూజించెను. ఆమీఁద నప్పగింతల తంతు మొదలాయెను. వేద బ్రాహ్మణులు వేదమంత్రములు పఠించుచుండిరి. ఒకప్రక్క నెదకరగించు సన్నాయిపాటలుప్పతిలుచుండెను. ఆనడుమ కురరి యట్టుల విలపించుచు రాజపత్నియుఁగనుల నీరు గ్రుక్కుచు ననఘుఁడు రాజవరుఁడును బ్రాణమునకుం బ్రాణమయిన కూతు హస్తమును నమంత్రకముగఁబాలనేతుల ముంచి యెత్తి దేవుకయి దమ్మినుంచి యర్పించిరి. పిమ్మట శ్రీనివాసు మాతను వకుళమాలికను వస్త్రా భూషణములతో విధ్యుక్తరీతుల బూజించి బిడ్డ కుడి చేయి పాలముంచి యామెచే దమ్మినిడి యప్పగించిరి. అట్లేవారు తమ కూతుచేయి లక్ష్మికిఁజేతనిడిగద్గద కంఠమున నర్పణమొనరించిరి. అప్పగింతల పాటల నడుమఁగన్నకూతువారు వలయు వారికెల్లనప్పగింతలు వెట్టిరి. ఇట్టులానాడెల్లకార్యములును సుసంపన్నములు కాగా నామీదనిజనివాసమున కుంబోవు నల్లునితోగూతుఁబద్మావతీ సతిం బయన మొనరించి తగుపరివారముతోఁబంపుచు నారాణీదుఃఖము పెల్లున నోటమాటరాక యెట్లోగద్గదిక నిట్లనిపలికెను. నాయనా! శ్రీనివాసా! పెద్దకాలము లాలనపాలనల బెంచిపెద్దచేసిన ముద్దులకూనను నీచేతులనిడుచున్నాము. మేము తలిదండ్రులము దరిలేనిలోటు కనరాకయుండ నాదరించి యామెను బ్రేమనేలుట నీవిధి యని బావురనియెను. అంతట నదికనివిన్న యారాజును కనులనీరు కాల్వలుకట్ట నిజనందనను దీనవదనుఁడై బిట్టుకౌగిలించికొని వాపోయెను. వారియిద్దరి నడుమనోటమాటరాక యట్టె నిర్విణ్ణుయై నిలిచియున్న, దుఃఖము పొంగిపొరలి వచ్చుచున్న పద్మావతి కనులనుండి నేలకేకధారగఁ గన్నీరుకారుచుండెను. వారియాస్థితులం జూచియెల్లవారును, ఎంతప్రేమను బెంచిపెద్దచేసినను గూతునెప్పటికేని యిట్టులొకయయ్యచేతఁ బెట్టిపంపి యెడబాటు దుఃఖమొందుట యెంతవారికైనఁదప్పదుగదా, యనుకొనుచుఁ గంటఁదడిపెట్టిరి.

కన్నకూతుంగని రాజిట్లు విలపించెను. అయ్యో! పుత్రీ! యిన్నిదినములు నిన్నుకంటికి ఱెప్పగఁబెంచి యెడఁబాయుచున్న నేనెంతమందభాగ్యుఁడను. నాజీవిత మంతయు దుఃఖమయము. కానక కన్నసంతానమును నినునేఁడు కనకుండనే పంపివేయుచున్నాడను. తల్లీ! మఱలనెప్పుడు కనులఁబడుదువో? నేనెంతకఠిన హృదయుఁడను? నిన్ను విడిచిక్షణమేని యుండజాలని నీతమ్ముఁడు నీవులేకయా క్రీడామందిరమున నెట్టులేమియాడును? నీవులేని యెడనాతని నోటికెట్టులు ముద్దపోవును. నీవులేని వానియాదుఃఖము నేనెట్టులు మఱపింతును? అనిపలవించుచున్న యన్నంగని తొండమానన్నపుండిట్టులనియెను. అన్నా శ్రీనివాసుఁడు మనయింటి యల్లుఁడాయెను. మనమెంతయు భాగ్యవంతులము. ఇదియంతయు మనయీబిడ్డభాగ్యమే కదా? ఈమె నెడబాయుట యన్ననెంతయో కష్టము. నిజమె. ఇంతకాలము ప్రాణమునకుం బ్రాణముగ బెంచి పెద్దచేసి యిపుడు విడుచుటయన్న నెంతయుం గష్టమే. కాని కన్నకూతు నెన్నటికేని నొకయయ్యచేతనిడి పంపవలసినదేకదా? కాని శ్రీనివాసునట్టి యల్లుడు దొరకుట మనయదృష్టము. దుఃఖింపకుము. మనబిడ్డ భాగ్యమేభాగ్యము. అనుచుండఁగనే యాతని కనులనుండియుఁ గన్నీరు జలజలరాలెను. గొంతు గద్గదికమాయెను.

అయ్యయో! మీరలిటు లేమియుఁ జింతింపకుఁడు. మేము మీకేమియు దూరమగుటలేదు. మీరెప్పుడు కోరిననప్పుడె వచ్చిపోవుచుందుము. మనసున ధైర్యముంబూనుఁడు. అనివారికిం ధృతికొలిపెను. ఇట్లు వైవాహిక విధులెల్లఁ బరిసమాప్తములు కాగా మంగళవాద్యముల, తూర్యారావముల నడుమ, వధూవరు లలంకృతైరావతగజము నెక్కి పరివారము వెంటరాగాఁ బురమునఁ బ్రదక్షిణముగ నేగుచుఁ దమతమ విడుదులకుం జేరిరి. ఆమీదట బ్రహ్మాదులును వారివారి విడుదులకుం జేరిరి.

## పెండ్లి వారి తిరుగుపయనము.

ఆపై నెల్లరకాదర సత్కారములు వీడ్కోలులు జరిగెను. తన్నుందరిసిన యత్తమామలకా శ్రీనివాసుఁడు పద్మావతీ సతీరత్నముతోఁ బాదముల కెఱఁగి తననివాసమునకు న్మఱలపోననుమతిం గోరెను. లోకరక్షకుడు నాయుర్వర్ధకుఁడు నగు నాదేవుని నారాయణుని దీర్ఘాయువుం గమ్మని మఱిమఱి దీవించుచు రాజెల్లర నొకనెలయటనె యుండిపోవుఁడని ప్రేమానురక్తులం గోరెను. హరియును దనకటఁ జాలతొందరలగు, చేయఁదగు కార్యములు కలవనియు నిటఁ బ్రస్తుతము తనకు నిలువఁదీరదనియుఁ బలికి యెట్లెట్లో వారిని దనపయనమునకు నొప్పించెను.

"ఈ దేవుచెట్టపట్టి ప్రక్కనుజేరి ప్రేమచూపులం గనుచునేగుచున్న యీరాకుమారి మనపద్మావతియెంతయు ధన్యురాలు. ఈ జేజేకు గన్యాదానమొనర్చిన మన రాజదంపతులు కృతార్థులు. ఈ పట్టణమున నుండి యీవేడుకల నెల్లఁ బాల్గొనుచుఁ గనులారంగాంచఁ గలిగిన మనమెల్లరమును జరితార్థులము. ధన్యులము పుట్టువు ఫలముంబొందఁ గన్నవారము." అని పలికికొనుచుఁ దనిసిరి. వారత్తరి దేవదేవుం జూచుచు నని మిషులేమైయెరస వింతలేదు.

నలువపలుకుల, నాకాశరాజు నను మతిని, దరలిపెండ్లివారు తిరుగు మొగముపట్టిరి. ఆటఁగూతున కాకాశమహీపాలుఁడు తొలిసారిగా పరిపూర్ణములగు వేలకొలదిగ దధిఘృత క్షీరసంయుత సువర్ణభాండములు, బండ్లకొలదిగ పన్నబియ్యము, గోధుమలు, పప్పుదినుసులు, వేలకొలదిగ దాసదాసీ జనంబులు, నృత్యగీతవాద్యములఁ దేరిన నరనారీరత్నములు, సమలంకృతములగు వేలకొలఁదిగ రథగజాశ్వములు గోరత్నములు నీయబడెను. లెక్కకు మిక్కుటమగు పెట్టెల కొలఁదిగ పట్టువలిపములు, బంగరువందిరి పట్టెమంచములు, గద్దెలు, రత్నాభరణములు, కొలది చెప్పనేరానట్లుగా నీయఁబడి వారివెంటం బంపంబడుచుండెను. రాజుకూతుం గౌగిలించికొని యిట్లనెను. అమ్మా! జగన్నాథునమంగు రాణివిగదమ్మా! అతని తలలోనినాలుకపై మనసులొకటిగా మనగదవమ్మా. అతనిసుఖమె నీసుఖముగ నెంచి యెల్లవిధముల నాతని సుఖముం గలవానిగఁ జేయుమమ్మా. అన్నియుందెలిసిన దానవు; కోరివరించి దేవునేపొందఁగలిగిన దానవు. నీకు మేము చెప్పునదేమున్నది? పుట్టునింటికి మెట్టినింటికిఁ బేరుతెమ్ము. సౌఖ్యానందములఁ బెంపొందుము అనుచు, తల్లీ మేముపోయివత్తుము. మాకనుమతి యిమ్మమ్మనుచు గద్గదకంఠమున నోటమాటరాకయే యెట్లో బిడ్డననునయించి, యారాజు సోదరపుత్రులతోఁ దనపరిమిత పరిజనముతో మఱలిపురమునకుం బోయెను. అటుపిమ్మట నాపద్మావతీ తరుణీ మణియుమెల్లన విభుని శ్రీనివాసుని దరియవచ్చెను. పద్మావతీ యుతుఁడై, పద్మాలయాసంయుతుఁడై యాజేజే బ్రహ్మరుద్రేంద్రాదులతో సువర్ణముఖరీ తటముం జేరియటవిడిసెను. అటు పిమ్మట నొక్కరొక్కరింగా దేవతల నెల్లర వస్త్రా భరణాదికముల నాదరసన్మానంబులఁ దనియించి వారివారి నివాసములకుం బంపెను. వారును దేవుననుమతిని ముదమున నాదేవుని పెండ్లిమాటలనె చెప్పికొనుచు వెడలిపోయి తమతమనెలవులు చేరిరి. తపోధనుల యోగిసత్తములఁ దగురీతి సన్మానించి పెద్దగ నాదరించి పంపవారును దేవుని ప్రేమకు ముగ్ధులగుచు వారివారి తపోవనముల కాశ్రమములకు, దేవుగుణగణములు, మాహాత్మ్యముం గనుచుఁ బ్రశంసించుచు నొండొరులకుం జెప్పికొనుచు దేవునిపెండ్లింగనిన తమభాగ్యమునకుప్పొంగుచుఁ బోయిసుఖముండిరి.

ఇటదేవుడు దేవేర్లతోఁ బద్మాలయాపద్మావతులతో నావృషశైలరాజమున, స్వామిపుష్కరిణీ తటమున, దొంటియట్లయానంద విహారములు జరుపుచు భక్తజనములచేఁ బూజితుండగుచుఁ దనియుచుండెను. లచ్చి, లిబ్బిపడతి, కలుముల జవరాలు పతిదేవు ననుమతిఁ గరవీరపురమునకుం బోవుచు వచ్చుచునుండెను.

## ఈ యదిపద్మావతీ కళ్యాణమహోత్సవకథాఫలము

దేవుని యీపెండ్లిగాథను భక్తిశ్రద్ధలతో వినువారికి వినిపించువారికిం గలుగు ఫలమెట్టిదని యెట్టులు వచించునది. అట్టియా పవిత్రహృదయులకు, భక్తవరులకుఁ గోట్లకొలఁదిగఁ గన్యాదానములు చేసినపున్నెము, నీభూమినెల్ల దానముగనిచ్చిన పున్నెము, నెల్లసత్కార్యములు నాచరించిన పుణ్యఫలమునబ్బును. ఎల్లమనోరథములు నెఱవేరి యేకొఱంతయులేనివారగుదురు. నిర్లిప్తుడై త్రికరణముల భక్తిని పవిత్రుఁడై యావేంకటేశ్వర దేవు కళ్యాణోత్సవముం జరిపించు నాపుణ్యుని పున్నెమే పున్నెము. అతఁడా దేవుని సాయుజ్యమునే పొందును. అట్టివారల కిటనటనెటను బ్రమోదమేయగును.

# పంచమాధ్యాయము

## శ్రీనివాసునొద్దకు నారాయణపురము నుండి దూతవచ్చుట

ఇట్టులొక యారుమాసములు గడచిపోయెను అంతనొకనాఁడు పద్మావతి లోపాముద్ర సహితయై స్వామిపుష్కరిణికి స్నానమునకేగెను. అటనామె నారాయణపురమునుండి వచ్చిన యొకదూతంగని యాతురతతో నిట్లనియెను. వార్తాహరా! నీవెవరు పంపవచ్చితివి? నీవచ్చిన పనియేమి? మాతలిదండ్రులు క్షేమమేకదా? మాసోదరుడు వసుదానుఁడెట్లున్నవాఁడు? పినతండ్రిగారు తొండమానుల, కుటుంబము క్షేమమెట్టిది? ప్రజలెల్లరుం గుశలమేకదా? యనుచుఁ బ్రశ్నలపైఁ బ్రశ్నలు వర్షముగఁ గురియించుచుండ నాదూతయు నారాకుమారితోఁ అమ్మా! యటనెల్లరు క్షేమమే. కాని రాజేంద్రులు ---- అని మాటలు తడబడఁ బలుకకయుండెను అదియేమి? ఊరకుంటివేమి? చెప్పుము చెప్పుము. ఊరకుంటివేమి? మాటాడవేమి? నాయనగారికేమాయెను? అనుచున్న పద్మావతితో నాతండ్రిట్లనియెను.

అమ్మా! యేమిచెప్పుదును? ప్రభువు వారు మంచముపట్టినారు. దినములు లెక్కించుచున్నారు. మిమ్ములను, అల్లునిగారిని, ఉన్నబంధువులను జూచుటకోయన నుసురులు పట్టియున్నవారు. ఇదితెలిపి మిమ్ముంగొనిపోవనే నేను హుటాహుటి నుఱుకు

పరుగుల నిటకు వచ్చియున్నాను ఓసౌభాగ్యవతీ! తొందరపడుడు; దేవునిం బయనింపఁ జేసి తండ్రిగారిపురముం జేరఁజనుదెండు. అనునంతనే యామె హాతండ్రీ! యనియట్టేమొదలు నటికిన చెట్టువలె నేలఁగూలెను. చెంతనున్న మునిపత్ని యామెనెట్లో పడకుండఁ బట్టినడిపించికొని యాశ్రమమునకుం దెచ్చెను. విషయమంతయు నెఱింగి దేవుఁడు నిర్వికారుఁడు శ్రీనివాసుఁడును సామాన్యునటుల బావురుమని వాపోయెను. అయ్యో దేవీ! ఎంతకష్టమాయెను. ఏమి చేయుదము? ఎక్కడికేగుదుము? అనుచు నటనున్న మునివరుంగాంచి యిట్లనియెను. ఓ మునివరా! ఇకమాటాడుటకుం గాలములేదు ఇప్పుడెరాజుం జూడఁ బోవుదము. తల్లీ వకుళమాలికా! నీవును బయనముకమ్ము. అన నెల్లరు నప్పటికప్పుడె తొందర తొందరగఁ బయనమైనడచిరి. భక్తవత్సలుఁ డాశ్రీహరి యిట్టులాయగస్త్యమునివరుతో దేవిపద్మావతితో, మాతృకవకుళమాలికతో నారాయణ పుర మటుసూర్యుడస్తమించు సరికింజేరెను. ద్వారపాలకు రాజుక్షేమంబడిగి తెలిసికొనియుఁ బురవీధులనెట్లుపోవుచున్నదియుం దెలియకయే రాజాంతఃపురాంతర మందిరముం జేరెను. ఎగయూపిరితోఁ దమకొఱకేయున్నవాని యట్లసెజ్జనంటిపెట్టికొని పరుండి యున్న రాజుంగని యావేలుపు హా రాజవరా ! ఎట్లుయితిరి ? అనుచునాతని చెంతంగూరుచుండిరి. శిరమాతనిపై నిడి దుఃఖింపసాగెను. పద్మావతి, కదలనేకాలురాక, యట్లేనిలిచిపోయి కనులనీరు గ్రుక్కుచుండెను.

## రాజుమృతి - బంధువిలాపము

వచ్చిన యల్లుని గూతుంగన్న రాజు నాననమొక్కమారుగ వెలుగొందెను. కన్నులింతలాయెను. తన్నుం జేరికూర్చున్న యాదేవుని కరస్పర్శ మాత్రముననే యాతని యాతనలెల్ల నదృశ్యములాయెను. ప్రభునిమోమున మోమునిల్పిరాజట్లే చూపులఁ జూపు చేర్చెను. హాతండ్రీ! యనికూతురు తండ్రిదేహముపైఁ బడెను. భార్యాపుత్రులు, బంధుమిత్రులు నారాజుచేతల నెన్నియెన్ని విలపింపసాగిరి. అప్పుడే లోకబాంధవుఁడు క్రుంకినట్లు వారికి లోకమే యంధకారబంధురమాయెను. లీలామానుష విగ్రహుఁడు, జగన్నాటకసూత్రధారి యాశ్రీహరి శ్వశురుపైఁ బడి సామాన్య మానవునట్ల యెల్లలోకముల జ్ఞానులం గూడ మోహమున ముంచుచు విలపింపఁదొడంగెను. అంతట భూవరుఁడల్ల నల్లనఁ దెలివంది కదలిదేవునికరములు తనకరములఁ గొని తనిసెను. కూతును గొడుకునుఁ జేరదీసి వారిచేతుల నాదేవుచేతులనిడి వీరిభారము నీదేనాయనా యనెను. సోదరుం బిలిచి వీరునీబిడ్డలే సుమా యనెను. మునికి మ్రొక్కి ధర్మపత్నిని ధరణీరమణింగనుచు శ్రీ వేంకటేశా! శ్రీనివాసా!యనుచు నుసురులు శాంతముగఁ

బాసెను. అప్పుడె యొకవింత తేజస్సొన్నపతి యొడలినుండి వెడలి వచ్చి దేవునిలోఁ గలిసెను. అదిగన్నయచటి వారెల్లరు నట్లేవింతను వంతను మునిగిరి. అచ్చటనదేమి వింతయో! యప్పుడె ధరణీకాంతయుఁ దనజీవములారాజుం జేర్చి తనువుంబాసెను. అప్పుడె తమకై దివినుండి దిగివచ్చిన దివ్యవిమానములందెక్కి యాదంపతులు దివ్యదేహములతో సత్యలోకమునకుం బోయిరి. అటు పిమ్మట రాజదంపతుల దేహముల కౌర్ధ్వదైహిక క్రియలకు సన్నాహములు జరిగెను. ఆరాజ శార్దూలుని శ్రీనివాస ప్రియుని సపత్నికముగ మునివరశ్రేష్ఠులు వసిష్ఠ గౌతములు, భరద్వాజాత్రి మౌనులు నలుకొమ్ములు పట్టికొని పోయి చితిపైనుంచిరి. బ్రహ్మమేధ మంత్రముల విధి విధానపూర్వకముగ దహనాదిక్రియలు జరిపించిరి. ప్రేతకార్యములన్నియుఁ బూర్తికావింపఁబడెను. శ్రార్ధకార్యములు సమాచరితములాయెను. దినములు కడచినంతఁ బుత్రునిచే మాసికపిండదానము లొనర్పఁబడెను. వేదజ్ఞులగు పవిత్ర సద్బ్రాహ్మణులుని మంత్రితులై వచ్చిరి. వసుదాను నాహ్వానము నగస్త్యకస్యపాత్రి భరద్వాజులు, విశ్వామిత్రవసిష్ఠవామదేవులు, భృగువాల్మీకి గౌతమ పులస్త్యులు, సనక, సనందన, జమదగ్ని పరాశరులు యాజ్ఞవల్క్య జాబాలి సునశ్శేపులు నాదిగనెందఱెందఱో తపోధనులు, మౌనివరులు వచ్చిరి. అంతట సన్మానితులై రాజదంపతుల పారలౌకిక క్రియలన్నియు, బరిపూర్తి గావింపఁజేసిరి. పురాణపురుషోత్తముఁ డెల్లకార్యములు నెఱవేర్పఁజేసి పద్మావతీదేవితో నటనెల్లరినుండి యనుమతింగొని యగస్త్యాశ్రమముం జేరి యటసుఖముండెను.

## రాజ్యమునకై తొండమాన వసుదానుల యందుకలహము

ధనైశ్వర్యము లెంతచెడ్డవి, అందునను రాజ్యకాంక్ష పదవీవ్యామోహము నెంతయు ననర్థకరములు. శ్రీనివాస దంపతులు వెడలిపోయిన పిమ్మట నారాజ్యమునకై తొండమానవసుదానులకు నడుమ జగడము లుత్పన్నములాయెను. నేనును నాయన్నయు నొకటిగనుంటిమి. పరస్పరార్జిత మభివర్ధిత మీరాజ్యము. ఈరాజ్యము నావలననే సుఖసమృద్ధమాయెను. కాన నీరాజ్యమున కేనపాలకుఁడఁ గావలయును. అని తొండమానుఁడన అదియెట్టు? ఎవరిచే రాజ్యము పెంపొందుఁగాక, పాలనమున నెవ్వరు రాజునకు సాయపడుదురుగాక, ఆరాజునకుఁ బిమ్మట నారాజుకుమారుఁడే రాజ్యాధికారముంబొందనర్హుఁడు. ఇదియేధర్మము. యుగయుగముల నుండి వచ్చుచున్న యాచారము. అనివసుదానుఁడనెను. నేనరాజును, నేనరాజును అని వారుకలహించి సమరమునకు సంసిద్ధులైరి. పరాక్రమజీవులు క్షత్రియులు. పరాక్రమోపార్జితము రాజ్యము, వీరభోజ్యము. కావునరణమున నెవరు గెలిచిన వారిదె యీరాజ్యమని వారు నిశ్చయించిరి.

దుష్ట ప్రవృత్తులఁ బెంచ పెద్దచేసి కలహములఁ బెంపొందించు వారెపలువురు సద్వృత్తుల స్నేహప్రవృత్తులఁ గలిగించి పెంచువారరుదు. దుర్మదాంధులు కలహప్రియులునగు పెక్కురు రాజుల, వీరులఁ గిరాతుల నాహ్వానింపఁ దొండమానన్నపున కండగ నెందఱెందఱో ససైన్యముగ వచ్చిచేరిరి. అట రెండక్షౌహిణుల సేనసంసిద్ధమాయెను. ఇట వసుదాను పక్షమునను, నానాదేశముల రాజులు వీరులు వచ్చిచేరిరి. ఎవరును నెవరికిని దీసిపోవువారు కాకుండిరి. నారాయణపురమునకు వెలుపల దక్షిణదిశను సువిశాలప్రదేశము సమరాంగణముగ నాయెను. ఇరువాగుల నున్మదోత్సాహము మిన్నుముట్టుచుండెను

## తొండమాన వసుదానులిర్వురును యుద్ధమున శ్రీనివాసుసాయమడుగఁ బోవుట

అత్తరి శ్రీనివాసుఁ దోడుగ నర్థింపనొక వంకనుండి తొండమానుఁడును, వేరొకవంకనుండి వసుదానుఁడును బయనమై పోయి దేవదేవు నెలవును జేరిరి. తలవని తలంపుగ వచ్చిన వారిరాక కెంతయు ముదమంది శ్రీనివాసుఁడు వారికి సాదరమున నెదుర్కోలొనరించి కౌగిలించికొని లోనికిం గొనివచ్చి యుచితాసనములఁ గూర్చుండం జేసెను. అర్ఘ్య పాద్యాదుల సంపూజితుల నొనర్చెను. పిమ్మట వారలంగని, మీరువచ్చిన పనియేమి? సెలవిండు అనిదేవుఁడన్నంత వసుదానుఁడు జరిగినయుదంత మంతయుం జెప్పి, బావా! శ్రీనివాసా! రాజ్యమునకై నేనును, బినతండ్రిగారును రణమొనరింపక తప్పదాయెను. అందునఁ జిన్నవాఁడను, దలిదండ్రులు లేనివాఁడను. అసహాయుడను, న్యాయముగ రాజ్యమునకర్హుడనగు నాపక్షమున నిల్చి రాజ్యప్రాప్తికి సాయమొనరింపరా మిమ్ములనర్థింపవచ్చితిని అనెను. అటుమీఁద దొండమానుఁడును శ్రీనివాసా! పలుపలుకు లేల? నేను నీసాయమర్థించి వచ్చితిని. మాయన్నదమ్ముల యునికి నీకుం దెలియనిదికాదు అన్నగారికిం బిమ్మట రాజ్యమన్ని విధములఁ దమ్మునకు నాకుం జెందవలసియున్నది. ఇయ్యదియే న్యాయము. కావున నాలోచించి కార్యముం జేయుము. నీవు న్యాయముగ నాసాయమునకై వత్తువని యాసించుచున్నాను. అనెను.

అదివిన్న వెంకటాధీశుఁడు మోమునఁ జిఱునవ్వు మొలకెత్త నేనొక్కడ మీయిర్వురకెట్లు తోడ్పడంగలను? ఇర్వురును న్యాయార్హులమనియు, ధర్మపక్షులమనియు నేజెప్పుచున్నారు. అనుచువారి నచటనే యునిచి తాను లోనికింబోయి, వీరిరాకయుఁ గోర్కులు నెల్లవిషయములు పద్మావతికిం జెప్పివినిపించెను. వరారోహా! ఒకవైపున నీసోదరుఁడును, మఱియొకవైపున నీపినతండ్రియును రాజ్యమునకై పోట్లాటకుం దిగి నాసాయముం గోరివచ్చినవారు. నిజముగ నాకుఁ బచ్చివెలగగొంతునఁ బడినట్లున్నది.

నీవయాలోచించి యిపుడు నేనెవరికి నెట్లుతోడ్పడఁ దగునో దాపరికముంపక విశదముగఁ బలికి నన్నొకతెన్నున నడుపుమనియెను అదివిన్న ప్రభావతి మనమునసెంతయు వంతంగుంది యిట్లనెను. నాథా మీరెఱుంగనిదేమున్నది? మిమ్ము నేనాతిన్నని తెన్నున నడుపుదానను? మానవధర్మము లెప్పుడును నొకతెన్నునసె నడుచుచుండును. బ్రహ్మాదులెప్పుడును ధర్మమునె మెచ్చిపెంపొందించుచుందురు. మీరె యాధర్మమున కెల్ల మొదలు దానికింగాపాడుడు. పురాణపురుషోత్తమా! చిన్నవాఁడు, నిరాధారుఁడు, రాజ్యముం బొందన్యాయముగ నర్హుఁడు, నగు వసుదానుని రక్షించుటయ మీకు న్యాయము, పున్నెమునని తలంతును మాపినతండ్రిగారు బలవంతులు, ధనవంతులు, మాతండ్రిగారి రాజ్యముం గోరుచున్నవారు. వారును నెల్లధర్మముల నెఱింగినవారు, రాజశ్రేష్ఠులు, ఇపుడేల నిటులధర్మమునకుఁ దలపడుచున్నవారో తెలియరాకున్నది. అనియెను అదివిన్న శ్రీనివాసుఁడామె భావ మనుజునకు సాయమొనరింపనే యని యెఱింగి మెల్లన నటనుండి వెడలిపోయి యాబంధుగులఁ జేరెను. తనయలౌకిక శంఖచక్రముల నిచ్చి తొండమాను నామోదితుం జేసి పంపెను. తాను మున్నతము వాయుజవోపేతమునగు నశ్వరాజము నెక్కి వసుదానువెంటఁ దోడుగ యుద్ధభూమికి వచ్చెను. అట నిరువాగుల వారికిని చైత్రశుద్ధత్రయోదశిని భీకరయుద్ధముల కురు పాండవసమర మట్టుల నారంభమాయెను.

ఇరుబలముల గలసైనికులును, వీరులును యూపస్తంభంబులంగల పశువులట్ల చంపఁబడుచుండిరి. సింహగర్జనలు, భీకర శంఖధ్వనులు, దుందుభినిస్సాణాది రణభేరీ నినాదములు, రథనేమిఘర్షరధ్వనులు, గుఱ్ఱముల సకిలింపులు మదగజముల ఘీంకృతులు, వీరుల వీరాలాపములు, భీకరములయి కడలుకొనుచు మిన్నుముట్టెను తెగిపడెడు తలలు, తునియలగు తొడలు, ఖండితములగు కరములు, గాయములం గ్రిందికిం జారిపడు కాయముల, నాయుధము లంగంబులం గాఢముగ నాటుకొన వెడలు హాహానాదములు కడలుకొన నాతుముల రణరంగము మృత్యుదేవతపాచన గృహమట్లు బీభత్సమైయుండెను. గృధ్ర, సూచీ, పద్మాది విచిత్రవ్యూహములు రచింపఁబడుచుండెను. సంగరమా యతిభీకరమైయుండెను వీరులు వీరాధివీరులు, రథులు, నతిరథులు, మహారథులు నగు సమరకోవిదులతో నొప్పునాసమరాంగణ మధ్యమున శ్రీనివాసుఁడు గ్రహముల నడుమ దినకరునట్లు విరాజిల్లుచుండెను. అందువసుదాన తొండమానులు తలపడిరి. తొండమానపుత్రుఁడు బాలకుడు శ్రీనివాసు నెదుర్కొనెను ఏమివింత? ఏమి మానవ సమాజము? తొలుతనుండియు నీమానవ జాతి, పాడముటాదిగ స్వార్థము నీర్ష్యా ద్వేషములతోడనె పెరుగుచు వచ్చుచున్నది. హృదయములందు ప్రేమ, సహనము,

మైత్రియించుకయు గానరాదు. ధర్మసత్యములు హృదయముల నాచరణనరుదు. తోచునదంతయు, బైపూతలోకముకనుగప్పు. అందునను వింతలవింత, నెయ్యుర యందునను బంధులందున నీకయ్యము, ఈసుపొంగి పొరలుచు క్రూరమై భీకరమై కొనలుసాగుచున్నది. పరులతోడి వైరము పోట్లాటయంత తీవ్రముగ దయావిహీనముగ నుండదేమోయని తోచుచున్నది.

వసుదానుఁడు వాడియైన పదియర్ధచంద్ర బాణములఁ దొండమానుం గొట్టెను. తొండమానుడును నన్నియశరముల నాతనినురమునం గొట్టెను. ఇట్టులు వారలన్యోన్యముఁ గొట్టికొనుచు నన్యోన్యప్రేషిత సాయకముల నడుమనడుమనె పడఁగొట్టుచు నొకరికొకరు తీసిపోక పోరుచుండిరి. ఇటఁ దొండమానపుత్రుడు తీవ్రనారాచముల నారాయణు నురమున గాఢముగా గాడనేసెను. చిఱుతవాఁడయ్యుం జెప్పఁదగు నుత్సాహము, నేర్పుఁజూపుచుఁ బుంఖానుపుంఖములుగ నలుగులు గుప్పించి శ్రీనివాసునొప్పించెను. అతనిధీరతను, వీరతనుగన్న దివిదేవతలును నబ్బురమున ముక్కున వ్రేలిడికొనిరి. ఎంతయు నొచ్చినవాఁడై దామోదరుఁడు కోపము రెట్టింప నిర్వదిబాణములం బాలకు నెడందనాటనేసెను. అంతలో నాగక నాలుగునాలుగు సాయకముల నశ్వములను, నిషుద్వయమున సారథింగొట్టెను. అయిదు బాణముల రథముం గొట్టిటెక్కెముం బడఁగొట్టెను. అంతనాబాలకుండును తోకత్రొక్కిన కోడెత్రాచై యొక్కయుదుటున నరదమునుండి యుఱికి వాసవువజ్రము నట్టి సునిశిత చక్రముం బట్టి వచ్చిదరిసి హరిని, హరులను బిట్టుకొట్టెను. చక్రాంకితహస్తుండుఁ చక్రధరుఁడా రణాంగణమున బాలునిచక్రధారావిద్ధుఁడై సాధారణ మానవునట్ల చూచువారినెల్ల మోహమున ముంచుచు, సురాసురమౌనివరులను భ్రాంతి విభ్రాంతులం జేయుచు మూర్ఛను మునింగి నిజహయరాజము నుండి నేలకొఱఁగెను.

## పద్మావతి నగస్త్యమునితో సలహాపొందుట

అటఁ బ్రాకార భవనోన్నత శిఖరమున నుండి యాలముంగనుం గొనుచున్న రాకుమారి పద్మావతీదేవి యనితలమున మూర్ఛమునింగి పడిన ప్రాణవిభుఁ బద్మాక్షుం గనుంగొని గుండె గుభిల్లు మననెంతయుఁ బరితపించి వేగమునఁ బోయి యాకెలకుల నున్నయగస్త్యముని తల్లజుంగని వందనమొనరించి యిట్లనెను. అగస్త్యమునివరా! ఇటురండు అట సమరతలమునఁ జేష్టలుడిగిపడియున్న మన్నాధు జగన్నాథుంగనుంగొనుఁడు వారియవస్థంగనుగొన్న నాగుండియ కలగుండు వడుచున్నయది. ఇప్పుడేమి చేయునది? తొందరపడుడు. ఆలస్యమొనరింపనగునదిలేదు. అనియాతురత నందుచున్న దేవ

దేవేరింగాంచి కుంభసంభ డాదేవునెదసంస్మరించి, సమయోచితముగఁ బద్మావతితో ననుభవైక వేద్యములగు పలుకులఁ బ్రశంసా పాత్రముగ నిట్టులనియెను .

కళ్యాణీ! కలఁతనందకుము. దేశకాలపాత్రములు గణింపక ప్రవర్తించు వారలాకర్మఫలమును, సుఖమును బొందఁజాలరు; చెడుగేయగును. ఎవ్వరుగాని దేశకాలపాత్రము లెఱింగి కార్యము సమాచరితము గావింపవలెను. అట్టివారేకార్యకుశలురు. మనుజుని శరీరమున శక్తికలంతదనుక, యెవరికైన తమకు వానితో పనియున్నంత దనుక నాదరింతురు. లోకము తీరేయిట్టిది. ప్రభువులు వీరులునగు వారి రణాదుల నియోగించి యుత్సాహపఱచి కార్యముంగొందురు. ప్రతాపోత్సాహములు చూపునంత దనుకఁ బ్రశంసలఁ గురియింతురు. పనిగొందురు. తమయవసరము తీరినపిమ్మటఁగాని, వారిదేహముల శక్తియుడిగిన పిమ్మటఁ గాని వారిమోమునైనం జూడరు. ఇదియ యీస్వార్థపరుల, నేటికుటిల మానవుల తీరు, ఎట్టి వీరులైనను, తమకెంత కూర్చువారైనను రణాంగణమునఁ గూలిన వారినడుగువారే యుండరు. ఎల్లవారును స్వకార్యనిపుణులే. పరార్థము మాత్రము వారికిం బట్టదు. రణమునఁ బడిన నీపతిని గననివారెవరు? కాని వారిం దరిఁజేరి యాదరించిన వారేరి? కార్యశూరులుత్సాహమునఁ గార్యరంగమున నురుకుచు ముందునకుం బోవుచు సజ్జనులచేఁ దలమానికములట్టు లాదరముం గాంతురు. జీవించియున్నంత దనుక యెవ్వరి కార్యదీక్షగాని కౌశలముగాని కానఁబడును. ఆపై మఱుపునంబడిపోవును. అది యెఱింగియోభద్రురాలా! నీవతొందరపడుము నీపతికై యటఁ జింతించువారులేరు. ఈ రణోద్యమమునుండి నీపతిని మఱలింపుము. ఓ పతిప్రియా! పతిభక్తియు స్త్రీలకుఁ బరమధర్మము అటుఁగనుము. ఒకవంక సోదరుడు, మఱియొకవంక పూజ్యులగు పినతండ్రి. ఇందెవరికిని హానికలుగకుండునట్లు జూడుము. పతిని మేలుకొలుపుము. ఎంతయు నీకు మేలగును. పతిదేవుని కాపాడుకొనుము పతిహితము నాచరింపుము. లేలెమ్ము. రాజ్యమునకై పోరువారిద్దఱుఁ దండ్రికొడుకులు. వారినడుమ సంధి యాచరణీయము. అదియే ప్రశంసనీయము. బందుగులకు భద్రము నాచరింపుము. సంధికార్యము నీకెంతయు ముదముగూర్చును దానినే నేను నాసించు చున్నాను. అను మునివచనములాలించి యారాకుమారి పద్మావతియప్పుడ సుందర సువర్ణమయాందోళిక నారోహించి ప్రాకారములు దాటి రణరంగాంతరమునకుం బోయెను. మునివరుఁడగస్త్యుఁడును నారణాంగణమునకామెతోఁ బోయిచేరెను.

ఓం శ్రీ వరాహాచలనాథాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ నీలాద్రినిలయాయ శ్రీ వేంకటేశాయ నమః

## బంధురణము మాన్పించుట - శాంతిస్థాపనము

పతిపరాయణ యాయన్ను మిన్న భూపతితుఁడైయున్న గరుడధ్వజాంగములలోచనుంగాంచి సమీపించి, యా శ్రీనివాసుని భూతలశాయిని సురేశ్వరు నట్టె బిగ్గఁబట్టి లేవనెత్తి తాఁదెచ్చి పఱచిన నునుసెజ్జఁ బరుండఁబెట్టి శీతలసుగంధ జలముల మోముకడిగి తుడిచి మెల్లన వీవనం బట్టి విసిరి కొంత సేదతీర్చెను. పిమ్మట విచారమున మునింగి క్రుంగిన యెడందతో నాయమ యిట్లనియెను. ఓ చక్రధరా! చతుర్భుజా! మూర్ఛనుండి తేరుము లెమ్ము! అనునామెను విని యాజగన్నాటక సూత్రధారి, యెంతయు నలసినవానియట్ల యప్పుడెమూర్ఛదేరిన వానివలెఁ గనులు విప్పి యిటునటుచూచి కురంగటం గూర్చుండియున్న పద్మావతీ దేవింగాంచి బొమలు ముడివడ, గోపించిన యట్లవేడగ నిట్లనెను. ఇదేమి? నీవా! ఈ ఘోరదుర్మరణాంగణమునకా! నీవు వచ్చుటయా! మునివరా! ఇప్పుడీమె యిటకువచ్చిన పనియేమి? ఈపె నిప్పుడ యిటనుండి తరలించికొనిపొండు. అనునాదేవుతో నగస్త్యుఁ డిట్లనియెను. అనురక్తయగు సతి పతిపడి యుంటంగని శాంతినుండఁగలదా? పతిని రక్షించుకొనుటకు, సేవలాచరించుటకు దేశకాల పరిస్థితులడ్డురావుకదా. ఓ సుజనశరణ్యా శ్రీనివాసా! ఇదియావేశమున కదనుకాదు లెమ్ము. ఇప్పుడు సంధికార్యము సమాచరణీయము. అడుగో నీశ్యాలకుఁడు బాలకుఁడా ప్రక్కను. ఈప్రక్కనిదే సుజనస్తుత్యుడు నీకనురక్తుఁడు తొండమాన మహీపాలుడు. ఇందెవ్వరు నీకుంగాని వారు? వీఁడుగో తొండమాననృపకుమారుఁడు పసిబాలుఁడు. ఈతఁడా నీకోపమునకుం బాత్రుడు. నిన్నుం గొట్టెనందువా? ఇటజేరినది కొట్లాటలకే కదా! కొట్టుకొనుటలో వింతయేమి? ఇట్టిచో శాంతింబూనుటయ కడుంగడు ప్రశంసాపాత్రము. లెమ్ము. ఉచితమాచరింపుము. బంధులనెల్లఁ దగురీతి నాదరించి, కరుణాదృష్టిం బాలించుము లెమ్ము. దేవా! మీదేవిపై నేలనాగ్రహింతువు? మూర్ఛము పాగిననిముంగని దుఃఖమున మునింగియుఁ బితాపుత్రులవైరము వారినాశము నూహించి కలంగియు నీమెయిట నీకడకు వచ్చినది. ఆమెకోరినది వైరముల మాపికుటుంబమునకు, దేశమునకుఁ గళ్యాణముం గూర్చుటయ. అదియె మాయెల్లరి వాంఛితమును. ఆ యగస్త్యుని వచనములు వినిన శ్రీనివాసుడించుక కోపము మోమునఁగదుర నాపద్మనయనను బద్మావతిం గూర్చి మునితో నిట్లనిరి. మునివరా! ఏమైన నగుగాక యింతుల కిట్టి ఘోర సమరస్థల మధ్యమునకు వచ్చుటయేమియుం దగియుండదు. ఇప్పుడే నేనా తొండమాన నృపు తలను తనువు నుండి వేరుచేయుదును. బలవంతుఁడు నావేశయుతుఁడు నగు నాతని పుత్రుని శ్రీనివాసనామకు నుసురులం గొనియెదను. బుద్ధిమంతుఁడగు వసుదానున కీరాజ్యరమ నొసంగెదను.

అనుచుండ పతిదేవుని వినిన పద్మావతి శ్రీనివాసునకుఁ బ్రాణనాథునకుఁ గరములు మొగిచి నమస్కరించుచు నిట్లు పలికెను. ప్రాణనాయకా పద్మనయనా! దయచూడుము. ఓ కృపానిధానా! ఈ కోపమెవరిపై? ఇందున మీకుంగాని వారెవరు? భక్తజనావనా! భక్తులకభయ మొసంగుము. ఓ జగన్నాయకా! ఈ క్రోధముచేనగునదేమి? ఇట వీరిర్వురును శ్రేష్ఠులగు రాజ్యపాలకులు. ఓ లక్ష్మీమనోహరా! ఈ రాజ్యము, రాజ్యకోశమునన్నియు నీ యిర్వురకును దయఁబూని పంచియిండు. దానిచేనెల్లరకును మేలగును. తండ్రిగారును దనియుదురు. శ్రీనివాసా! యుద్ధోద్యమము నుండి మఱలుము, బందుల మఱల్పుము, అనుచున్న ప్రియురాలింగాంచి యాలిబ్బిపడతియేడుగడ యిట్లనియెను. ఓ సుదతీ! క్షత్రధర్మము నీకేమి తెలియును? నీవిందేమియుఁ గలుగఁజేసికొనకుము. ఇప్పుడ నేను సపుత్రుని తొండమానుని దునుమాడి రాజ్యమను వసుదానునకుం గూర్తును. ఇందు నీసోదరుని కొఱకై మృతినందినను మంచిదే. దానికై నేనేమియు విచారింపను. ఏరికిని విచారింప నక్కరలేదు. అనుచున్న ప్రాణవిభుకట్టెదుట గడగడ వణకుచు నణకువ మిగుల నాతన్వంగి మునివైపునకుం దిరిగి యిట్లనియెను. ఓ దయానిధీ! మునిజనపావనా! మీరేని యీవైపున మనసుంచి దయఁగనుడు. ఈ వేంకటేశునెట్లేని నీసమరావేశము నుండిమఱల్పుడు. అనునామెను నాలించిన మునివరుఁడటు మధురిపువైపునకు మోముద్రిప్పి యిట్లనియెను. ఓపుండరీకాక్షా! మధుసూదనా! శాంతింపుము, శాంతింపుము. బాలకుల శ్రీనివాస, వసుదానుల నడుమఁ జెలిమిని గూర్పుము. తొండమాను నుద్బోధించుము. పొలతులు పోరుమధ్యమునకు రారాదని యీయమ్మను గినియకుము. నాఁడు నీవ సత్యభామా మతల్లిని తొయ్యలిని కయ్యమునకుం గొనిపోలేదా ? నీమాయా వినోదములు చాలింపుము. ఇటు కనికరంపుం జూపులు నెఱపుము. ఎల్లరశాంతి పఱచుము. రాజ్యకోశముల నిర్వురకుం బంచియిమ్ము. నీవుతలఁచినఁ గానిదేమియులేదు.

అనవిని యపుడ వైకుంఠుండు మందమందస్మిత మాననపద్మమున విరియనప్పుడ తండ్రికొడుకులఁ దొండమానవసుదానులం బిలిపించి వచ్చిన రాజవరుందొండమానుం గాంచి దృఢవచనముల నిట్లనియెను.రాజా నీమనోవాంఛిత మేమి? మానక వచింపుమన్న తొండమాన నృపుఁడప్పుడేమియు వెనుకముందాడక యిట్లనియెను. ఓ శ్రీనివాసా! చిదానందా! చిన్మయరూపా! నీవేమాగతి. నామనసెప్పుడు నీయందతగిలియున్నది. నీవెట్లొనర్చిన నదియేమా కానందము, నంగీకారము అనవిని నంతన పుండరీకనయనుఁడు వసుదానువైపునకుం దిరిగి యిట్లనియెను. బావా! ఇదిగోనీయక్క బందుగలగు మీయందు శాంతిసౌహార్దములను, సంధిని గోరుచున్నది. అనుదాని కారాజ పుత్రుడిట్లనియెను. బావా, శ్రీనివాసా, వేంకటగిరివాసా! దండములు నేనెప్పుడును మీయాజ్ఞలనుండువాడనే.

మీయిచ్ఛయెట్లట్లచేయుదును. మీయడుగుజాడ లనుసరింతును అనెను. ఇటుల వారిరువురియనుమతిం దెలిసికొని శ్రీనివాసుడు వారలకు సంధిగావించెను. రాజ్యకోశములు, రథగజాశ్వములు, ఇంకనుగల ధనకనకవస్తు వాహనములు, దుర్గగ్రామనగరములు సర్వము నిర్వురకును సమముగఁ బంచియిచ్చెను. అదియైనంత వారు తండ్రిబిడ్డలన్యోన్యాలింగనముల నాదరసత్కారముల మనములు కడిగికొని నిండుప్రీతి నెదల నింపికొనిరి. పిదప వారాదేవునిగాంచి, శ్రీనివాసా మమ్ముల మారణోద్యమము నుండి తప్పించితివి; ప్రజానాశము కాకుండఁ జేసితివి. ఈ లోకోపకృతికి, మాకుమధ్యవర్తివై, మాయెడదలు కడిగి ప్రీతి మొలకలెత్తించి పెంచినదానికి ఫలితముగ మారాజ్యమునఁ బదునాఱవ భాగముమేమంగీకార పూర్వకముగ మీకిచ్చుచున్నారము. కాదనక గ్రహించి మమ్మనుగ్రహింపుమని యొకయిర్వది సుశ్యామలముల, ఫలవంతముల గ్రామముల నాపద్మావతీ శ్రీనివాసులకర్పించిరి. తొండమానుఁడు తొండరాజ్యమునకు తొండమానపురము రాజధానిగఁ బరిపాలకుఁ డాయెను. అట్లే వసుదానుడు నారాయణపురము రాజధానిగఁ దనరాజ్య భాగమునకుఁ బరిపాలకుఁడాయెను. ఆపై నాదేవుఁడు వారిద్దఱచే నాదరమంది వారివారి యిండ్లఁ బత్నీసహితుఁడై విందులారగించి యామీఁదట వారింబిలిచి విందులు గుడిపించి తదనంతరమునఁ బద్మావతితో బయలుదేరి యగస్త్యముని వరునాశ్రమముం జేరెను. అట సజ్జనారాధితుడు, సజ్జనసద్గతి, సిరివల్లభుడు పద్మావతీయుతుడై వినోదవిహారముల దినములు హాయిగవెళ్లఁబుచ్చుచుండెననుచు నాకథకవరుఁడు మునివరుండిట్లనియెను. ఈ పవిత్రాఖ్యానమును భక్తిశ్రద్ధలతో జదివినఁ జెప్పిన, వినిన వారు శ్రీనివాసునను కంపనెల్ల మంగళములం బొంది సుఖింతురు.

## తొండమాన నృపవరుడు శ్రీనివాసు దర్శించి స్తుతించుట

అంతయువినిన శౌనకాది మునివరులు రోమహర్షణిం గనుంగొని, పూజ్య మునివరా! పిమ్మట నాతొండమానవసుదానులేమైరి? శ్రీనివాసుని వింతచెయిదము లెట్టివి? వీనుల విందుగ వినిపింపవే యన నక్కథకుండిట్లని చెప్పందొడగెను. అయ్యలారా! దేవుని దివ్యగాథామృతమెంత త్రావినను దనివియుండదుకద. ఆదేవుని కథలు చెప్పుటయు నాభాగ్యమ. అదియెంతయు మీయనుగ్రహమే. శ్రద్ధనాలింపుడు.

ఒకనాఁడున్నట్టుండి తొండమాననృపవరుఁడిలు వెడలి దేవుని దర్శింపఁ దన్నిలయమునకు వచ్చి తత్పాదపద్మముల కెఱఁగి మఱిమఱి దండములిడి నిలిచెను. ఎదుటి రాజుంగని మునిజనవందితుఁడు ముకుందుఁడు. "రాజవరా! మీవచ్చిన కార్యమేమి? సెలవిండు" అనిన విని భూపతి యిట్లనియెను. దేవా! మీదర్శనభాగ్యమునకు

మించి నాకన్యమగు కోరికయేమున్నది? వచ్చినమునులు, యోగులు, భూదేవతలు, దేవతలు నెల్లరును మిమ్ము దేవాధిదేవులని, వేదవేద్యులని పురాణపురుషులని వేనోళ్లఁ బ్రశంసించుచుండ విని మీదర్శనముం జేసికొననే ముప్పిరింగొను కోరికినిటకు వచ్చితిని, ధన్యుఁడనయితిని. ఓస్వామీ! అచ్యుత! గోవింద! పురాణపురుషోత్తమ! లీలామానుష విగ్రహా! అప్రాకృత శరీరుఁడవు యీసర్వమును సృష్టించుటకుం, బెంచుటకు, హరించుటకుం గర్తవని జ్ఞానిజనులు వచింతురు. ఈ ప్రకృతికిం బ్రభవకారణలును నుత్పత్తిస్థానమును మీరే. జగత్తునెల్ల జలమగ్న మొనర్చియంద నన్యుండవై వినోదించుచు నలరారుచుందువు. ఈ జీవరాసులెల్లఁ జరాచర ప్రకృతి యెల్ల మీయుదరమున నొకయెడన నిండియుండును. అంతయుమీర మీర పురుషోత్తములు, సుందరరమ్య శరీరులునై, రమాయుతులై యలరారు మనోహరాకారులు. విద్యావినయ విజ్ఞానఖనియగు బ్రాహ్మణజాతి మీమోమునసముద్భవించెను. బాహుబల ప్రబలమగు జనత్రాణ పరాయణ మగు క్షత్రియజాతి మీబాహులం బొడమెను. పాడిపంటలం బెంపొందించి యెల్లరకుం గూర్చి సుఖమునొసంగు మూడవజాతి మీయూరులనుదయించెను. ప్రాణిని బట్టియుంచు పాదములట్టుల జాతికెల్ల నాధారమయి పట్టినిలుపు నాలవజాతి మీపాదములం బ్రభవించెను. ఎల్లప్రాణులు మీశరీరమునందుననె జన్మించెను. వాయువు మీయుచ్ఛ్వాస నిశ్వాస సంజనితము. తేజఃప్రభవమగ్ని. ప్రకృతి ప్రభవకారణులు మీరే. ఈ చరాచర ప్రకృతియంతయు మీయందయుద్భవించి యలరును. ఈ దేవతలకు మునులకు, యోగులకు నెల్లరకు మీరె యేలికలు. వారెల్లరు మీయానపాలింతురు. వేంకటేశ్వరా! పితామహపితా! వందనములు. రమామనోనాయకా! రాజీవలోచనా! వందనమ్ములు. పుణ్యమూర్తీ! పురుషోత్తమా పురాణపురుషా నమోవాకములు! శాంతాకారునకు, సత్యస్వరూపునకు, ప్రేమమూర్తికి మీకు వేవేలు దండములు. శ్రీనివాసా! చిన్మయరూపా యనంతమూర్తీ! యభివందనములు. శేషశైలవాసా! శేషగిరీశా! శ్రీశా చేమోడ్పులు. పరబ్రహ్మకు బరమాత్మకు మీకుఁబ్రణామములు. ఓదేవా! లీలామానుష విగ్రహా! మీరిట మాలోనొకఁడవుగ వినోదించుచున్నారలు నీవనంతుఁడవు నవ్యయుఁడవు. సహస్రనేక శిరములు, నయనములు. ననేకానేక కరచరణములు కలిగి, యనేకానేక దివ్యాయుధములు దాల్చి దివ్యమాల్యాంబరముల ధరించి, దివ్యగంధాను లేపనములనొప్పునో యనంతా! విశ్వతోముఖా వందనములు, వేనవేలు సూర్యులొక్కమారు దివిఁబొడమినఁ గలుగు తేజమును మించుతేజము నీదందురు. నానాజంగమ స్థావరజగత్తంతయు మీరె. సర్వము మీయందయిమిడియున్నది. నీవనేకమయ్యునేకము. ఏకైకునకు నీకు నమస్కృతులు. నీవాది మధ్యాంతరహితుఁడవు, ననంతుఁడవు. బ్రహ్మాదిదేవతల కెల్లకారణ మీవ

వారునీయాదేహమందుననె యిమిడియున్నవారు. నీవయెల్ల భువనంబులను, భవనంబులం గల వారినిలోగందువు. వెలినిడుదువు. అనంతశక్తికి, ననంతరూపునకు నీకివె కైమోడ్పులు. నీవమిక్కిలి తెలియదగినవాఁడవు, నక్షరుఁడవు, ఈవిశ్వమున కెల్లనాధారభూతుఁడవు, శాశ్వతుడవు, ధర్మరక్షకుఁడవు, ధర్మమూర్తివి, సనాతనపురుషుండ, వఖండుండవు. నీకివే దండంబులు. అవ్యయానంతా! సూర్యచంద్రులు నీనేత్రము, లగ్నియేముఖము. నీతేజస్సున నీయనంత విశ్వముసందీప్తమగుచున్నది. రుద్రాదిత్యులు వసువులు, సిద్ధసాధ్యులు. నశ్వినులు, మరుత్తులు పితరులు, గంధర్వులు, యక్షరాక్షసులు, నెల్లమునులు యోగులు జ్ఞానులు నిన్నెయెన్నుచున్నవారు, సన్నుతించుచు నున్నవారు, సర్వవంద్యుడవు,నేరికిన గమ్యుఁడవు, సర్వాంతర్యామివి నీకివే వందనములు.

చరాచరప్రాణులకెల్ల వారివారి కర్మానుయోగ్యముగఁ గష్టసుఖములు, కలిమి లేములు చావుబ్రతుకులు, సంయోగవియోగములు, భోగానుభవములు నొసంగు వాఁడవునీవ. నీయనుమతిన యంతయునడుచుచున్నది. ఓ జగదాధారా! జగన్నాటక సూత్రధారీ! మీకిదేయంజలింతును. ఆదిదేవా! నీవసత్తు, వసత్తువు, ఆరెండిటికి నతీతుఁడవగు నక్షరుఁడవు; ఈ జగత్తునకంతకునేకాధారుఁడవు. జ్ఞాతవును జ్ఞేయమునునీవ. కర్తవును కారణకార్యములును నీవ. నీవు విశ్వస్వరూపుడవు. నీవ శ్రేష్ఠతమమగు స్థానము. ఈ వాయువు, నగ్నియు, యముఁడు, వరుణుఁడు సూర్యచంద్రులు, ప్రజాపతియుఁ బ్రపితామహుఁడును నీవ. నీవుకానిదేమున్నది? నీకివే, వేవేలు, నమస్కారములు. నీవసర్వసంపూర్ణుఁడవు, నమేయుఁడవు, సర్వాంతర్యామివి. ఎవ్వరెట నేరికేరీతి నమస్కరించినను నన్నియు నీకెచెందును. కైకొనుమివే నాయిడు కైమోడ్పులు. స్తుత్యుఁడవు, సమర్థుఁడవునగ నీవునాయెడఁ బ్రసన్నుఁడవుకమ్ము. నీవకాకనాకు మఱెవ్వరు. అనుగ్రహింపుము. అనుచుఁదన్నుఁదామఱచి ప్రస్తుతించుచు నెదుటనున్న యారూపమె యెదందంజేరి విండఁదన్మయత నట్టే నిలిచియుండెను. అదియంతయు వినిన, హృదయజ్ఞుఁడు, భక్తజనానురక్తుఁడు, వాసుదేవుఁడెంతయుఁ బ్రసన్నుఁడై రాజవరునితో నిట్లనియెను. రాజా! నీచేఁజేయఁబడిన యీస్తోత్రంబెంతయుఁ బావనము, నుత్తమోత్తమము. భక్తియుక్తులై, పావనమతి నీస్తవరాజముచే నన్నుస్తుతించుచు నలరించువారు నాసాలోక్యముం బొందుదురు; తరింతురు. ఇందేమియు సందియము లేదు. ఇదియాలింపుము. నేను కేవలతపదానములచేతను, జ్ఞానవాక్కులచేతను బ్రసన్నుండనుగాను. నేను బుద్ధిగమ్యుఁడఁగాను, హృదయగమ్యుఁడను. కేవలవాక్కులచే నగునదేమియులేదు. పవిత్రమగు డెందముతో నదియెల్లపవిత్రాచరణమున నుంపవలెను. నేను జూచునది పవిత్రహృదయము, పవిత్రాచరణము. నన్నెడందనుంచినవారు

నాయెడందనుందురు; ఎల్లకర్మలు పరమాత్మవే యని పరమేశ్వర సంబంధములే యని, మత్పరాయణులై మదర్థమే, సంగరహితులై యహంకారమమకారములంటని వారై యెల్లభూతముల, నెటనువైరములేనివారై యొప్పువారు నన్నుంబొందుదురు. ఎల్లప్రాణుల నెల్లమానవుల నన్నుంగాంచుచు నేరికినవమానము, బాధ కలిగింపక ప్రేమానురాగముల సర్వసమభావముం బొంది యొప్పువారె నన్నుం బొందుదురు. అనుచు మఱియు నిట్లనియెను.

## దేవాయతన నిర్మాణయత్నము

ఓ రాజా! ధర్మాత్ముడాకాశరాజు ధన్యజీవి. ఆతడు నాప్రాణస్వరూపుడు. మోక్ష సంప్రాప్తినొందెను. ఆ మహాత్ముని వలననే నాకీలోకమున నెంతయుఁ బ్రసిద్ధికలిగినది. పేరును బ్రతిష్టయునందితిని. ఆబంధువులేమి, నాకిప్పుడెంతయుఁ దీరనికొఱఁతయై వెతకూర్చుచున్నది. ఆపుణ్యుఁడు నన్నొకయింటి వానినొనర్చెను. దానిచే నేనొందిన యానంద మింతంతనరానిది. నాయదృష్టమే యదృష్టమని యెంతయు మురిసితిని. అతఁడు నాపాలిటి దైవమేయని తనిసితిని. ఆతండు లేని యిట నాకుంగతియేమని వగనొందుచున్నాఁడను. అనుదేవుని విని తొండమానుఁడును గనులనీరుగ్రుక్కుచుఁ గొంతవడికి ధృతిఁబూని యిట్లనియెను. దేవా! ప్రాకృతజనునట్టులేలఁ బోయినవానికై వగగుందెదవు? పుట్టువుంగన్న వారెల్లరు నెన్నటికేని మృతినొందువారే. అట్టిమృతికి వెతనందనేల, వెఱపందనేల? ఎల్లజీవులకుం గతియావ. ప్రారబ్ధకర్మానుభోగులు ప్రాణులు. ఉత్తమోత్తమగతి నొందిన యాయుత్తమజనునకై యుత్తలపాటేల? ఇటనున్న నన్ను, వసుదాను, నింకనుగలవారిఁ గమలనయనా! కరుణంగనుంగొనుము. అనుసాంత్వన వచనములు విని సుజనపాలకుఁడు పుండరీకనయనుఁడు శ్రీనివాసు డిట్లనియెను.

నృపవరా! నిజమే నీసోదరుఁడు ననునొక కుటుంబికు నొనర్చెను. వియన్నృపాలు నల్లుండనై యిల్లు వాకిలిలేక పరులపంచలఁ దలదాచుకొనుచున్నాఁడను, ఓరాజకులోద్భవా! రాజవరా! మీరలిప్పుడె నాకైయొక గృహమును నిర్మింపంజేయుఁడు. దీనికి మీరు కాకొరులు సమర్థులేరును లేరు. అనుచున్న వెన్నుని పలుకులు వినిరాజును వల్లె యని యాశుభకార్యమునకుం గడంగెను. అప్పుడె శుభముహూర్తమని తారాబలచంద్ర బలములను, సుగ్రహస్థితి నెంచి రాజును వెంటంగొని గరుఁడు నధిరోహించి శ్రీహరి వరాహదేవు పాలికిం బోయి శేషశైలమున స్వామిపుష్కరిణీ తీర్థదక్షిణతటమునఁ దన కనుకూలమగు తావుం జూపియటఁదనకై మందిర నిర్మాణమునకు ననుమతింగొనెను. ఆదేవుఁడు రాజుంగాంచి యిట్లనెను.

ఓరాజా! ఇచటన మదర్థమై దివ్యమందిరమును బూర్వాభిముఖముగ సుందర గోపురద్వయముతో, సింహద్వార రంజితమ్ముగఁ బ్రాకార త్రయమున నిర్మింపుము. సప్తద్వారములందందు నందగింపఁ జేయునది. సర్వసల్లక్షణలక్షితంబగు ధ్వజస్తంభము, నందమై విశాలమగు నాస్థానమండపము, నబ్బురంబగు యాగమండపమున మరఁ జేయుఁడు. ధాన్యాగారములు, ధనాగారములు, మాలాగృహవస్త్రాగారములు, పాకశాల, భోజనశాలలు, వానివానికిం దగుతావులఁదనర నిర్మితములు కావలెను. ప్రత్యేకముగ గోగజాశ్వశాలలు, వాహన, యానశాలలు, సునిర్మితములుగ నుండవలయును. అదిగోయాకనంబడు భూతీర్థము పవిత్రము శ్రీతీర్థమె. ఒకప్పుడది నీచేతన వినిర్మితము. దానిని బాగుగ శిలావినిర్మితము సుబద్ధము శోభాయుతము నొనర్పుము. అనుచో వింతపడుచు రాజిట్లనెను. ఏమిదేవా! నీపల్కు వింతగనున్నది. అదినాచే నిర్మింపఁబడెనా? ఏ జన్మమున? అప్పుడు నేనెవ్వడను? ఆకూపము నాచేనెట్లు నిర్మింపంబడెను? ఇదియంతయు నాకెంతయు వెఱఁగుగొల్పుచున్నది. వివరముగఁ దెలియఁజెప్పంగోరెదను. అనుచున్నరాజున కాశ్రీహరి శ్రీనివాసుఁడు జగన్నివాసుడిట్లని చెప్పందొడంగెను.

## తొండమాన నరపాలు పూర్వజన్మ కథ

శ్రీ వేంకటనగాధీశుఁడు తొండమాననరవరున కాతని పూర్వజన్మచరిత మిట్లని చెప్పందొడంగెను. ఓరాజా! తొల్లినెంతయుఁ బవిత్రభావుఁడు వైఖానసుఁడు గోపీనాథుఁడను ఋషివరుఁడుండెను. ఆతండతి ప్రాచీనంబగు శ్రీకృష్ణావతారగాథనంతయు నాకర్ణించి, ఈమానవుల శరీరములు, కర్మలు, జీవితములు స్థిరములు కావుగదా ! అనిచింతించి, దక్షిణమునఁ చోళదేశమున నొకచోఁబవిత్రకుశాస్తరణంబున నుపవిష్టుండై, జితేంద్రియుఁడై నిరాహారుఁడై, నేనాకృష్ణదేవుం దర్శింతునను దృఢసంకల్పమునఁ గఠినమగు తపస్సు నొనరింపం దొడంగెను. దానికిం బ్రసన్నుండై భక్తవత్సలుఁడు భగవానుఁడు గోపాలక రూపమ్మున నెదుటందోచెను. మునియువానిం బ్రత్యక్షుండగు శ్రీహరియె యని యెంచి యిట్లని స్తుతియింపం దొడంగెను.

దేవదేవ పురుషోత్తమ! దీనావన దివ్యమూర్తి కరుణాకర కామితార్థదాయక శ్రీగోపబాల! మదినెంతును బూజింతును నిన్నెకాక యొరులనెఱుఁగ గనికరమునఁ గాపాడుము. మాధవామురారి కృష్ణ అనుచుఁ దన్మయత నున్న యాతనింగని యాగోపాల బాలుఁడిట్లనియెను. ఓ మునివరా! నీతలంపులకు ధ్యానమునకుం దగినవాఁడు. శ్రీనివాసుఁడు. శేషశైలమునకుం బొమ్ము. అట నాదేవుఁడొక వల్మీకమున నున్నవాఁడు. అటఁ జేరియాదేవు దివ్యప్రతిమ నొకటింజేసికొని ప్రతిష్ఠించికొని భక్తిశ్రద్ధలు విడక నిరతము

మానకపూజింపుము. అచట నీకు శ్రీరంగదాసను భక్తవరుఁడు శూద్రకులోత్తముఁడు కలియును. ఆతఁడు నీపూజాదులకెంతయుఁ దోడుపడును. అనియెను. అదివిన్న యాతఁడా గోపాలార్చకునకు మ్రొక్కి యటనుండి కదలిపోయెను. ఆమునివరుఁడటు నడచివచ్చి యా శ్రీ వేంకటాచలముంజేరి, పైకింబోయి స్వామిపుష్కరిణిందరిసి ఆయెడ వల్మీకమున వెలసియున్న దేవుం దర్శించికైమోడ్చి పూజించెను. ఆయెడనె తానొక దేవునిదివ్యమంగళ విగ్రహము నొకటినెలకొల్పుకొని ప్రతిదినము నర్చింపసాగెను. అంతనొక దినమున నటనె రంగదాసును వచ్చి యాతనికలసెను. అది భక్తులకలయిక. రంగదాసుతా దినదినము దివ్యకుసుమములం గొనితేరఁ గొని వానిచే నావైఖానసుఁడు దేవునిబూజలఁదనియించుచుండెను.

## రంగదాసు చరితము

ఆ రంగదాసు చరితము నాలింపుము. అది పాండ్యదేశము. అందొక గ్రామమున శూద్రదంపతులకుం బవిత్రులకుం గలిగిన బిడ్డడు రంగదాసు. ఆతఁడు చిఱుతప్రాయము నుండియు ధర్మానురక్తియు దైవభక్తియుఁ గలిగియుండి యిలువెడలియెందేని దేవాలయము కలదని దేవుఁడున్నాఁడని యెవ్వరేని యననంతనె యటకుంబోయి దేవుంగాంచఁ గోరుచుండెను. కోరిపోయి దర్శించుచుండెను. అట్లాతఁడు తిరిగుచుఁ దిరుగుచు నారాయణపురమును జేరెను. అట వరాహదేవుని దర్శించి యారాధించి నమస్కరించెను. శ్రీవేంకటాద్రిని శ్రీనివాసదేవుఁడు కలఁడనియు బ్రహ్మేంద్రాదులచేత నిరతంబును బూజలనందుచుండుననియు నటనాతఁడు వినెను. వినుటయేమి యప్పుడయాదేవు దర్శించిసేవించి, తరింతునని బయలువెడలెను. అటనుండి యాతఁడు సువర్ణముఖరీనదికిం జేరి యందు మునుకలిడి, యాయెడనెకల పున్నెముల నొసఁగు, కమలాతటాకంబను కోనేట, తానంబు లొనరించి దానియొడ్డునం గల బలరామసహితు శ్రీకృష్ణదేవు మనసారఁగని, దండప్రణామంబులాచరించెను. మాటిమాటికాదేవునకుం బడిపడి మ్రొక్కులిడుచు బయలువెడలి వేదండ తండంబులు దండిగఁగల యడవింబడి పోయిపోయి శేషశైలమును నటనొకసెలయేరును, గపిలతీర్థంబును గాంచెను. ఆయెడన కపిలేశ్వరునీశ్వరుఁగాంచెను. కపిలతీర్థంబున స్నానంబాచరించి కపిలారాధిత లింగదేవునకు మ్రొక్కులిడెను. అగాధంబును, బాపవినాశంబునునగు చక్రతీర్థంబున స్నానంబొనరించిన పిదప నతఁడు మెలమెల్లన వేంకటాద్రి నధిరోహింపసాగెను. దేవుంగాంచి పూజలు సలుపఁబోవు వానికిఁ గొందఱువైఖానసులు తోడయిరి. వారింగూడి యారంగదాసు ముందునకుసాగెను. స్వామిపుష్కరిణిని గాంచి శ్రద్ధాభక్తులతో నందునస్నానము

లొనరించెను. ఆ పుష్కరిణితటమున నొకవృక్షమూలమున వైఖానసుఁడగు గోపీనాథ మునిచేఁ బూజింపబడుచు, బంగరుమేనిచాయల శ్రీదేవితో, చిత్రవిచిత్రములగు రంగులతో నొప్పు భూదేవితోఁ గూడియున్న నీలసుందరదేహు శ్రీహరింగన్నారంగాంచెను. కెలకుల శంఖచక్రములును, కౌమోదకీగదయును, నందక ఖడ్గంబును, శార్ఙ్గకోదండమును నొప్పియుండెను. దేవునకుఁ దలకుఁబైనవితానమట్లు వినతాసుతుఁడు ఱెక్కలు విప్పిపట్టియుండెను. అట్లటదేవుని దరిసెనముం గావించిన రంగదాసు మనంబెంతగ నుబ్బిపోయెనో? ఆతనియబ్బురము నానందము నింతంతగాదు. మనమున నెన్నెన్నియో కోర్కులు కొనలెత్తెను. అప్పుడె యాతఁడట దేవునకు సుందరోద్యానమును నిర్మింపదృఢమతి సంకల్పించెను. దేవాయతనమునకును స్వామిపుష్కరిణికిని నడుమఁగల ప్రదేశమున మనోహరముగఁ బూలమొక్కలఁ బండ్లచెట్టుల నాటిపెంచి మనోహరోద్యానముం జేసెను. ఆదేవుంగాంచిన యాచెట్టు మొదటన యాతఁడు తనయునికిం జేసికొని యాయెడంగల పొదలఁ దొలగించి దేవుని యునికిని నందమగు నెలవుంగీలు కొలిపెను. ఆవిశాల భూమికిఁ జుట్టును ఱాలతోనందముగఁ బ్రాకారమును వినిర్మించెను. లోన మల్లిమొల్ల మరువకములు, జాజిసన్నజాజి విరజాజులు, కరవీర, కురవక, కుంద, మందారములు, చామంతులు, మాలతీ మాధవీపొరు జాతములాదిగ నెన్నెన్నొ విధములగు పూలమొక్కల వేర్వేరగు మడులందుఁ దీర్చిపాతిప్రోదిచేసి పెంపసాగెను. ఆ యుద్యానమునకు నడుమ నందమగు కోనేటినొకదానిం ద్రవ్వి తనరఁజేసెను. ఆకొలఁకునఁ దామరలు కలువలు వేసిపెంచెను; తులసివనంబులు తోరంబుగ నలవరించెను. దినదినమాతఁడా యుద్యానమునఁ బూలనేటి కోసి మాలలుకట్టి యర్పించుచుండ వైఖానసుఁడర్చకుఁడా గోపీనాథముని యాదండలు భక్తింగొని దేవుమెడ నలంకరించును, శిరములనుంచును. బాదములఁ బూజించును. వారిర్వురును బూవుల, బూలమాలల నాదేవునర్చించి పూజించుచుండిరి. వారిభక్తిని బూజనుగాంచ దేవతలును గుములుగట్టి వచ్చిచూచి వెఱగందుచుందురు. వారును వారింగాంచి ప్రమోదాశ్చర్యములందుచు నారాధించుచుందురు. ఈ రీతిగ దేవదేవులకుం గైంకర్యములు చేయుచుఁదనియుచు నేవారికి వత్సరములు దినములుగ, దినములు ఘడియలుగ నానందమునఁ గడచి పోసాగెను.

ఒకనాటి వేకువన కుండలుఁడను నొక గంధర్వ యువకుఁడు తనకామినీ మణులతో విమానమున నాకాశతలమునఁ బోవుచు నేకాంతమున మనుజులు లేని యాయెడ నాయుద్యానమును నందలి తామరకొలకునుగని వానియందమునకు నెంతయు మురిసి విమానమునట నాకసంబుననె యుంచి పడతులతోఁ దాను క్రిందికిం దిగివచ్చి యావనంతమున నాస్వామిపుష్కరిణిని మునుకలిడి, దేవునర్చించి యాబిబ్బోక

వతులతో నాపరిసరముల వినోదవిహారము లొనరించి యొనరించి యాపూఁదోట నాకొలఁకున జలక్రీడల నలవరించుచు ముదమునఁ దేలుచుండెను. అంతలో నారంగదాసు విటిసి, తావులుచిమ్ము, కుసుమమ్ములు కోసికోసి కోనేటిదటికి వచ్చెను. వచ్చినయాతఁడు క్రీడలందేలుచున్న యాతరుణుని, తరుణులను గాంచి మనసేమియోకాగాఁ దన్మయత నట్టే మైమఱచి తనవచ్చిన కార్యమును మఱచియాదరినొక పొదరింట గూరుచుండి వారివినోదములు విలాసములు చూచుచు నొడలు మఱచియుండెను. విధి బలీయమైనది కదా. ఇంతఁదనుక దేవునారాధనమెకాక మఱివేరెఱుంగని సంయమ, నియమముల జీవితము వెళ్లఁబుచ్చినవానికీ చంచలతయేమి గంధర్వుఁడు క్రీడలందేలి యువతులంగొని, కొలనివెడలి వచ్చి వియత్పద మునకుంబోయి విమానమునం దనదారింబడి వెడలెను. దివ్యవస్త్రములం దాల్చి గంధర్వుఁడటు వెడలిపోయిన పిమ్మట విమోహితుఁడగు రంగదాసు తేరికొని పూర్వస్థితికి వచ్చెను. తనయామనశ్చంచలత కెంతయులజ్జించి, పరితపించి, యపవిత్రుఁడనైతినని యనుతప్తుఁడై తనతెచ్చినపూల మాలలనటనెవిడిచి పవిత్ర పుష్కరిణిని మునిఁగి కలుషముడిగి లేచి మఱలఁ దొందరతొందరగ పూవులంగోసి తెచ్చి దండలు గ్రుచ్చి వానింగొని దేవాలయమునకుంజని సిబ్బితి తోడన దేవునిపూజల కీయఁ బరుగుపరుగున నర్చకునికడకు వచ్చెను. దానింగాంచిన వైఖానసవానప్రస్తుఁడు కాల మతిక్రమించి వచ్చిన యాతనితో నిదియేమి మిత్రమా! యింత యాలసించితివి? నీకేమాయెను? ఎన్నడునులేదే, నేడింతయేలతడసితివి? మాలలును నింతయస్తవ్యస్తములై యున్నవేమి? ఇంతవఱకు నాపూలతోట నేమిచేయుచుంటివి? అనియడిగెను. ఇట్లని యడుగుచున్న యావానప్రస్థుంగాంచి రంగదాసు కడుంగడు లజ్జితుఁడై తలవంచి యేమియుం బలుకకయ నిలిచి యుండెను. అత్తరి నాపూజలనందు దేవుని వెనుకనుండి యశరీర వాక్యమొండు విననాయెను.

నాయనా! రంగదాసా! సిగ్గిలకుము. అంతయు దైవయత్నము. సురాసురులతో మునులతో మనుజవరులతో నీజగత్తంతయు మాయామోహితము. విన్ననవలసిన దేమున్నది? మోహితుఁడవైతివి; భ్రమనుబడితివి. ఇంతవయసువాఁడవయ్యు నీవుకామమును జయింపజాలకపోతివి. కామము నణపక కార్యములేదు. కామ వ్యాకులునకు స్వాస్థ్యముచేకూరదు. అస్వస్థచిత్తునకు నెన్నటికిని సిద్ధియొనగూడదు. ఇదినిక్కము. అయినను వెఱువకుము. నీకుమేలగును. నీమనసెంతయు పశ్చాత్తాపాను తప్తమైనది. అదియె భవ్యము. రాగలకాలమున నీవాగంధర్వరాజుంబలెనే భూమిని రాజువుకాఁగలవు. మహారాజవై యుత్తమపాలకుఁడవై రాజభోగములనుభవించి తనిసికర్మయోగివై యవ్యయానందమును బొందఁగలవు. నీజేసిన సత్కర్మకు, బొందిన

పశ్చాత్తాపమునకు నిదియఫలము. అప్పుడె నీయందునఁ బ్రసన్నుఁడనైన నేను నీకు మోక్షమును బరమపదమును బ్రసాదింపఁగలను. ఓబుద్ధిమంతుఁడా! నీవు మరణపర్యంతమిచటనె యుండి నాసేవలంజేయుచుఁ దనియుము. సకాములైనను నాయందు పవిత్రమగు భక్తిగల వారికిట్టి తెఱంగుననే ముక్తిసంప్రాప్తికాఁగలదు అని పలికెను. పిమ్మట మఱియేమియు వినరాలేదు. అదివిన్న రంగదాసును ఎప్పటియట్ల యారామముం బెంచుచుఁ బూల మాలలతో దేవునర్చించుచు నపాదశత (125) వత్సరములు పూర్తికాగానిరంతర ధ్యానంబున దేవుని దివ్యరూపము నెడందనిలిపి యట నేచింతలఁ జేరనీక తనువును జాలించెను. స్వర్గధామముం జేరెను. ఆనాటి రంగదాసుఁడె యీనాటి యీతొండమానుఁడు గనై పుట్టువందెను. ఇదియనీతొలిపుట్టువు నందలిగాథ.

ఆనాటి పూలవనముందడుప నీవుత్రవ్వి యొనర్చినదియ యీకొలకు. దీని నుద్ధరించి యలంకరింపుము. ఇటనాకై దివ్యమగు నాలయంబును, జుట్టుప్రకారంబును, గట్టింపుము. గుళ్లను గోపురములను మండపములను, బ్రాకారముల నరదంబుల బాగుగ నిర్మింపుము.

మున్నుగాని యిప్పుడు గాని మఱెప్పుడుగాని నాటికొనిన బీజములు మంచివో చెడ్డవో మొలకెత్తి ఫలించును. కావుననే సద్బీజముల నాటికొని సత్ఫలముల నందందగును. ముషిణివిత్తు మొలకెత్తి మామిడిపండు పండఁబోదుకదా. గోవిందు వచనములు వినిన తొండమానుఁడు తనపూర్వ నిర్మితకొలకును బునరుద్ధరించి సుశోభితమొనర్చెను. నవరత్నఘటిత మహోన్నత దివ్యవిమానము సువర్ణాలంకృతము చిత్రాతి చిత్రము నిర్మింపఁజేసెను. నలుదెసల నాలుగు సుందర శ్రేష్ఠమూర్తుల నెలకొల్పి సువర్ణకలశా శోభితముగ, వైనతేయోద్భాసితముగ నొనర్చెను. మున్ముందువచ్చిపోవు భక్తయాత్రిక జనము రాకపోకల కనుకూలముగ సువిశాలములుగ మార్గములను, నందమగు సోపానముల తో సునిర్మితములొనర్చెను. నడుమనడుమ విశ్రాంతి మందిరములు, పలు బావులు, వినిర్మితములాయెను. అంతయునైన పిమ్మట నారాజవరుఁడు దేవవరునికడకుం బోయి, దేవ! మీసిద్దేశమెట్లట్ల సర్వమును సుసంపన్నమాయెను. ఓజగన్నాధా! జనార్దనా! దయజేసిరందు సర్వముం దర్శించి గృహప్రవేశ మొనరించునదిగా మిమ్ముల నర్థించు చున్నాఁడను. అనియెను. రాజపిలుపున కెంతయు ముదమందిన మదనగురుఁ డిట్లనియెను. నృపవరా! మీభక్తికెంతయుఁ బ్రమోదమాయెను. నేనుతప్పక మీవెనుక వత్తును. నడువుడు. అనివెంట నింద్రాదిదేవతలు బలిసికొలువ, ఋషిశ్రేష్ఠులు, వైఖానసులు, బ్రహ్మజ్ఞులగు బ్రాహ్మణవరులు ఋగ్యజుస్సామ వేదమంత్రమ్ముల విధియుతమ్ముగ గానమొనర్చుచుండనెల్ల దిక్కుల మంగళవాద్యములు ధ్వనించుచుండ,

హరుడును, హిరణ్యగర్భుఁడును గెలగుల నడువవచ్చిన పద్మావతీ సహితునా శ్రీనివాసదేవు నానూతనమందిరమ్మున వైభవమ్మునఁ బ్రవేశపెట్టి యారాజుసంతసము నొందెను. జయజయధ్వానములతో నలుకెలకుల నుండియు వ్యోమపథమున నుండియు దివ్యప్రసూనము లాపుణ్యదంపతులపైఁ గురిసెను. అప్పుడాదేవు నెల్లరుందాముగాఁ బూజించి హర్షోత్ఫుల్లగాత్రులైరి. రాజనిర్మితమగు నాదివ్యాలయమున మహోన్నత దివ్యవిమానమునకెదుట నాభగవంతుఁడు శ్రీహరినిలిచి యెల్లరకును గనువిందును నాత్మామోదమును గలిగించెను. ఎల్లరికానందము నొసంగునదగుటనదియానంద నిలయమునఁ బ్రసిద్ధమాయెను. అటనాదేవుఁడు చెంతను గమలాననమునఁ గమలాలయనునుంచి, పద్మావతి నెదకు హత్తికొని, శంఖచక్రముల నొకవంకననుంచి నడుమునఁ జేర్చిన కుడిచేతితో దేవముని జనారాధితము, నెల్లజనులకు నుత్తమోత్తమ గతియునగు తనపదపద్మములం జూపుచు మచ్చరణసేవకుల కీభవసాగరము మొలబంటియ యని సూచించుచు తనవేరొక చేతనభయముద్ర నెల్లవారింగనికరించుచుఁ దోచెను. ఆమూర్తినెద నిలిపికొనికాంచుచు నిశ్చలమనమున నుతించు వారికి నిటనటనెల్ల సుఖములు, నానందములు, కరతలామలకములు! మీఁద సాయుజ్యము సుఖప్రాప్యము, ఆవేంకట నగాధినాధు మాహాత్మ్యమిట్టి దట్టిదని వర్ణింప నింతయంతయని కొలవెట్ట నెవ్వరికగును? అద్దిపవిత్రాతి పవిత్రంబు, పరమపుణ్యప్రదంబు, మంగళంబుల కెల్లను మంగళంబు.

## తొండమాను తొలిజీవితచరిత్ర

ఇంతకుమున్ను మీకుంజెప్పంబడెఁగదా. సువీరరాజవరుని కుమారరత్నము మిత్రవర్ముండు. ఆతనిజ్యేష్ఠ కుమారుఁడాకాశరాజు కాగా నాతనియనుజుఁడై పుట్టువందెను తొండమానుఁడు. ఆతొండమానుడె తొలిబాముచ రంగదాసని యెఱుంగునది. పూర్వజన్మ సుకృతమున నాతఁడు చిఱుతప్రాయమునుండియు విష్ణుదేవునందు హత్తినచిత్తమున, బత్తిని ప్రవర్తిల్లుచుండెను. వయసుతో వానిభక్తియుఁ బెరుగుచుండెను. ఆతఁడు సద్గుణ సంపన్నుఁడై ధైర్యసాహసములతో సాటిలేని సూరుఁడు వీరుఁడునై సుశీలుఁడై యొప్పుచుండెను. భక్తిని, ధర్మానురక్తిని, భోగవిరక్తిని, యోగులకును నాతఁడు వింతగొలుపుచుండువాడు.

పాండ్యదేశపురాకుమారి శీలవతిపద్మయను నామెతో నాతనికిం బెండిలియాయెను. పిదప నెందఱెందఱినో దేశదేశాల రాకుమారితల, స్వయంవరమును వివరింపఁబడి వివాహమాడి దేవేంద్రునకు మించిన వైభవమున భోగమునమభవించుచు సౌఖ్యానందముల

నోలలాడుచు నన్న కన్నివిధములఁ దలలోనినాలుకయై తండ్రికి నండదండయై తోడివారికిం దోడునీడగ మేటియై యొప్పెను. ఒకనాఁడా తొండమానుఁడు తండ్రిగారి యనుమతింగొని వేటకు బయలువెడలి వేంకటాద్రి పరిసరారణ్యముల నా సింహపరాక్రముఁడు సపరివారుఁడై చరించుచు నడకొండయాయననుత్కట మదధారలఁ గార్చుచు నడయాడునొక గజరాజముంగని విస్మయోత్ఫుల్లనేత్రుఁడై దానింబట్ట నుత్కంటవెన్నాడిపోయెను. అట్లరిగి యాతఁడు సువర్ణముఖరీ నదిని దాటిపోయి యద్దరిననున్న బ్రహ్మర్షివర్యు శుకమునిం గనుంగొని, సాష్టాంగ నమస్కారములొనరించి, వారియనుమతిని ముందునకు సాగిపోయెను. అట్లు వెడలిన యాతఁడొకవనముననుండి యొక వనమునకుం దిరుగుచు నొకయెడ దివ్యమగు వనమధ్యమున వల్మీకాకార స్థానంబున నున్నదానిఁబెక్కురు భక్తజనులచే సేవితయగుచున్న దాని భక్తుల కోర్కులెల్లం గడముట్ట నొసంగు దాని దేవవరులచేతను బూజితయగు దాని రేణుకా దేవింగాంచి వినమ్రుఁడై వినతులొనరించి యటనుండి పశ్చిమముఖుఁడై వెడలెను.

అట్లవెడలిన యాతఁడొక యెడఁబంచరంగులశుకము నొండొకదానిం గాంచెను. దానింబట్టికొనఁ గుతూహలియై తహతహయినుమడింప నాతండాచిలుక వెంటంబడెను. అదియు మాటిమాటికి శ్రీనివాస శ్రీనివాస యనుచునే యాకొమ్మనుండి యాకొమ్మకు నాచెట్టునుండి యాచెట్టునకు నెగురుచుఁబోయి పోయికొండమీది కెగిరి యాతనికిం గానరాకపోయెను. అదియెందుఁబోయెనో గదాయని యందందు దానికై నెమకుచు నాతఁడును నావేంకటగిరివరముపైకి నెక్కియటనట నీచెట్టునాచెట్టు నన్వేషించుచుఁ బడుకులనెక్కుచు వానిసందులం గనుచుఁబోయి పోయి యొకచో శ్యామాకవనముం జేరెను. తత్పాలకుఁడును వచ్చినరాకుమారుం గాంచి వెంటనేలేచి నమస్కరించి నిలిచెను. వానింగని రాకుమారుఁడు తొండమానుఁడభినందించి యిట్లనెను. ఓమయా! మీరేమేని యిటకు వచ్చిన యైదురంగుల చిలుకంగాంచితిరా? ఓ గిరిజనవరా! అదిమాటిమాటికి శ్రీనివాస శ్రీనివాస యనుచుఁదరువు తరువున కెగురుచునట్టే మాయమాయెను. అనెను. అదివిన్న వసువునాఁబడు నాయాటవికుడు రాజవరుంగాంచి, ప్రభూ! చిత్తగింపుఁడు. అది శ్రీనివాసదేవునిచేతను శ్రీభూదేవులచేతను గారాబమునఁ బెంచఁబడుచున్న కీరరాజము. మాతలిర్వురుం దానిఁ దమ చేఁదమ్ముల నిడికొని మేతలిడి పలుకులు పలికించి లాలింతురు. పవలెల్లనది యీకొండ నడవుల స్వేచ్ఛగ విహరించుచు సాయంవేళల స్వామి పుష్కరిణీ తటమ్మునకు దేవీదేవుల కడకుంజేరును. దానింబట్టి కొననేరికినింగాదు. అని మఱియు నిట్టులనియె. నేనిప్పుడపోయి యాదేవునకు, దేవేరులకుం దేనెయన్నము నారగింపం జేసివత్తును. అంతదనుక మీరిటనాపుత్రునితో నుండి వినోదించుచుండుడు.

అనుచున్న వాని విన్నరాకుమారుఁడు అయ్యానేనును మీవెంటనే వత్తును. ఈగిరివరవాసు శ్రీనివాసు దేవదేవు జనార్థను దర్శనము నాకుంజేయింపందగు. అనినంత నావనచరుఁడు చామయన్నమును, మామిడాకుల విస్తరింబెట్టి చుట్టి పట్టికొని రాజును వెంటంగొని శ్రీహరి వేంకటేశుకడకుం బయలుదేరెను.

నడచినడచి యిరుకెలకులఁ గొండపడుకులం గనుంగొనుచు గొంతతడవునకు వారునందచందముల శోభిల్లు స్వామిపుష్కరిణినిజేరిరి. అటఁ బుష్కరిణియందు నిషాదుఁడును రాజును విధి విధానమున స్నానములొనరించి దేవుదర్శింపంబోయిరి. పుష్కరిణీ తటమ్మున నొకసుందరంబగు బిల్వవృక్షతలమున వారికిం దేవుండు గననయ్యెను. విరిసిన తమ్మిపూరేకులట్ల యందములై, యతసీపుష్పములట్ల విశాలములైన నేత్రయుగమును సుదీర్ఘములగు నాల్గుజేతులును, భుజమున శార్ఙమును, చేతుల శంఖచక్రగదాఖడ్గములును, నీలాభసుందర దేహమును గల్గియొప్పువానిని, తలను మణిరంజిత సువర్ణకిరీటమును నడుమునఁ బట్టుపీతాంబరమ్మును నొప్పువానిని, మోమున, జిఱునవ్వు వెన్నెలలు గురియించుచున్న వానిం, గెలకుల జాలిచూపుల బత్తులనలరించుచు సుందరశోభన రూపములనొప్పులోకమాతలచే సేవింపఁబడువాని, గంఠమున వనమాలయు నురమున శ్రీవత్సలాంఛనమును, నొప్పువానిని, నీశ్వర కుమారుఁడు స్కందుచే ముప్పేళలఁ బూజింపఁబడువాని బాదములు వల్మీకమున దాగికానరాకయున్న వాని నాజానుబాహు జగన్మోహనాకారు జగద్రక్షకు జగన్నాథుం బురుషోత్తముం జూచిరి. రాజును దేవువింగాంచి యానందమున మైమఱపుకాగా నఙ్జనట్లచేతులు మొగిచి నిలిచి నమస్కరించుచు నుండిపోయెను. నిషాదుఁడును దేవునకుం బడిపడి దండములిడి తాను గొనివచ్చిన మధుమిశ్రిత శ్యామాకాన్నమును నివేదించి తదర్ధమును రాజునకిడి శేషాన్నమును దానుభుజించెను. పుష్కరిణీ జలములు దృప్తిగఁ ద్రావి వారు తిరిగితిరిగి దేవుంగాంచుచు, దండంబులిడుచు మఱలివచ్చి శ్యామాకవనముం జేరిరి. అట నిషాదుని పవిత్రపర్ణకుటిని రాజారాత్రియెంతయు సుఖనిద్రం గడిపెను. వేకువనలేచిరాజు, నిషాదుఁడు ప్రేమను వీడ్కోలీయ నటనుండి వెడలి సమీపమునం గల తనపరివారముం గలిసి ముదమున వారితో దనపురమునకుం బయనమాయెను. పయనించిపోయిన యారాకుమారుఁడు పరివారముతోఁ బోయి మఱల దేవీవనమును జేరెను. ఆనాఁడు చైత్రశుద్ధనవమి. రాకుమారుఁడప్పుడ తానెక్కిన హయరాజముం దిగి పాదచారియైపోయి రేణుకాదేవిం దర్శించి యర్చించెను. పాలునేయి నివేదించెను. రకరకముల పిండివంటలు జాజికాయ జాపత్రి యేలకులు కుంకుమ పూవు పచ్చకప్పురము, మొదలగు పరిమళద్రవ్యములు వైచిద్రాక్ష కిస్‌మిస్ జీడిపప్పు, మొదలగునవి

వేసిన పరమాన్నము భాండములకొలఁదిగ వండించి దేవికి నివేదించెను. భక్తి తన్మయతఁ బ్రార్థనలు చేసెను. హృదయముతోడి వానిపూజలకుం, బ్రార్థనలకుం దేవిప్రసన్నచిత్తయై యనేక వరంబులొసంగెను. ఆదేవి పవిత్రుఁడును రాజునకిష్టుఁడును నగునొక పురుషునావేశించి రాజునకిట్లని వచించెను. ఓ రాజా! దత్తచిత్తుఁడవై యాలింపుము. భావిని నీవును మహారాజవుకాగలవు నీరాజ్యమకంటకమై భాసిల్లఁగలదు. నీపేరున వెలసిన పురమె నీకురాజధానియై విరాజిల్లును. ఈ నాసమీపముననే నీరాజ్యము విస్తరిల్లంగలదు. నీవును జిరకాలము ప్రజారంజకుఁడవుగ రాజ్యపాలనముం బొనరింపఁగలవు. ఓయనఘా! నీయెడ దేవదేవునకుఁ బరమాత్మునకు శ్రీనివాసునకును బరిపూర్ణానుగ్రహము కలుగును. అనుచువరదానము లొసంగి యాదేవియామనుజుని వీడెను. వాఁడును బ్రకృతిస్థుడై సచైతన్యుఁడాయెను.

కతిపయ దినములు కడచనిన పిమ్మట రాజమిత్ర వర్ముండు నిజకుమారు నాకాశరాజును నాతనిగురు విప్రపూజాసక్తి ప్రజానురక్తి, దేవునందలి భక్తి, ధర్మాభిసక్తిం గాంచి, శౌర్యసాహస పరాక్రమవంతునిగ, వీర్యవంతునిగ, సకలసద్గుణసౌశీలునిగఁ దలంచి, మంత్రుల నాలోచించి, ప్రజానుమతిం గ్రహించి, రాజుగ విధివిధానమునఁ బట్టాభిషేక మొనరించి తాను వానప్రస్థుఁడై నిజకాంతతోఁ గాంతారమునకుం బోయెను. తొండ మానుఁడును నన్నకన్నివిధములఁ జేదోడువాదోడై మెలగుచుండెను. వారితనువులు వేరైనను మనసులొకటిగ ప్రజాపాలనము సాగించుచుండఁ బ్రజలన్ని విధముల సౌఖ్యానందముల నోలలాడుచుండిరి. ఆపై వియన్మహారాజునకుఁ బద్మావతి కుమార్తెగప్రాప్తంబయి శ్రీనివాసునకు బత్నియై విరాజిల్లుట, కుమారుడు వసుదానుడు సకలసంపన్నుం గల్గియుంట, ఆమీదరాజా శ్రీనివాసుంగాంచుచు, బరమాత్మం గలియుట మీరువిన్నదే కదా. ఆమీఁద శ్రీనివాసునను గ్రహముననె వసుదాన, తొండమానులా రాజ్యమును విభజించుకొని యెవరిరాజ్యమును వారు ప్రజానురంజకముగఁ బరిపాలించి తనియుచుఁ ప్రజలఁదనియించుచుండిరి. స్వనిర్మిత స్వనామరంజిత తొండమానురాజ్యమునకు రాజధానియై విరాజిల్లెను.

## సమాధిసాధన - అష్టాంగయోగ నిరూపణము

ఒక పరితొండమాన నృపాలుడు శుకమునివరుం జేరి యాసక్తిమీఱ గురువరా! సమాధిసాధనయు, అష్టాంగ నిరూపణమును, ఆత్మసంయమయోగమును విశదముగ నాకు ననుగ్రహించి వచింపరేయనెను. అంతనామునివరుండిట్లని చెప్పందొడంగెను. వేద ధర్మజ్ఞుల శ్రేష్ఠుఁడును, బుద్ధిమంతుఁడును నగు నెవ్వఁడు యోగారంభము నొనర్చి

యమనియమములు పూని పలువిధములగు నాసనంబులయుక్తాసనంబున నుపవిష్టుఁడై దృఢమతిఁ బ్రాణాయామ, ప్రత్యాహారములను ధారణమును సాధించునో మననము పొనర్చునో యాతఁడే సమాధిసాధన నొనరించి పొందఁగలఁడు. యమనియమములు మొదలుగ ధ్యానధారణముల వరకుఁగలుగు, నవియన్నియు సమాధిసిద్ధికిఁ గారణంబులగును. సాంగమగు సమాధియే యష్టాంగయోగమనంబడును. ప్రతిదిన మీయష్టాంగయోగమును నింతింతగ నియమపూర్వకముగ నభ్యసించి సాధించి నిశ్చయనియమమునఁ గొనసాగింపవలెను.

నిషిద్ధాచారములకు దూరుఁడై, నిషిద్ధకర్మలను వీడుటయె యమమనంబడును. సత్యము, దయ క్షమ ధృతి, మితాహారము, ఆర్జవము, బ్రహ్మచర్యము, అస్తేయము, అహింస, శౌచమునను నీదశవిధ సాధనాంగములతో శరీరమును నదుపున నుంచుచు హింసాదులకు దూరమగు యోగమెయమము. స్వాధ్యాయము, నియమము తోడితపము, సంతోషము, ఆస్తికత్వము, దానము, భగవదర్చన వేదాంత శ్రవణము, లజ్జామతి, జపము, వ్రతము నను దశవిధాంగములతోడి యోగమే నియమము. యోగాభ్యాసమున, జపతపములఁ గూర్చుండువిధి, స్వస్తికాది భేదముల నొప్పునది యాసనము పూరకకుంభక రేచకములను మూఁడు భాగముల నొప్పు, ప్రాణోపాన వ్యానోదాన సమానములను పంచప్రాణముల నదుపుననుంచు యోగాంగము ప్రాణాయామము. ఇందు పూరకమన నియమమున శ్వాసను నెమ్మదిగ లోనికిం దీసికొనుటయు. కుంభకమనలోనికిం దీసికొనిన ప్రాణవాయువునట్టె హృదయమునఁ బట్టియుంచుటయె. రేచకమన కుంభకమున నున్నయూపిరిని నియమమున నెమ్మదిగ వెలికి విడుచుటయు. దీనిచేఁ బ్రాణములను స్వాధీనమున నుంచికొనుటయగును. ప్రాణాయామముచే మనసు సుస్థిరమై యేకాగ్రత నందఁగలదు. విషయముల నుండి యింద్రియములను మనసును నుపసంహరించుటయె ప్రత్యాహారమునాబడును. మనసును సుస్థిరముగ నాత్మయందుఁ బరమాత్మయందు నిలిపియుంచుటయుఁ ధారణయననొప్పును. తైలధారయట్లు అవిచ్ఛిన్నముగ జ్ఞానధారను భావనయందుంచుటయె, యవిచ్ఛిన్న భగవద్భావనయె ధ్యానమనంబరగును. భగవంతునేవేళఁ జింతనచేయుటయ మననము అనబడును. ఈయోగాభ్యాసకాలమందు జ్ఞాతయు, జ్ఞేయమును, జ్ఞానము ననునవి విభిన్నముగఁ దోచుచుండును. పరిపక్వదశను నెప్పుడీ జ్ఞాతృజ్ఞేయ జ్ఞానముల భేదమే తొలఁగిపోవునో పరమానంద జనకము, పరానందము, చైతన్యస్వరూపమునగు పరమాత్మయందు మనసుపూర్తిగ సంద్రమున జలబిందువట్లు లీనమైపోవునో యప్పుడ అదియె మహాయోగ సమాధియన నొప్పును. ఇట్లు బుద్ధిమంతుఁడు పంచకాల పరాయణుడై యభ్యాసముం జేయుచు నాయాకాలానుకూల కర్తవ్యకార్యముల యోగబుద్ధిఫలాపేక్షను మాని దైవార్పణముగ సమాచరింపవలెను. బుద్ధిమంతుఁడగు వాఁడు

ప్రతిదినము సాయంకాలమునఁ కంటకకీటాదిబాధ లేమియులేని యేకాంతస్థలమున మృదులాసనమున మిగులనెత్తును. బల్లమును గాని తలమున చేలాజిన కుశోత్తరంబగు మృదులాసనమున సుఖాసీనుఁడై తలయు యెడయు శరీరమును దిన్నగ, సమముగ నుంచి నాసికాగ్రమును స్థిరముగఁజూచుచు ఏకాగ్రచిత్తమున, స్వస్తికాద్యాసనముల, తనకనుకూలమగు నాసనమున, గూర్చుండి ఇడానాడిచే మెలమెల్లన వాయువును శ్వాసను లోనికిం దీసికొని లోనమ్మృదువుగఁ గుంభించి సుషుమ్నానాడియందు నిదురించి గుప్తముగనున్న కుండలిని నుద్బోధింపవలయును. ఇట్లు ప్రతిదినమాచరించు యోగిశరీరమును వీడవలయునను కోర్కియుదయించినపుడు నేకైకదేవు శ్రీ వేంకటాద్రీశు శ్రీనివాసు నెడందందలంచుచు ఓమ్ అను ప్రణవమునుచ్చరింపవలెను. ఓంకార నాదమొనర్చుచు బ్రహ్మరంధ్రమునుండి బయల్వెడలి యాత్మస్వరూపుఁడక్షరుఁడు అర్చిరాదిక మార్గమునఁ బరమపదమును బొంది పరాత్పరు శ్రీవేంకటేశదేవుని సాయుజ్యలాభమొంది చిరకాలమనుపమానంద భోగియై సుఖించును. శ్రీవేంకట శైలాధీశు కైంకర్యమున బుద్ధిదృఢముగ గలిగియున్న యెడఁద సద్గురు నుపదేశమునఁ బూర్వోక్తవిధమున సుస్థిరమగు యోగమును బొందవలెను. ఇడానాడిచే వాయువు నాకర్షించి సుషుమ్నానాడియందుఁ బ్రవేశపెట్టవలెను. పిదప నావాయువును జఠరాగ్ని జ్వాలతోఁజేర్చి రెంటిని హృదయాబ్జమునఁ జేర్పవలెను. అట హృదయాబ్జమున నున్న శంఖచక్రగదాధరు కేశవునిదెలియవలెను. ఆపై నాజ్ఞాస్థానమును బరిక్రమింపఁజేసి యాయోగితెలివితో భ్రూమధ్యమున, బ్రవేశపెట్టవలెను. అట సహస్రదళ పద్మమధ్యమున నలరారు చంద్ర మండలమున నీవారధాన్యాగ్రమట్లు సూక్ష్మమైయున్న దేవాదిదేవుని నమృత స్వరూపుని భగవంతుని లక్ష్మీపతిని దర్శింపఁదగును.

ఆవరుని సంకల్పముచే నాచంద్రమండలమునుండి స్రవించుచున్న యమృతబిందువుచే దేహములోన, బయటను నంతట వ్యాప్తమై యున్నదని తలంచి సుషుమ్నామార్గము నుండి ప్రాణవాయువులను నెమ్మది నెమ్మదిగా దిగువకు దింపుచుఁ గొనివచ్చి వానివాని స్థానములఁ బూర్వమట్లు సుస్థిరముగ నుంపవలెను.

ఇట్లు ప్రతిదినము సంధ్యలను నర్థరాత్రముననను నాచరింపవలెను. శరీరమునకుఁ బైనద్వాదశాంగుళ ప్రమాణమున వ్యాప్తమై యుండువాయువును జేతిపాయములేకయే యాత్మయందున సమముగనో కొద్దితక్కువగనో పట్టియుంపవలెను. అట్టి యోగాభ్యాసముచే మానవుఁడు వజ్రకాయుఁడగును. మఱియుం గాలమృత్యువుం గూడనిర్జించి యాచంద్రతారకముగ జీవించియుండును. దీనిచే నింద్రియములను వశమున నుంచికొని మనసు నేకాగ్రముగ నొనర్పనీలగును.

## ఆత్మసంయమయోగము

కర్మయోగ జ్ఞానయోగములు రెండును అవినాభావసంబంధము కలవి. యోగయుక్తత కర్మలు బాగుగ నాచరించిననే జ్ఞానమొదవును. జ్ఞానము సాయముననే కర్మయోగము సఫలమగును. కావుననే యీరెంటికిని సహాయభూతముగ నీయాత్మ సంయమయోగము ధ్యానయోగము భగవంతునిచే నొసంగఁబడినది. కర్తవ్యకర్మలు వీడికాషాయములు కట్టి సోమరియై దేశదిమ్మరియగు వాడుకాడు సన్యాసి. తాను కర్మలను వీడియితరుల కర్మఫలితముం గుడుచువాడు యోగియుంగాడు సన్యాసియుంగాడు. చేయఁదగిన కర్తవ్యకర్మల ఫలాపేక్షమాని చేయువాడే, ఫలాపేక్షను విడుచువాఁడే సన్యాసి. సంకల్పాహంకారమును, ఫలమమకారమును మాని దైవార్పితముగ కర్తవ్యము సక్రమముగ నొనరించువాడేయోగి. కావుననే యోగియే సన్యాసియగును, సన్యాసియే యోగియగును. సన్యాసిని యోగిని మాటలచే గాదు ఆచరణచేఁ దెలియఁదగును. శుద్ధసంకల్పము పూని మలినసంకల్పములం దరిచేరనీయక నాశమొనర్చి క్రమమున నిస్సంకల్పుఁడైనపుడె యోగారూఢుడు కాఁగలఁడు. ఇంద్రియములను,నింద్రియార్థములను వశమున నుంచికొన్ననే మనసు సుస్థిరమగును. సుస్థిరమనసు కలిగిననే, ఆత్మసంస్థ మొనర్చికొన్ననే ధ్యానయోగమున, జ్ఞానమున సుస్థిరతగలుగును. అట్టివాఁడే యోగారూఢుండన నొప్పును. గురువులైనను, మఱేపెద్దలైనను దారిచూపుదురే కానితన్ను తానే యుద్ధరించికొనవలెను. అధోగతిని పొందకుండవలెను. విషయములందరిమి, యింద్రియముల వశమున నుంచికొన్న మనసే తనకు మిత్రమై యుద్ధరించును. విషయేంద్రియములకు వశమగు చంచలమనస్సే తనకు శత్రువు, తన్నునధోగతికిం దోయును. శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానము లాదిగ ద్వంద్వముల కతీతుఁడై, ప్రశాంతుఁడై, పరమాత్మయందు నేకాగ్రముగ మనసును జేర్చిననాడే, వాఁడేశాంతిని బొందఁగలుగును. నిర్మలాంతఃకరణముననే, శుద్ధప్రశాంత హృదయముననే భగవంతుఁడు, పరమాత్మ నెలకొని సాక్షాత్కరించును. తాను బ్రహ్మచారియైనను, గృహస్థైనను, వానప్రస్థుఁడైనను, ఏజాతివాఁడైన నేకులమువాఁడైన పురుషుఁడైనను, స్త్రీయైనను బ్రహ్మచర్యమును జక్కఁగఁ గాపాడుకొనవలెను. బ్రహ్మచర్యము వలన సాధకునకు శారీరకముగ, మానసికముగ నపరిమితమగు శక్తిసామర్థ్యములొదవును. మోక్షసిద్ధిని పరమాత్మను బొందఁగోరువాఁడాత్మ సంయమమున మనోనిగ్రహమున నిరంతరాభ్యాసము నొందియుండవలయును. అప్పుడే యాతనికి విజయమై పరమాత్మ సన్నిధానముచేకూరును. యోగిమితాహార విహారములు కలిగియుండవలెను. మితిమీరిన తిండియు, నిద్రయు నేమియుం దినక, నిద్రింపక యుంటయుందగదు. అన్నికార్యముల సముచిత మిత వర్తనమె మేలిచ్చును. దుఃఖముం

దొలఁగించును. అట్లన్నికార్యములను మితవర్తనుఁడై భగవంతు నెదఁజేర్చినవాఁడే దైవచింతన నొందును. దైవచింతనచే నెల్లదుఃఖములు తొలఁగును. పరమయోగి పరమాత్మానుభవమందిన, ఆత్మసందర్శనమందిన, ఆత్మైక్యమందిన పరమశాంతి నందును, ఆత్మానందమునను‌న్నవాఁడై యింద్రియాగోచరము, నవ్యయానంతమునగు సుఖమునొందును. ఎట్టిదుఃఖమును నాతని చలింపఁజేయఁజాలదు. ఆత్మ, పరమాత్మ తనయందే కలఁదు. వానికై యెక్కడికో పోనక్కరలేదు. కాని అది పరమాత్మ పరిశుద్ధాత్మచేతనే, పరిశుద్ధమగు మనసుచేతనే ప్రాప్తమగును.

## బ్రహ్మోద్దీపిత దీపారాధనలు - బ్రహ్మోత్సవములు

ఆ వెనుక పితామహుండు లోకాభ్యుదయము, మంగళమ్ము మదినెంచి జగద్ధిత కారియై యప్పుడరెండు దివ్యజ్యోతుల వెలిగించెను. జగదానందు గోవిందుం గనుంగొని యంజలించి యిట్లనియెను. తండ్రీ నాప్రార్థన మంగీకరింపుము. నాకీవరము నొసంగుము. కలియుగాంతము దనుక నీదీపద్వయము వెలుఁగునిచ్చుచుండుగాత. అంతదనుక నీదివ్య విమానమున్నతమై నిలిచియుండుంగాక. అంతవరకు నిట నీయవతారంబు విరాజిల్లు గావుత. ప్రజాహితమునకై నాకీవరముం దయచేయుండనెను. దానికాజగత్పతియు నట్లనెయగుగాతమని యావిధాతంగని యిట్లనియెను. ఓ పితామహా! నీజనహితైషితకు మనమునెంతయు ముదమాయెను. అదియటుండ నిత్యోత్సవముల జనములు పాల్గొని పవిత్రులై పావనజీవితములకుం గడంగుటకు నుచితవిధానము నొనర్పుము. అనవిని విధాతజనకుని కడ ననుమతింగొని పోయి హర్షోత్ఫుల్లమానసుఁడై ధ్వజారోహణమాదిగ రథారోహణముతో నూరేగింపు టుత్సవముంజరిపింపను వేదవేదాంతపారగులచే సమంత్రకముగ విధ్యుక్త విధానమున నైవేద్యాదికముల ముప్వేళల భయభక్తులతో, శ్రద్ధాభక్తులతో నివేదనలు జరిపింపనెంచెను. అప్పుడె తొండమానురావించి యానరపాలునితో నిట్లనియెను. ఓరాజవరా ! రమాపతికిన్నై యూరేగింపు టుత్సవములకు విచిత్రవాహనములను దారునిర్మితములను పొనరింపంజేయుము. ఇందునీకు విశ్వకర్మయుఁ దోడుపడును. అనుచున్నంతన విశ్వకర్మయటకు వచ్చెను. వాని నారాజునకుం జూపి స్రష్టవీనిచేఁ బనిగొనుమని యప్పగించెను. ఆవిశ్వకర్మయు నుత్సాహమున శ్రద్ధాసక్తులతో రాజునియోగించినటులనె చిత్రవిచిత్రములగు రథాదిక వాహనములను, ఛత్రచామరాదికములను, పలువిధములగు వానినిర్మించి యిచ్చెను. వానింగాంచి రాజెంతయుఁ బ్రసన్నుండై బమ్మకు వానినెల్లంజూపి తనివింగూర్చెను.

ఉత్సవోచిత కార్యంబులన్నియుఁ దొందర తొందరగనే బాగుగ నెఱవేర్పంబడెను. అంతతేఁడు నలువయనుమతిం గొని;యపుడె దేవునుత్సవమునం బాల్గొనరండని వేగరులగు దూతలనెల్లయెడలకు దేశాధీశులకు, నంగవంగ కళింగ కాశ్మీరకుకుర కేరళ కాశీ కాంభోజాది దేశాధీశులకు పాండ్యపౌగండ సింధుబర్బర చేదిజాంగల విరాటాధీశులకు, మత్స్యమాగధాదిదేశాధిపులకు సకుటుంబులుగ, సపరివారులుగ రానాహ్వానములంపెను. వారును దేవునుత్సవమునం బాల్గొనికనులారం గాంచఁగలుగుదుమను నుత్సాహమున రథగజాశ్వములపై శిబికాందోళికలపైఁ గాల్నడకల దూరభారములు తలంపక, వెఱపందక, వెనుదీయక యుత్సాహమున హుటాహుటినుఱుకు పరుగుల వచ్చుచుండిరి. ఎల్లెడలనుండియుఁ బ్రజలను బిన్నలు పెద్దలు స్త్రీలు పురుషులు నెల్లరాయుత్సవములం బాల్గొనవచ్చుచుండిరి. మార్గమునఁ దోడిప్రయాణీకులకు నన్నపానములిచ్చువారు, గొడుగునీడలు కూర్చువారు, వ్యజనంబులు వీచువారు, తమచెంతన వాహనములపై నెక్కించుకొనువారు, బడలికలు వాయ సేవలు సేయువారు, పటకుటీరములు నిల్పిచల్లని నీడలనిచ్చువారునై యాప్రజలందుననే పరమేశుంగాంచుచు మానవసేవనే మాధవసేవగ నెఱుంగుచుఁదనియుచుండిరి. భక్తితన్మయులై, వస్త్రాభరణంబులు శారీరికసేవలు, సర్వము శ్రీవేంకటేశ్వర చరణారవిందార్పణంబుగ నర్థిజనుల కర్థినొసంగితనివిం జెందుచుండిరి. ఇట్లు కతిపయదినముల కెల్లవారునట వేంకటగిరిం జేరి దేవాయతనముం దరిసిరి. ఉత్సవములును మొదలాయెను. మేముమేమని వారెల్లరందుత్సాహమునఁ జేరుచుఁ దమభాగ్యమునకెంతయు నానందించుచుండిరి. ఆతరినెయెల్ల యెడల నుండియు ఋషులు, మునులు, యోగిజనమ్ములు, నెల్లతాపసులు నటకువచ్చిచేరిరి. సూర్యుఁడు కన్యారాశిం జేరినతఱి, కన్యామాసమున, ద్వితీయదివసమున జగత్పతి శ్రీనివాసుని ధ్వజారోహణ మొనర్పంబడెను. పిదప నంకురార్పణము కావింపంబడెను. వైఖానసాది మునితల్లజులెల్లరిచే సమంత్రకముగ విధ్యుక్త విధానంబున దేవుని పూజలు బాగుగ జరిపింపఁబడెను.

అంతసుందరాందోళిక నందముగను,
బట్టితెచ్చి దేవునెదుటం బెట్టియట్టె ,
కొందరొదిగి ప్రక్కను నుండఁ గూర్మినజుఁడు
పలికెదేవుని గని యిదె పరమపురుష
యెక్కిపల్లకి కృపను నూరేగరమ్మ,
రమ్మురమ్మన్న వెన్నుండు బమ్మనుగని,
పలికెనట్టులె కానిమ్ము బమ్మఁ యనుచు,
అపుడు మినుముట్టెనుత్సవ మమందమగుచు.

మంగళవాద్యములు భూనభోంతరములన్నిండి బోరుకలంగెను. దేవదేవు దివ్యమంగళ విగ్రహముం గన్న ప్రజల యుత్సాహరవములు మిన్నుముట్టెను. ఆటనానాడందటా దేవునంద తన్మయతలీనమై పోయిరి. ఆటనద్వైత మొక్కటియతోచెను. అపుడాచదువుల వేలుపు నాల్గు మోములనాలుగు వేదములు వల్లనవేయుచు నాదేవు ప్రస్తుతులు సాగించెను. ఆ నాలుగువేదమంత్రముల సారమోయనఁగ నపుడు శ్రీనివాసమూర్తులు నాలుగు స్వయంభువులై తోచెను. ఆమంగళమూర్తులందు దొల్తటిది యుత్సవ శ్రీనివాసుఁడు, రెండవది యుగ్రశ్రీనివాసుఁడు, మూఁడవది సర్వాధిక శ్రీనివాసుఁడనం బరఁగు, నాల్గవది లేఖకశ్రీనివాసుఁడు. ఈనాలుగు మూర్తులకును మూలమూర్తి శ్రీనివాసుఁడు. ఇవియన్నియు నాదేవుని సంకల్ప సంజనితములు. భక్తులగు నాయాదేవతల, మానవుల మనోభావముల కనుకూలములుగ నామూర్తులొదవి, యుద్భాసితములాయెను. వానింగన్న తెలిదమ్మిగద్దియ వేలుపు నాల్గుమూర్తులఁదన నాలుగుమోముల నెంచియుంచి నుతించుచుండును. తొలిమూర్తినిడెందాననుంచి కనుంగొనుచు నామహోత్సవ సమయమున దృఢమతి ధ్యానింపసాగెను. ఇట్లాయుత్సవ కార్యమన్ని విధముల సర్వమంగళోత్సవ సంపన్నముగ సంసిద్ధినంది యలరారెను. అప్పుడా బ్రహ్మోత్సవ సమయమున నాప్రోడజన్నిగట్టు పర్యవేక్షణమున నింపగు వంటకములు పలువిధములు దేవునినైవేద్యమునకు సంసిద్ధమాయెను. గుడోదనము, తిలాన్నము, పరమాన్నము, ముద్గాన్నము, మాషాన్నము, దధ్యోదనము, చిత్రాన్నము, పప్పులతో, బూరెలు, గారెలు, నప్పములతో, జిలేబులు, రసగుల్లలు నప్పడములతో, వడియములు గుమగుమతావుల తోడి కూరలతో రసములతో దప్పళములతో, పులుసుచారులతో నోరూరించు వంటకములు సిద్ధముకాగా దేవునకు నివేదింపఁబడెను. ఆమీఁదట నెల్లరకుఁ దనివితీరఁగఁ దినిపింపఁబడెను. ఇట్లాయుత్సవములు పలుదినము లవిరళములుగ నవిచ్ఛిన్నముగ సాగెను.

శ్రీనివాసుని యాయుత్సవము ధ్వజారోహణ మాదిగఁ బరమోత్కృష్టముగఁ గొనసాగెను. ధ్వజారోహణమునకుం దొలిదినమున సాయంకాలమున ననంతుఁడు, గరుడుఁడు, బ్రహ్మాదిదేవతలు, వసుదానాది మహీపాలురు మహర్షులు నూరేగింపుగఁ బోయి, వల్మీకాదులుం బవిత్రమృత్తికంద్రవ్వి తీసికొని మత్తగజ మస్తకమున నునిచికొని మంగళవాద్యములతోఁ బ్రదక్షిణ మొనర్చుచుఁ గొనివచ్చి, హర్షపులకిత గాత్రులై యంకురార్పణ మొనరించిరి. ఆ మరునాడుషఃకాలమున ధ్వజారోహణోత్సవమాయెను. ఉత్సవమాదినుండి యవభృతాంతము దనుక, పుష్పయాగాంతము దనుక, విధిచే విధ్యుక్త విధానమున, నవిరళోత్సాహమున నెఱవేర్పంబడెను. ఆ శ్రీనివాస దేవుని మహోత్సవము

నందు, ధ్వజారోహణ సమయమునఁ బ్రప్రథమమున మనుష్యాందోళిక యాదేవు వాహనమాయెను. రాత్రి రెండవయానముగా శేషవాహన మొనర్పంబడెను. అట్లే మఱునాఁడు తొలుదొల్తగా నాశేషాద్రివాసునకు శేషశయనునకుఁ దొలి వాహనము నాగ రాజాది శేషువుకాగా రాత్రివేళ రెండవదిగా హంస వహనమమరింపంబడెను. మూఁడవ దినముదయమునఁ దొలుతసింహవాహనమును, రాత్రిముత్తెముల మండప వాహనముఁ జేకూర్పఁబడెను. చతుర్థదివసమునఁ బ్రథమవాహనముగాఁ గల్పవృక్షమును, నారేయి రెండవదిగా సర్వభూపాల వాహనము సుసంపన్న మొనర్పంబడెను. ఐదవదినమునఁ బ్రొద్దుట నామోహన వేషధారికి నమృతదాతకు శ్రీహరికాందోళికయును సాయం సమయమున వేదవేద్యునకు ఖగేశ్వరవాహనము (గరుడవాహనము) సమకూర్పంబడెను. ఆమీద నారవదినమున నాసర్వారాధ్యునకు వరుసగా నంజనీపుత్రుఁడు హనుమంతుఁ డును, మంగళగిరియును, యానములుకాగా మహిషీయుతునకు, నావసంతోత్సవ ప్రియునకు మూడవ వాహనముగా నారాత్రిని నైరావత గజమొప్పెను. ఏడవదిన ముదయమునఁ దొలియానముగ భాస్కరమండలమును, రెండవదిగ సాయం సమయమున మంగళగిరియును నారాత్రి మూడవయానముగఁ జంద్రమండలమును నాయెను. పుష్పోద్యానవిహారి, పవిత్రవనితా మండలమధ్యవినోది, భక్తజనారాధితుఁడు, లక్ష్మీయుతుఁడు, పద్మావతీ మనోహరుఁడు శ్రీహరియై ఎనిమిదవ దినమున వివిధాలంకార సంశోభితము నానావిధమాలాలంకృతమునగు నున్నత రథారూఢుడుగాఁ జేయఁబడెను. ఆనాటిరాతిరిని దైత్యారాతి సుందరోన్నతోచ్చైశ్రవాశ్వమునధిరోహించెను. కడపటిఁ దొమ్మిదవ దినమున నామంగళమూర్తికి మంగళకరునకుఁ దొలివాహనము, తొలిప్రొద్దున నాందోళిక కాగా నాటిరేయి మంగళహారిద్ర పింగళచూర్ణములతో మంగళాభిషిక్తుండును నవభృతస్నాతుఁడునగు నాసర్వానందప్రదునకు సర్వాత్మునకు వేంకటనగాధినాథునకు మంగళగిరియె యుత్తుంగవాహనమై యధిరోహితమాయెను. హారిద్రమంగళ చూర్ణాభి షిక్తుఁడైన యాదేవుఁడు మంగళగిరి వాహనారూఢుఁడై మహాజనములు తన్నుజేరికొలిచి రాగా వైదికమంత్రములు గానముపొనర్చు ద్విజసత్తములు తన్నుచుట్టి స్తుతు లొనరించుచుండ నాచైత్యప్రదక్షిణం బొనరించిపోయి యాదేవదేవుఁడు పురుషోత్తముఁడు. శ్రవణానక్షత్రమున స్వామిపుష్కరిణిని దిగి పవిత్రావభృత స్నానమొనరించి, వాహనా రూఢుఁడై పురమేగెను. ఆమీద ధ్వజారోహణోత్సవ ఘతివైభవముగ సుసంపన్నమాయెను. మఱునాడు పుష్పయాగము మహోత్సవము మహావైభవముగ సమాచరితమాయెను.

తదనంతరమున దేశాంతరముల నుండి యరుదెంచిన యెల్లజనులకును, దగురీతి సపర్యలు చేయఁబడెను. వారు సంతుష్టులుగ నొనరింపంబడిరి. పిమ్మట

నామహోత్సవమును గనులవిందుగ డెందముల కానందముగఁ గనుంగొని యందుం బాల్గొనిన దేవతలెల్లరును దమతమతావులకుం బోయిరి. జనమ్ములును, జనపతులును, మనములును, తనువులును నుత్సాహోత్ఫుల్లములు కాగా నావినోదములె చెప్పికొనుచుఁ దమతమ నెలవులకుం జనిరి. వేంకట నగాధిపునకుం, తండ్రికిన్నెఱిగి ద్రుహిణుఁడును దనసత్యలోకమునకుం జనెను. ఉత్సవమంతయు నెఱవేర్చి తొండమాన భూపాలుఁడును సతీపుత్రాదులతో, సోదరపుత్రుడు వసుదానునితోఁబోయి వైకుంఠుందర్శించి నమస్కృతు లొనరించి యనుమతులంగొని స్వపురమునకుం జేరెను. అటఁ దననగరమున నాదేవుని సంస్థాపించి దినదినము భక్తియుక్తిని బూజలఁదనియించుచు సత్యమార్గానువర్తియై, ధర్మమే యవలంబముగ,ఁ బ్రజానురంజకముగ, గోబ్రాహ్మణహితమ్ముగ, నతిథ్యభ్యాగత జనానుమోదమ్ముగ, నింద్రియముల వశమందుంచికొని, క్రోధముం జంపి శాంతమూర్తియై పరిపాలనం బొనరించుచుండెను. అప్పుడప్పుడు తానుగవచ్చి యాశ్రీనివాసదేవుని దర్శించి యర్చించి తనియించి తనిసిపోవుచుండెను. సత్యప్రభువన బ్రజారంజకుండన నావిభుడు పేరంది. వెలసెను.

## శ్రీ వేంకటేశ్వరుని పరాత్పర భావనిరూపణము

సూతమునివరుండు శౌనకాదులతో నిట్లనియెను. ఓ దపోధనులారా! విష్ణుస్వరూపు శ్రీ వేంకటేశ్వర దేవుని మాహాత్మ్యరహస్యమును నేఁజెప్పుదానిని మనసుంచి యాలింపుడు. ఈ భూమండలమునంగల ఎల్ల పవిత్రతీర్థములయు, పావనక్షేత్రములయు, పుణ్యావనపర్వతములయు, చరితలనెల్ల బాగుగఁ దొలుతనుండియు నెన్నియో వినియున్నారు. ఎల్లపురాణముల సారమును, దివ్యమును, వైకుంఠపదమును సాయుజ్యము నొసంగుదానిని, దయామయుఁడగు, ప్రసన్నుండగు నావ్యాసమహర్షిచేఁ బరిప్రశ్నముల-విన్నవాఁడను. అయ్యది పార్వతీపరమేశ్వరుల, సముచిత సంభాషణముల; బ్రీతుండగు శంకరభగవానుఁడు, ఉమారమణికిం జెప్పినది. ప్రత్యక్షముక్తిదాయకము, వేదాంతసార సంగ్రహము పరమానంద ప్రాప్తికరము. అద్ది సిద్ధముని సురవరులకును, యోగిజనులకును, దుర్లభమును దుర్గాహ్యమును, మంత్రముల నెల్ల నుత్తమ మాదివ్యక్షేత్ర మాహాత్మ్యము. ఎల్లపర్వతముల పవిత్రతయుం బుడికిపుచ్చుకొని, తనలోనిమిడ్చికొన్న శ్రీవేంకట పర్వతము యొక్కయు, అందలి తీర్థరాజములయు, శ్రీ వేంకటేశ్వర దేవునియు మాహాత్మ్య ము నింతయంతయనియు నిట్టిదట్టిదనియుఁ జెప్పనేరికివశము? గురునను గ్రహమున విన్నదాని నాతెలిసినంత చెప్పెద. నాలింపుఁడు. ఎట్టి చికిత్సకులకును గుదర నిరోగముల గుందురోగులు గ్రహబాధలు పొందువారును, వికలాంగులును,

దుష్కర్మఫలప్రాప్త దుఃఖార్తులగువారును, బధిరాంధమూఢమతులు నగువారును, ప్రాయశ్చిత్తములకుం గూడదూరులగు పాపులును, మానసిక దుఃఖార్తులగువారు నాదిగ గలవారలా వేంకటనగపమున కరిగి యాతీర్థరాజముల మున్గియాదేవునర్చించి తనువులు మనసులు పవిత్రములు కాగా దుఃఖములు బాధలుపాయుదురు. ఆదేవు సుదర్శనచక్రమున నసురగణములట్ల పాపదుఃఖభారములు నశింప సుఖానంద భరితు లగుదురు. ప్రత్యేకించి యీ కలియుగమునఁ బాపరోగ పీడితుల కాదక్షిణాపథస్థిత వేంకటనగంబునకుం బోయి కలికష్టనివారకుఁ, గరుణారస విస్తారకుభక్తజనార్తి విదూరకు, సమస్తాఘవినాశకు, శ్రీవేంకటనాయకుం బవిత్ర సుస్థిర భక్తింగొల్చి తరింపందగును. ఈ జనములనెల్లం గరుణ రక్షింప నావేంకటనగాధి నాథుఁడు శ్రీమన్నారయణుఁడాది విష్ణువు, శ్రీనివాసుఁడు కాకవేరొండు దైవంబులేడు. ఆదివ్యక్షేత్రముం గాంచిన మఱియొక క్షేత్రము చూడవలసినదిలేదు. ఆ వేంకటాద్రిని దర్శింప మఱివేరునగముఁ జూడనేల? అందలి తీర్థముల మునిగిన వేరొండు తీర్థములకుం బోవఁబనియెలేదు. అటఁజేరి తపమొనరింప మఱివేరు నెడలకుం జనఁబనియెలేదు. ఆదేవుమంత్రమె మంత్రము. దానింబొందిన మఱిపొందవలసిన మంత్రములేదు. ఆదేవునెడ భక్తియనుపమావ్యయభక్తి భుక్తి ముక్తి ప్రదాయిని. గతియాతఁడే వేరుగతియెలేదు. ఆదేవుం దెల్పునదియే జ్ఞానము. ఎఱుకమన్యంబులేదు. అదే దేవునెఱుకయే, భక్తియే యానందదాయకము. అద్దికన మఱియన్యమింకనుఁ బనియెలేదు. అనుపమానంతావ్యయ లాభంబదియు. అద్ది బ్రహ్మానందమవ్యక్తము. అద్దెప్రియధామ మద్దియేముక్తిధామము. అద్దియ సమాధి, దానఫలము. సర్వసిద్ధిదంబు సచ్చిదానందంబు. యోగమదియెయన్యమొందలేదు. సాక్షాదానంద రసప్లావితము, సర్వేంద్రియ మనోహరము, కాలభయాపహంబు, సంపూర్ణము నావేంకటేశ్వర దర్శనము, సర్వకామదము. ఆతఁడె విష్ణువు, నారాయణుఁడు, రమేశుఁడు, త్రిమూర్త్యాత్మకుడు. తద్దర్శన లాభమెసర్వమును. అంతకుమించి మఱికోరదగినది, పొందఁదగినదిలేదు. వేదాంతములకు మించి శాస్త్రములేదు. వేంకటేశుఁడు కాకదేవుఁడులేడు. వైకుంఠమున కంటెధామము లేదు. వేంకటగిరి కంటె మఱిగిరిలేదు, సంకటహారము లేదు. ఇద్దియే నిజము నిజము. ఈ బ్రహ్మాండములందెల్ల వేంకటేశుండు దేవుండు. మఱియొక్కరుఁడు లేఁడు. కలుగఁబోడు. ఈయాదియె వేదాంత నిర్ణయము. ఓమునివరులారా! ఇట్టి యీదివ్య జ్ఞానముం గూర్చిన మాహాత్మ్యముం దెలిపిన, గౌరీకాలకంథరుల యెడందలం బుట్టి వెడలిన యాసంవాదమును దాని సిద్ధాంతమును జెప్పుచున్నాఁడను మీరు మనసుంచి యాలింపుఁడు.

# షష్ఠాధ్యాయము

## పార్వతీ పరమేశుల పావనసంభాషణ

తొల్లి యొకప్పుడవ్యయానంత శిఖరముల నొప్పి నిర్మలోజ్వల కాంతులఁ బ్రకాశించుకైలాసశిఖరిని జ్ఞాన రసప్లావిత నిర్మల చిత్తుఁడు, యోగిజనసంసేవితుఁడు నగు యోగేశ్వరేశ్వరుఁడు మహేశ్వరుఁడు రత్నరంజిత సువర్ణ సింహాసనమున నుపవిష్టుఁడై యుండెను. ఆదేవుని దరిసి కాత్యాయని యిట్టులడిగెను. ఓదేవదేవా! త్రినయనా! ముల్లోకావృతాంధకారమును నాశమొనరించు నో సర్వజ్ఞా! నీయంతఃకరుణము పరమానంద రహస్యానుభవము మీయెడందను నాయెడఁ బరిపూర్ణానంద కృపాదృష్టి యొప్పియున్నది. నాయడిగెడి దీనిం జెప్పంగోరెదను. ఓశంకరా! భక్తవశంకరా! ముక్తిక్షేత్రమునఁ గర్మబంధముల నుండి విముక్తులైన సిద్ధులకు నెచ్చట నిత్యానందరస ప్రపూర్ణాబ్ధి సంలబ్ధియో, ఎచ్చట మీధ్యానవైభవానందము నిల్చియున్నదో, ఈదివ్యరహస్య మెందు నిక్షిప్తమో, యాగుప్తధామమును దెలియంజెప్పుదురే? అన విని చంద్రశేఖరుఁడా సర్వమంగళం గాంచి యిట్లనియెను.కాత్యాయనీ సర్వమంగళా! బాగుబాగు భక్తజనముల మేలుకోరి నీవెంతయు నొప్పుగఁ బలికితివి. నాకెంతయుం బ్రియమైన యీరహస్యమును నీకుంజెప్పెదను వినుము. ఈ భూమండలమున భారత భూమిని దక్షిణాపథమున తెలుగునాటను వేంకటాచలమొప్పును. అందున సర్వలోకపావనము, పరమాద్భుతము, స్వామి పుష్కరిణీతీర్థము, ప్రాణులకు నెల్ల దర్శనమాత్రమున భక్తిజ్ఞాన సుఖప్రదమై యొప్పుచుండును. పుట్టువులందెల్ల మూటకట్టికొనిన పాపమ్ము లెల్ల దానిందర్శించినంతనె పటాపంచలైపోవును. మఱియూ పాపముల పొంతకుం బోవకుండుట వారిముఖ్య విధి. అప్పుడె జ్ఞానముం బొంది సంసార బంధనముల నుండి విముక్తిం బొంది తరింతురు. ఓ యీశ్వరీ! ఆవేంకటనగ దర్శనము యొక్కయు, ఆ తీర్థముల స్నానపాన స్పర్శనముల యొక్కయు మాహాత్మ్యమునేమని చెప్పునది. ఆ తీర్థమాహాత్మ్యమును వర్ణింపఁగల్గిన వారెవ్వరు? అద్దిలోక దుర్లభము. నాచేతను బ్రహ్మాదుల చేతను నదికాఁజాలదన, సిద్ధముని యోగులును దాని వర్ణింపఁజాలరన సామాన్యమానవుల వేరెచెప్పనేల? ఎల్లజగములఁ గల్గు పుణ్యతీర్థముల పవిత్రత యంతయుఁ దమలో నిమిడ్చికొనిన పెక్కులు దివ్యతీర్థముల నొప్పి, చిత్రాతి చిత్ర విచిత్రానందము నొసంగునదై ముక్తిదాయకమై శ్రీ వేంకటేశ్వర పవిత్ర నిలయమునకు నలువైపుల మూడు మూడుయోజనముల దనుక విస్తరించి యున్నదా. పవిత్రభూమిధరము ఆపవిత్ర భూమిని వసించు ప్రాణులు మానవులుధన్యులు, ధన్యజీవులు. వారిదే భాగ్యము. ఆసచ్చిదానందుని దర్శనమానందదాయకము, దినదినము

వారికె యది సంప్రాప్తము. ఎంతభాగ్యము? ఆ వేంకటేశ్వర మండలముననిదురించుటయు నొకతపస్సే యగుమ. అందుండు వారిజన్మము సఫలము. ఓభవానీ! మేమును నెల్లకాలము నచటనెయుండ వాంఛింతుము; ప్రార్థింతుము. అగునగు భక్తితో మనసును బ్రసన్నము నొనర్చికొనవలెను. తరువాత నాస్వామికిం బ్రీతికారకములగు వ్రతాదులు నియమములు సమాచరింపవలెను. అన్నదానము, మహాపూజ, వైభవాచరితోత్సవములు మున్నగు స్వామి కైంకర్యములు ననంతపుణ్యము నొసంగునవియు. ఇచట సమాచరితస్వర్ణాన్నాది దానములు, పితృశ్రార్థములు నాదిగ నిచట జేయఁబడిన యేసత్కర్మలుగాని యనంత పుణ్యఫలము నొసంగును. అట్లేయచట నాచరించిన దుష్కర్మలకును, నవ్యయానంత పాపములు దుష్ఫలితములు దవులును ఆపాపులకు నిష్కృతియే లేదు. ఘోరనరకయాతనలే యిహమునఁ బరమున వారికిఫలము. ఇచటనెప్పుడు నెవ్వఁడు నేపాపము పొంతకుం బోరాదు. అట్టిపాపచింతయు మనమునం జేర్పరాదు. జ్ఞానులు, నజ్ఞానులు నెవ్వరుగాని భక్తియుక్తులై యిటఁగర్మలు పవిత్రమనంబునఁ జేయవలసినదని నేప్రోత్సహించుచున్నాను. ఇటభక్తిశ్రద్ధల సమాచరించినఁ గర్మబంధముండదు. ముక్తిప్రద క్షేత్రములందెల్ల నిది తొలుతొల్తనెన్నఁదగినది. ఇట నీ శ్రీశైలాగ్రమున సాయుజ్యముక్తి సమ్మోదప్రాప్తియగును. అన్యములగు నెడల నట్టి మాహద్భాగ్య మొదవుటరిది. ఇట నాదేవునితోఁ జేరి యుత్తమానంద పదవీ భోగసంపల్లాభమగును. ఓ ప్రాణప్రియా హైమవతీ, సతీ! ఈ లోకమున ముక్తులగు యోగులం దేకొద్దిమందియో పరమయోగులు మాత్రమే యెల్లవేదాంతముల యీసారమును ననుభవరూపమున, నీయుత్తమ రహస్యమును దెలియఁగల్గుదురు; అన్యులకుం గాదు బ్రహ్మానందపదము నిచ్చు, ప్రియమగు, నీరహస్యము నీకుం జెప్పితిని. ఇద్ది శ్రీవేంకటేశు నందు నిర్మలభక్తినుంచు, శాంతకృతులగు స్త్రీపురుషులకే యెఱుంగనగును. అన్యులకిది చెప్పినను దలకెక్కునది కాదు. ఓ పర్వత రాజతనయా! భగవంతుండగు శ్రీహరి, వేంకటేశ్వరు ధ్యానవైభవము నాకర్ణింపుము. కల్పకల్పములనుండియుఁ జేరుకొనియున్న పాపముల నెల్లనది బూడిదచేయును. వాఙ్మన శ్రవణ ధ్యానంబుల నానందమకరందమ్ము నానించు నాబ్రహ్మానంద మహత్తు నాలింపుము. తద్ధ్యాన మాహాత్మ్యఫలమును నేనచెప్పఁజాలనన నన్యులనెన్ననేల? అద్దికడు విచిత్రము; మనోవాక్కులకందనిది. ఈ రహస్యపూర్ణమగు నుత్తమధ్యానమునూహించి పొందుము.

జ్ఞానమయము పవిత్రమునగు నాయాదివరాహ క్షేత్రమున సుద్ధాంతఃకరణ జన సంస్తుతంబును, తీర్థరాజ సమావృతంబునునై సుందర సుగంధిత పుష్పఫల సంభరిత లతానికుంజములచేఁ, బారిజాతాది వృక్షరాజములచే శోభితవనరాజములతో మరకత మాణిక్యనీల ప్రవాళాది రత్న సంపదలతోఁ, గలకలనినాద వినోదిత శుకపిక శారికాది

శకుంత సంతానములతో, నజగజ హరిణగోవృషభాది జంతుసంతతులతో సంకులమై, దేవసిద్ధముని యోగిజన సంసేవితమై, బాధలకు నెల్లదూరమై సమస్తానందమునకు సదనమై, వైకుంఠస్వరూపమై, విరజానదీతీరంబు నందువలె నవరత్నప్రభా సంశోభితములు, సువర్ణమయములు, నగునాలుగిండ్ల భవంతులచే శ్రీవేంకటేశ్వర పురము స్వామిపుష్కరిణీ తటమున విరాజిల్లుచు నగణిత సూర్యచంద్ర విద్యుల్లతా కాంతులం గూడ మందము లనిపించు తేజఃపుంజముల శోభిల్లును. ఆదివ్య భవనములు సభామండపములు పవిత్ర హృదయుల జ్ఞాననేత్రములకే సుగోచరము కాఁగలవు. అన్యులకదృశ్యము లగోచరములు నచింత్యములు నయితనరారఁగలవు. అన్నియెడల విష్ణుతేజస్సమావృతములగు వాని బవిత్రహృదయులుగని తనిసి తరింతురు. అదియూ వేంకట నగాధినాథుని యనుగ్రహమును బొందిననే సాధ్యము. తన్మధ్యముననే చతుర్థ బ్రహ్మమనునొకదివ్య తేజమొప్పును. స్వయంప్రకాశమగు నాసత్పదార్థమే తనశక్తిచే, నద్భుతగుణములచే, బ్రహ్మాండముల సృష్టించునది, సమస్తమునకు నాదికారణము.

సాలెపుర్వునలువైపుల గూడునల్లినట్టులది తనమాయాతంతు జాలమున నెల్లనావృత మొనర్చియున్నది. మూలప్రకృతిం గూడి కార్యప్రవృత్తినంది యదియామాయా తంతుజాలమునుండియే వెలికిందోచుచుండును. ఆయాకర్మల ననుసరించి యది మూఁడు తెఱంగుల స్థూలము, మహత్తు, సూక్ష్మమునై తోచును. విషయగ్రహణమునకుఁ బూర్వమున నానత్తేయుద్యోతకమగును, జ్ఞానప్రకాశితులగు విజ్ఞులు చెప్పునహ మయ్యదియ. ఘటమున నుంచఁబడిన దీపకాంతి యాఘటమునకుం గల చిల్లులనుండి వానిరూప పరిమాణ భేదములచే హెచ్చుతగ్గులతోఁ బలుతెఱఁగులఁ బయటకుఁ దోచునట్లుగ స్వయంప్రకాశితమగు నాయహము, సత్తు బ్రహ్మతేజ ముపాధి భేదములచే స్థూలసూక్ష్మ మహద్రూపములం దోచుచుండును. కాని యనన్య భక్తియుక్తులగు మానవులకా సచ్చిదానంద మీమూఁడుపాధుల ననావృతమై, త్రిగుణాతీతమై, శూన్యమటులనై యద్వితీయమై యేకాత్మతనుద్యోతకమగును. ప్రకృతి భావములకుం దూరమై యానద్బ్రహ్మము మేఘములకుం బైన సూర్యునట్టుల విచ్చిన్నాచ్ఛన్న మహత్తేజంబునఁ బ్రకాశించును. మేఘముల ఛిద్రముల నుండి సందుల నుండి వెలికిఁ బలురీతులఁ దోచునా యినతేజమట్టులె "యేకమేవాద్వితీయ" మననొప్పునది నానాత్వమునఁ గల్పనలచే ననేకత్వమునఁ బ్రకటితమగును. ఆ పరమపదమిది యదియని చెప్పరాక వేదములచేతను, "నేతి, నేతి" పదముల, ఇది కాదు, ఇదికాదు అని చెప్పబడినది. అదే స్వయంప్రకాశము, సత్పదార్థము. ఆ సద్రూప పరబ్రహ్మము, సత్యస్వరూపము, నానందము, నమృతకారణము, నాద్యంతశూన్యము. అది నిత్యశుద్ధము, నిర్వికారము, నిర్మల జ్ఞానరూప, మాత్మరూప, మాత్మస్వరూపము, వాగగమ్యము, సర్వవ్యాప్తము. అది

శూన్యమునుగాదు, నశూన్యమునుగాదు, ద్వైతమును నద్వైతమును గాదు, భావాభావశూన్యము, సూక్ష్మాతి సూక్ష్మము, మహత్తునకంటెను మహత్తయినది, సచ్చిదానంద మహాపయః పారావారము, అద్ది నిర్భయమగు కైవల్యమును, సాయుజ్య పరమానంద పదమును నొసంగునది, యింద్రి యాతీతము, నిర్గుణ నిరంజనాకారము. ఆతేజోరూపమే శ్రీనివాసుఁడు. ఆద్యంతరహితుడు, సర్వాంతర్యామియునగు నా దివ్యతేజస్స్వరూపుఁడు, ఆనిర్వికారనిరంజనుఁడు కరుణామయుఁడయి తనభక్తులకు దర్శనమీయ, లోకరక్షణ మొనరింప, సురసిద్ధ ఋషిముని యోగిజనముల హిత మొనరింప, నిర్వ్యాజ భక్తి నెడందల నిల్పి నింపికొనిన, కోరికలం బాసి నిత్యతృప్తులయి భజియించు, శ్రద్ధాళులగు జనులను గాలప్రవాహ గంభీరమై మాయావర్తకలోల భీకరమగు భవాంబుధిని దరింపఁజేయ; నిర్మల భక్తి జ్ఞానములఁ గొల్చువారల యాయురారోగ్య సంపదల బెంపొంది, కోర్కులం దీర్చుకొఱకు, నాయారూపముల, నాయాకాలముల నాత్రికాలస్వరూపుడు త్రికాలజ్ఞుఁడు, త్రికాలాతీతుఁడు, నగు నాయనశ్వరుఁడు, త్రిగుణాతీతుఁడు, త్రిగుణములంగొని యణిమాద్యష్ట సిద్ధులను, యోగసిద్ధులను, అష్టాంగయుత బ్రహ్మవిద్యను నొసంగువాఁడై, మంత్రయంత్ర, మహాతంత్ర, ఫలప్రదాతయై తనయంశావతారముల నిరాకారుఁడయ్యు నాకారములం గాంచుచున్న యా యనంత బ్రహ్మ మా యనంత తేజమై వైకుంఠమున వైకుంఠుఁడన నొప్పువాఁడు, సర్వలోక సృష్టిస్థితి లయకారకుఁడు, భూమిని తొలుత నుండియు జ్ఞానవరాహ మూర్తికి స్థానమై పావనమై యొప్పు వేంకటాచలమున లక్ష్మీయుతుఁడై పరిపూర్ణ తేజోరూపుఁడై శుద్ధతేజంబున కళ్యాణరూపుఁడై వెలసియున్నవాడు.

ఓ పార్వతీ! సర్వాధ్యక్షుని మహావిష్ణు నత్యంతానందమును, ననంత దయయును గలిగి యెల్లరకును వింతగొలుపు వానిని, సర్వవ్యాపకు, నచింత్యానందైశ్వర్య విభాసితు, రత్న తోరణ విద్యోతమాన ద్వారప్రభాన్విత దివ్యవిమానారూఢు, తటిత్కోటి సమప్రభా విభాసమానదేవతా మూర్తిని, తేజోమండల మండితు, సుందరస్థితు, సర్వప్రసిద్ధ దివ్యశ్రేష్ఠ పంచాయుధోద్భాసితు, చండ, ప్రచండాది ద్వారపాలక సంసేవితు నందసునందాది పారిషద సమన్వితు, గోవిందు, పూర్ణస్వరూపు, రామకృష్ణా ద్యవతారములు దాల్చిన వానిననంత విగ్రహు, నఖిలోపనిషత్సార సంవేద్యు శ్రీ భూసహితు, శ్యామసుందరు శ్రీ వేంకటేశ్వరు నమస్కరించుచున్నాను. అనేకకోటి కందర్పలావణ్య మధనోద్ధత సుకుమార సుందర శరీరుఁడు, జగన్మోహన లీలావైచిత్ర్య కారణుఁడు, నాగమ రసాభిజ్ఞులగు వైఖానసాది మహర్షులచే, బ్రహ్మాగస్త్య భరద్వాజ సనక సనందన వాల్మీకి వ్యాసాది యోగివరులచే, వామదేవ శతానంద భృగ్వాది తాపసులచే ఁబూజితుడు, జనకాది నృపశ్రేష్ఠులచే నర్చితుఁడు నగు పురుషోత్తమునకిదే మ్రొక్కులిడుచున్నాను.

సీ॥ సర్వలోకాధీశు సర్వేశ్వరేశ్వరు
నానందమయుని నాద్యంతరహితు
బాలార్కకోటి ప్రభావిభాసిత తేజు
కోటీందు సమసౌమ్య కోమలాంగు
నీలజీమూత వినీల సుందరదేహు
భవ్యతటిత్ప్రీత వస్త్రధారు
రత్నజాంబూనద రమ్యభూషణ భూషి
తాంగు నచ్యుతుని నవ్యక్తు నభవు

తే॥ విబుధవిభు, నుత్తమోత్తము వేదవేద్యు
నాదిమధ్యాంత రహితు బ్రహ్మస్వరూపు
సచ్చిదానందు వేంకటేశ్వరుని బరుని
కొలుతు దండంబు లిడుదును గూర్మిమిగుల

ఉ॥ దండము, దానవారికిని, దామరసాక్షున, కద్రిధారి, కా
ఖండలముఖ్య దేవవిభు గాఢభయాపహ చక్రధారికిన్
దండము దీనబంధునకు, దర్పితవైరి వినాశకారికిన్
దండము శ్రీనివాసున కుదారునకవ్యయ దివ్యమూర్తికిన్

కం॥ కమలను హృత్కమలంబునఁ
గమలోద్భవు నాత్మనాభి కమలమునందున్
గమలహితాబ్జజాల నయన
కమలములుగ దాల్చు హరిని గరము నుతింతున్

సీ॥ అద్వితీయము, నేకమై, పెక్కురూపుల
నన్నియు, దానయై యలరువాని
నన్నియుఁ దనయందు నన్నిటఁదానుగా
బయట లోపల నౌచుఁబరఁగువాని
గుణములు గల్గించి గుణములు లోఁగొని
వానికతీతుఁడై వరలు వాని
నదియిది యట్టిట్టులని చెప్పఁగా రాక
నేతినేతని యెంచనెసఁగు వానిఁ

తే॥ ప్రజ్ఞ శక్తియుక్తులఁ బట్టరాని వాని
భక్తిభావంబునను బట్టువడెడివాని
హరిని విష్ణుని నేవేళ నంజలింతుఁ
గోర్కులడఁగించి డెందానఁ గూర్మినెంతు॥

ఉత్సాహ॥
వేదవేద్యుఁ బరమపురుషు విశ్వవినుతు మాధవున్
మోదితామరు న్హరిం దపోధనార్చితాంఘ్రుని
శ్వాది నాదిదేవు దీనబాంధవు న్ఖలారి దా
మోదరుం భజింతు నెంతు మోదముననుగేశవున్

ఓ దేవీ! ఆదేవుని వేంకటాద్రినాధుని శ్రీనివాసుని జిరకాల మాస్వామి పుష్కరిణీ తీరమున నేనును నంగిరసుఁడను లోకపాలురును నర్చించితిమి. మనకుమరుఁడు కార్తికేయుఁడును, దపోధ్యాన సమాధుల నానావిధ కుసుమంబుల నర్చించి ధన్యుఁడాయెను. నాదుహృదయానందానుభవ రసమునకు మూలమైన వాని, శంఖచక్రముల నొప్పియభయ హస్తుఁడైన వాని, జతుర్భుజుని లోకములందెల్ల దర్శనీయమగు ప్రసన్నవదనాంబుజమున నొప్పువాని నాకర్ణాంత విశాలాక్షి కటాక్షాబ్ధితరంగితుని, జిరునవ్వు వెన్నెలలు గాయు మోమును, నువ్వు పువ్వు నవ్వు నాసికయును, వంగిన విండ్లఁగాదను గనుబొమలును, అష్టమి చందురుం గ్రిందుపఱచు నెన్నుదురు కలుగువాని, సువర్ణేందుమణి కస్తూరీ కుంకుమాది సువిరచితోర్ధ్వపుండ్రముల భాసిల్లు వానిఁ బాదపల్లవములాదిఁ గిరీటము వరకుఁ బూజింపబడువాని, వజ్రాంకుశ ధ్వజాబ్జాదిరేఖల శోభిల్లు పదతలంబులవాని, నఖచంద్ర చంద్రికల మాయాంధకారమును మటుమాయమొనర్చువాని, లక్ష్మీ వక్షోజ కస్తూరీ కుంకుమోల్లసితవక్షము వానిఁదనుగొల్చువారికిఁ దనివి నానందమిచ్చు వాని వేదాంత వాక్కులు ఘోషించు కరకంకణ ఝుణఝుణత్కారంబుల వాని వక్షోవిరాజిత మాలామణి మధ్యంబున, నిజహృదయ స్థిత లక్ష్మిచే దాగుడు మూతలాడించువాని, నాజానులంబిత బాహులవాని నేవేళ నతమస్తకమున మ్రొక్కుకొందు.

సీ॥ కరుణామృతం బొల్కుచిఱునవ్వువెన్నెల
ల్చిందుమోమునఁజంద్రుఁజిన్నపఱచి
జాలిచూపుల తావి, మేలగు కనుదోయిఁ
బుండరీకమ్ముల గండడంచి
నీల మణి ద్యుతు ల్నిగిడించు తనవున
గగనకాంతులను జీకాకు పఱచి
కౌస్తుభమణి దరిఁగలుముల జవరాలి
వెడఁదగు నెడఁదను గడక నుంచి

తే॥ సాధుసజ్జనులను బ్రేమసాకు దేవు
భక్తజనములకును జిక్కుపడెడిదేవు
వేడ్కగోవిందుఁ గనువిందు వేంకటేశు
శ్రీనివాసుని మ్రొక్కెద జేతులెత్తి ॥

తొడవులకును దామ తొడవైన పాదార, విందమ్ములను బాగైన వాని, చారు జానూరు లావణ్య ప్రభావిభాసితాభరణముల వాని, ననర్ఘరత్నఖచిత జాంబూనద భూషణోద్భాసి తోరస్థలంబువాని, గంభీర నాభీ సరోజసంభవముఖ ముఖరిత వేదాంత వేద్యుఁడై వెలయు వాని గంబుగ్రీవుల సన్మాణి క్యోజ్జ్వల కంఠ మాలాలంకృతుని, నగలఁదగిలిన యింద్రనీలంపు మణుల యెఱపు మణగించి మఱపించు నొడలి బెడఁగగు కాంతుల నొప్పువాని, శంఖచక్రగదాఖడ్గధారియై తనరువాని, నభయహస్తాన ధ్గర్తులఁదనుపు వాని, నొప్పు చిబుకంబు, బగడాల దీవికి దీటైన పెదవులు, దాడిమ బీజంబులట్టి పండ్ల వరుసలుం గలవాని, చెక్కిళ్లయందంపు సంద్రాన నీదులాడెడి మకర కుండల ప్రభల వాని, జిరునవ్వు వెన్నెలల్జిందు మోమందున జాలితరగల చూడ్కులనొప్పు వాని, జెవులతో మంతనములాడు కనుల వాని, నీలాలకోద్భాసితోజ్జ్వల ఫాలభాగంబువాని, దివ్యమణి దీపితోజ్జ్వల కిరీట భాసిత మూర్ధంబువాని, భూమి కాంతను భుజములఁ, గలిమి చెలిని నుఱమున నుంచి లాలించి మించువాని, గుదరమున నుండి కుధరంబు నెత్తు వాని, భూషణోజ్జ్వల దేహసౌందర్యముననను మూఁడు లోకాల మోహాబ్ధిముంచువాని గాంచినంతన ముదము తన్మయత గూర్చి యొడలు మఱపించి మనసును దనుపు వాని, వెన్న దొంగను, వెన్నుని వేవిధాల నెంచితనియుదు, భజియింతు భక్తిమీఱ. సూర్య చంద్రాగ్నులకు, దేజోమూర్తులకుం దేజంబొసంగు వాని, సతతానంతావ్యక్తా నందుని, చందనాగరు కస్తూరీ కుంకుమాది సుగంధితద్రవ్యానులిప్త తనుభాసితుని, నానావర్ణసురభిళీ సుందరసుకుమార సుమన మాలాలంకృత ప్రణవస్వరూపు నావేంకటేశుని హృదయాంభోజ మధ్యంబున సతతము నుంచి పూజించి మురియుచుండు. మనకుమారుఁడు స్కందుఁడనన్య చిత్తమునఁ బవిత్ర భావమున నాదేవుసుధారసభరిత పాయసములతో, రుచులమీఱు వంటకములతో బిండివంటలతో, మధు శర్కరలతో, సూపాన్నంబులతో, దధిక్షీర ఘృతంబులతో దివ్య సౌరభనైవేద్యంబులతో విందుల నొసంగి పూజించి తనియించి తనియును. చెదరని భక్తిని షోడశోపచారముల సేవించును లక్ష్మీయుతుండగు నాదేవునకు దివ్య కర్పూరవీటికల నొసంగి, ధూపదీపనీరాజనంబులొసంగి యన్నిటఁ బ్రసన్నునొనరించి ముఱియించి ముఱియును. వ్యజన చామరములు వీచుచు నృత్త గీతవాదిత్రములతో, వీణా వేణు మృదంగాది రవంబులతో, తూర్య దివ్యశంఖ ఘోషలతో దేవునెడందకు

విందొనర్చుచు సురసిద్ధ సాధ్యకిన్నర కింపురుష గంధర్వాదులు గుములుగుములుగ వచ్చి యర్చించి హర్షమందుదురు. గరుడోరగయక్షవిద్యాధరాదులచే సమభ్యర్చితుండై సంతుష్టుండైన వాని, షడానన సమభ్యర్చనా స్తోత్రములఁబ్రముదిత హృదయుడైన వాని, హా, హా హూహూతుంబుర నారదాది భక్త సంకీర్తనా సంతోషితు, శుద్ధ సత్వమయాకారు, స్వామి పుష్కరిణీతట ప్రదేశముల రమాసహిత వినోద విహారముల నానందోద్భాసితు, నవ్యయానందు, సురముని వందితు, సృష్టికాలముల, సృష్టించుచు, స్థితికాలమునఁబోషించి రక్షించువాని లయకాలమునఁ బ్రళయమందించువాని, సృష్టిలయములంటని వాని, రాజులకు రాజును, దేవతలకు దేవతయును, సర్వమునకును నియంతయునగు వాని చరాచరముల నెల్లెదల వ్యాపించియున్నవాని గరుణాతరంగిత హృదయుండై సర్వమును రక్షించువాని, శాత్రవ దమనంబొనరించుచు, దివ్యాంఘ్రులంజూపుచు విశుద్ధ సత్వ విజ్ఞానమును, నుత్తమ బుద్ధియు నొసంగుచు నభయముం బ్రసాదించు వాని, సత్వ స్వరూపు గరుణానిలయు, గరుణామూర్తి నాదేవదేవు హృదయమున నష్టదళపద్మకర్ణి కారమున నుంచి మేమును నర్చించుచుందుము. ఆనందస్వరూపు, అష్టాక్షరీ మంత్రస్వరూపు, తానేసత్యమును, సత్యమే తాను నైనవాని నిట్లనిస్తుతించి ధ్యానింతుము. వేదాంతగంభీర సముద్రమున వేదాంత సారోపనిషత్తరంగములనె మునుకలిడి పొందదగు రత్నమగు నామంబుకలవాని, మాదు నజ్ఞానాంధకారమును నాశమొనరించు దివ్య కౌస్తుభమణి ప్రభల నొప్పు వాని మాకు మాసంతతుల కమృతమై జీవము నిచ్చు వాని, విశ్వాభీష్ట వరప్రదానఫల మొసంగువాని, భోగీశ్వరశయను, భోగీశ్వరాభరణు, సమస్తైశ్వర్య నిదాను, నాత్మవరప్రదాను, శ్రీనివాసు, వేంకటేశు నేభజింతును. ఇట నా వేంకటేశ్వర స్వామి సమీపమున, దివ్యాంగనా స్వరూపయై స్వర్గాపవర్గంబు లొసంగునదై యొప్పు శ్రీ సువర్ణముఖీనదీతటమున నాకు నివాస మొప్పినది. ఇది యెంతయుముదయాయెను. బ్రహ్మాగస్త్యులచే వినుతింపఁబడిన కైలాసమైన శ్రీకాళహస్తి యందు, నుత్తమ యోగిజనుల మధ్యయందు నివాసమెట్టి వారికిని దుర్లభముకదా.

ఓం శ్రీ శంకరప్రియమిత్రాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ వైకుంఠాచలవాసినే శ్రీ వేంకటేశాయ నమః

## అష్టాక్షరీ మంత్రరాజోపదేశము

ఓగిరిరాజ కన్యా! మొదట ఓమ్, ప్రణవమునుంచి పిదప "నమః" చేర్చి శ్రీ సహిత వేంకటేశశబ్దము, ధ్యానింపందగును.

ఓమ్ నమః శ్రీ వేంకటేశాయ. నీమంత్రరాజమును సర్వగోప్యమును హృదయముననుంచి కొనుము. ఈ మంత్రమనన్యమనస్కత హృదయముననే స్మరింపదగినది. ఉత్తమానంద ప్రదాయిని యగు నీమంత్రరాజమును నీయందలి ప్రేమచేతనే నీ హృదయ పవిత్రత నెఱింగియే నీకుందెలిపితిని గ్రహింపుము. తొలుదొల్త నిట్లుగా నీమంత్రధ్యానమొనర్పవలెను. వాసుదేవాయ శాంతాయ శ్రీనివాసాయ మంగళమ్. ఇట్లు మంత్రధ్యానమొనర్చి పిదప నీమంత్రమును ఓమ్ నమః శ్రీ వేంకటేశాయ అని గాని ఓం శ్రీ వేంకటేశాయనమః అని గాని స్మరణ మొనరింపవలయును నమః పదమును మొదట గాని, కడపట గాని యుంపవచ్చును. ప్రణవముతోడి నీయష్టాక్షరీ మంత్రము ప్రశిద్ధము భుక్తి ముక్తులొసంగునది. ఎల్లమంత్రసార రహస్యమిమిడ్చికొన్నది యత్న పూర్వకముగ దీని గోప్యముగనుంపదగును. స్వామి పుష్కరిణీ స్నానము, శ్రీ వేంకటేశ్వర దేవుని సందర్శనము, ఆ దేవుని మహాప్రసాదముంబొందుట యను నీ మూఁడును ముల్లోకములయందును గడుంగడు దుర్లభములు. వానింబొందవలయునన దొల్త హృదయమును గడిగి కొనిపవిత్రము చేసి కొనవలయును. మనసున నుండి పాపపుం దలవుల నిలువ నీయక తరిమివేయువలయును. బుద్ధిమంతుఁడు పవిత్ర హృదయుఁడునగు వాఁడుత్తమోత్తమమగు స్వామి పుష్కరిణిని, దివ్యమగు సువర్ణముఖరీ నదిని భవపాదోధిసేతువు నవ్యయానందుని శ్రీ వేంకటేశుని సర్వత్ర సర్వవేళల గీర్తింపవలయును. ఇద్దికడు సూక్ష్మమైనది కడుపవిత్రము. యోగిజనులకును గడు దుర్లభము. అజ్ఞానాంధకారముంబాపు పాపపంకిల మింకించు సూర్యుఁడననగు నిది పాపులకు మనమున కెక్కదు.

స్వామి పుష్కరిణీ తీర్థంబులు రాసాయనికదివ్యౌషధము. మృత్యురోగము నివారింపంగల మహద్వైద్యుఁడు వేంకటేశుఁడు. సామాన్య మానవులం గూర్చి పలుకనేల? మహాయోగులకును నావేంకటనగశిఖరమున కేగి స్వామి పుష్కరిణని మునిగి దేవుని దర్శించు భాగ్యమెంత దనుకఁగలుగదోయంత దనుక జన్మజరారోగాది దుఃఖములు నీపాంసారికకలతలు పట్టియే యుండును. వానిచే వారికి ముక్తి లేదు. ఈ బ్రహ్మాండాంతర్వర్తియగు పుణ్యామచంద్రికయందలి సత్సంగా మృతముంగొనఁగల్గినదే భాగ్యము. ఆసత్సంగామృత సేవనముననే శ్రీ వేంకటేశ్వర ప్రీతి కలుగును. సమస్త

లోకకరుని, లోకానందకరుని హృదయంబుననిలుపుకొన నంతఁదనుక మానవులేమి, దేవలోకవాసులేమి నిర్మల యోగి జనులేమి, యనే కానేక యోనుల మలమూత్రముల జిక్కవడుచు గర్భనరకయాతనలనుభవించుచు బుట్టుచు జచ్చుచు నెతలందు చుందురు. ఓ హైమవతీ ! నాకు నానంద మిచ్చు మనఃపూర్వకముగ గ్రహింపందగు నీ పరమ పవిత్రా ఖ్యానము నీకునేఁజెప్పితిని, దీని నెటింగి తరించు వారు ధన్యులు.

## శంఖభూపాలుని కథ

తొల్లి సూర్యవంశోద్భవుఁడు, కడుంగడు ప్రాజ్ఞుఁడు శంఖుఁడను భూపాలుఁడు గలఁడు. ఆతఁడు విష్ణుంబ్రసన్నుంజేసికొని, సూర్యచంద్రులు, భూమియుఁ గలుగునంత దనుక విష్ణునకుందనచేసిన సేవలు నిలిచి యుండవలయునని కోరికొను మనసైన వాఁడాయెను. అప్పుడె యా భూపాలుఁడు రాజ్యమునఁదనకుమరుని నియమించి, తాను తనగురుఁడగు వసిష్టభగవాను నొద్దకుం బోయి, వినయవినమ్రుడై నమస్కరించి యిట్లనియెను. ఓ గురువరా! ఏయెడకుంబోయి యేమి యొనర్చిన నావిష్ణుదేవుండు ప్రసన్నుండై దర్శనమిచ్చి కోరిన కోర్కులం దీర్చును? అది నాకుంజెప్పరే. అనెను అట్లడుగఁ బడినముని తల్లజుఁడిట్లని చెప్పెను. ఓ రాజా! నీయభీష్టమెంతయుమేలు. నీవిప్పుడ సువర్ణముఖరీ నదిమధ్యంబున నొక శిలాఫలకమొప్పును. అటనగస్త్యముని వరుండొకప్పుడు తపంబొనర్చి దేవుని బరితృప్తుంజేసి దర్శించెను. అదిపరమపావనము; గయాదికప్రభావము గలది. అటనాశిలాతలమున శివకేశవాది దేవుల పదచిహ్నములు కలవు. అట బ్రహ్మకుల్యతో స్వర్ణముఖరి సంగమించుచున్నయది. అటనాసంగమంబున నేమానవుడు గాని సంకల్పపూర్వకంబుగ విధి విధానమున స్నానమొనర్చి ఋషి ముని దేవతల నర్చించి పరితృప్తుల నొనరించి భక్తితో నా బ్రహ్మ శిలాతలమున దనపితరులకు శ్రద్ధను శ్రార్ధార్పణ పిండదానముల నొనరించునో వాని పితరులేడేరు తరములు వరకు నటగంగను గయ యందలి పిండదానములచే దనిసినటుల దనిసితరింతురు. ఇయ్యదినిక్కము. ఇందేమియు సందియము లేదు. అట నా యెడను భోజనతాంబూల వస్త్రాదికములతో గోభూమి తిలా దానంబులు, ధనదాన్యాది దానంబులు యథాశక్తిఁజేయబడిన యింతలంతలుగా రేణుతుల్యంబులును మేరుసమములుగా ఫలించును. ఓ రాజేంద్ర! నీవును నటకుం బొమ్ము. ఆ మహానదీ సంగమంబున స్నానదానాది కమ్మలు, శ్రాద్ధపిండ దానాదికములు, జలతర్పణమ్ములు శ్రద్ధనొనరింపుము. ధ్యానయోగమున విలీనుడవు కమ్ము. ఆవాసుదేవ భగవంతునందు మనసులగ్నమొనరించి యట నుండి యా వృషభాచలమున కేగి దపంబొనరింపుము. అట్లు నీవొనరించుతరి శిష్యులతో నీకట నాయగస్యముని వరు

దర్శన భాగ్యముం గలుగును. ఆతపోధనునితో నాతని చెప్పు నామహాత్మ్య కథల నాలించుచు గిరి ప్రదక్షిణంబులొనరించి, సమాధిస్థుఁడవై యాభగవంతు సాక్షాత్కారము బొందఁగలవు. నీప్రార్థనల, వినతులఁ బ్రసన్నుఁడై భగవంతుఁడు నీయభీష్టముల నొసంగగలడు. అన్నగురుని విని వృషభాద్రికింబోయి యాతని చెప్పినట్టు లన్నియు యధాక్రమమున నొనర్చికుంభసంభవు దర్శన భాగ్యముంబొంది యా మీద దేవదేవు దర్శన బాగ్యముం గాంచి తనమనసునంగల కోర్కిందీర్పవేడెను. ఆ కల్పమునటఁదన సేవలా దేవునికి నిలిచి యుండంగోరెను. అంతట దేవుండును రాజాంగని యిట్లనియెను. ఓరాజా! నీకోర్కి యెంతయు నొప్పియున్నది. నేను సచ్చిదానందస్వరూపుడను. నిర్వికార నిరంజనుడను, నిరాకారుడను. నేను స్వయముగ బ్రకటమగుటకుం దగు నెలవులనె బ్రహ్మాదులకు, యోగులకుం గానరగుదును. అట్టి యర్చావతారమగు నామూర్తిని గాంచునదృష్టమెవ్వరికో? అట్టిమూర్తిని మదినుంచుటయు నేకొందరో? అది వారి పుణ్యాఫలము. కలియుగమున వారికి నాసచ్చిదానంద రూపముంగను నంతఁదనుక నారూపమును మాహాజనితమును విగ్రహాకారమున నొనంగం దలంచితిని. తన్మూలముననే జిజ్ఞాసులు నా యవ్యయానంద రూపముం గాంచఁగలరు. కావున నోరాజా! నామంగళ స్వరూపమును, విగ్రహమును సహజమును గనుము. దానికి నావరణముగ నాలయమును దివ్యవిమానమును నిర్మింపుము. దానఁబాపులు, పుణ్యులు, నెల్లరును నామూర్తిందర్శింతురు. పావనులు పుణ్యులు నామూర్తింగల దివ్యజ్యోతిని నన్నుంగని తనియుదురు, తరింతురు. ఇప్పుడు నన్నునీవేరూపున గాంచుచుంటివో యట్టి రూపమున నన్నుంచుము. ఆ రూపమే పూజకాధారము. మఱియు ధ్యానగమ్యము. నీవు కన్నయీ నాదివ్య రూవమునకుం బ్రతిరూపమును విగ్రహమును నిర్మింపంజేసి యాదేవునకు, దివ్యవిమానమును నిర్మింపం జేయుము. అద్దియే భావిజనులకుం దరణోపాయమనుచు నాదేవుండంతర్ధానుండాయెను. దేవునాతని నా శంఖపాలుఁడును. దివ్యమంగళ విగ్రహమును, అప్రతిమాన పవిత్ర విమానమును నిర్మింపంజేసి దేవునకుంగైంకర్యముగఁజేసి దేవుని యనుగ్రహమునఁ బరమ పదమును బొందిన వాఁడాయెను.

ఓం శ్రీ మత్స్యరూపాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ క్షత్రియాంతకరామాయ శ్రీ వేంకటేశాయ నమః

## దైవవిత్తాపహరణ పాపఫలము - శునక గాథ

ఓమునివరులారా! దైవవిత్తాపహారణము కడుంగడు పాపమునిచ్చును. దాని దెలుపు తొల్లింటి గాథనొండు వినుండు. అనాఁడు హస్తిపురమ్మున నుండి జనమే జయనరవరుండు రాజ్యమును ధర్మమునూతగఁ బరిపాలించుచుండెను. ఆతండొక దినంబున నిండు కొలువు దీరి యుండనాసభామధ్యమున కొక వేపి ద్వారపాలకుల కనుగప్పి, తక్కుఁగల వారెన్ని తెఱంగుల నడ్డినను నాగక వచ్చి రాజున కెదుట వందన మొనరించి తనముంగాళ్లువంచి తలనేల కానించి లేచినిలిచెను. అంతను బోక మనుజభాషణంబుల నర్ది యిట్లు మొఱలిడెను. ఓదేవా! నేను నా బిడ్డలతోఁ దెరువునకుం బ్రక్కగ నొదిగియేరికి నేబాధయుఁగలుగకుండఁ బరుండి యుండనొక దుష్టుండ కారణంబుగ మాపైఱాలరువ్వియు మమ్ముందండమున మోదియుఁగడునిడుమ పఱచెను. అప్పుడు నాకూనలు కుయ్యోమొఱ్ఱోయన నాతండు వెకవెక నవ్వ నాగుండె నీరాయెను. మాపాలి ధర్మప్రభువవు నీవుంటనిటకు మొఱలెట్టుకొన వచ్చితిని, అనియట్టెనిలిచి యుండెను. అది విన్నరాజా కుక్కంగని యక్కటికం బూని యప్పుడ సేవ కులంబంపి యది చెప్పిన జాడలంబట్టి దానింగొట్టిన వానింబట్టి తెప్పించెను. ఆతండును దన తప్పిదముంగప్పి పుచ్చికొన నేమేమియో నంగినంగి పలుకులంబలికెను. ప్రభూ! అర్ది కూనలతోఁదెన్నుక కడ్డుగ, బాటసారులకు బాధాకరముగ నుంటఁగని చిఱుతలకు దానిచేనేమేని హానియగుననియు నెంచి ఱాలరువ్వితిని. దానికిని దాని బిడ్డలకును దానిచేనేమేని హానియగుననియు నెంచి ఱాలురువ్వితిని. దానికిని దాని బిడ్డలకును దరువాతనగు నిడుమలుతొలగింపనే నేను ఱాలురువ్వికొట్టితిని. అది నిక్కమె యనియెను. అది విన్న యా జనపాలుఁడు జనమేజయుడు నవ్వుదొలకాడ, దానివేలు నకుందానింగొట్టితివే? యెంత బుద్ధిమంతుఁడవు? అని తనయేలు బడిని మనుజులకే కాదే ప్రాణికి నన్యాయము జరుగరాదని యెంచి ధర్మాధికృతులచే విచారింపం జేసి యాతని నేరమునెఱింగి యెట్టు శిక్షింపవలయునా యనివిచారించుచుండెను. అతని తలంపునెఱింగి దాయునకా శునకమట్టులనియెను. ఓధరాధిపా! దీనికైయింతగఁ జింతింపంబనిలేదు. వీనినేదేని భాగ్యవంతమగు నొక దేవాలయమునకో, యేదేని ప్రజాహితసంస్థకో ధర్మకర్తగా నొనరింపుడు. అది యవాని కిందగినదండన. అనునంత నది వినిన రాజే కాదా. కొలువునఁగల వారెల్లరచ్చెరువున మునిగిరి. తేడును నాశ్వానముం గని, యిదేమిదండన? పాడిదప్పి విన్నుంగొట్టిన వానికి ధనాధికారమునొసంగుమని చెప్పుచుంటివేమి? అనెను. అప్పుడాశుని పుడమియొడయనికి మ్రొక్కియిట్లనియెను. దేవా! మీరన్నియుందెలిసిన వారు. మీతో నేనేమనఁగలను. కాని వానికి ధనాధికారము, అర్ధియు

దేవాయతనమున నొసంగుటయే తగినదండన యని యెల్లవిధముల నామనమున కుంగట్టిగఁదట్టుచున్నది. ఎట్లందురా? దయయుంచి యీ దీనురాలి పలుకాలింపుడు. క్రిందటి పుట్టువున నేనొక మేటి ప్రజానాయకుఁడను. ఆనాడు మాయూర నాయట్టి తెలివి తేటలు కలవాఁడు లేడనవచ్చును. కావుననే యాయూరి వారెల్లనామటల కగ్గమై యాయూ రంగల మేటి దేవాయతనమునకు ధర్మకర్తగ నన్ను నియమించిరి. ఇఁకనేమికావలె? నా జీవితము మూడు పూవులారుకాయలాయెను. దేవుని కోవెలను గోడల, మేడల, మేడల మరమ్మతులు, వెల్లలు, రంగులు, సేవలు, నుత్సవములు, నివియవియన నేల దేవాలయమున నాయూర నిత్యకళ్యాణము పచ్చతోరణమునై కన్నులపండువాయెను. ఎల్లవారును నన్నుంబొగడువారె; ఎదుటంగనిముఱిసెడి వారే. కాని నావెనుకంగనగలిగిన వారేలేరైరి. కనినవారు కొందఱేని యున్న నెదుట నోరెత్త దమ్ములు లేక యణఁగి యుండిరి.

అదియంతయు నాతెల్వియనుకొంటిని. అందఱి కన్నులఁగారము కొట్టితినని యుబ్బితిని. కాని కానకయె సర్వమ్ముంగను వాఁడొకఁడున్నాడని వాని కనుఁగప్పరాదని తలంపంజాలకపోతిని. ఒక్కరూకవెచ్చపెట్టి నేపదిరూకలని లెక్కంజూపితిని, మిగిలిన యాతొమ్మిదియు నాజేబున నిడితిని. భూములు కొంటిని, మేడలు కట్టితిని, గ్రామమున కాదు, దేశమునను బెద్దలందెల్లఁబెద్దనయితిని. కడకుఁగాలమాసన్నమైన నాకొఱకేడ్చువారే లేరైరి. నాకూర్చినధనము లెవరికి వారె తక్కించికొను పెనగులాటలో వ్యస్తులైరి. తుదకు నావెంట నొకకాసునేని కొని పోలేక పోతిని సరికదా, దేవవిత్తాపహరణ దోషపాపము మాత్రము నానెత్తిని బరువుగ తోడునీడగ నన్నంటివచ్చినది. అటయమునిపురమున బడిన యిడుమలు, నరకయాతనలు నిన్నియన్ని యని చెప్పరానన్ని అవి చాలకనేనిట నీపుట్టు వందితిని. అయ్యో! తమకురావలసినవి, వచ్చినవి చాలక దొంగలై దొరికిన వెల్లఁ జేజిక్కించి కొన్న దొంగయర్చకులే యీ నాకూనలు. ఇటనెల్లరిచే ఛీత్కారములం బొందుచుఁ గాని తిండికింగలియఁబడుచు హీన జీవితముందొరలించుచుంటిమి. కావుననే పాడిదొరగి మమ్ముంబాధించిన యీచెనటి దేవసదనమున ధర్మాధికారియై పాపియై. విత్తమున పహరించియిట్టికుక్కయో వందియోయై యందఱిచేఁగట్టిమోదులు ఛీత్కారములు ననుభవించును, మలాదిహీనభక్షణముల తనువును బుచ్చును. ఆనాడీతఁడు దొంగిలింపఁడేమో యందురేమో! నక్కయెుక్కచోనీలనైచి యెుక్కచో గౌరి కళ్యాణ ముంబాడునా? ఏపాపమెఱుంగక యెుకమూల నొదిగి పడియున్న, కడచినదానికే కటకటంబడుచున్న మమ్ముంగొట్టనుంకించిన, యీ కట్టడి ధర్మముందప్పక విధినెఱవేర్పం గలఁడనుటయెక్కడి మాట? అట్టియెుప్పిదమె సంభవించిన మన మెల్లర మానందింప

వలసినదే కదా. అని మిన్న కుండెను. రాజును సభ్యులును నదియెటింగి ప్రజాధనాపహరణ పాపమున కెంతయు వెఅపందిరి. అదియంతయు వినుచున్న యానిందితుఁడును దనదుశ్చేష్టితమునకుఁ గరమను తాపమంది రాజును ధర్మాధికారులను బరిపరివిధములఁగుల విన్నపములొనరించి యాసారమేయముంగని, తనయవిచారతకు విలపించి క్షమింపవేడి యెల్లరియనుగ్రహమంది పోయి దుష్టతవీడిశాంత జీవితమును బుచ్చెను.

## దేవుని భక్త వాత్సల్యము

శౌనకాదులు సూతులంగాంచి మునివరా! దేవునర్చావతారమున విగ్రహరూపమున శంఖచక్రాదులు లేమి కింగారణమేమి? అదిమాకుంగడు వింతగఁ దోచుచున్నదన రౌమహర్షణి హర్షోత్ఫుల్ల మనంబుననిట్లని చెప్పసాగెను. ఓమునివరులారా! మీయడిగిన దెంతయు సమంజసము. శంఖభూపాలుడారీతినాలయనిర్మాణమొనర్చి దేవుని ప్రతిష్ఠించి యాతడు బిలద్వారమున ప్రతిదినంబును వేంకటగిరికింబోయి దేవుని దర్శించి పూజించి తనియుచుండెను. ఆతఁడుభక్త్యుల్లసిత హృదయుండై యాదేవునకుఁబెక్కుగ్రామముల నర్పించెను, సర్వాంగసుందరముగ దేవళంబులను మంటపగోపురాదులను సుదృఢములుగ నిర్మింపఁజేసెను. దేవుని భూతిమయరత్నజటిత దివ్యాభరణ భూషితుంజేసెను.

అట్లుండ నొక్కతరి నారాజు దేవుని నికటమున సేవలఁ దనియుచు నుండనటఁ గొందఱు శత్రురాజులు బలములతో వచ్చి పురమునాక్రమించిరి. సేవలు పూజలు నైన పిమ్మట రాజాపురమ్మునకుంబోయి శత్రు సమాక్రాంతంబగుట గాంచి సర్వశక్తులం బోరియుఁబరాజితుండై యత్యంతదుఃఖమున బిలద్వారమున దేవు సన్నిధికింజేరి పరిపరివిధముల బ్రార్థింపసాగెను. పాదములంబడియవమానంబునంగ్రుంగి విలపింపసాగెను.

తే॥ పాహి వేంకట గిరివాస పాహిపాహి
త్రాహిమాం దేవదేవేశ త్రాహిత్రాహి
రమ్ము రక్షింపరమ్మువేగమ్మ రమ్ము
నీవుగాకెందు లేరు నన్బ్రోవ నేరు ॥

మొఱల్విన్నదేవుఁడు నుండబట్టలేకపోయెనేమొ. ఆయర్చామూర్తి మోమునుండియె యిట్లుపలుకులు వెలువడియెను. బిడ్డా వెఱపందకుము. నీకు భద్రంబగును. ఇదుగో నా శంఖచక్రముల నీకొసంగు చున్నాను. గైకొనుము. వానితో నీవు పురంబునకుంబొమ్ము. ఆపైనంతయునదియు చక్కబడంగలదు.

అనుమండనే శంఖచక్రములారాజు దగ్గరకుంజేరెను. వానితో భూపుడును నగరిం జేరెను. చేరెనోలేదో వానిచేనట శత్రువులెల్లరు నిర్మూలింపఁబడిరి. దేశమంతయు నిష్కంటకమాయెను. ఆపిమ్మట నాయాయుధములు సర్వేశుంజేరెను. తోడన వసుధేశ్వరుడును కేశవుంజేరి సర్వేశు సర్వాత్ముఁబరిపరితెఱంగులఁగీర్తించి సాష్టాంగ వందనంబులాచరించెను. అంత దేవుండు ప్రసన్నుండై, నీకేమి కావలయును కోరికొనుము వరముకొసంగెద ననెను. దాని కానరపాలుండిట్టులనియెను. "ప్రభూ! ధన్యుడను, మీ యనుగ్రహమున శంఖచక్రప్రభావమున నారాజ్యము నిష్కంటకమాయెను. మీ యీ భక్తవాత్సల్యచిహ్నముగ జగమున సుయశము సుస్థిరముగఁదోపను నాకోరికందీర్పుడు. ఈయుద్భావతారమగు శిలామూర్తిని. శంఖచక్రములం బూనకుండు నట్లనుగ్రహింపుడు. అనెను. దేవుండును నట్లయగుకాక యని యంతర్హితుండాయెను. అప్పుడెదేవుతోడన మానవమూర్తియును గుడుసుక్కైదువును గనుమఱుగాయెను అటనావిగ్రహమునం గల [illegible], జొట్టువాలును మాయమాయెను. అది కారణముగ నప్పటినుండియు వేంకటాద్రి దేవుని. వెన్నునివిగ్రహమున జేతుల శంఖచక్రములు కానరాకుండెను. విష్ణురూపుండగు శ్రీ వేంకటనాథు విగ్రహరూపమున శంఖచక్రములు కానరామి కియ్యదియ కారణము. మనదేవుని శ్రీనివాసుని భక్తవాత్సల్య మసమానము గదా!

## వరాహతీర్థాదుల వర్ణనము

అంతట శౌనకాదులానూతవరుంగని, మునిపుంగవా! స్వామి పుష్కరిణీ పరిసరముల నాకమ గల ద్వి తీర్థము లేమి? వాని కధిదేవత లెవ్వరు? వానిప్రభావమేమి? వానిగొనితెచ్చిన దెవ్వరు? వివరముగ జెప్పవే, తరింపఁజేయవే యన వారికి నమ్ముని సత్తముండిట్లని చెప్పం దొడంగెను.

మున్యాదులారా! పెక్కుమారులు మీకుంజెప్పఁబడినయట్లు స్వామిపుష్కరిణి తీర్థంబులందెల్లఁబావనము, పుణ్యప్రదము, గంగయట్ల పాపహరము, దానికి వాయువ్యదిశను భగవంతుండగు కశ్యపమహర్షిచే గొనిరాబడిన వరాహతీర్థంబొప్పును ఎప్పుడు భూమ్యుద్ధరణార్థము ప్రార్థితుండైన మహావిష్ణువు యొక్క మహదంశమున మహాబలశాలి, భయంకర దంష్ట్రాధారి వరాహమూర్తి జనించెను. ఆద్దేవుఁడు వరాహమూర్తి రసాతలమునకుంబోయి మహద్బలు హిరణ్యాక్షుం దునుమాడి తన ముంగోరపై భూమినెత్తి పట్టెను. ఆదేవు వా పవిత్రమూర్తి లోకరక్షార్థము వేంకటాచలమునఁబరమేష్టిచేఁ ప్రతిష్ఠింపబడెను. వరాహదేవునివాసము, వరాహదైవాధిదైవతము, నైయొప్పున దా వరాహతీర్థము. అత్మభువు, ప్రజాపతి, జగత్స్రష్ట వరాహమూర్తి ప్రతిష్ఠ, తీర్థ ప్రతిష్ఠ

క్షేత్రప్రతిష్ఠ యొనర్చిన పిమ్మట దేవతలతో మునులతో గూడి తీర్థమాడియిట్లనియెను. ఇచ్చటకు వచ్చిన యెవ్వరు గాని తొలుదొల్త నీ వరాహతీర్థమున స్నానమాడి పవిత్రుఁడై వరాహమూర్తిని దర్శించి మ్రొక్కి శ్రీనివాసదర్శనమునఁదరింపగలరు. ఈ వరాహతీర్థమున మునుంగక, యీ వరాహదేవునర్చింపక వేంకటాద్రినాథుసేవింపఁబోయినను నాదేవుండు తనియఁడు, ప్రసన్నుండు కాబోడు, ఇదియ భగవన్నియమమని యొక పవిత్రమగు కట్టడ నుంచెను. ఆవెనుక సురజ్యేష్ఠుఁడు విధాత శ్రీనివాసుఁజూచి పెక్కుతెఱంగులం గీతంబులఁ గీర్తించి దేవుపదపద్మమ్ములు పట్టికొని నాచే బ్రతిష్ఠితమైన యీ వరాహదేవుని పూజతొలుదొల్తఁ గావలయును, దాని ననుగ్రహింపుమన నాయవ్యయానందమూర్తి వేకంటేశుండును, అద్దేవు పూజయు నాపూజయేకద. అట్లనే యగుగాత మని యనుగ్రహించెను. ఆనాటినుండియు వరాహ శ్రీనివాసదేవుల పూజక్రమమున జరుగు చుండెను. 2.ఉత్తరమున గుబేర తీర్థము కలదు. అందునస్నానమొనర్పనెల్లపాపములు నశించును. ధనసంపదలును జేకూరును. అద్ధిధనదునిచే బ్రతిష్ఠితమాయెను. దానికీశానదిశగ గాలవమహర్షిచే నిర్మితమైన 3.గాలవ తీర్థముకలదు. అందుమును కలిడిన, జలములు మనసారంగ్రోలిన వారికి, భుక్తి ముక్తులు రెండును నలవడును. పూర్వభాగమునఁ చిరజీవియగు మార్కండేయునిచే నెలకొల్పఁబడిన 4.మార్కండేయ తీర్థమున్నది. దానందానమాడిన హ రతనియట్లు చిరజీవులు కాగలరు. ఆగ్నేయదిక్కున బాపమోచనమును, నగ్నిస్థాపితమునగు 5.నగ్ని తీర్థమొప్పును, దక్షిణమున నరకయాతనలు తెరలింపంగలయట్టి, యమనిర్మితమగు 6. యమతీర్థము తనరారును. ఆదావుననె నైరృతి దెసను వసిష్ఠమున్యానీతమగు ఋణబాధల నెల్లఁదొలఁగించు, 7. రాక్షస తీర్థమువెలయును. పశ్చిమమున సద్యః కైవల్యము నొసంగంగల 8. వాయుతీర్థమొప్పారును. వానికి నడుమన మహాపాపములయు నాశనమొనరించు 9. సరస్వతీ తీర్థము చెన్నారుచుండెను. ఈ చెప్పిన తొమ్మిది తీర్థముల నేనరుఁడు ఒక్కదినంబున స్నానంబులొనరించి శ్రీనివాసదేవుని దర్శనంబునొనరించునో వానికింబునర్జన్మంబులేక ముక్తి చేకూరును. 1. స్వామి పుష్కరిణీ స్నానము, 2. శ్రీనివాసదేవునివేంకటేశుని దర్శనము, 3. సహస్రనామపఠనార్చనంబు తప్పకనాచరింపవలసిన కర్మలు. వీనికిందోడుగ నవ (తొమ్మిది) తీర్థముల స్నానం బొనర్పనెంతయుమేలు. ఆ పుణ్యఫలమున కవధులే లేవనవచ్చును. శ్రీ వరాహదేవుని దర్శింపక యీ చెప్పిన నవతీర్థంబుల స్నానం బులొనర్పక పోవువాని జతనంబులంతగ ఫలింపవు, భగవంతుని పలుకులందు భక్తి శ్రద్ధలును, విశ్వాసానక్తులునుంచి యాదేవుచెప్పినటుల నడచికొనుచు నెల్లధర్మముల నొనరించుచుంబోవు మానవుఁడు ధన్యుడు, సుకృతి, భగవంతు ననుకంపనుఁ బొందఁగలవాడు కైవల్యానందముం బొందంగలండు.

## తీర్థయాత్ర వైభవము

తీర్ధయాత్రయందలి విధియేమి? దానికిందగు కాలము, ఫలితమునేమి? సర్వమును మాయందక్కటికంబూని చెప్పవే! యన నామునియిట్లనియెను. తీర్ధయాత్రల కేగుట, దివ్యతీర్థంబులం మునుగుట యెంతయు మేలు. కానియెట్టి పవిత్ర కార్యముననేని భావముప్రధానము. పవిత్రభావమున దాని పవిత్రత యినుమడించును. భావముచెడుగైన ఫలితము శూన్యమగుటయే కాక బెడిసికొట్టనుగలదు. యాత్రలభావమును, నాచరణక్రమమును, నెఱింగి యాత్రల నొనరించువాఁడు ధన్యుఁడు. యాత్రలకుం దొరకొనువాఁడు మఱిపాపకార్యములచేతకును, వాని తలంపులకును బాసియుండ దృఢమగు పూన్కిపూని జీవితమును. బవిత్రపధమునం బెట్టవలయును. అట్టి వానినే దేవుఁడనుగ్రహించి, గతమును క్షమించి భావిని నిహపరముల నొసంగి ముక్తింజేకూర్చును. భగవంతునందు భక్తి విశ్వాసములుకలవాఁడు పాపముల పొంతకుంబోనొల్లడు పోడుపోడు. పావంబననేమందురా? ఇద్దియెఱుంగుట యెంతయు సులభము. ఇతరులు తనకేమిచేయఁగోరునో, తాను నన్యులకదియె చేయందగును. అన్యులేది చేసినఁ దనకుంబాధయగునో దానినన్యులకుందానును జేయరాదు. అట్టుకాదని చేయుటయ మహాపాపము. త్రికరణముల నేకరీతింబవిత్రత నలవరచుకొనవలెను. అదియ పుణ్యమునకు, ధర్మమునకుఁ గొలబద్ద ధర్మములకెల్ల నాధారము సత్యము. సత్యమె దైవము. అహింసయె పరమధర్మము. భావమునఁగాని మాటలంగాని, చేతలంగాని, యన్యుల మనమునకుంగాని, తనువునకుంగాని బాధకలిగింప కుండుటయె యహింస. అదియె మొదటి ధర్మము. అట్టిసత్యాహింసలనారాధించువాఁడె, యాచరించువాఁడె భక్తుఁడు, భగవదారాధకుఁడు. అట్టివాఁడెల్లపున్నెములంజేసినవాఁడు. ఎఱుకగల్గి గతముందలంచి, భావినూహించి, ప్రస్తుతముందిద్దికొని, యాత్రలు గావింపవలయును. బాల్యమాదిగనియత జీవితమున, ననురక్తిని విద్యనర్థించి, పడసినవాఁడై గురుజనుల భక్తిశ్రద్ధల సేవించి శాస్త్రవిధి విధానంబుల యాత్రలు గావించుటలోనె సుఖముకలదు. సద్గురువుల సేవలనైన, యాత్రలనైన సన్మతి నొనరింపం దగును. నిత్య, నైమిత్తిక, కామ్యములని కర్మలు మూఁడు విధములు. అందీతీర్ధయాత్రలఁ బెద్దలు నైమిత్తికములని కొనియాడిరి. కావున నెఱిఁగి చేసిన యాత్రలుత్తమోత్తమము లగును. తీర్ధజలముల మునుకలిడుచు నందిన ప్రాణులనెల్లఁ బట్టి రక్షముంబిల్చు జెలగముక్తికింజనునె? తెలిసి పావనమతి యాత్రలొనరించునతఁడే, నత్యాహింసలను, సే వానక్తిని బొందిజీవించునతడే యిమ్మడి, ముమ్మడి నత్ఫలమంది, యిహవరములొంది, ముక్తిగామికాఁగలడు.

సజ్జన సంగతుఁడై, సత్కథలాలకించుచు, సత్కర్మాచరణంబుల సన్మతి యాత్రలంగావించు నతఁడె పాపములెల్లఁ దొలంగి బ్రహ్మనిర్యాణమందఁగలడు. మనుజుఁడు సత్కర్మంబుల, విద్యుక్తంబుల, మానకచేయందగును. ఆచేయు కర్మల, ఫలాసక్తిని వీడి, కేవల కర్తవ్యములుగ నెఱింగి, భగవదర్పణబుద్ధి నొనరింపఁదగును. ఫలాసక్తిలేని కర్మాచరణము చేతనే పరమపదము చేకూరును. కర్మాచరణమున, ఫలాపేక్షయే జనన,మరణములకుఁ గష్టసుఖముల కారకము. సద్విద్యా సంప్రాప్తిని విజ్ఞానమునొంది, కర్మణ్యుఁ విద్యుక్తము వీడక, యాపేక్షనొందక, కర్తవ్యకర్మ లొనరించు వాడు ఐహికాముష్మకములందియు నీటందామరాకుంబలె వానినంటక పరమపద మందును. విద్యాప్రాప్తిచే మననశీలుఁడగును. మననశ్రవణంబులచే, శ్రద్ధాసక్తులొదవును. శ్రద్ధాసక్తులచే భక్తికలుగును. భక్తిచే భగవానుఁడు శ్రీహరిప్రసన్నుండగును. యాత్రలు, శాస్త్రాలాపంబులు, శ్రవణమననంబులు నొనరించుచు, దేవునెఱింగి, ప్రసన్నుంజేసికొని, తరింపందగును. తొల్లిదేవతలు, వసిష్ఠాది ఋషులు, నెల్లరు మహాత్ములును, శాస్త్రంబులలీనులై, తీర్థంబుల నధివసించి, భగవాను నధోక్షజునర్చించి, యాదేవుంబడసి తరించిరి. పవిత్ర భావముతో దృఢ విశ్వాసముతో నొనర్చిననే యాత్రాఫలము, తీర్థస్నానఫలము, కోటిగుణితమై ఫలించును. అదిలేనినాడంతయు వ్యర్థము. విద్యా వినయసంపన్నుండై సత్సంగమున సత్కథలాలకించుచు, సదాచరణ తత్పరుండై మనసును మార్చికొని జీవితమును సత్పథమునకు మరల్చి తీర్థయాత్రావైభవముల నెఱింగి, భక్తి శ్రద్ధలతో విశ్వాసముతో, నాచరించు నాతఁడు పాపవిదూరుఁడై యిటనట సుఖములంది కడపటఁ బరమపదముంబొందఁగలఁడు. ఎందెందు నెవరెవరు తీర్థయాత్రలంజేయఁ బోయినను తన్నియమములెఱింగి, భగవదర్పణమ్ముగ తూచతప్పక యాచరణమున నుంచి సత్ప్రవర్తనులు, సదాచరణులునై తరింతురుగాక. ధనధాన్యాదికములు, గలకలుములు వేంకటాద్రిదేవున కర్పణంబుగఁ జేసిజీవితము దేవునకై కడవనేర్చి యలసటలేని యవిరళోత్సాహమున సాగింతురుగాక.

## వివశు చరిత

మున్నొకపత్తనంబున నొకయువకుండు వివశుండనువాఁడుండెను. వాఁడు విద్దెలంబడయ గురువులకడంజేరియు నావిద్దెలయందాసక్తి లేనివాఁడై యిచ్చవచ్చినరీతిం జరించుచుండును. ఎందేనియువతులు రూపవతులు కండ్లఁబడిన నోటికి వచ్చినటులం బ్రేలుచుండును. పరులెవ్వరును గనకుండఁ గొంగులులాగియు, జడలూచియు మొదలుగ నవమానములకుంబాలువఱచుచుండును. అటగురువుల కడంజేరి వారియానతిం

దలఁదాల్పక యుంటయకాక వారేమేని దుండగమును మానుమన్నఁ గష్టించిచదివి విద్యనభ్యసించుమని యన్నవారింగొట్టఁజూచును. ఇటులుండ నొకనాడు వానినొకగురువు దౌష్ట్యమునకుంగినిసి యిట్టిచేతలు నీకుందగవని గట్టిగ మందలింపఁ గినిసి తెఱువునం బడిపోవు నాగురుని వాఁడు రాతంగొట్టి పడఁగొట్టి గిట్టించెను. తలిదండ్రుల మాటలెందును సరకుచేయువాఁడుకాఁడు. ఇట్టివిట్టివె యెన్నెన్నో పాపముల వాని జీవితము నడచెను. వానిపాపములెల్లంబండెనోయన వానికి శ్వేతకుష్ఠరోగ మావహించెను. వానిపాపంబులిన్ని యన్నియని యేమియెన్ననగును. ఒకవంక గురుద్రోహము, మఱియొకవంక పరవనితలకు నవమానాచరణము, తలిదండ్రుల నిరాదరణము, ఇట్టివెన్నెన్నియో పాపకార్యముల భయంకర పరిణామమే వాని యారోగము. అంతియకాదు. వానియారోగ మానాట కానాఁడు వింత వికృత రూపమునఁబెంపుకన, వానిపడు పాటులకు వెతలకు మేటికాన రాకుండెను. దేహము ముక్కముక్కలుగనై, యవయవముల రూపులేక పుండ్లతోఁ జీములు కట్టి క్రిమికీటకములు మీఁదఁబడి తొలుచుచుండ వానిందోలుకొను శక్తి యుంజాలక వానిపొందు యాతనయమయాతన యెయనవలెను. లోకనిందయు మితిమీఱనెవ్వరును వాని మోముంగూడఁజూడ నేవగించి తొలంగిపోసాగిరి. ఒకనాఁడాకస్మికముగ వానియింటి కగ్గియంటికొని యున్నదంతయు దగ్ధముకాగా నయ్యోయను వారేలేకపోయిరి. బందుగులుంబాసిచనిరి. వాఁడూరుననుండఁ జాలక రేయికి రేయి గుంటుచు దొర్లుచు దొర్లుచు నెట్టులెట్టులో బయటకుంబోయెను. అటవానినక్కలు కండకండగఁబట్టి లాగికొనిపోయిరి. ఆభయంకర నరకలోకమున నాతఁడనుభవింపని యాతనలులేవు. అందెన్నెన్ని విధముల నరకయాతనలు కలవన్నియు నాతనికి ననుభావ్యము లేయయ్యెను. అటవాడు పొందుదుఃఖమెంతెంతయో. వానికి విముక్తియే లేనటులుకాఁగాఁదనగత జీవితమునకెంతదురపిల్లెనో. ఎంతవంతవందిన నేమగును? అదియంతయు గతజలసేతుబంధనమేయయ్యెను.

ఇట్లెన్నెన్నియో వత్సరములు గడచిపోగా వానివంశాపత్యమొకండు పావనుండను వాఁడు వానిపాపజీవితమునెఱింగి తలంచివగచి వేంకటాద్రికింజేరి పవిత్రహృదయమున గాఢమగు దైవభక్తితో విశ్వాసమతిశయింప నొకదినమంతయు, రేయియుంబవలును నాదేవుని కటమున దీపము వెలిగించి యారాధనముంగావించెను. ఆపుణ్యఫలమున నావివశునియు ఘోరపాపములన్నియు సూర్యునికటమున విరిపిచనిన చీకటులటులఁ దొలఁగిపోగా విధ్వస్తపాపుండై యమదూతల ధిక్కరించి విష్ణులోకమునకుంబోయెను. ఆహ్హారే! వేంకటాద్రిని విశ్వల భక్తిని వెలిగించిన దీపారాధనఫలంబు వెలిగించిన వానినే కాదు వానివారిం దరింపఁజేసెడిదగునుగదా!

దేవు నికటమున నిర్మలచిత్తంబున భక్తిశ్రద్ధలతో దీపారాధనమొనరించునతఁడు మఱి దుఃఖమెఱుంగకయుండును. నిత్యసుఖానందములందేలియాడును. అంతయకాదు. అటశేషశైలమున దేవదేవునికటమునఁబవిత్రహృదయముతో నేచిన్నక్రియ యొనర్చినను, నింతదానమొనర్చినను నదియెంతెంత యోకాగాఁ గల్పాంతమ్ము దనుక నవిచ్ఛిన్నముగఁ బుణ్యఫలంబునొసంగుచునే యుండును.

దివిని దేవజన్మముకంటెను భువిని మానవజన్మము శ్రేష్ఠము. ఇటభూమిని వారొనరించిన పున్నెముల ఫలమనుభవించుటకేనట స్వర్గమునవారిపుట్టువు. అటమోక్షము నొందఁదగు కర్మలు పొనరింపవారికధికారవములేదు. చేయనుజాలరు. ఆపుణ్యఫలానుభవము పూర్తికాగావారు మఱల భూమిని బుట్టవలసినదే; కర్మాను సారముగఁ బ్రవర్తించి ఫలములననుభవింపవలసినదే. ఇకమానవులకన్ననో,వారి ప్రారబ్ధములనుభవించుచున్నను ముక్తింబొంద సత్కర్మల సన్మతి నొనరింపఁ దరింప నధికారము కలదు. కావుననే సద్గతికి, మోక్షమునకుంబోఁదగు సత్కర్మల సన్మతి నొనరింపం బెద్దలు ప్రేరేపించుట, దేవునుద్బోధ. అట్టి సర్వోత్కృష్ట మగు మానవజన్మ మెత్తియు దుర్మతిని తమమానవతనే వమ్ముచేసికొని దుర్గతులకుం బోవునాయధమజీవినే మనవలెను. కావున మానవులము మనము, కాలమునేమియు వ్యర్థము చేయక సన్మతిని సత్కృతులఁ దరింపఁదగు మార్గమున చరింతముగాక.

## వేంకటాద్రికింగల పలునామములు - దాని మహాత్మ్యము

పూర్వమున నొకపుడు ముల్లోకములందిరుగుచు మహతీవీణను గొని మీటుకొనుచు శ్రీహరింబాడికొనుచు నారదముని నత్తముఁడు మహాత్ముఁడగు భృగుమహర్షి యాశ్రమమునకుంజనెను. వచ్చిన దేవర్షింగాంచి నయంతన యా తపోధనుఁడు శిష్యులతో గూడి లేచి యెదురు వచ్చి యర్ఘ్య పాద్యాదులిచ్చి యర్ఘ్య పూజలనర్చించి కుశల ప్రశ్నలైన పిమ్మట నిట్లనియెను. ఓ నారదభగవానుఁడా! మీరెందుండి యెందేగుచు నిటకరుదెంచిరి? తెలియ జెప్పవేయన, దేవర్షివర్యుం డిట్లనియెను. ఉత్తమోత్తమ తీర్థంబుల నొప్పు, నవ్య యానందస్వరూపుడు. శ్రీమహావిష్ణువు లక్ష్మీ సహితుఁడై దివ్యవిహారముల విహరించుచు నెందు భక్తజనులకుం బ్రత్యక్షముగఁదోచి వరదానము లొసంగునో, యెచటఁదపమాచరించినఁ దాపసులకుందొందరగ సిద్ధిచేకూరునో అట్టి పవిత్రశేషశైలము నుండి నేవచ్చుచున్నవాఁడను భగవన్నివాసమగు నాశైలరాజమునకుం గల నామము లెన్నియో మహాత్మా! ధన్యతపోధనాయాలింపుము.

ఉత్తమక్షేత్రము, ఉత్తమ తీర్థస్థానము భూమండలమున వేంకటనగనామకంబు. అద్దియెల్లపాపముల వినాశమొనరించునదైపుణ్యముల నెంతయుఁబెంపొందించునదై యొప్పు పవిత్రక్షేత్రము. అద్దాని వర్ణించి చెప్ప వాణీధవునకును గాదు నెల్లదేవతల కారాధ్యదైవతంబు, భక్తవత్సలుఁడు, కమలాకాంతుఁడు వైకుంఠముంబాసివచ్చి కలుముల చెలితో గరమనురక్తి వినోదవిహారముల నానందించుచుండును. దానికి నంజనాద్రి, శేషశైలము, గరుడాచలము, తీర్థాగము, శ్రీనివాసనగము, చింతామణిగిరి, వృషభాద్రి, వారాహపర్వని భృత్తు, జ్ఞానక్ష్మాధరము, కనకకుధరము, నానందాహార్యము, నీలశిఖరి, సుమేరు శిఖరాచలము, వైకుంఠ గ్రావము, నారాయణధరాధరము, పుష్కర పర్వతము, మొదలుగా గలపలునామముల నొప్పుచుండును. బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులుగాని మఱేజాతి వారుగాని స్త్రీలుగాని పురుషులు గాని పవిత్ర భావమున నీ నామముల మననము సేయు వారును, ఎల్లపాపబంధనములుందెగి నశింప ముక్తిగాములగుదురు. ఈ బ్రహ్మాండ మందెందును నావేంకటాద్రికిం దుల్యమగు దివ్యక్షేత్రము లేదు. అందలి తీర్థములకవ్వియే సాటికాగా వేంకటాద్రీశుఁడే దేవుఁడు వేరొండు దేవుండు లేడు; లేడు. ముందును గలుగఁబోడు.

ఇంతయు విన్న భృగుముని తిలకుఁడు నారదుంగని, యాదేవుండుత్తమమగు వైకుంఠమునుగాఁదని వీడి తానై వచ్చి యావేంకటగిరి నేలనివాసమొనర్పవలసి వచ్చెను? చెప్పవే యన నారదుండిట్లనియెను. ఒకప్పుడు నేను నారాయణ దేవుం దర్శింపఁ బాల్కడలికింబోయితిని. అక్కడఁ గాంతివంతము, ప్రతిభాన్వితము శ్వేత ద్వీపముం గనుంగొంటిని. అందుఁగల్పద్రుమ వన మధ్యమున ననేకామితోజ్వల రత్నజడితములు, సువర్ణమయములు నగు స్తంభముల శోభిల్లుచుఁ బెక్కు దినకరు లొక్కుమ్మడి నుదయించినట్లుల బ్రకాశంబున నొప్పు నొక్కదివ్యభవనంబును, దేవ శ్రేష్ఠులకుం బ్రాప్యంబు కాని దాని, భక్త జన సుగమ్యంబగుదాని గనుగొంటిని. అందుదేవుని శ్రీవిష్ణుని వైనతేయ, సహస్రఫణాదిపార్షద సంసేవితుఁడై పేరోలగమునం గొలువు దీరియున్న వాని గాంచితిని.

ఆహాయేమి యాదివ్యతేజము! వెడదలగునాకన్నుదమ్ముల నుండి కురియు జాలివెన్నెల, నామోమందమును జెప్పనెవరికగును. అదో! జీవుల కెల్ల నేకైక కారణ మాదికారణ మాప్రభువు. తెల్లని కాంతులంజిమ్ము నాయనంత శయ్యను వేవేల మెఱుపుల వెలుగులఁ జిమ్ము బంగరు బట్టతో నీలమణి కాంతులం జిమ్ము దేహముతో, విపుల శ్వేతనగమున విద్యుత్కాంతుల వెలయు కాలాభ్రమునట్టి యాదేవుంజాడనేవలయును. అజ్జారే! యిరువైపుల నాలోకమాతలు భూదేవీ శ్రీదేవులు కూరుచుండి పదము

లొత్తుచునున్నారు. దుష్టులశిక్షింప శిష్టుల రక్షింప నొడయలు శంకచక్రము లిరుపజ్జల నాశ్రీదేవునాజ్ఞలకై వేచియున్నటులున్నవి. చెక్కులపైఁగాంతులఁ జెలగాటలాండించు చెవులకుండలము లొప్పుచుండ శ్రీవత్సలాంచన విరాజిత విశాల వక్షము నొప్పవైజయంతి మాలావిభూషితు, కోటిసూర్యప్రభాభాసిత కిరీటోజ్జ్వలోత్తమాంగు, సౌందర్య రజోదధి సకల పాపహరుఁ గౌస్తుభమణి మండితు, మణి మౌక్తికహార విరాజితోరస్థలు, చందన కర్పూరాది సుగంధ విలేపన విరాజితు, శుకభరద్వాజ మార్కండేయాంబరీష యాజ్ఞ వల్క్య పుండరీ కాదిమహర్షులు చుట్టియుండఁదనయట్ల శంఖచక్రాది చిహ్నములం బూని యున్న ప్రహ్లాదాది భక్తవరులు పరివేష్టించియుండ సనకసనందాది యోగి వరులు ప్రస్తుతు లొనరించుచుండ వినోదించుచున్న వాని యోగ్యజనులకు భోగములు, సుఖానందములు, భుక్తి ముక్తులు నొసంగువాని, వెఱపుగదుర, వినయ వినమ్రులై, బ్రహ్మాదులు నికటమున నిలిచి సేవింప సాదరమ్మునఁదనుపువాని, జగన్మోహనుని శ్రీనివాసునినేఁ జూడగంటిని. అప్పుడాదేవుఁబలుతెఱంగులఁ బ్రస్తుతులొనరించి, తలవంచి, నమస్కరించి, భక్తి తన్మయత నట్లే నిలిచియుంటిని. నన్నుంగని వంతన యాదేవుండును ముద్దుల మనుమడా రమ్మురమ్ము. ఇటఁగూరుచుండుము యనుచు మిక్కిలియుఁ బ్రేమ సంభరిత నయనమ్ములం జూచుచు నరుణాధరమ్మునఁజిఱునవ్వు చిందులాడ నిట్టులనియెను.

నాయనా! నారదా! నీవెల్లలోకంబులందిరుగు చుందువు. నీవు కానని తావులుండవు కదా! నాయుండుటకు, విహరించుటకు, హాయిగ విశ్రమించుటకుఁదగిన మంచివసతుల నొప్పుతావెందుఁగలదు. అట్టి దెందేనియున్న వచియింపవే యన్న నేనిట్లంటిని. ప్రభూ! ముల్లోకముల మీయెఱుంగని తావెందుఁగలదు. నాయందున్న ప్రేమాధిక్యముననే మీరునన్నడుగుచున్నారు. అంతియకాదు మీరు కావలయుననుకొన్ననెక్కడనేని యట్టియనుకూల మగుతావును సృష్టింపంగలరుకదా! అగునగు మీకు విహార యోగ్యమగు రమణీయప్రదేశమొండు నేగాంచితిని. వింతయు వినోదమునుంగొల్పు నాతావున కుద్దియగు నెడనెందుంగానను. ఆ మనోహరస్థానము మీపాదపద్మోద్భవమగు పావనగంగానదికి దక్షిణముగ రెండువందల యోజనముల దూరమున దండకారణ్యమునఁ బూర్వసముద్రమునకుఁ బడమటి దెసనేబదిమైళ్ల దూరమున నొప్పుచున్నది. అయ్యో! దేవ! అందలి ప్రకృతి యెంతయునందమైయొప్పి నటనుండు మనుజులు హృదయ వికారులైయున్నవారు. వారు కలిమల సంకలితులు. వేదములకుం దూరులు వేదా ధ్యయనమును ధర్మచింతయు లేనివారు. ఇక సామాన్యుల మాటఁజెప్పనేల? మానసిక చింతల రోగముల సంగ్రస్తులై యున్నవారు. వారు పట్టి పోవున దెల్ల చెడ్డమార్గములనె. నీపాదచింతనయె వారెఱుంగరు. వారలనను గ్రహింపనైన నీవచట నెలకొనందగును. అచట నీయునికి చేనైన వారు తమ కలుషిత భావములు వీడి, పట్టిపోవుచున్న పాడుపంథలు విడిచి పవిత్రులై పూతభావులై తరణోపాయముంగాంచగలరు. అనవిన్నయా దేవుడు

నాతో నిట్లనియెను. అట్లయగుఁగాక. భావినిఁగొంతకాలమునకుఁజోళరాజునకుఁ జక్రవర్తియనునొక కొమరుఁడు కలుగఁగలఁడు. అతఁడు మద్భక్తుఁడైయనన్య శ్రద్ధ నన్నర్చింపఁగలఁడు. అతనినను గ్రహింప నాఁడటనే నెలవుకొనఁగలను. అదియనాకు వినోద విహారస్థానము కాఁగలదు. అనుచునటనున్నయాది శేషుంగని చిరజీవీ విన్నాఁడవు గదా! నారదుపలుకులు. నా యిష్టులందెల్ల నీ విష్టుఁడవు. కావున నోయనంతా! నాకైయొక యిష్టకార్యంబొనరింపుము. నారదుఁడు చెప్పిన యాతావునకు రయమ్మునఁ బొమ్ము. అటనాక్రీడలకుందగుమంచి చోటుంగని యయ్యెడ నీవు నొకసురమ్య పర్వతంబవె నెలవుకొని యుండుము. ఇయ్యదియ నాకోరిక. తగుసమయం బుననేవచ్చియట రమారమణితో నివసింతును, విహరింతును. అనుచున్న దేవునుత్సాహోత్పుల్ల వచనంబుల నాలించి యాతడవుల నిడుపడు తనిసి తబ్బిబ్బయి జేజేల జేజేఁగని యిట్లనియెను. దేవా! ధన్యుడను. అనుగ్రహింపఁబడితిని. నేబోయియటఁగొండగ నుందును. మీరటనాపై వసియించి సానువులఁ గందరములఁ దటముల విహరింపుడు; లీలావినోదము లొనరింపుడు. మీ యాజ్ఞనట నాపైఁబలు నదులు తీర్థములు సరసులు వెలసివిలసిల్లుం గావుత. అటఁజేరిన వారితపసులు తొందరగ ఫలించుగావుత. చరాచరులగు జీవులటఁజేరి కొల్చిన వారికోర్కులు ఫలించి సుఖించి తరింతురుగాకయని ప్రార్థించెను.

దేవుఁడాతనివినతులెల్ల మన్నించి యిట్లనియెను. ఓయీసహస్రఫణా! నీయడిగిన వెల్లనగుఁగాక. ఇందునీకైకోరిన దేమియులేదు గదా. నీపరోపకార చింతయు నౌదార్యమును నెంతయు మెచ్చఁదగినవి. అచ్చట భక్తి శ్రద్ధల నొనరించు, తపంబులకు, దానధర్మములకుఁ గొంచెమునకె కొండంతగ సంతసింతును, ఎంతెంతయొ ఫలసిద్ధిం గూర్తును. మనసున నన్బట్టిన ప్రాణుల కెల్ల నే దర్శనంబిత్తును, గోర్కులు దీర్తును. శ్రీభూనీళాసహితుఁడనై నేనటనెయుండి తనిపి యెల్లరఁదనియింతును. అనియచటన చెంతల నున్న ప్రసన్న ముఖులఁ బద్మదళాక్షుల ఇందిరా నీలలంగని భగవంతుండిట్లనియెను. శోభనవతులారా! మీరు మీచెలికత్తెలతోఁబోయియట నిలువుఁడు. నారదుతలఁపు ననునరించి మేమాతావును క్రీడాస్థలముగ నొనరించికొనఁబోవుచున్నారము. అనెను. వారుమ వల్లె యన నా దేవుఁడట నిజసేనానింగని విష్వక్సేనా నీవును నిపుడె నీపరివారముతోఁ బార్షదులతో, బ్రహ్మరుద్రేంద్రాది దేవతలతో, యక్షరాక్షస సిద్ధ సాధ్య విద్యాధర, కిన్నరులతో, నాగులతో, ఋషిముని యోగులతో శేషాద్రికింబొమ్ము; ఆలసింపకుము. మేమునట లచ్చితో, పుడమిపడతితో, నీలాసుందరితో నివాసముంజేయఁ బోవుచున్నారము. అటనుండియె సాధు సంయములనను గ్రహింపంబూనితిమి, అనియెను. ఆమీద నెల్లరితో దేవుఁడును దేవేరులతో గరుఁడారూఢుడై శేషాద్రికిం బోయెను. అనిచెప్పిన నారదు నాలించిన భృగుమహర్షికలహాశమునంగనియిట్లనియెను.

# శేషుని శైలరూపము - శ్రీశైల మహాత్మ్యము

ఓ మునివరా! శేషుఁడే శైలంబాయెనంటిరిగదా. ఆతని శిరః ప్రదేశంబెట? పుచ్ఛమెచ్చట? అననారదుండిట్లనియెను. ఓభృగువరా! అదక్షిణ కైలాసమను, ప్రసిద్ధినందిన కాళహస్తి నెఱుంగుదురు కదా! శుభములంగూర్చు శంకరునకు నిలయమగు నదియ యాయనంతుని తలకడం గలదు. అట కుత్తరమున దూరమునంగల శ్రీశైలమను పేరున విఖ్యాతమగునది యాతనితోకగఁజెప్పఁబడుచున్నది. ఆశ్రీశైలనగరాజమున భవ్యమగు నీలకంఠాశ్రమ మొప్పును. అందుండి వ్యాఘ్రపాదుడను మునివరుఁడు, జితేంద్రియుఁడై నియమమున నీలకంఠుంగూర్చి చిరకాలము తపమొనర్చి యాతని సంతృప్తునిజేసెను. దేహార్ధ భాగంబున లోకమాతభవాని యెప్పియుండ గైలాస మట్టులఁదెల్లనికాంతులనొప్పు వృషభరాజము నధిరోహించి ప్రసన్నచిత్తుఁడై చుట్టును ప్రమదులు నురసిద్ధ గంధర్వాదులుం గొల్చిరాగ గరుణామృత రసవృష్టిం గురియించుచుఁ గోరిన కోర్కులెల్లందీర్చి భక్తులం బరితృప్తుం జేయు కోరికను వచ్చియట చంద్ర శేఖరుఁడు ప్రత్యక్షమై మునికెదుట నిలిచెను. దేవునింగన్న యాతఁడు మోదము ముప్పిరిగొననిట్లని ప్రార్థించెను.

శా॥ శ్రీకంఠా గిరిజామనోహర నినుం జిత్తంబునం దెప్పుడున్
బాకారి ప్రముఖాది పూజితపదుం బ్రార్థింతు, నీదీను న
స్తోకంబైన కృపారసంబునఁగడుం దోగాడుచు న్వచ్చి వే
సాక న్బ్రోనిన మీదు ప్రేమ నహహా శక్యంబెయూహింపఁగన్

ఆ.వె॥ భక్తి నెడఁద మిమ్ము భావించినంతన
దోసమెన్న కపుడె తోతువోమ
నుబ్బులింగఁడనఁగ నొప్పెదు కారుణ్య
మూర్తి భక్త వరద మొగుతుకైలు

కం॥ పుట్టింతువు పోషింతువు
గిట్టింతువు లోకములను గ్రీడగసతమీ
వెట్టిడివో నీయాటల
బెట్టెదు మము సిలుగుల నివి వేడుక లేమో

కం॥ కన్నుల పండువుగా నా
పన్నశరణ్యుండ! కానఁబడినాడవయా
యెన్నగనిదెపదివేలుగ
పన్నగ భూషణ గిరీశ పశుపతి యభవా!

కం॥ చిక్కవు జపములఁ దపముల
జిక్కవు దానముల, భజన చేతల; నెడఁదన్
జిక్కని భక్తిని గొలిచినఁ
జిక్కిన క్రియ; నెఱిఁగి కొలుతు శితికంఠహరా !

కవిరాజ విరాజితము
ఒడలిసగంబున నుర్వీ ధరాత్మజ
యొప్పుగ నౌదల గంగమయున్
జడలను జాబిలి, రేఖయు మేనునఁ
జక్కనలందిన బూది పొడల్
తొడవులు గాగ భుజంగమ సంతతి
తోరము ప్రేమరసంబెడఁదన్
గడుకడు నొప్పఁగఁ దోఁచిన దేవర
కావుమ యోగిజనాభరణా!

తే॥గీ॥ గుండెనిండుగఁ బ్రేమ; మైనిండబూది.
ఔదలను గంగ జాబిలి; యగ్గినుదుట
రమణి సామేన, మిగుల విరక్తి మదిని
పొంతనంబెందు? దేవ! నిన్నుబోని కొల్తు

ఆ॥వె॥ మునులు, సురలు, పలుకుపొలతి, యనంతుండు
నిన్ను నెన్నఁ జాల కున్న యెడల
నెంతవాడ నిన్ను నెన్నిక వినుతింపఁ
గామితార్థ దాత! కామదహన.

వ॥ దేవ నీవొక వింతసమస్య నిన్నుఁదెలియఁ జెప్పనుగా దేరి కైన గాని నిర్గుణుడవీవు నిర్వికారుడవు నీవు. రూపమేలేని నీసృష్టి రూపమయము॥ అద్ది త్రిగుణాత్మకము శుద్ధవికారము. నీవు విషమనేత్రుఁడవు కాని సమదృష్టి నీది॥ ఐశ్వర్యవంతుఁడ వాది భిక్షుడవు. అణువునకణువగు నీవంతట నిండియుంటివి. మహత్తునకు మహత్తునీవు అణువునను నిమిడియుంటివి. నిన్నుఁదెలియుదు మనువారును దెలిసితి మనువారును దెలియని వారలె. నిన్ను నీవయెఱుంగుదువు; ఒరులకుంగాదు తెలియ నీవిట నాకన్నులకుందోచితి వన్ననది నీ యపార కరుణయు.

అనుచు మఱి మాటరాక యతఁడట్లు నా దేవునెదుట నిర్నిమేషుఁడై కనుచు నుండి పోయెను. వానింగనుచున్న శంకరుఁడు నిట్టులనియెను.

వత్స! నీతపంబున కెంతయు మెచ్చయ్యెను. నీకోరిక నీయ నేనిటకు వచ్చితిని. కోరుమా! యిచ్చెదనన విని మునియిట్లనియెను.

కరుణాసాగరా! సర్వలోకైక కారణా! విశ్వాకారా! భగవంతుఁడా! వృషధ్వజా! ప్రసన్నుండవగుము. ప్రసన్ననయనా! సూర్యచంద్రులె చక్రములుగ గలిగిన భూమియె రథముగ, వేదములె యశ్వములుగ, వేదకర్త బ్రహ్మయ సారథిగ, ముక్కోటి దేవతలకిరవగు మేరువె సుదృఢ కార్ముకముగ, దానికి వాసుకియ మౌర్విగ, దానవాంతకుఁడు దామోదరుఁడె బాణముగఁ జేసికొని త్రిపురములు బూదియొనర్చిన యో త్రినయనా! చంద్రమౌళీ! వందనములివే గ్రహింపుము. నీదర్శనమే మహాభాగ్యము. ఇఁకనే కోరవలసినదేమున్నది? అయిన నిట్లగుఁగాక. మీరలిట నీయాశ్రమమున దర్శనం బిచ్చి నన్నునుగ్రహించితిరి. ఈమీదను. మీరెల్లపుడీ యాశ్రమమునె నెలవుగాఁగొని వసింపుడు. ఈయాశ్రమము మీపేరుననే ప్రసిద్ధంబగుగాక. ఏమానవుఁడీ పుణ్యతీర్థమున నొక్కమారును మునుగునో యాతఁడా పున్నెమునఁ బరిశుద్ధ చిత్తుఁడై పురుషార్థ సిద్ధి నంది పరమార్థ సిద్ధియు నొంది తరించును గావుత; అనియట్టె నిలిచిన యాతనింగని మహేశుండును. భక్తవరా! నీకోరిన కోర్కులన్నియు నట్టులెయగుఁగాక. అని యానాటినుండియుఁ బార్వతీ సహితుఁడై యాపరమేశుఁడుతానందుననే వసింపసాగెను. నాటినుండియునది నీలకంఠా శ్రమమను పేరునకెక్కెను.

పర్వతరూపుఁడగు నాశేషుని వక్షభాగమున బ్రసిద్ధమగు నహోబిలాఖ్య పర్వత రాజమున్నది. అద్ది శ్రీ నృసింహదేవునకుత్తమ పుణ్యనిలయము, సర్వసిద్ధిదము. హిరణ్యకశిపు శిక్షించి, భక్తవరు ప్రహ్లాదునను గ్రహింపంగోరి, లోకావనదక్షుఁడానరహరియట బ్రహ్మేంద్రాది దేవతలతోఁదోచి తిరముకొనెను. దానికిందీటగు తీర్థస్థానమొండీలోకమున నెందునలేదు. దీనినొక్కపరిదర్శించి నంతన జీవులు ముక్తులగుదురు. అందొక్కదినమున వసించిన వాడెల్ల పాపములనుండియు ముక్తుడై విష్ణులోకమునకుంబోవును. ఇఁకనటఫణాఫణి ప్రదేశమున శ్రీ వేంకటాద్రి యలరారును. అదియ శేషాద్రి, వృషభాద్రి, నారాయణాద్రి మొదలుగ నామముల విరాజిల్లుచున్నది. బ్రహ్మాది దేవతలును వందలు వేలు వత్సరములు శతశతముఖమ్ముల దాని మహిమను వర్ణింపంజాలరు. అందలి నదులమును కలిడి, తపసులొనరించి తరింప నగస్త్యాది మహర్షులును సురసిద్ధ సాధ్యాదులును నెదురుతెన్నులం జూచిచూచియటఁజేరి పుణ్యపవిత్ర పుష్కరిణుల మున్గిదేవుంగొల్చుచుందురు. అమర వరులు పలురూపంబుల ఫలవృక్షములుగాఁ బక్షులుగా లతలుగా నటరూపందిరా యనునట్లుండు నందలి ఫలవృక్షలతాదులు పశుపక్ష్యాదులు.

# సప్తమాధ్యాయము

## నారాయణాద్రియనుపేరు కల్గుట

భృగుమహర్షి నారదమునివరుంగని, దేవర్షీ పురుషోత్తముఁడా వేంకటగిరింజేరి నివాసముండి, పిమ్మట నేమేమి వినోదమ్ములొనరించెను. ఆదేవుని దివ్యలీలలేమి? ఎల్లవిషయములు వివరించి చెప్పుము. అన నారదుండిట్లనియెను. భృగుమునివరా! మహదానందము. ఆదేవుని లీల లెంతయు వివరముగ నీకుంజెప్పెద. అవి యెల్లవిన నీవ తగినవాఁడవు. ఆలింపుము.

వివిధ ధాతు విరాజితమ్మును, సెలయేళ్లకలకల ధ్వనులచే వీనుల విందొనర్చు నదియు పనస, పంపర పనసమామిడి జీడిమామిడి జామ,రేగు,సీతాఫలంబు రామాఫలంబు నేరేడు వెలగ, ద్రాక్ష, నారింజ, బత్తాయి కమలాఫలంబులాది ఫలవృక్షముల చేతను, జాజి, విరజాజి, మల్లిక మొల్లపొగడ మొగలి చామంతి గలిగొట్టు కడిమి, గురిజ మోదుగు నందివర్ధనము మొదలగు పూలచెట్లచేతను, లతల చేతను మంచి గంధము, మద్ది కంకేళి వెదురు గోరంట, చీకటి మ్రాను, తుందు, గవిసె, యాదిగ పలుతెఱంగుల చెట్లచేతను నందమై కనువిందొనర్చునదై, ఏన్గు బెబ్బులి, జెడల మొగము, గురుపోతు, నెనుపోతు లావులాలపోతులాదిగ జంతుసంతతుల చేతను, నెమలి కోకిల, గోరువంక, చిలుక లాది పక్షులచేతను, నింపుగలిగించునదై, విననింపగు కలకూజితముల నొప్పు నానారత్నరంజిత మగు నాకొండనెత్తమ్మునకా యవ్యయానందు డనాదినిధనుఁడు, భగవానుఁడు కమలాలయతో నవతరించి వినోదించుచుండెను. అప్పుడ నారాయణుడను విప్రుడు తరింప నాసగొని భగవంతుంగూర్చి యొకయెడఁ గడునిష్టఁ దపంబాచరించుచుండెను. అదిగన్న నలుమొగంబులవేలుపా పాఱునెడఁ బ్రసన్నుండై కనికరమూని యాతనికిం దోచి యిట్లనియెను. నాయనా! ఇటఁగాదు నీతపము. నీవిపుడపోయి యావేంకటాద్రిని స్వామిపుష్కరిణీ తటంబున నుండి లోకారాధ్యభక్తవత్సలు శ్రీహరింగూర్చి తపం బొనర్పుము. అట దేవుండు నీకు బ్రసన్నుండగును. కోర్కులు ఫలించును. అనఁగా నాజన్నిగట్టప్పుడ పోయి, భగవంతుందర్శించుకోర్కెను శేషాద్రిని చేరి స్వామి పుష్కరిణికి నుత్తరతీరంబున నాశ్రమంబును బొనర్చికొని, యింద్రియములను మనసువశమున నుంచి, యామనసును జీవాత్మను జేర్చి, జీవాత్మను బరమాత్మకధీనమొనర్చి సమాధి నిష్ఠితుడై యోగారూడుండై, దృష్టినాసికాగ్రంబున నిలిపి, చాలకాలముదనుక తాపసులకును వెక్కసముగఁదోచునట్టి, దుష్కరమగు నట్టి తపస్సునొనరించెను. ఆతఁడట్టి తప మొనరించుచుండ నచటి వృక్షలతాదులు ఋతువుల మఱచెనోయన నెల్లవేళలఁ జిగుళ్లతో

మొగ్గలతో బూలతో ఫలములతో విరాజిల్లుచుండెను. జంతువులును దమసహజవైరములు మఱచి, యన్యోన్యమైత్రిని నొండొంటి సేవలమసలసాగెను. తపః ప్రపూతమగు నామలను బ్రేమ శాంతులలుముకొనెను. అత్తరినాతని తపస్సున కెంతయు నలరి వాసుదేవుఁడు వేంకటాద్రీశుఁడు శ్రీ భూనీళాసహితుండై, సుమేరు శిఖరమునట్టులు వైనతేయు నధిరోహించి, నారాయణ విప్రునకెదుటఁ దోచెను. సుప్రకాశిత సువర్ణ రత్నమాల యురమున వ్రేలుచుండఁబెక్కు మెఱుపులొక్కుమ్మడిదోచినట్లున్న దేహ కాంతులతోఁ బుండరీకాక్షుండు, తానెపుడెట నవతరించిన నాతనతోడన తానును నవతరించి తోడునిడని, భక్తుల యెడలఁగరుణా దృక్కులఁబఱపి ప్రోచి రక్షించు కమలా ననఁ గమలనయన దోడుచేసికొని, సర్వంసహను, కుమారినీలను పజ్జనిడుకొని, పచ్చని బట్టంగట్టి, వనమాలాలంకృతుఁడై శ్రీవత్సలాంచనముతో, దులసిమాలతో గౌస్తుభమణి భూషణముతోఁ, గమలదళనేత్రుఁడు సింహమధ్యముఁడు, నీలాంబుదశ్యాముఁడు నారాయణుండ తనికెదుట దోచెను. అంత నారాయణ విప్రుండు, హర్షపర్యాకులేక్షణుండై, కనులంబొంగి పొరలు నానందాశ్రు సందోహుండై, హర్షాంబునిధి తరంగముల మునిగి తేలుచు నోలలాడుచున్నవాఁడై, యాసమ్ముదమునఁ దన్నుఁదానెఱుంగకయ యా దయాంబురాశికి వాసుదేవునకుం బ్రదక్షిణంబులు పొనర్చి యేమి చేయుచున్నదియు, నేమిచేయవలసి నదియు నెఱుంగని వాఁడై ముహూర్తకాలం బట్టే నిలిచియుండి యంతలోఁగొంత తెలివంది యిట్లని స్తుతియించెను.

దేవదేవా జగన్నాధా! దీనరక్షక కావవే, భక్తవత్సల పాలితామర ప్రోవవే! కరుణాలయా! కరివరదా, కరుణాలయ, శరణాగత జనరక్షక దయుగని నను భయముడుపుము! పాలింపుము భక్తవరద నీవేత్రాతవు ధాతవు. లోకములకునేడుగడవు. ఆదియునంతమునీవే. ఆద్యంతము లేనివాఁడ వోదేవేశా ॥ నీవ ప్రకృతివి పురుషుండవీవ. నీచూపుమాత్రముననే యీ సృష్టియంతయు జరుగుచున్నది; నీతలంపున నీయందణగుచున్నది. నీకుసాటియగు వారెందునను నీలోకమునను నేరును లేరు. సములె లేరన నధికులెందుందురు. నీవు సర్వోత్తముఁడవు; నసదృశుఁడవు. తెలియువాఁడవు నీవు. కార్యకారణ ఫలములు నీవ. నీవకాకెందులేదొండు! ఓ జగత్పతీ! ఈ జగత్తునకంతకు నీవ తండ్రివి. అనపాయినియగు నీపద్మసంభవ లక్ష్మియే యీ సర్వజగత్తునకుందల్లి. ఓయవ్యయానంతరూపా! బ్రహ్మాది దేవతలును సనకాది యోగులును మునులును ఘనమగు తపసుచేతను బ్రహ్మచర్యాది వ్రతముచేతను, ఆత్మసంయమము చేతను భక్తి సంభరితులై నిన్నుందెలియ బొంద సమర్థులు. భక్తియుతముగాని, భక్తి కొఱవడిన కేవలయజ్ఞములచేతను, వేదాధ్యయనములచేతను, దపోదానముల చేతను నీవు దొరకవు.

కానఁబడవు. ఓ త్రివిక్రమా! రమాధవా! నాభాగ్యవశముననె కరుణామతివై నీవునాకుంగండ్లఁబడితివి. ఓదయానిధీ! నాయందక్కటికపూని నీనిజరూపమును నాకుంజూపి తరింపఁ జేసితివి. మాయీ దర్శనంబుననేను ధన్యుండనైతిని; నాకుంగండ్లు గల ఫలమొదవినది; పుట్టువు సఫలమాయెను. మిమ్ముంగన. జాలని వానిజన్మమే వ్యర్థము. ముమ్మాటికి నిదియ నాతలంపు. మిమ్ముంజూచి నంతన నామనసున్మత్తమయి నట్లున్న యది. అనియింకను నేమేమియో వినుతులు పొనరించుచుండ నాభూసురుంగని ప్రసన్నచిత్తుండై దేవుఁడు మేఘ గంభీర వాక్కుల నిట్లనియెను.

జితేంద్రియుండవైన యోధరామరోత్తమా! నీవెందులకు నేమికోరి యిటనిట్టుత్తమ నియతిందపం బొనరించుచున్నాఁడవు? చెప్పుము నీకోరిన కోర్కినే నెఱవేర్తును. అననా జన్నిగట్టునారాయణుఁడు నారాయణ దేవునకిట్లనియెను. ఓదేవేశా! కరుణానిధీ! శ్రీపతీ! నీవు నాకోరికిం దీర్చు వాఁడవేయైన నేకోరుకొందు నాలింపుము. నేను నారాయణాఖ్యుఁడ పాఱుండను. మిమ్ముందర్శించుకోర్కిని భూమండలం బెల్ల నంభ్రమించితిని. కానియెందును మిమ్ముంగనఁ జాలకపోతిని. అంతం బ్రహ్మను గూర్చి తపమొనర్చితిని. ఆదేవుండు ప్రసన్నుండై ననుంగనియిచ్చిన యాజ్ఞననుసరించియె యిట నీపుష్కరిణిం జేరి నియమమునఁ దపమొనర్చి మిమ్మారాధించితిని. దేవా! యనుగ్రహింపుము. దయామయా! నేకోరుటకేమున్నది? నన్నుంగూర్చి చెప్పుకొనుట కాదు. ఇటనేనెంతయో నియమ నిష్ఠలఁగష్టించి జితేంద్రియుండనై చిరకాలముగఁ దపమొనరించుచున్నాఁడను. మాయీ భూమి వాసుల కెల్లర కింతగఁ దపమొనరింపఁ దేలికగ నగుపనికాదు. వారల బ్రతుకేమి కావలయును? దయామయా! మాయీదీనమానవుల యెడఁగని కరమూనుము. వీరికిం దరుణోపాయముం ఘటింప నెల్లరకు సులభ గోచరుఁడవై వారి వారి యభిలషితములం దీర్చుచు శేషగరుడ విష్వక్సేనాది పరివారపరివృతుఁడవై, మాతల్లి లక్ష్మితో విహరించుచు నిందుననే వసింపుము. మఱియు నీనగము మన్నామమునం బ్రసిద్ధమగు నటులం జేయుము. నామనంబెన్నడును నీయందుననెలగ్నమై యుండును, మన్మతి చంచలత నుండకుండ ననుగ్రహింపుము. ఇట్లని వేడిన యాపుడమివేలుపుంగని వేలువుల వేలుపు వేంకటనగాధీశుఁడనుగ్రహ దృక్కులంగనుచు నిట్లనియెను. ఓయీ నారాయణా! నీకోరికియెట్లట్ల యగుంగావుత. బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులు గాని మఱియెవ్వరుగాని, పాపులుగాని, పాపరహితులుగాని, యీ స్వామిపుష్కరిణీ జలముల మునుగుచు నిటనుండి పశ్చాత్తప్తులై గతపాపమార్గములనెల్ల వీడి, మఱిముం దేవిధమగు పాపమార్గముంద్రొక్కక నన్ను సేవించు వారు పాపములెల్లంబాసి పవిత్రులగుదురు. వారికి నేను స్వర్గాది సౌఖ్యముల నొసంగుదును. కల్పాంతము దనుక వారుసుఖంబుందురు.

ఈ పుష్కరిణినిమునుగువారు నరక భావములెల్ల నశింప బ్రహ్మభావముంబొందుదురు. ఈ స్థానము, ఈసరోవరము, భోగమోక్షముల నొసంగునవియు. ఇవి యెల్ల సిద్ధులంగూర్చును. ఇందుసందియ పడవలసినదేమియు లేదు. నేటి నుండియు నీగిరివరము నారాయణాద్రియనియుం బిలువఁబడును. అనుచునారాయణ దేవుఁడా విప్రునకుంబలికి సాయుజ్యమోక్షము నొసఁగి యనుగ్రహించెను. ఆపిమ్మటఁ దనసంకల్పము చేతనెయటకు వచ్చిన తనయెల్ల పరివారముతో నాస్వామి పుష్కరిణీతటముననే యాదేవుఁడు నెలవుకొనియెను. కలుముల జవరాలితో, భూకాంతతో, నీలాతలోదరితో నటవినోదముల నుండి మనసిచ్చిన భక్తులనెల్లపుడును దనియించి తరియింపం జేయుచుండెను.

## భగవంతుని మృగయావిహారము
## వృషాసుర వధ

భగవంతుండా కొండనెలవుగఁజేసికొని యుండికొన్ని దినములకుంబిమ్మట నొకనాడు వేటలాడబోవ మనసుకలిగి తన సేనానిం బిలిచి ప్రసన్నచిత్తమునఁ జిఱు నవ్వొలయు మోమునవానింజూచి, యోయీ! సింహవ్యాఘ్రమగజాది మృగానేక సంకులం బీయడవి. ఇందు వేటాడఁబోవమనసగుచున్నది. బలముల నాయత్తము చేయుమా యనెను. ఆతఁడును వల్లెయని యట్ల సర్వసమాయత్తముకావించెను. ఆదేవుండును శబరినాయకునట్ల రూపముంగొని, పరివారమును శబరులుగాఁజేసి, వారిని వెంటగొని శేషశైలమున కుత్తరమునంగల కొండకుంబోయి యటనడవుల మృగయాసక్తిందిరుగుచు నాదైత్యాంతకుఁడు వినోదించుచుండెను. అందందునఁగలభిల్లనాయకులును దేవురాకందెలిసి, తేనెలు పండ్లు పూవులాదిగ వింత వింత కానుకలగొని వచ్చి యఖిలేశున కర్పించి భక్తి వినమ్రులై మ్రొక్కులొనరించి నిలిచి దేవునను గ్రహమును బొందిరి. ఆటవారు చూపిన పరిచితస్థానములకుంబోయి విభుఁడు మృగయా విహారముంజరుపుచుండెను.

ఆ కాలమున శ్రీశైలమునకుం దక్షిణమునంగల ప్రదేశమున వృషభుండను నొకయసురుడు సంచరించుచుండెను. ఆతఁడు కడుంగడు శంకరభక్తుండు. ఆనాడాకస్మికముగ నాకొండనెత్తమ్ములంగలిగిన యా కలకలముందెలిసియిదేమి ? ఇది యెవ్వని కార్యము;వానింవెదకి పట్టెదంగాకయని తనపరివారముతోఁబోయి యందందుఁదిరుగుచు నాయెడ వేటతమి దిరుగుచు శబరనాయక వేషమున సపరివారుఁడు హయారూఢుఁడు నగు శార్ఙ్గ కోదండపాణిని శ్రీహరిని గాంచి యెంతయుఁగృద్ధుండై యీతడు పెద్దయు మాయల మాఱియట్లున్నాడు. చూచెదను గాక యీతని తెగువ. అని ఎవ్వఁడవునీవు? ఆగుమాగుము. అనుచుగర్జించుచు నాతఁడు

తొందరగ నాదైత్యారిం డాయంబోయెను. అప్పుడట నాయిర్వురకును వారివారి బలములకును వెఱపు గొలుపు పెద్దపోరాయెను. రక్కసుండా భిల్లనాయకుఁ బేరెత్తి యెత్తి పెక్కుతెఱంగులఁ దూలనాడసాగెను. అవ్విపినంబుననట వారికిని వీరికిని బెద్దగఁ బోట్లాటాయెను. అట ఖడ్గపరసుపట్టిసములఁ, దీవ్రభల్లనారాచముల, గదా ముసలముద్గర భిండివాలముల జావు తెలియక తగులు దెబ్బలు దలంపకముమ్మరముగ సంకుల సమరము సాగించుచుండిరి. కాళ్ళుసేతులు తెగిపడువారు, తలలు తెగిపడువారు, ప్రక్కలు డొక్కలు తెగినవారు, తీవ్రములగు గాయముల వ్రేళ్లువారు కాగా నడవియంతయు రణరంగమై రక్తము కాల్వలుగట్టనందు నెమ్ములు, తలలు, నవయవశకలములు తేలికొట్టికొని పోవుచుండెను. అద్ధిమృత్యుదేవతకైన వంట యిల్లాయన బీభత్సమై భయంకరమై యుండెను. కొమ్మలు విఱిచి కొట్టువారు మొక్కలు పెఱికి తెచ్చి మోదువారునైరి. ఎదిరి కొట్టు దెబ్బల నాగికొని, తిరిగికొట్టువారునైరి. అంతనెదుటంబడ్డ శబరుల నెల్లనంతంతం జక్కాడుచు నెదుటికిం జొచ్చికొనివచ్చు రక్కసుంగని రక్కసులగొంగవిష్వక్సేనునకు నాతని నొక చూపుచూడు మాయన్నట్లు సన్నచేసెను. ఆతండును దోడిపరివారమును పోత్సహించి, యుత్సాహ పఱచి తీవ్రరణమునకు సాగెను. అప్పుడు రోమాంచకారియగు ఘోర సమరము ప్రవర్తిల్లెను. విష్వక్సేనుఁడును శస్త్రా స్త్రంబుల నతిభయంకరముగ శత్రుహననముంగావింపసాగెను. అదిగన్నయామాయావి దానవు. డిప్పగిదిం జయము దొరకుటకష్టమని యపుడెమాయకుం దొరకొని పెక్కురు రక్కసి సైనికుల వందలు వేలుగఁబుట్టించెను. నారాయణదేవుం దుదముట్టించుకోరిక నావృషభ నాధుఁడనేకానేక శస్త్రాస్త్రముల విసరికొట్టెను. ఆ యసుర ప్రయోగించిన వానినన్నిటి నాయసురాంతకుఁడు నడుమనే తునియలొనరించి దుమ్మొనర్చి తన ప్రతిభం బ్రదర్శించెను. అది చూచి మాయలమారి యసురుఁడు తనప్రతిద్వంది యు సామాన్యుడు కాడనియు దుర్జయుండనియు నెఱింగి తనయాసురీమాయం బూని తానంతర్ధానుండై మేఘంబునుండింబలె పైనుండియస్త్ర శస్త్రములాదిగఁ గురిసి దేవునిబలగమును జిందరవందర చేయసాగెను. దానిం బొడఁగన్న సర్వేశ్వరుఁడు, జనార్దనుండా గ్రహారాదగ్రుఁడై సర్వదుష్ట సంహారకమ్మును, సకల సురాధిపవందితమును నగు చక్రరాజమును బంపెను. ఆ సుదర్శనంబును నగ్నులంగురియుచు తేజాను విరజిమ్ముచు బోయెను. దానిచే వారాక్షస సేనలు నీఱుకాఁజొచ్చెను. వారలచేఁ బ్రయుక్తములగు నాయుధానేకమ్ములక్కడి కక్కడనే బుగ్గియై రాలిపడెను. ఆ కొండపై నెచ్చటను గన్నను రాక్షసుఁడొక్కరుఁడును గానరాకపోయెను. తనమాయలన్నియును వమ్మగుటంగని విస్మయాకులమానసుండై వృషభుండీతని కతనఁదన చావునిక్కమనియుఁ నీతడసురారి విష్ణువనియు నదియసురాంతకమగు చక్రరాజము సుదర్శనమనియు గ్రహించియిట్లని తలంచెను.

ఇకనిట నామరణము నిక్కంబు, నందియమందంబనిలేదు. ఈతడు సృష్టిస్థితిలయకారుడు సురమునివందితుడు. ఈదేవునిచేతనే మృతినందితినేని యదియ మహాభాగ్యము. ఆపున్నెమున నాపాపము లెల్లనశించి ముక్తిబొందంగలను. నిశ్చయముగ నీసంసారవారాసిం దరించి మోక్షగామిం గాగలను. ఇంతకంటె నాకుం గావలసినదేమున్నది? పుట్టినవారికిం గిట్టులుయనునదెప్పటికైనం గలదు. అని తలంచి, మరణమునకు వెఱపందక యుత్సాహముగొని నిండుమనమున భక్తియిరవుకొన నాదేవునిట్లనిస్తుతియించి ప్రార్థించెను.

దేవదేవ జగన్నాథా, దీనరక్ష దయానిధే, లోకకారణలోక రక్షకః లోకవినుత రమాధవా! ప్రణతపాలక శరణుబొందితి. బట్టిప్రోవవేదీనుడన్. అన్నిటను నీవిమిడి యుందువు నన్నినీయందిముడగా

బ్రహ్మరుద్రేంద్రాది దేవతలెల్లరును నీయాననడుతురు సూర్యుడొదవుట యస్తమించుట, గాలివీచుట, యగ్నిమండుట, యింద్రుడేలిక యౌటయును జముడరసి ధర్మము నిలుపుటల్ ॥ నీపనుపున నెయని పలుకుచుండెను. వేదవితతులు, విస్తృతంబుగ లేరురక్షకులన్యులెవ్వరు. నేరినేజేరంగబోనిక ॥ పాహి పాహి దయానిధే। ప్రణతపాలకృపానిధే ॥ నిర్వకార నిరంజనా। నిత్యనిర్గుణపావనా ॥ ఆర్తిహర ప్రేమార్ద్రహృదయా యక్కటికనను నేలవే ॥

మోక్షప్రాప్తికినై సిద్ధమునియోగివర్యులెవ్వాని పదపద్మముల వెదకుచుం దపింతు రా దివ్యమూర్తివి నీవ నాకన్నులకెదుటం దోచితివి. దేవా! నాపాపమ్ముల, నపరాధమ్ముల క్షమింపుము. నన్నుంగృతార్థుం జేయుము. తరింపం జేయుము. పాపముల కాకరమగు నీపాడు జీవితమునింకను గావలెనని నేఁ గోరను. దాసునియప రాధములు దండముతోడన చెల్లు. నీకివె శ్రద్ధాసక్తుల భక్తివినతులు. నీపవిత్ర చక్రమున నన్ను విహతునొనర్చి మోక్షమును గూర్పుము. నీయందున నన్ను విలీన మొనర్చికొనుము. ప్రభూ! మీరు కాకన్యులు రక్షకులు లేరు. నాదిమటియొక కోరిక నాతరువాత మీయాన నీశైలము నాపేరున వృషభాచల మనఁబ్రఖ్యాతమగుం గావుత; మనుచు శోకసంతప్తుడై యశ్రుపూర్ణనయనుఁడై వ్యాకుల చిత్తుఁడై యున్న వానింగని గరుడధ్వజుఁడాపన్న శరణ్యుండు చిఱునవ్వులొలికించుచు నిట్లనియెను.

ఓ యీ వృషభాసురా! నా భక్తిని మునిగిన నీవవశ్యము మోక్షమొందెదవు. ఈ నగరాజమునీ పేరునఁ బిలువంబడును. అనుచుండఁ దనకుమృతియు నాదేవునను గ్రహమే యనియాతఁడానందముననుండెను. అప్పుడ సుదర్శన చక్రము మంటలు చిమ్ముచు వచ్చి వానిగొంతుఁదునిమి తమవువ మండి తలను వేరుచేసెను. అప్పుడె వాని దేహమున మండి పెద్దవెలుఁగు, దివ్యతేజమొండు వెలువడి వచ్చి యాదేవునంద విలీనమాయెను.

అటనాకసమున నుండి వేలుపులు పూలవానలు కురియించిరి. దేవదుందుభులు మ్రోగెను. అచ్చరలాడిదేవుం బాడిరి. దిక్కులు ప్రసన్నములాయెను. అసురునదృష్టమును వారెంతయుం గొనియాడిరి. నిర్మలమందానిలములు, పరిమెళముల బరువుంగొని వీచుచుండెను. దయామయుండు భగవంతుడును నసురునకుం గోరిన వరంబులొసంగి యటనుండి కదలి మఱలి శేషశైలముం జేరి యెప్పటియట్ల నివసించుచుండెను.

## అంజనాదేవి పుట్టువు

ఓ భృగువరా! మునిజన సంకీర్తితంబగు దేవదేవు మహాత్మ్యంబు నేకాగ్రచిత్తుండవై యాలింపుము. తొల్లిత్రేతాయుగంబున సువ్రతుండను నొక దానవుండుండెను. వాఁడు పుత్రార్థియై యీశ్వరుం గూర్చి నిరాహారుండై యింద్రియముల వశమున నుంచికొని భక్తినిష్ఠల గడ్డుతపంబాచరించెను. పంచాక్షరిని జపించిదేవుని బ్రసన్నుంజేసికొనెను. లోకకళ్యాణకరుఁడు, భక్తవశంకరుఁడు శంకరుఁడు భగవంతుఁడు వానికిం బ్రత్యక్షంబై తనయెదుట దండవత్ప్రణామం బొనర్చి నిలిచియున్న యసురుంగని యిట్లనియెను. సువ్రతా! నీకు మేలగుగాక. నీయొనర్చిన యీమేటి తపమున నాకెంతయు ముదమాయెను. నీకోరిక యేమి? యడుఁగుము. ఇత్తును నీకోరినవరమ్ము. అనిన నాదనుజుండు కరములు మొగిడ్చి, దేవదేవా! నాయందనుగ్రహము కలిగినవాఁడవైతేని, నాకొక మహావీరు నెట్టి రణమ్ములను విముఖుఁడు కాని సాహసోత్సాహ గుణాధికుఁ బ్రాజ్ఞుఁ బుత్రుఁ దయచేయుము. అను నాదైతేయు విని దేవుండిట్లనియెను. నీతపమునకు నేనెంతయుఁ బ్రసన్నుండనైతిని. కాని నీకుంగుమారునీయంగాదు. నీకుఁ బుత్రయోగములేదు. అదిదైవేచ్ఛ. ఐనను నాయనుగ్రహమున సుగణముల ప్రోవు, సుందరియగు నొక కుమరిత కలుగఁగలదు. ఆబిడ్డను బ్రేమను లాలించి పాలించి తగినవరుని జూచి పెండ్లి సేయుము. నీకుం గొడుకు కాడుగాని దౌహిత్రుడు నీకోరినయట్టి మహాబలశాలి, గుణశాలి యగువాడు దయించగలవాడు. అని యనుగ్రహించి భూతేశుం డంతర్హితుం డాయెను. అసురవరుండుమ నావరంబును బొంది యెంతయు సంతుష్టుండాయెను. తరువాత నాతనికిం దగుకాలమున ధర్మపత్నియందున లోకోత్తరసుందరి, లోకవిస్మయ కారిణి తనయకలిగెను. దైత్యరాజా తనతనూజకు అంజన యను నామకరణం బొనరించెను. మంజుమిత భాషిణియగునాబిడ్డ శుక్లపక్ష చంద్రరేఖయుం బోలెన యునానందకరముగ దినదినాభివృద్ధి బొందినిండు యౌవనవతియాయెను. ఆమె గుణములు చేతలు రూపముం గనినవారెల్లరామె యందెంతయు వాత్సల్యమున నొప్పెడివారు. తండ్రి యనురాగమునకుం బరిమితియె లేకుండెను. చెలిమికత్తెలతో నామెకూడా, బెండ్లాడుచో, బొమ్మల పెండ్లిండ్లు చేయుచు గుజ్జనగూడులు వండుచో వింతవేడుకల బాలక్రీడల నొననిరించుచో గాంచి యాతఁడు పొందునానందమున కవధులే లేకయుండెను.

అంతం గేసరియను ప్రసిద్ధుండగు నొకవానర వల్లభుండాపె గుణగణముల నెఱింగి, పెండ్లాడఁ గోరియడిగిన నాయమతండ్రి యాతనికిం గూతునిచ్చి యనురాగమ్మున సాలంకృత కన్యాదానమ్మునఁ బెండ్లి మొనరించెను. రూపయౌవన గుణవంతులగు నాదంపతులా నందవిహారముల నెంతయు సుఖముగ దినములు వెళ్లఁబుచ్చుచుండిరి. ఇట్లు చాలకాలము గడచెను. అనుకూలుఁడు ననురూపుఁడునగు పుత్రకుండు కలుగమి కాదంపతులెంతయుం గుందిరి. ఆసాధ్వీమతల్లి మునమునెంతయు వెతనందెను. నాతండ్రి నన్నేపుత్రస్నేహమున లాలించి పాలించెను. దౌహిత్రుంగందునని మురియుచుండెను. ఇంతదనుక నాకు సంతతియే లేకపోయెను. తండ్రి కోరిక యెట్లుతీరును? నేనా పితృఋణము నెట్లువీగుదును. మందభాగ్యరాలను. పుత్రహీనులగు స్త్రీలకుఁ బారలౌకిక సుఖమేమియుఁగలుగఁ బోదుగదా. పుత్రునొడి నిడికొని లాలించుచుఁ జిఱునగవులతోడి చిఱుతమోముంగని తనియుతల్లిదే భాగ్యము. తల్లికాఁగలుగు తరుణిదే తనువు. అనుచు నిట్లెన్నెన్నియో యోచనల, దినములు వెళ్లఁబుచ్చుచు సుసంతానమును బొందుకొఱకై వ్రతములు దానములు నెన్నెన్నియో పొనరించుచుఁ దీర్థయాత్రలకేగియు భూసురారాధన మొనరించి వారి యాశీర్వాదములొంది వారినభీష్టదానములఁ దనియించు చుండెను. ఆయంజనాదేవి యొకనాఁడు శకునజ్ఞుల దైవజ్ఞులం బిలిచియడిగి వారుచెప్పిన వ్రతములు మిగులనియమనిష్ఠల స్వయముగ నెఱవేర్చెను. గోష్ఠంబులు తుడిచి శుభ్రముచేసెడిది. సేదదీర్చి సేవలుచేసి గోమాతల పూజించెడిది. ఆయమ యొనర్పని వ్రతములు, పూజింపని దేవతలు, చేయనిదానములు లేవు. కాని యాయమకోరిక ఫలింపలేదు. ఆమె వెతలు తీరలేదు. ఇట్లు చాలకాలము కడచిపోయెను. ఒకదినమున ధర్మదేవత యామెయందున దయపూని యాటవికవనితా రూపముం బూని, యెఱుకలబుట్టయు నొకదండమును గొని యొకయాడుబిడ్డను నొడినిగట్టుకొని వచ్చి వీధింబడిపోవుచు మాటిమాటికి నిట్లఱచి యఱచి పలుకుచుండెను.

ఓయవ్వ యవ్వ యెరుక చెపుతానవ్వయెరుక చెపుతా! ఓ యమ్మ యెవరేని గానిరండమ్మ. మదిగల్గు కోర్కెలనడుగు డోయమ్మ. ఉన్నదున్నట్లుగాఁ జెప్పెదనమ్మ. కోర్కెదీరునుపాయములు చెప్పెదమ్మ ఇట్లను నాపెపలుకు లాలించి యెవ్వరేని వచ్చి యడిగినవారియడిగిన యర్థంబులెల్ల వింతగ సరిగఁజెప్పుచుండెను. అట్లు పోవుచుంబోవుచు నంజనాదేవియున్న నెలవుం దరిసెను. ఆయమంగాంచిన యంజనాదేవి యాయెఱుకతను దనచెంతకుం బిలిచి యున్నతాసనమునం గూరుచుండం బెట్టి బంగరుచేటను ముత్యాలయక్షతలు నింపి యెదుటం బెట్టి యెన్నియో కాన్కలిచ్చి ప్రసన్నవానర్చియడిగెను. అవ్వా! నాభాగ్యమునఁ బుత్రుఁడు కలుగునా! నాకు సంతానయోగమున్నదా? నిజముం జెప్పుము. సందియమందకుము. నాకుంగొమరుండు కలిగిన నీకేమి కావలయునన్న నవియెల్ల నొసంగి తనియింపఁగలను. అనునంజనను విని యాయవ్వ యిట్లనియెను.

ఓ కళ్యాణీ నీవు కోరిన పుత్రుఁడు నీకుం గలుగును. చింతింపం బనిలేదు. సందియము మానుము. నేను నాధర్మము పైనొట్టు పెట్టుకొని చెప్పుచున్నాను. కాని నాదొక్కమాట. శోభనాంగీ నీవిప్పుడే వేంకటాద్రికిం బొమ్ము. వేంకటగిరీశు శ్రీనివాసుం గూర్చి, భక్తి శ్రద్ధల నిష్ఠను దపముచేయుము. కాలము కడచిపోవుచున్నదని చింతింపకుము. సహనము సత్ఫలము నిచ్చును. దేవుఁడు నిన్ననుగ్రహించును. బలవంతుఁడు గుణవంతుఁడు నగు, భగవదనురక్తుండగు కుమరుండు కలుగును. సందియములేదు. వంతను వీడుము. అనుచు నట ననుమతింగొని యాయమ యెటనుండి వచ్చెనటకుం బోయెను. అంజనయు నాపెమాటలు మాటిమాటికి మదిం జింతించి పతిదేవుని యనుమతితో సిద్ధముని సంసేవితంబగు శ్రీ వేంకటాచలమునకుం బోయి యాకాశగంగకు సమీపమున, నాశ్రమ మొండొనరించికొని వాయుమాత్రభక్షణంబున నిశ్చలమగుమతిదీక్షను దపం బొనరింపసాగెను.

ఆమె తపమ్మునకుం బ్రసన్నుండై వాయుదేవుండును నాయెడకు మునిరూపమున వచ్చి యాయమంగాంచి ప్రసన్నతం గని దినదినమొక ఫలమిచ్చిపోవువాఁడు. ఆమెయు నిర్మల నిశ్చలమనమునఁ దనతపమును సాగించుచుండెను. దినములు నెలలు, వత్సరమ్ములు గడచిపోయెను. ఆ తరుణమున నొకదినమున నాది దంపతులుపార్వతీ పరమేశు లాయాశ్రమ ప్రాంతమ్ములకు విలాస విహారములకై వచ్చిరి. ఆయెడవారు విహరించుచుండ నటకు రెండు వానరములు వచ్చి విహారములు సలుపుచుండెను. వానింగాంచిన లోకమాతాపితలకును వినోదమై వానరములట్ల రూపముం దాలిచి యిచ్చావిహారము లొనరించుచు నాయెడఁ దపమొనరించుచున్న యంజనం గాంచి ప్రసన్నులైరి. అప్పుడ శివుఁడు వాయువుంబిలిచి, నిజవీర్యము నొకఫలమున నిడి యాతనికిచ్చెను. భగవన్నిర్ణయము ఇంతకు మున్నాతఁడు దినదినము కొనితెచ్చి యిచ్చెడి ఫలమునట్లె యదియుందన తినుటకే యనియెంచి భక్షించెను.

మఱికొన్ని దినములకామెకు గర్భలక్షణములు తోచెను. ఒడలుబరువాయెను. చూచుకములు నలుపెక్కఁదుమ్మెదలు తోడి పద్మకోశములట్ల యొప్పి కుచములు మెలమెల్ల బలియసాగెను. దీన నిర్జితేంద్రియ యగు, నవ్వనితకు నబ్బురపాటును భయమును నయ్యెను. ఇట్లని చింతింపసాగెను. అయ్యో దైవమా! ఏపాపమెఱుఁగని నాకిదేమిగతి? విధాతయు నాయెడ విరోధి యాయెనా? నేనెంత మందభాగ్యురాలను? నాకిట్టి రూపలక్షణములే దోషమునఁ దోచుచున్నవి? అని యిట్లేమేమో విచారమున గ్రుంగి, లజ్జావనతయై, యాశ్రమమున నణఁగియున్న యామెకప్పుడొక యశరీరవాణి వినవాయెను. పుత్రీ! విచారించకుము. నీభవితవ్యముత్తమము బ్బాలము. ఈశ్వరతేజమున, వీశ్వరాంశయుతుఁడు నీకుం బుత్రుఁడు కాఁగలఁడు. వాయువు నీకుంగొనితెచ్చి యిచ్చినది

యీశ్వర ప్రసాదము. రావణుండను క్రూరరాక్షసుడు, లోకకంటకుండై ముల్లోకముల ముప్పు తిప్పలు పెట్టుచున్నాఁడు. సాధ్వీమతల్లులం జెఱఁబెట్టి బాధించుచుండెను. దేవతలును వాఁడు పెట్టు నిక్కట్టుల కోర్వంజాలక పలుతెఱంగులఁ బ్రార్థింప దేవదేవుఁడాది విష్ణువు భూమిని రఘువంశంబున రాముండన నుద్భవించెడిని. ఆదేవుడ రావణుని దుదముట్టింపం గలఁడు. తత్కార్యంబున నీకుమారుం డెంతయు నాతని కండదండయై యాసత్కార్యమును సఫలం బొనర్పంగలండు. నీతనయుఁడు బలపరాక్రమముల శౌర్యసాహసముల మేటియై, సాటిలేనివాడై ధీరుఁడు గుణవంతుఁడు, జితేంద్రియుఁడునై యటదేవునకుం బ్రేమపాత్రుఁడగును. ఇట భూమిజనులకు నారాధ్యదైవంబగును. పుత్రీ విచారించకుము. ఇందు నీదోషమేమియులేదు. పావనురాలవు; పవిత్రురాలవు నీవు. దేవుని చేత కసాధ్యము లేదుకదా ? అది విన్న యాయంజనాదేవి మనమున ధైర్యమంది యూరటనందెను. మిగుల సంతుష్టురాలాయెను. అప్పుడె గృహంబునకుం బోయి పితృదేవునకును, బతిదేవునకును జరిగిన యుదంత మంతయుఁ జెప్పివినిచెను. అదివిన్న యాపెతండ్రియున్నాళ్లుఁ దనకోర్కెనెఱవేఱెంగదాయని మిగులనానందము పొంది యెప్పుడు మనుమనిమోము గాంతునాయని యువ్విళ్లూరుచుండెను. ఆమె దేహవల్లరినాటికి నాడుతెల్లని కాంతినొప్పుచుఁ గళంకవిహీనమగు చంద్రకళయట్లు శోభిల్లసాగెను. గర్భభారమున నామె నడకలలసములాయెను.

## హనుమానుని పుట్టువు

అటు పిమ్మటఁ గ్రమముగ నెలలు నిండఁబదవ మాసమున నాపద్మనయన శ్రావణమాసమున శుద్ధఏకాదశిని శ్రవణా నక్షత్రమున నటుపూర్వదిశను సూర్యుఁ డుదయించుచున్న తఱిఁ నిటఁ బలవంతు సూర్యసమతేజుఁ బుత్రుంగనెను. చెవులఁ గుండలముల కాంతులు చెక్కిళ్లపైఁ జిందులాడ, భుజమున నుజ్జ్వలయజ్ఞోపవీతముతోఁ గటిఁ గౌపీనముతో నాశిశువద్భుతమగు బంగరు దేహకాంతులతోఁ బుట్టువందెను. అంతకును మించిన వింత! ఇట భూమింబడుటతోడన నమితమగు నాకట నాతఁడు నకనకలాడెను. ఆకలిముందును దరువాత నాతఁడును మెట్టినాయను నట్లాయెను. పుట్టువుతోనే యాసిసువు తూర్పున నుదయించుచున్న యెఱ్ఱని రవిబింబముం గాంచి, మిక్కిలి యెఱ్ఱనగు నద్దానిందన తినుటకుం దగిన పండని భ్రమనందెనేమో. దానిం దినవలయునను నుత్కంఠతో నప్పుడ నిచట వేంకటాద్రి నెగిరియటను దయాద్రిం జేరి నిలిచెను. ఒక్కపట్టున నామార్తాండుం బట్టి కబళింపనెంచు నాబాలకుం గాంచి భూతంబులు దెసల హాహాకారంబు లొనరించెను. అప్పుడె పర్వదినంబని పట్టవచ్చిన రాహువాకందుంగని తన్నెక్కడ మ్రింగునోయని వెనుదిరిగి పరుగిడి యింద్రుపాలంబడెను. వృత్తమంతయు విన్న యింద్రుఁడు క్రుద్ధుండై యా పట్టవచ్చిన వాఁడెట్టివాఁడోయని యప్పుడె యైరావతారూఢుండై వచ్చి బాలకుంగని వజ్రమునం గొట్టెను. వజ్రమును

దోకతోఁ జిమ్మియదియుఁ బండేయని తన్ను నైరావతముం, బట్టవచ్చు కూనంగన్న యింద్రునకే కాదు వేల్పులెల్లరకు వెఱపును వింతయును దోచెను. ఇంతలోననేయటకు వచ్చిన బమ్మయుఁ దొందర నంది, వెనుకముందు లాలోచింపక యాబొట్టెనుదనయస్త్రమునం గొట్టెను. ఆశిశువావచ్చు నాబ్రహ్మాస్త్రముం దోకతోన చెదరంగొట్టెను. అజ్జారే! ఈతఁడా, చంటిబిడ్డఁడా! ఈతఁడేమిటి పసికందు? ఈతనిచే బ్రహ్మాస్త్రమును వజ్రాయుధమును గూడ విఫలమగుటమేమి? యనియటఁ జేరిదే వాసురాదులెల్ల రాశ్చర్యంబునఁ బలుతెఱంగులఁ బలుకసాగిరి. ఇంతలో నాబ్రహ్మాస్త్రము తాకున నాయర్భకుఁడవని మూర్ఛనందిపడెను. పడినతనయుంగన్న యాతల్లి యంజనయెంతగనో విలపించెను. పలవించి పలవించి యాతల్లి యిట్లు పలికెను.

ద్విపద ॥ ఇలనిప్పుడే పడ్డ యీచిన్ని కుఱ్ఱ
జెలఁగి చంపగ మీకుఁజేయెట్లు వచ్చె
కసుకందువని మది కనికరంబడక
పసిపాప నిలగూల్చి పగ్గలేలయ్య
సిగ్గెగ్గు లేదయ్యె చెప్పెడి దేమి
సిగ్గులచేటగు నిట్టిపోరంబు
నసురులేనియుఁ జేయఁదలకొన ఁబోరు.

అనుచు నేమేమియో పరుషంబులాడు నంజనం గాంచినయా సురలప్పుడాతఁడు పరమేశ్వరాంశోద్భవుఁడగుటయు నాతనిచే భావిని గావలసిన దేవకార్యమును గ్రహించి యూహించి సాంత్వనవాక్యముల నాయమనోదార్చుచు నిట్టులనిరి. ఓ యంజనా! దుఃఖింపకుము. నీతనయుడు మృతినొందలేదు; మూర్ఛంబడెను. ఇప్పుడే మేల్కొనును. మేల్కనుటయకాదు. నీయీముద్దులబిడ్డ భావిని లోకాతీతమగు శక్తినిగలిగియుండును. ఆశక్తిని మించుశక్తి యెయరుదు. దేవమానవ యక్షరాక్షస పిశాచాదులందేవారిచేతను నీతడు మృతినందఁడు, పరాజయమందఁడు, అస్త్రశస్త్రములచే నేయాయుధములచే మరణమందఁడు. ఇతఁడు చిరజీవియగును. బుద్ధిబలముల నెల్లరమించి యుండును. ఈతఁడు శత్రువులకజేయుఁడు. అనిపల్కి దేవతలూరకున్నంత నామెంగనియజాం డిట్టులవియెను. బిడ్డా! యంజనా! నీవీగిరివరమున సుదారుణమగు తపంబొనరించి యజేయుండగు దేవకార్య ధురంధరుండును, లోకకళ్యాణకరుఁడును నగు పుత్రుం బడసితివి. నీతపః పరిపూతయగు నీశైలరాజమంజనాద్రియను పేర నిప్పటినుండియుఁ బిలువంబడును. అనుచుండ నాయర్భకుఁడు నిద్రనుండి లేచినవానివలె తొంటికంటెను నుత్సాహతేజస్సులతో లేచెను. బ్రహ్మాది దేవతలును నాయర్భకున కాశీర్వాదము లొసంగి తమతమ తావులకు మఱలిపోయిరి. ఆ పిమ్మట నంజనా కేసరులాకందుం గొనివచ్చి యట నాయంజనాద్రినే యాశ్రమము సొనర్చికొని సుఖంబుండిరి.

# చక్రవర్తి చరిత్ర

నారదమునితో భృగుమహర్షి యిట్లనెను. ఓ మునివరా! తొల్లి మీరుచోళరాజును చక్రవర్తియను వాని ననుగ్రహించి దేవుఁడు చక్రాదుల వీడెనని యంటిరి. ఆ గాధ వివరముగఁ జెప్పరే. ఆరాజవరుఁడెవ్వడు, ఎట్టివాడు? దేవుండాతని నెట్టులేల ననుగ్రహించెను? ఏలఁ దనయాయుధంబులను వీడెను? అనవానికి నారదుం డిట్టులనియెను.

కలియుగమునఁ దొల్లిచోళుండను నొకరాజవరుఁడుండెను ఆతఁడు వీరవరుండై, శౌర్యోద్భాసితుండై, ప్రజల బిడ్డలట్ల కనుచు సుఖముగ ధర్మపాలన మొనరించుచుండెను. ఆతండు నీతిజ్ఞుండు, నీతిమంతుండు, పరమధార్మికుఁడు ననఁబరగెను. ఒకప్పుడాతనికి వేటకుంబోవ మనసుకాగాఁ దనపరివారమునకు ననుజ్ఞనిచ్చెను. వేటతమకంబున వీరులు రథగజాశ్వములతోఁ దగు శస్త్రసాధనములతో నెల్లరుఁ బెద్దసందడితోఁ బురము బయలువెడలి శేషశైల వనప్రదేశంబులకుం గదలిపోయిరి. రాజును నుత్తమాశ్వారూఢుఁడై సాగిపోయెను. భటుల యుత్సాహాలాపములతో, గజఘీంకృతులతో, హయహేషలతో, వాద్యఘోషలతో నాయడవి పిక్కటిల్లెను. అందలి జంతువులును నాయులివునకుం గరము వెరచి తమయునికి పట్టులఁ బొదల గుహల బొరియల వీడి చెల్లా చెదరుగఁ బరుగులిడసాగెను. వానింగన్న వీరులును వాని వెన్నాడి తరిమి తరిమి పరిమార్పం దొడంగిరి. అందందుఁ బౌరుషంబునం దిరుగఁబడిన మ్రుక్కడి మృగముల నెక్కుడుతేకువం జక్కాడుచుండిరి. ఆనాడాయడవి యస్తవ్యస్తము నల్లకల్లోలము నాయెను. ఆవనమృగముల పాలిటి మృత్యుదేవతయే యట స్వేచ్ఛావిహారము జరుపుచుండెనా యనునట్లుండెను. పరుగువారు బెబ్బులిని వెన్నాడి కొట్టువీరుఁడు, నిలిచి గర్జించు పంచాననమును నెదిరించి కూల్చుసాహసుడు, నావేశమున మీఁదికి నడరివచ్చు వరాహము నదల్చివిదలించి చంపుధీర వరుఁడుగా నారాజచమూసమూహ ముత్సాహశౌర్యములు రూపందివటులా యడవిని వేటను వినోదించుచుఁ దిరుగుచుండెను ఆభూమివుఁడును ఘీంకరించుచుఁ బైఁబైవచ్చు వనగజమును ఖడ్గమునఁ దొండము తుండె మొనరించి కూల్చియుఁ, దావరంబున హుంకరించుచు మీఁదనుటికి వడఁబోవు వ్యాఘ్రంబు నాస్యంబున నడిదంబుఁ జొనిపి చంపియు, గర్జించి యాగ్రహంబున మీదికిందుముకు కేసరిని గాసిలం గొట్టి గిట్టించియు, లేళ్లందరిమియు, వరాహసంఘంబుల శరముల నమయించియు, గండంబుల గండడంచియు, గవయముల యవయవములు దునిమియు వేటయాట వేడుకను మునిగి తన్ముఁదామఱచియుండెను ఆమై మఱపున నాభూపాలక తల్లజుఁడెట నెటనో తిరిగి తిరిగి యొకయెడకుం జేరెను. అప్పుడయాతని కెదుట రూపందిన యౌవ్వన రూపరసంబున

నొకయువతి కానంబడెను. ఆమెను గనుగొన్నంతన యాతని వేట తమకమ్మును దిగిపోయెను. అతని మనమున నేమేమియో యూహలు తీగెలువారెను. మెడకుఁ ద్రాడువైచి లాగినయటులాతని మనసాయమ వైపునకే యాకర్షితమాయెను. దెబ్బతిన్న లేడి యట్లొక్కయడుగైన వెనుకకు వేయఁజాలకపోయెను. తోడి వారినందంద నిలువరించి యాతఁడు నల్లనల్లన నాబిత్తరిం జేరనరిగెను. విల్లమ్ములతో తనువందిన ననవిల్తు నట్టులఁ దలవని తలంపుగఁ దరిచేరిన ధరణిపుంగవుని యాపూవుంబోడియుఁ గొన్నిక్షణంబులట్లే నివ్వెఱవడి నిలిచియంతం దెలివందెను. అతనినే తెప్పవాల్పక చూడసాగెను. మనమున నేమేమియో వింత తలపులు పరుగులు తీయుచున్నట్లాయెను. పూవులు కోయుటయుడిగి, నిలిచినది, నిలిచినట్లే చిత్తరవున బొమ్మయట్ల యుండిపోయెను. ఇంతలోనన రాజాక్రాల్లంటిం జేరనరిగి యిట్లనియెను. కాంతామణీ! నీవెవ్వరిదానవు? నీపేరేమి? ఈకాంతారము కడుంగడు భయంకర జంతుసంకులము. ఇచ్చటికేల నొంటిగ వచ్చితివి ? క్రూరమృగాకీర్ణమీయడవిని నీ ఈ విహారము లెట్టులు? నీతలిదండ్రులెవరు? ఎందలిదానవు ? నేనా, చోళుండనువాడ, నీదేశంబునకేలికను; మృగయా వినోదోత్సుకుండనై పరివారముతో నిటకువచ్చితిని అన్న నృపతిని విన్న యాయన్నువకుఁ దట్టి మేలుకొలిపి నట్టులాయెను. అంతఁ గొంత తమాయించికొని యానృపతికా దెలతుక యిట్లనియెను. ఓపృథ్వీపతీ! ధనంజయుండను నాగరాజుకుమరితను. మాపురియీచెంగటనె కలదు. కావుననిటకప్పుడప్పుడు విహరింపవత్తును. నేనుకన్నియను నన్నుంగుముద్వతి యందురు. తలిదండ్రుల లాలన పాలనల దివ్యములగు భోగమ్ముల ననుభవించుచు నేనేకొఱంతయు లేకయున్న దానను. అనియాతని మోమునె కనుచున్న యాపాలతుకంగని యాచోళుండు, తన్వీయిటువినుము. నీవుకన్నియవుకదా; నెలజవ్వనివి పెండ్లియాడున నున్నదానవు. నీయందున నామనము లగ్నమై యున్నయది. నన్నుంబతిగ నంగీకరించి యోవరాంగీ నన్ననుగ్రహింపుము. నాజీవితము సఫలమొనర్పుము. అన్నయాతని విన్నయాయన్నుల మిన్నయు ననవిల్తుపూముల్కు లెదనాటికొనఁగ మనసు తబ్బిబ్బు కాగా నేమి చెప్పుటకును రాక యొకింత తడవు కొట్టుమిట్టాడి యల్లన నిట్లనెను. ఆర్యా! యెంతయుమేలు. నాతలిదండ్రులును దగినవరుం జూచిపెండ్లి చేయఁగోరుచునన్వేషించుచున్నారు. నేను తలిదండ్రుల చాటుదానను. వన్నీయందగు పెద్దలువారు. నాయందున దయయుంచి వారికి మీభావమ్ముం జెప్పుడు. వారును గాదనబోరు. అనునాపె పల్కులు తమకము హెచ్చినరాజునకుఁ జెవులఁబడలేదు. ఆతడిట్టులనియెను అంగనా! క్షత్రియులకు గాంధర్వ వివాహముత్తమము. అందుఁగన్నియ తాన తన్నర్పించుకొన నర్హురాలు యువతీయువకుల మనసులు కలియవలయును, అదియకావలసినది.

అగునగు మీరన్నదినేఁగాదనను. కాని ఇది నాప్రార్థన దీనిచే నాశీలము గౌరవము, రక్షితమగును, గురువులును బంధుగులును మెత్తురు. చంద్రోదయమున సంద్రమెంత పొంగియుఁ జెలియలికట్టదాటని యట్లుమనమును మనమర్యాదల నుంటయు మేలు. అనుచున్న యాకుందరదన పలుకులా చోళుఁడు గాదనఁ జాలక తనవారిని బురికిని బోవఁగట్టడసేసి తానావెలందితో నాగపురమునకుం బోయెను. అతని, నాతనికోర్కెను నెఱింగిన నాగరాజు ధనంజయుండును మిగుల నానందించి వారిప్రేమ వివాహమున కంగీకరించెను. విధివిధానమునఁ బెండ్లియుఁ బూర్తియాయెను. రాజును నటఁగొన్ని నాళ్లుండి వినోదక్రీడలందేలి మామగారి నుండి మఱలవత్తునని యనుమతిం గొని, తనయెడబాటున కెంతయుం గలతనంది వెతనందు ప్రేమంపుటాలి నిప్పుడవత్తునని యెట్టులో యొప్పించి నిజపురంబునకుం బోయెను. పోయిన యారాజు రాచకార్యముల మున్గి తనప్రేమను పొలఁతిని మఱిదలంపనేలేదు. కాముకుల డెందములు కపట కలుషితములు. అల్లుఁడింక వచ్చు, నింక వచ్చును బత్నిం దీసికొని వెళ్లునని, ధనంజయుం డెంచి యూరకుండెను. పావనచరితయగు నాయిల్లాలు పతినింటికి బోవనాతురత నొందసాగెను. కాని యిట నెలఁతకు నెలతప్పుటఁ దండ్రియు నామెనింటనె యుంచి లాలించెను. నెలలు నిండిన యాయమ ముద్దులకందుం గనియెను. అప్పటివారికా నిండుచందురుడు బిడ్డమోముంగని సిగ్గున వెలవెలఁబోవుచున్నటులుగఁ దోచెను. మనుమనియామోమందము. వెడఁద కనులబెడఁగు, మొలకనవ్వుల కులుకు, కనికని యాతాత తనివియె యందఁజాలకుండెను. దినదినము శుక్లపక్ష శశికళ యట్లు పెరుగుచున్న యాపసికందును బాయఁజాలకయె యానాగరాజు తల్లిబిడ్డల నల్లునింటికి బంపనే యూహింపలేదు. ఇట్లు రోజులు, నెలలు వత్సరములు గడచిపోయినవి. కాలమెవరి కొఱకును గట్టువడియుండదుగదా. నాగరాజు నానందముతోఁ బాటు బాలకుఁడును బెరిగిపెద్దయై కొంతప్రాజ్ఞుండాయెను తనతోడి బాలుర,ఁదలిదండ్రుల నాదరమునఁ బెరుగు వారింగని యా బాలకుఁడు తల్లివద్దకువచ్చి యమ్మా! నానాయనగారేరి? ఎందును, ఎప్పుడును గానరారేమి? ఎందున్న వారోచూపుము, కాదేని చెప్పుమని యడిగెను. అదివిన్న యామానవతి డెందమెంతయువగం గుందిపోయెను. గతమును దలంచి వెతపొందెను. పిమ్మటఁ దనకడచిన వృత్తమంతయు నతనికి వివరముగఁ జెప్పెను. అదివిన్న యాబాలకుఁడు తల్లితో నిట్లనియెను. తల్లీ ఈ పృథ్వీతలమున నెక్కడనున్ననేమి తండ్రిగారిని నేఁ జూచితీరెదను. జనకుల పురమునకుంబోవు మార్గమును నాకు వివరముఁ జెప్పుము. ఇప్పుడ నాకుంబోయిరానను జ్ఞయిమ్ము. కాదనకుము. ఇప్పుడెపోయి యప్పయొడిం గూరుచుందును. అప్పుడు నాకెంతసంతసముగ నుండునో! నా? అన్నయా తనయుంగన్న యాజనని యానందమెంతయో. ఆమెమనసు చింతయు

నత్యంతమాయెను. తనయుఁడు తండ్రింజూడఁ బోవుచుండెనను నానందము, చెంతనున్న సుతుఁడును దూరమగుచుండెనే యనుచింత. ఈతనూభవుచేతనే తమదంపతులకుం బునస్సమావేశమగునేమో యనునాశ యింతంతయై ముప్పిరిగొనుచుండ నామెమన సేమాయెనో యామెకే తెలియక పోయెను. తనూజునకుం జెప్పవలసిన దంతయును జెప్పిపంపెను. ఆతండును తాతంజేరి జరిగిన కతయెల్లం జెప్పి మాతామహుననుమతిం బొంది యిలువెడలివారు చెప్పిన మార్గమున నశ్వారూఢుండై వెడలిపోయెను. పోయి పోయి చోళరాజు నగరింజేరి రాజుందర్శించి తండ్రీ!యని పాదములంబడి నమస్కరించి యాపదములు పట్టి విడువక యున్న నాతనిబట్టిలేవఁ దీసి నీచరితమేమని రాజాదరమున నడిగెను. దానికాబాలకుండు తనతల్లి చెప్పిన యుదంతంబంతయుఁ జెప్పివినిపించెను. అదియంతయు విన్నరాజునకా చరిత్రమంతయు నొక్కమారుగ స్వాంతమున మెఱపుమెఱసినట్లయి యెవ్వరో వీపునఁ జఱచికొట్టినట్లు కాగాఁదనమఱపునకు, నక్రమవర్తనకు మిక్కిలిగఁ బరితపించెను. పుత్రుం గౌగలించికొని కన్నుల జలజలనీరు కార్చెను. అప్పుడ పరివారమును, దగువారిం బంపి తనభార్యను గూడ పురమునకుం బిలిపించి యంతఃపురమున నాదరమ్మున నుంచెను. జ్యోతిశాస్త్రజ్ఞులచేఁ దనపుత్రుఁడు దైవభక్తుడు ప్రతాపవంతుడు నగు చక్రవర్తికాఁగలఁడని తెలిసి యాతని ప్రమోదంబమే యంబాయెను. అంతియకాదు తనకును, దనభార్య కుముద్వతికిని నెచటఁ బ్రథమ సమావేశమాయె నచటనె పెద్దపురమును నిర్మింపఁజేసి ధానికతనినె రాజుగనభిషిక్తునిగఁ నొనర్చెను. పిదప నాతఁడు చతుస్సముద్ర ముద్రితంబగు ధరణీతలం బెల్లనేక ఛత్రముగఁ బరిపాలించి రారాజై చక్రవర్తి నామమును సార్థకమొనర్చికొనెను. అంతటి పాలకుండయ్యును నేవేళను నెమ్మది శ్రీహరిని మఱువక యెడందం బట్టియుంచి మేటిభక్తుండై యుండెను.

## చక్రవర్తికి దేవుని దర్శనము

భక్తవరుఁడు చోళ చక్రవర్తి ప్రజారంజకముగఁ బరిపాలనము సాగించుచుండెను. ఒకదినమున నాతని గోపాలురు కొందఱు రాజవరునంతికమునకు వచ్చి యిట్లని మనవిచేసికొనిరి. ప్రభువరా! మేము దేవర వారియానమేరకుఁ బ్రతిదినమును నాశేష శైలమునఁ బశువుల మేపుకొనుచుఁ దిరుగుచుందుము. ఉదయాస్తమయముల నటఁ బాలుపితికి భాండములం బట్టి రాజమందిరమునకుం గొనితెచ్చుచుందుము. ఇట్లుండ నీమధ్య నట మధ్యేమార్గమునం గల వల్మీకము కడకు వచ్చుసరికేమి వింతయో గాని యాపాలకుండలబ్బురముగఁ బగిలిపోయి పాలాపుట్టలోనికిం బాఱిపోవుచుండెను. అట మాజాగ్రత యేమియుఁ బనికివచ్చుటలేదు. అట్లు పగిలిపోవుటకేమియుఁ గారణమును దోచకుండెను. అదేమియో తెలియవలెనని యత్నించిచూచితిమి కాని యెంతగట్టివేయైనను

దినదినమట్లా యటికలటఁ బగులుచునేయుండెను. పాలుపుట్టకే పాఱుచుండెను. కారణము మాత్రము మాకావంతయుఁ దెలియరాలేదు. ఈ వింత విషయము మీకుం దెలుప వలయునని వచ్చితిమి. అదియేమియో మీరే యోచింపవలయును. అని తెలిపి తేని యనుమతినంది వెడలిపోయిరి. అదివిన్న రాజును మిగుల విస్మితుఁడై యదిదైవికమని యెంచుచు నాసాయం సమయమున నెప్పటియట్ల దేవుని పూజాదికములం జేసికొనిరాతిరి దేవదేవుని శ్రీహరిని దలపోయుచునె శయనించి నిదురించెను. ఆ రేయినాతఁడొక యద్భుతమగు స్వప్నముం గాంచి యుదయముననె లేచి, కాలోచితములం దీరి దేవు మాధవునర్చించి సభకు నేతెంచి తనకలయంతయు మంత్రులతో స్వప్నఫలజ్ఞాతలతో నిట్లని తెలియఁజేసెను. ఓ సదస్యులారా ! మీరెప్పుడును గాంచియుండరు. నేనీరాతిరొక వింతకల గాంచితిని. అదో కడువింతల వింత దానిమీకుం జెప్పెద నాలింపుడు.

ఒక యద్భుతమహాపురుషుఁడు నీలమేఘశ్యాముఁడు, కమల దళములట్టి విశాలనేత్రముల వాఁడు దయామూర్తి నాకు నెదుటఁ దోఁచెను. అపుడు నేనాపురుషోత్తము నడిగితిని మీరెవ్వరు? ఎక్కడివారు? మీరిపుడిచటికేల దయచేసితిరి? మేము మీకై చేయఁగలుగునదేమి కలదు? ఇట్లు నేనడిగిన నాపుణ్యపురుషుఁడు కరుణామూర్తి యిట్లని పలికెను. ఓ రాజవరా! నేను దేవదేవుడు శ్రీనివాసునిచేఁ బంపఁబడితిని. నేనీ శేషాద్రి నాశేషగిరి వాసుని కటముననె యెల్లపుడుఁ బ్రమోదమున నివసించుచుందును. అబ్బురమగు నీ వేంకటాద్రి మాహాత్మ్యమును జిత్రాతి చిత్రమును నీకుం దెలుప నాదేవాధి దేవుఁడు నన్నుంబంపెను.

కేశవుఁడు శంఖచక్ర గదాధారి శ్రీభూదేవులతో నీపర్వతోన్నత శిఖరముల సదా వినోద విహారములం జరుపుచుండును. ఆ నగరాజమున దక్షిణమున దేవుని రాజధాని గజాశ్వరథసంకుల మత్యద్భుత వస్తు సమృద్ధము విరాజిల్లుచుండును. ఆ గిరివరమున ముప్పది మూఁడుకోట్ల దేవతలు మునివరులు యోగిసిద్ధవరులు బలురూపముల నివసించుచున్నారు. ఎల్ల తీర్థములటఁ జేరియలరారుచున్నవి. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశత్వము నను నెనిమిది విభూతులు నందాకొండను నలరారుచుండును. అవ్వియా దేవుంబొందం గోరియటఁ దపంబొనరించు చుండెను. ఆ పుణ్యామలకుం దూర్పున గాళహస్తి యన విశ్రుత పవిత్రక్షేత్ర మొప్పును. అందున మహేశ్వరుండాదరాసక్తుల వసించుచుండును. ఆ దివ్యక్షేత్రమున కుత్తరమునఁ బవిత్ర సువర్ణముఖరీ నది సర్వపాపహరంబై మునిజన సంసేవితమై యొప్పును. దానితీర భూములనుండి జితేంద్రియుఁడు శుకయోగీంద్రునితో యోగులు, మునులు, శేషశైలేశుం గూర్చి తదనుగ్రహముం బొంద దారుణతపంబులఁ బొనరించుచుందురు. ఆ నగ

రాజమునకుం జుట్టును నేడుయోజనముల దూరము వరకును గల పుణ్యదేశమునమండి పవిత్రమనముల భక్తినుంచి పవిత్రములగు నడతల మానవులుసులభముగ విష్ణులోకముం బొంది తరింపంగలరు. అష్టాక్షరమంత్రమును బవిత్ర హృదయమున జపమొనరించిన నికలోటనునదేమి! అలబ్యమేది! యెచ్చట ! ఇంతయెందులకు లెమ్ము లెమ్ము! ఆదేవ దేవేశుని ఆ భగవాముని శ్రీవేంకట గిరీశుని దివ్యమందిరమును శేషశైలమును దర్శింప నిప్పుడలేచిరమ్ము.

అనుచుండనప్పుడ నేనును లేచి యాదివ్యపురుషు వెనువెంటనె పోయి శేషాచలమును జేరితిని. ఏమి చెప్పవలయు నాయద్రిరాజముం గూర్చి? పెక్కు శిఖరములచే నలంకృతమై యద్దియాకాశముతో మంతనములాడుచుండెను. అటకుం గొనిపోయి యామహాపురుషుఁడు నాకుఁ బదియారువన్నె బంగరుచే నిర్మితమైన నవరత్నజటితమై యందమై విశాలమగు దివ్యవిమానమును జూపెను. నేనాదివ్య దేవాయతనమును జూచుచునే యుంటిని. ఇంతలో నాపురుషుండంతర్ధానుండాయెను. అంతలోనన యా యాలయమును గనుమఱుగాయెను. నేఁజూచిన పరమాద్భుతమగు తనువెల్ల గగుర్పాటొనరింపఁజేయు స్వప్నమిదియ. ఇట్టిది మున్నెవ్వరైన నెన్నఁడైన నెటనైనఁ గాంచిన వారుకలరే! ఇది యదృష్ట పూర్వము. మీరెల్లరు యోచింపుడు.

అది విన్న యందలి బుద్ధిమంతు లిట్లనిరి. ఓ రాజవరా ! దేవుఁడే మీయందునఁ గరుణపూని తానుగ నిదియంతయు మీకుంజూపెను. తొల్లి గొల్లలు సెప్పిన యావల్మీకము యాదేవుని నివాసమై యుండనోపును ఇదినిక్కము. అక్కడ క్షీరాభిషేకమొనరించిన నాదేవుండు దయామయుండు తానుగ దర్శనం బీయంగలండు.

ఇట్లు వారు యోచనలనుండ నాసభకొక శబరుఁడేతెంచెను. ఆతఁడు కాలాభ్ర సన్నిభ నీలతనయుఁడు, విల్లమ్ములు, ఖడ్గముం దాల్చి యుండెను. తలను పల్లవయుత లతలతోఁ జుట్టి కట్టిన సిగను నెమలిపింఛెము. గ్రుచ్చియుండెను. మాటలాడక యెవచ్చి యాతఁడు రాజునకు వినమ్రుఁడై నమస్కరించి యంజలించి నిలిచి యిట్లని విన్నవించెను.

హే స్వామి! నేను వృషశైలంబున నుందును. అటఁ బ్రియంగు సస్యములం బండించి వండి దేవునకు నివేదింతును. దానితోడననేను నాకుటుంబమును బంధుగులును జీవించుచున్నారము. అటకెక్కడినుండియో యొక శ్వేతవరాహము వచ్చి మమ్ముల వెఱపించి చూచుచుండగనే మాకొట్టుచేనుం దినిపోవుచుండెను. అందువల్ల నొకనాఁడు నాపుత్రునటఁ గట్టిగఁ గాపుండనియమించి దేవుని నివేదనమునకుం దేనియం దేవనంబునకుంబోతిని. నావచ్చుటకుం జాలసేపాయెను. ఇంతలో నాకొట్టులకాశపడిన

నాబిడ్డడు వానింబేల్చి చేతులనలిపి తీసికొని తినివైచెను. నేనును దిరిగివచ్చి చూచితినిగదా. ఏమున్నది దేవునికి నివేదించుటకు దేవునికి నివేదింపక నామనసునకుం దనివియుండదు. దాననేను మిక్కిలియుం గోపించి యేడ్చుచున్న కొడుకుంబట్టి కొట్టి చంపఁబూనితిని. అప్పుడు నాకాశమున నుండి యొక గంభీరవాక్కు ఇట్లు విననాయెను. ఓయీ దేవునకు నివేదింపలేదని బిడ్డని జంపఁబోకుము. నీభక్తి కార్యంబునకు దేవుండు ప్రసన్నుండై యిట స్వాకారమందియున్నాడు. చక్రవర్తి భూపాలుని కడకుంబొమ్ము. వానింజూచి వానికన్న స్వప్నవిషయమును దెలియఁజెప్పి యిటకుం దీసికొనిరమ్ము. అని తన వినిన గగనవాక్కును జెప్పవిని రాజు సభ్యులతో విజ్ఞులతో విచారించి గోపకుల పలుకులు, తనస్వప్న వృత్తాంతము, శబరవచనములు నన్నింటి సమన్వయముగ యోచించి యాశబరునితోఁ గూడ బయలుదేరిపోయెను. పోవుచుఁ గలిగిన గోవుల పాలెల్లఁ బిండించి భాండంబుల నిండించి కొండకుం బట్టించికొని రండని మంత్రివరుల కాజ్ఞాపించెను.

చక్రవర్తి యటకు దివ్య విమానమును జూడంగలనను నాశను నాశబరుని వెంటంబడిపోయెను. అదృష్టవంతుండు రాజు. ఆట కొత్తచేనునఁ బడి భయంకరముగ ఘర్ఘరధ్వని చేయుఁజేనుందినివేయుచు నిటునటు దిరుగు నావరాహమును, దాని వెనుకన పోయిపోయి యాతఁడు కలనుగన్న యాసువర్ణమయము, రత్నసమాలంకృతము నదృష్టపూర్వమునగు దివ్యవిమానము వేవేల సూర్యులకాంతుల వెలుగొందు దానినిగాంచెను. ఆతరువాత నావరాహము వారుచూచుచుండగనె యాపెద్దపుట్టయందుననె చొచ్చి కానరాక పోయెను. ఆదివ్య విమానమును నదృశ్యమాయెను. అదికాంచి మిగులవింతనంది, యిదియేమి? దీనియర్థమేమి? ఇందలి రహస్యమేమి? అనుకొనుచు నీకేమేని దెలిసినఁ జెప్పుమని రాజాశబరురు నడిగెను. ఆ శబరుండిట్లనియెను. ఓ యేలికా! యీవరాహముకే వల వరాహముకాదు; సాక్షాద్విష్ణుదేవుడ ; భూమినెత్తిన యాదివరాహమిద్ది. మీరుచూచిన యీ దివ్యవిమాన మాదేవదేవు నిలయమే. ఆ పెద్దపుట్టయే యాదేవుని యాలయమున్న తావుకానోపును. కావుననే యాదేవుండందున నుండియే వచ్చును. మఱల నందునకే పోవుచుండును. కావుననోదేవరా! ఇప్పుడే యాపుట్టంద్రవ్వించి దేవాయతనమును, దేవుని జూడవచ్చును. నిక్కముగ దేవుండిందుననే వసియించుచున్నాడని నానమ్మకమున రాజాను నట్టులనే తోచుచున్న ది. అందువలననే గోపాలురు పాలయటికలిట పగిలి క్షీరములు వల్మీకములోనికిం బ్రవహించుచున్న వనియనుకొనెను. ఇంతయెంచియు రాజా పుట్టవట్టుం ద్రవ్వింప వెనుకాడుచుండెను. అంతలోనన గోపకులు పాలంగొని రాగా వారు తెచ్చిన లెక్కకు మిక్కిలగు దుగ్ధభాండంబులంగొని తానభక్తిపురస్సరంబుగ క్షీరంబులు దానిపై నొలికించెను. ఆ క్షీరాభిషేకమున నావల్మీకము కరిగిపోగా నాలోపల మాహాలకందవి,

పలుకులకురాని, యమితతేజోమయము దివ్యముత్తమము విమానము కాననాయెను. ఱేఁడద్ది దర్శించి తలవంచి భక్తిని మాటిమాటికి వందనము లొనరించెను. తన్మధ్యమున నీలమణికాంతి శోభిత దివ్యతనుఁడు కమలాపతి, సృష్టిస్థితి లయకారుఁడు జగద్రక్షకుఁడు, శ్రీవత్సాంకుడు,కమలనేత్రుఁడు, కమలనాభుడు పీతాంబరధరుఁడు చేతులం శంఖచక్రములం బట్టియభయహస్తము నెత్తిపట్టి వివిధానేక రత్నాభరణ సంశోభితుండును, దేవాధి దేవతలచే సంసేవితుండునునై యున్న వానింగనువిందుగఁ గాంచెను. భగవంతుని నాదిదేవుని శ్రీమన్నారాయణు వేంకట నగాధీశుని శ్రీనివాసు నెదుటంగని యాభక్త వత్సలునకుం బ్రణమిల్లి చక్రవర్తి ధరావరుఁడు వినయ వినమిత గాత్రుఁడై యిట్లని సంస్తుతించి కీర్తించెను.

## చక్రవర్తి చేసిన శ్రీనివాస స్తుతి

దేవయేకైక పాలకుండవు. బ్రహ్మరుద్రులు, పాకశాసనాద్యష్ట దిక్పాలురు, సిద్ధసాధ్య విశ్వేదేవతలు, మరుత్తులు మొదలుగా గల దేవతలెల్లరును స్వర్గమున నుండి మీయాజ్ఞల కెదురుచూచుచుఁ బాలించుచునుందురు. మీరూపమత్యంతాద్భుతమ్మ. దాని ఋషిముని యోగిసత్తములును గాంచఁజాలరు. అట్టియెడ నాయందవ్యాజ కరుణనూనియనుగ్రహించి యిట్లు ప్రత్యక్షముగఁ దోచితిరి. ఇది మీదివ్యా నురాగము నాదగుమహద్భాగ్యము. ఓ భగవానుఁడా! యజ్ఞమీవ, యజ్ఞార్థవస్తువులును, యజ్ఞకర్తయును నీవ. అగ్నివీవ, స్వాహవీవ. యజ్ఞోద్దేశ్యము. యజ్ఞఫలము సర్వమునీవ. నీవకాకన్యమొండులేదు. నీవదేవుఁడవు, వేరుదైవంబు లేదు. అంతకాదినున్నయద్వితీయ పరబ్రహ్మవు. అంతయు లయమందిన నుండువాడవు నీవ. నీసంకల్పముననే యీప్రకృతి యంతయుఁ గలుగుచున్నది. పెంపునందుచున్నది. నీ వలనఁ గలిగిన యీప్రకృతి యంతయు నీరూపము, నీకన్యములేదు. అంతయు నీయందిమిడియున్నది. అంతట నీవు నిండియుండి దీనిం బాలించుచున్నావు. దేవా! నీవు కాలస్వరూపుండవు తొలుతొల్లిటికాలంబున బ్రహ్మరుద్రేంద్రాదు లెవ్వరును లేరు. అంతకాదినున్నవాఁడవీ వొక్కరుఁడవ. అంతకాది స్రష్టవీవ, కారణమీవ, సంహర్తవీవ, అంతకు రక్షకుఁడ వీవ. నీసంకల్పముననె యాకాశవాయువులొ దవినవి, తేజంబుకలిగినది. అనంతజలంబుల నొనర్చి, యందనంత శయనమున ననంతుఁడవై జాగృతిని శయనించి యున్నాడవు. నిన్నెటింగిన వారెవ్వరునులేరు. ఈ లోకమునిన్నెఱుంగదు. అంతయు నీవెరుంగుదువు. నీవాది మధ్యాంతములు లేనివాడవు. వేదములు నిన్ను సత్యస్వరూపుడ వనుచున్నవి. సత్యము నీవ. నీవె సత్యమవు. జ్ఞాన స్వరూపుండవు. జ్ఞానగమ్యుడవు నగు నీకిదే నమస్కరించుచున్నాను. కర్తవీవ, కర్మవీవ, కర్మఫలమీవ కర్మకారణ మీవ యో దేవదేవ! అంతటనీవు వ్యాపించియున్నాడవు. నీవెనుకనంటి లక్ష్మీమాతయు వ్యాపించి

యున్నది. లక్ష్మీసఖునకు, లక్ష్మీవిభునకు, నతభక్త జనరక్షకునకు, ప్రణతార్తిహరునకు, మంగళమూలునకు, మంగళకరునకు నీకు వందనము. నిర్వికారునకు, నీరజాక్షునకు నిత్యునకివె భక్తిప్రణతులు, నుతులు.

ఇట్లారాజవరుడు ప్రార్థనం బొనరించుచు మాటిమాటికి భూమిని బడిలేచి సాష్టాంగ నమస్కృతులొనరింపసాగెను. ఇతని భక్తితాత్పర్యములం గన్న దేవుండెంతయో ప్రసన్నుండాయెను. గుహల ప్రతిధ్వనించు సముద్రనినదముం గూడఁగ్రిందుచేయు గంభీరస్వరంబున నాదేవుండా భక్తుంగని యిట్లనియెను. ఓ రాజేంద్రా! నీయీ దుర్లభానన్యభక్తికే నెంతయుఁ బ్రసన్నుండనైతిని. మనసార నీకుంగల కోర్కెను జెప్పుము. నేను నేఁడు దాని సుసంపన్న మొనర్చెదను. విచార మందంబనిలేదు; మానుము. అనదేవుని విని రాజిట్లనెను. దేవదేవ! యిదేవందనమ్ము. నిన్నుంగండ్లారంగన్న నాకువేరు కోరికెక్కడిది ? కోరికలకెల్లఁ బెద్దకోర్కి నీదర్శన ప్రాప్తియ యోగిజనులకును దుర్లబంబగునది నాకు నీయవ్యాజ కరుణను సంభవించెను. ఇంకేమి కావలయును చాలుచాలు. కాని నాకోతిమనసు ప్రేరణమున నేనొక్కటి కోరుకొనుచున్నాను. ఈ భూమింగల వారెందఱెందఱో వారెల్లరు గాఢతపోదానంబుల నిన్నుందనియింపం జేయఁజాలరు. వారిం గరుణించి యీ దివ్యరూపమున నిచ్చట నుండి వారి కీయర్చారూపంబున దర్శనంబు లిచ్చి ముక్తి ప్రమోదము లొసంగుము. నాకోరునది యొక్కటియె. అననాతని పరార్థచింతకుఁజిత్తంబు రంజిల్లదేవుండు వల్లెయని మఱియునిట్లనియెను. నీవు నాకనన్య భక్తుండవు. నీవంటివాడు నా కన్యుండులేడు .నిన్ను నాసఖుని గానెంచుచున్నాను. భక్తవశుఁడనగు నన్ను నీసఖునిగానెఱుంగుము. నిచ్చలును నీవు నిండు సౌహార్ద్రమున మూఁడువేళల నిటకువచ్చి నన్ను నర్చించి సేవించి కంటబడిపొమ్ము. అని చిఱునవ్వు వెన్నెలలంగురియుచుఁ బల్కి దేవుండం తర్హితుండాయెను. అది మొదలుగ నారాజు తనపురమున నుండి ముప్పేళల వచ్చి దేవుదర్శించి నియమార్చనంబులఁ గొనసాగించుచుఁ దనియించుచుండెను. భగవంతుండును నర్చావతారమునఁ గాక ప్రత్యక్షరూపముననె యారాజు సేవలంగొనుచుండెను. వానికిం దగువేళల నర్థోపదేశముల నొసంగుచుండెను.

## ధ్వజారోహణ - రథోత్సవ విధానము

ఇట్లు క్రమంబునఁ బూజలొనరించుచు శ్రీగరుడాధిష్ఠితమగు మంగళమంజుల మనోహర ధ్వజస్తంభంబు నారాజు నిర్మింపంజేసెను. దాని నాదేవుకర్పించెను. భక్తవరుఁడాచక్రవర్తి సూర్యుడు కన్యారాశిం జేరిన తఱి నిరాలసుఁడై దేవునకుత్సాహంబున విధిదృష్ట విధానమున ధ్వజారోహణోత్సవమును సుసంపన్న మొనర్పనెంచెను. దానికై పరమేష్ఠి పరమేశులను, నింద్రాది దిక్పాలురను, ఋషిముని యోగి గణములను, వేద బ్రాహ్మణులను రాజవరులను బరివారయుతముగ రానాహ్వానించెను.

ఆహ్వానమందిన యబ్జభవుఁడప్పుడె హంసవాహనారూఢుఁడై యబ్జనాభు సేవలు చేయనుత్సవంబున కుత్సాహమున యోగిమునిజనులతో బయలు వెడలి వచ్చెను. గిరీశుఁడును గిరిజాసహితుండై, వృషభారూఢుఁడై ప్రమదాది పారిషదపరివృతుఁడై ప్రమోదమున రమాధవు దర్శింపవచ్చెను. ఇంద్రుండును నైరావతారూఢుండై, దిక్పాలురతో సురసంఘంబులతో హుటాహుటి దేవుని సేవలకు నరుగుదెంచెను . నారద మౌనీంద్రుండును, తోడిమునులతోఁ దాపసులతో, శ్రీహరినామము మాటిమాటికి బిగ్గరగ నుగ్గడించుచు మహతీవీణెను మీటుకొనుచుఁ దదానందమునఁ దన్మయుఁడై యటకువచ్చెను. దేశదేశముల నుండి రాజులును బ్రజలును దేవునుత్సవంబును దర్శింపఁ బలుతెఱంగుల వారు పలుభావముల వారు వచ్చిరి. పుత్రపౌత్రుల, ధనధాన్యముల, వస్తువాహనముల, గృహముల నర్థించి, ముదమందఁ గోరువారును, అవ్యాజభక్తిని నిరాశాహృదయముల, దేవుని సేవామాత్రాభిలాషులైన వారును వచ్చిరి. వచ్చిన వారు దేవదేవుని దివ్యయశమును, గానము చేయువారును భగవంతుని దివ్యలీలలం జెప్పుకొనువారును, హరికథలం బాడుకొనువారునునై తన్మయులగుచుండిరి. ఈరీతిగా నాదివ్యోత్సవ మెల్లరకును నభిమతములు దీర్చునదియును, మంగళప్రదమును, మహోల్లాసకరమునై యెల్లర నబ్బురమున నానందమున ముంచితేల్చెను.

ఆశ్చర్యమాశ్చర్యము. అందువచ్చి పాల్గొనిన వారలందుఁ గుంటివారికిఁ గాళ్లువచ్చి గునగున నడువసాగిరి. మొండివారికిం జేతులు కలిగెను. చెవిటివారు దూరశ్రవణోల్లాసము నుంబొందిరి. గ్రుడ్డివారికిం గన్నులు జ్వాలములై చూపుకలిగెను. మూగవారు వాచాలులైరి. ఇదికన్న వారివారికే యెంతయో వింతయాయెను. అది మొదలుగఁ బ్రతివత్సరమును నెందరెందరో భక్తులు. విశ్వాసహృదయులు, దేవునుత్సవంబునకు వచ్చి యానందించుచు నిర్మలహృదయులై మిక్కుటముగ మేలును బొందుచుండిరి. పెంపొందుచుండిరి.

అత్తరి నింద్రునాజ్ఞను జలదములు వచ్చి వీధులనీరు చిలకరించి, ధూళినణచి, సుమనోహర మొనర్చెను. కల్పకమ్ములు పూలజల్లులఁ నెల్లెడఁ దావులు నిండించెను ఎనిమిది దినములు వరుసగ నాయుత్సవయజ్ఞము జరిగెను. ఎనిమిదవ దినమున రత్నాలంకృతమగు, సువర్ణమయమగు దివ్యరథమున దేవుండధి వసించెను. రథోత్సవ మందముగ వీధివీధులనూరేగింపునఁ దిరిగెను. ఆనాఁడు శ్రవణ నక్షత్రమున రథాఁరూఢుఁడై దేవుఁడు స్వామి పుష్కరిణీతీరమును జేరెను. అందుదేవుఁడు యజ్ఞావభృత స్నానము నొనర్చెను. దేవునితో నెల్లరునందుఁ బవిత్ర స్నానమాచరించిరి. మఱల నానాటిరాత్రి యథావిధిగ ధ్వజారోహణము కావింపఁబడెను. విప్రవరులు దేవునకు మహానైవేద్యము లర్పించిరి. మఱునాడు మఱల దేవుపూజలు దివ్యకుసుమములం జరిగెను. అంతయునైన పిమ్మట నతమస్తకులై నిలిచిన బ్రహ్మాదులకు దేవుండాదరమ్మున వీడ్కొలిచ్చెను.

బ్రహ్మాదులెల్లరు దేవుననుమతింగొని తమతమ తావులకుం బోయిరి. ప్రజలును ప్రమోదానందంబులొంది తమతమ యెడలకుం దరిలిరి. నిత్యోత్సవముల నొప్పునావెంకట నగంబాదినంబుల మర్త్యామర్త్యులతో, మునిజనములతో నానంద కోలాహలములతో దిక్కులు పిక్కటిల్లనందమై యొప్పెను. ఇట్లా యుత్సవమునుబరిపూర్తి మొనరించి రాజవర్యుఁడు ప్రసన్నచిత్తుఁడై కృతార్థుండై ధన్యుండననుకొనుచు నిజ నివాసమును జేరెను.

## సింహోదుడను రాక్షస వృత్తాంతము

ఓ ఋషివరా! మీకివే వందనములు. మీవలన మేము శ్రీవేంకటాచల మాహాత్మ్య వృత్తాంతము, భూతభవిష్యద్వర్త మానములు నెంతయు సవిస్తరముగ వింటిమి. అట భగవంతుడు కల్పపర్యంత మెట్టులేరూపున విహరించును? ఏమేమి యొనర్చును, ఒనర్చెను? అదియెల్లందెలియం జెప్పుడు. భగవంతుని చరితలకంటెను వినవలసినదేమి కలదు? అని వారలడిగిన నామునివరుండిట్లని చెప్పందొడంగెను మునివరులారా! వినుండు. తొలియగస్త్యముని తల్లజుండిది ప్రసంగవశంబునఁ జెప్పెను. దానినె మీకుం జెప్పుచున్నాడను.

చక్రవర్తియె పృథ్వీనాయకుండై పరిపాలన సాగించుచుండెను. ఆ కాలమున సింహోదుఁడను మహాబలవంతుఁడు దైత్యుండొకఁడుద్భవించెను. ఆ దురాత్ముండు పాపనాశని కుత్తరమున నొకటిన్నర యోజనముల దూరముగ నాశ్రమము నొనర్చికొని దినదినము ముప్పేళలఁ బాపనాశనిని మున్కలిడుచుఁ బరమేష్ఠిం బద్మభవుం గూర్చి యాదేవుని కంటెను మఱియొండు వేలుపు విశ్వంబున లేడనుచు అదేవు సేవించినవాడ శేషభాగ్యశాలియగును, నెల్లమనోరథములు తీరిన వాడగునని తలంచుచు దృఢమతిని తపం బొనరింపసాగెను. ఒక్కవర్షం బట్లుఁ బూన్కి నారాధన మొనరించి నంతఁ బితామహుండు పరమేష్ఠి యంచనెక్కివచ్చి సింగముల పెక్కురక్కసి యెదుటందోచెను. లెమ్ము లెమ్మో యిసింహోదలెమ్ము లెమ్ము. మేలు మేలు శుభంబగు మెచ్చువచ్చె; నీవొనర్చిన తపమిది నెమ్మనమున కోరుకొనుమేమి వరమైనఁ గూర్మినిత్తు. అనుదేవునిం గాంచి సింహోదుఁడిట్లని ప్రార్థనము లొనరించెను.

అఖిల కారణకారణునకు నజునకు, నాత్మభవునకుఁ బరమేష్ఠి కబ్జజునకు, విశ్వసృజునకు స్రష్టకు విధికి నీకు, వందనము ధాతకజునకు వందనమ్ము వేల్పుపెద్దా! నాయందక్కటికయె కల్గినచో నీవరమొసంగుము. దేవదానవ గంధర్వ యక్షరాక్షస నాగులందందఱు నావశంబున నుండవలయుము. నాయధీనులగు వారెవ్వరిచేతను నాకేవిధమగు భయమును గలుగకుండుంగావుత యిదియ నాకోరిక అనవివి

నలుమొగంబుల వేలుపట్టులెయగుంగావు తమని యంతర్ధానంబాయెను. అది మొదలుగ నాదురితాత్ముఁడున్మదవృత్తిని దనయట్టి కట్టడులం బెక్కు్రరం జేర్చికొని నాకెదురేమని దేవతలం బాధింపసాగెను. మునులఁ దపసుల నిడుమలం బెట్టెను. భూమి ప్రజలం బాములం బెట్టఁదొడంగెను. తపములు చెఱచి ధర్మములందందడి పెట్టి యజ్ఞము లస్తవ్యస్తము లొనరించి తొంటి యసురుల మేలనిపించెను.

ఆక్రవ్యాదుండు పెట్టు బాధలంబడఁజాలక మునులు, తాపసులు, ఋషులు, జేజేలు నొక్కుమ్మడి నశరణ శరణ్యు వేంకటరమణు నంతికమునకు శేషగిరి తటమునకుం బోయి యిట్లని మొరలు పెట్టుకొనిరి. దానవాంతకా! ఆర్తజనరక్షకా! ధర్మపరిత్రాతా! శరణు శరణు. శరణాగతవత్సలా! పుండరీకాక్షా! త్రాహి త్రాహి. సింహోదుండను క్రూరరక్కసుచే ముల్లోకములల్లకల్లోలములగు చుండెను. వాడు చేయని దుండగములేదు. వాడు మమ్ముబెట్టని యిక్కట్టులు లేవు. వాని యత్యాచారముల కంతుకానరాదు. పడతుల పాతివ్రత్యముం బాపి యవమానించి, యుసురులందీయును, మానవతుల నవమానించును. కూళలు ధనమానప్రాణములకుం బాసినశింతురని పెద్దలందురు; ధర్మశాస్త్రములుం జెప్పుచున్నవి. ఈ మహాపాపి బమ్మచేఁ బొందిన వరదానమదమున మన్ను మిన్ను గానకయున్నవాఁడు. మాపాలిటికీవుగా కొరులులేరు. కాపాడుము. నీపాలం బడితిమి. పాలముంతువో నీలముంతువో నీదేభారము. మాకు వేరొక గతియెందును లేదు, లేదు. అని యీరిదలఁ జేతులు చేర్చి నిలిచియున్న వారింగని భూతభావనుడు భగవానుఁడు నక్కటిక మిక్కుటముగ నాదేవాదులంగని మేఘగంభీరధ్వని నిట్లుపలికెను.

ఓ దేవమునివరులారా! మీరెఱుంగనిదేమున్నది? ఆసురద్విషుఁడు నలువచేఁ బొందిన వరంబున దైత్యదానవాసురులచే, దేవతలచే, దేవయోనులచేఁ జచ్చువాడు కాఁడు. మనమాటను మనమెవమ్ము చేసికొనరాదు కదా! ఆవరమునకుం బెరవారగు మానవులందు వానినెదిర్చి చంపంజాలు బలపరాక్రమవంతులు కానరారు. అగ్నికి వాయువుతోడైనట్లా ఖలునకింకను మొఱకులు పలలాశనులు పెక్కురు తోడై వర్తించు చున్నవారు. షడ్భాణాసుర పుత్రులు, కులటోత్పన్నులు, దైత్యాంశోద్భవులత్యంత ఖలులు, ఖరుడు, కడారుడు, పింగాక్షుఁడు, కనకుఁడు కద్రుకుఁడు, కపి యను వారార్వురు ముక్కడులు తమతమ బలగములతో నాదుష్టునకండగ నిలిచియున్నవారు. అగుఁగాక, యాదుష్టుల నెల్లనాశమొనరింప నొకయుపాయముం జెప్పెదను. సావధానులయి యాలించి తదనుసారముగ బాగుగ నాచరించి మేలందుడు. ఈయెడఁ గాళహస్తికి సామీప్యమునఁ బాపనాశని, పుణ్యప్రదాయినియగు సువర్ణముఖరీ నదీమతల్లికిఁ బశ్చిమతీరమునం గల పుణ్యధామనగరమున మహాపరాక్రమవంతుఁడు చక్రవర్తియను రాజవరుండు

వసించుచున్నవాఁడు. మీరెల్లరు మీమీదేవాంశములఁ గొంతకొంత యాతనియందుం జేర్పుఁడు. ఆతండు మదీయభక్తవరుండు. తనభక్తిచేతనె యాతండు మదీయతేజంబును బొందియున్నవాఁడు. అలనాఁడా రామచంద్రుండా రావణు సంహరించి నటుల నామహాబలుడాక్రూరుల బలవంతుల సింహాదాదులరాత్రించరుల దునుమాడును. ఓ దేవతలారా, తాపసులారా! మీకు మేలగును. శాంతసౌఖ్యము లొదవును. ఇట్లనుచు నా పరంధాముఁడు వారలనెల్ల వీడుకొలిపెను. తాను దనవిమానమును జేరెను. ఆ పిమ్మట వారెల్లరును జక్రవర్తి కడకుంబోనుద్యుక్తులైరి.

ఆ దేవగంధర్వాదులును, తాపసులును, విప్రవేషంబులు దాల్చి శుభాశీర్వాద పూర్వకముగ నారాజవరుం జేరిరి. దరికివచ్చిన యాపాటులంగాంచి రాజమ్యుండు లేచి ప్రత్యుత్థానం బొనరించి వందనాదుల సత్కరించి యుపవిష్టులం జేసి యథావిధి పూజలఁ బరితృప్తులం జేసి కుశలప్రశ్నలువేసెను. వారును వినయభావముననేక కంఠమున నిట్లనిరి. ఓ రాజవరా! నీవు పాలించుచుండ నీభూమిని మాకెల్లరకును కుశలమే. సూర్యుఁడు వెలుంగుచుండ నంధకారమటకుఁ జేరఁగలదె? కాని యీమధ్య సింహాదుఁడను నొకదానవుఁడు పెచ్చుపెరిగి తనయట్టివారిం దుండగులఁ బెక్కురందోడు జేసికొని దుండగములొనరించుచున్నవాఁడు. ముఖ్యముగ నాతఁడు భూమి సురులనెక్కుడు వెతలఁ బెట్టుచున్నాడు. వాని కారణమున నెచ్చటను యజ్ఞయాగములు హోమములు జరుగుటలేదు. ఏ సత్క్రియలు, ధర్మకార్యములు జరుగుట కే యవకాశమును జిక్కుటయేలేదు. వేదాధ్యయనములు వినవచ్చుటయే లేదు. ఆ దుష్టుఁడు, భూమిసురహింసకుండట పాపనాశన తీర్థమున కుత్తరమున సార్థయోజన దూరంబున దురాచారము లొనరించుచు నివసించుచున్నవాడు. లోకకంటకుఁడగు నాతని దొలగించి దేశమును నిష్కంటక మొనరింపుడు. ఇదియ మాప్రార్థన. మీవలన ననుగృహీతులమై మేము కృతకృత్యులము కాగలమనిరి. అది విన్న రాజిట్లనెను. ఓ మహాత్ములారా! మీయనుగ్రహమున నేనాపాపి ననశ్యము నాశమొనర్పంగలను. కాని యిదిచెప్పుడు. వాఁడెట్టివాఁడు? వాని ప్రవర్తన మెట్టిది? వాని బలమెట్టిది? అన్నధరణీ సురులిట్లనిరి. రాజా! వాఁడు బమ్మచేఁ బొందిన వరముల గర్వమునఁ గన్నులు నెత్తికెక్కి మన్నుమిన్నుగానక, కడుక్రూరుండై మత్తునఁ బ్రవర్తించు చున్నవాఁడు. అతఁడెల్ల దేవతల చేతను గడకు దైత్యాంతకుఁడగు చక్రధారి మురారిచేతను నవధ్యుండు. ఆతనిం జంపంగలవాఁడ వీకొక్కఁడవె. ఇందింతయు సందియములేదు. ఓ ప్రభూ! దేవతలెల్లరును నీకార్యమున నండగనుండఁగలరు అనుచు జయజయ కారములతో నాశీర్వాదము లొనర్చి యొక్కఁడొక్కడుగ నంతర్ధానమైపోయిరి. అదికాంచిన రాజును మిగులవింతలఁగూరి యాలోచనాన్వితుఁడాయెను. అటు పిమ్మట పరమధార్మికుఁడా మహారాజు మంత్రులరావించి

వారితో దుష్టరాక్షస వధోపాయ మునుయోచించెను. కార్యజ్ఞులగు మంత్రివరుల సలహానంది యారాజవరుడు వేంకటాద్రికి దేవునసన్నిధికిం బోయెను. సువర్ణపత్రంబులఁ, గనకకమలములఁ, దులసీదళంబులఁ దావులంజల్లు పూవులనాదేవు యథావిధిం బూజించి, కరుణించి కన్నులంబడిన యాగోవిందుతోఁ గనువిందుతో నారాజిట్లనియెను.

ఓ ప్రభూ! భూమింగల పజలు పుడమివేల్పులు సింహాదుండను నాదైత్యునిచేఁ గడుంగడు పీడితులగుచున్నవారు. వారెల్లరునే తెంచి వానింజంపుమని నన్నాదేశించిచనిరి. ఓ దేవదేవా! జగన్నియంతా! నీయాజ్ఞ యేమి? నన్నేమి చేయుమందువు? అననాతనికి శ్రీ వేంకటాద్రీశుండిట్టులనియెను

ఓ భక్తవరా! ఆ దుష్టదానవుం జంపనీవ వలతివి. దానికై నీకు నాయాయుధంబులై దింటి నొసంగెదను. అవ్విపాపులనే కాదు పాపంబులను మొదలంట నశింపఁ జేయునవి, ముక్తిసూచకమ్ములు. వానిం దాల్చిపోయి యాదానవుని వాని మంత్రుల, బంధుమిత్రులఁ బరివారమును నిశ్శేషముగ సంహరింపుము. పొమ్ము. అనియాదేవుండు రాజునకుభక్తవరునికి పాంచజన్యశంఖమును, సుదర్శనచక్రమును, శార్ఙ్గకోదండమును, కౌమోదకీగదను, నందక ఖడ్గమును బ్రసన్నచిత్తమున నొసంగెను. చక్రవర్తియు దేవునకు వినమ్రభావంబునఁ బ్రణ మిల్లి యాయాయుధరాజముల నంజలించి కైకొనియటనుండి దేవు నా నిజపురంబునకు వచ్చి చేరి తనసైన్యంబుల సమరసన్నద్ధములం జేసెను. దైవానుకూల్యము నొందిన రాజు తాను గిరాతనాయకుఁడుగ వేషమూని, తనసైన్యంబుల గిరాతులుగ నొనర్చి శేషగిరికి వేటలాడఁ బోవునటుల యాత్రను సాగించెను. ససైన్యుండును సపరివారుండును నైనరాజు కొండంజేరి యడవిని నుత్సాహమున వేటలు సాగింపసాగెను. పులుల వెంటఁదరిమి చంపువారుఁ నెలుగు గొడ్డులం బిలుకుమార్చువారు, తోడేళ్లం ద్రుంచువారు, సింగంబులం ద్రుంగించువారు, నడవిపందుల, నేదులఁగడతేర్చువారునై యుత్సాహమున నడవి యెల్లందామెయై తిరుగుచుఁ దిరుగుచు వారలమెలమెల్లన నాసింహాదుఁడుండు వనంబునకుం జేరిరి.

విపినాంతమునం జరుగుచున్న యాకలకలమునువిని సింహదుఁడు, యాతుధాన పతి, వనదుర్గము నుండి బయటకు వచ్చి వేటతమకమున నున్నవారిం జూచి చిఱునవ్వు మోమున నొలయమనమున నిట్లని తలపోసెను. వీరలెవరు? దేవతలును గారు, దైత్యులునుగారు, యక్షగంధర్వాదులయు సైన్యములుగావు. అలచక్రవర్తి బలగమందమా యదియుఁ గానట్టులెయున్నది. అయిననింత నిర్భయులయి నాయావిపినమున వీరెవరిట్టులు చరించుచున్నవారు? వీరలంగని మనమేల వెనుకముందాడ వలయును. అనుకొనుచు నాతఁడు తనబలగంబులం గొని దుర్గమును వెడలివచ్చెను. సింహదుఁడు

సింహారూఢుండై చూపఱకు వెఱపుంగొలుపుచుఁ దనయసంఖ్యానీకంబుతోవచ్చునంత, నటనెన్మిది దిక్కులనుండియు లక్షలు కోట్లు రాక్షసవీరుల వెంటనిడికొని షడ్బాణాసుర తనయులు కర్కశకాయులు, ఖరకడారాదులు ద్రేకాననులయి వచ్చిచేరిరి. వారందఱు కూడివచ్చి చక్రవర్తి యనీకంబులఁ గిరాతరూపులఁ గొట్టనారంభించిరి. అటు చక్రవర్తి సైన్యములును మోహరించి ముక్కిడి రక్కసిమూకల మార్కొనిరి. వారికి వీరికిఁ బెద్దపోరాయెను. రథికులు రథికుల, నాశ్వికులాశ్వికుల హస్తిసైన్యంబులు హస్తిసైన్యంబులఁ బదాతులు పదాతులఁ దాకి భీకర సమరంబును బొనరించుచుండిరి.

హరిభక్తులు, హరివిరోధులు,నొండొరులందాకి పోరొనరించుచో నదికాంచ నారదుండుకుంచె వీచుచు, మహతిమీటుచు, గగనతలమునఁ బాడుచునాడుచుండెను. అట సురవీధిని విమానములనెక్కి యక్షకిన్నెర గంధర్వాప్సరసలు గుములుగవచ్చి వినోదంబుగఁ జూచుచుండిరి. ఇంద్రాది దేవనాయకులు నాసంకుల సమరమునుత్కంఠం గాంచుచుండిరి. యుద్ధము నందసువులం బాసిన వీరులం బొందనేను నేనని యచ్చర మచ్చెగంటులు తమలోఁ దాము పోటీల వచ్చికొనిపోవుచుండిరి. తనయోధవరులందుఁ జనిపోయిన వీరులంగని రాజాగ్రగూపుఁడై శార్ఙ్గచాపమును జేపట్టి తీవ్రనారాచములం గుదులుగుదులుగ సంధించి గుప్పించుచు దానవ వీరుల బాణబాణమునఁ బదులు వందలుగఁ దునుమాడుచుండెను. తనయసురవీరులట్టులనిఁ గూలుటంగని కృద్ధుఁడై సింహోదుండు భయంకర గదనుబట్టి గిరగిరం ద్రిప్పుచుం బోయి రాజారథాశ్వములం గొట్టి కూల్చెను. తురంగంబులు తునిసిన గినిసి రాజైరావతముం బోని గజరాజమును నింద్రునట్లధిరోహించి కౌమోదకీగదను కైఁగొని రాక్షసాధిపు వాహనమును గూల్చి రక్కసిమూకల మోకుమ్మడిం జక్కాడెను. కౌమోదకియులక్షలాదిగ రక్కసుల హతమార్చి మఱలరాజుకడకుం జేరెను. అంతనాక్రవ్యాదాధిపుడు రక్కసిమాయలం బూనికొంత తడవట్టె యాలముసాగించి యంతలోనన నలువైపులందేటి చూచినంతఁ జచ్చిన దనుజులెల్లరుం బ్రతికి నిదురనుండి లేచినయట్లే లేచి కదనమునకుం దొరకొనిరి. అదిగన్న దేవతలు మునులు నెంతయు వెఱపును వెఱఁగును బొందిరి. అంతరాజు శార్ఙ్గమున నర్ధచంద్రభల్లముం దొడిగియాసింహోదుతలం దునుమాడెను. అట మఱల నట్టులే వేరొండు తలమొలిచి నిలిచెను. అటులు రాజునరుకుట, తలమొలుచుట వందలాదిగ మారులాయెను. అదిగన్న త్రిదశులు కడుంగడు చింతాకులులైరి. మఱియొక వంక ముక్కిడి రక్కసి బలగములును జచ్చుచుం బుట్టుచు రాజసైన్యంబుల బలుసిలుగులం బెట్టి చెండాడుచుండెను. అంతరాజు గాంధర్వాస్త్రము నాముక్కిడి మూకలపైఁ బ్రయోగించెను. దాని ప్రభావమున నాదైతేయులుమతులు చలించినవారై శత్రుమిత్రభేదము నెఱుంగక యుచితాను చితములు మఱచి తమలోఁ దామె చంపికొనుచుఁ

గొంటికికొనుచు భూతగ్రస్తులట్టుల వెక్కసముగ వర్తించుచు నశించుచుండిరి. ఇట సురజ్యేష్ఠుని యోగమున వాయువు విప్రునట్టుల రాజాదరికి వచ్చి చెవినట్లు చెప్పెను. రాజా! షడక్షరంబగు సౌదర్శనమంత్రమును భక్తిని జపించి విష్ణుచక్రమును బ్రయోగించి గోబ్రాహ్మణహితమ్మును నెల్లప్రజాసంరక్షణమ్మును జేయుమని తన్మంత్రమునుపదేశించి యంతర్ధానుండాయెను. రాజును బ్రాహ్మణోపదేశముం బొంది మంత్రమును బఠించుచు వేయంచులకైదువును చేపట్టి నిలిచినంత విష్ణువే వచ్చెనాయని యాపిశితాశనులు నివ్వెఱపడి చూచుచుండ నారక్కసి టేనిశిరము నాచక్రము నటికినైచెను. మఱి వేరుతలయట మొలువలేదు. రేద్రిమ్మరీడులును నుసురులం బాసి మొదలునఱికిన మహావృక్షమటులనేలం గూలసాగిరి. అమరవైరులును గాంధర్వాస్త్రప్రభావమునఁ దమలో దాము చంపికొనియు, రాజసైన్యములు కసిమసంగగను బూర్తిగనశించిరి. రాజుపైనప్పుడ కల్పకపుష్పవర్షము జల్లుగఁ గుటిసెను. దేవతల విజయ దుందుభులు నలువైపుల మ్రోగెను. అప్పుడు కలిగిన నశరీరవాణిని విన్న రాజాగంధర్వాస్త్రము నుపసంహరింపలేదు. కావుననె యిపుడును నజ్ఞానులు నసురాంశసంభవులు, మానవోద్భవులు, నాత్మఘాతంబులగుపనులనె మునిగి చెడుచున్నారు.

బుద్ధిమంతులు దైవానురక్తులా యాసురభావములకు లోనుగాకయ యుందురు. సత్యానురక్తిని, పావనప్రేమమార్గమున దేవుందరిసి భుక్తిముక్తులంగందురు. సింహాదుని, తదనుచరుల యాసురాంశలు, అగోచరరూపములందిరుగుచుఁ గలియుగంబున మానవులను భ్రమలమ బెట్టుచుండును. ఆయాసుర భావములకుఁ బ్రలోభములకు, దుర్వృత్తులకులోనుగాక దైవసంపదలనందు వారెధన్యులు.

ఆ పిమ్మట, ఙక్రవర్తి మహీపాలుఁడు వేంకటాధీశు పాలికింబోయి సమరవృత్తాంతం బంతయు దేవునకు విన్నవించి తనకొన్న యాశంఖ, చక్ర శార్ఙ్గగదా ఖడ్గముల నాదేవునకర్పించెను. అప్పుడు దేవదేవుండా రాజుంగని పలికెను. నరేంద్రా! భావికాలమునను నీవెప్పుడెప్పుడజేయులగువైరులం దార్కొందు వప్పుడీ యాయుధములు నీకుం దోడైనీశత్రులందునిమి నీకు విజయంబు పేకూర్పంగలవు. అనిప్రేమార్ద్రవచనంబులం బలికి యాయాయుధములతో నిట్లనియెను. ఓ శంఖచక్ర గదాఖడ్గశరాసనములారా! ఇంతనుండి మీరీరాజునకుం గోర్కులు దీర్చువారయి యీగిరిని మీమీతీర్థముల నుండుడు. అవ్వి మీనామంబులఁ బ్రసిద్ధములయి యుండును. మనసులు మార్చుకొని పవిత్రభావముల వచ్చి మీపంచతీర్థముల మున్గువారికిని సాయుజ్యము నొసంగి తరింపఁజేయుఁడు. నన్నెతలంచుచు మీరును సాయుజ్యమోదంబును బొందుడు. ఇటనుంటయన నీమర్త్యభావమున నీమర్త్యలోకమున వాసమని వెనుకాడవలదు. ఇట నాపనికై నాయాజ్ఞాపాలనమునకై యుండు మీరు నాసాయుజ్యమునె పొందుదురు.

రాజా నీవును బోయి రాజ్యమును ధర్మముగఁ బ్రజానురంజకముగఁ బాలింపుము. నీకు సాయుజ్యంబగును. నీచేయుకార్యంబు లెల్లమదర్థంబుగ నొనర్పుము. ఇదియె నీకు ముక్తిమార్గము అనెను. ఆ పంచాయుధములు దేవునానంగొని యప్పుడపోయి పంచాయుధతీర్థముల నెలవుకొలిపికొని యటనె యిరవుకొనెను. రాజును శ్రీనివాసుని యనుమతింగొని యింద్రునమరావతిం బోలుతన నగరికింబోయి సుఖంబుండెను.ఇట్లు నారదమునిచే భృగుమహర్షి, దేవుని దివ్యమహిమలనాలించి, తద్భక్తిని, బ్రేమను విలీనుం డాయెను. రమాపతిని వేంకటేశునిం జూచునభిలాషను దానును నాశైలరాజమునకుం బోయెను.

భారతభూమిని నమృతవర్షకంబై లక్ష్మీప్రదంబగుట నదివేంకటాద్రియనం బరగెను. భగవంతునకు నదిస్థానమై దోషరహితమై వెలయుట దానికి నారాయణాద్రియను నామంబాయెను. ఇంద్రునకు, నట్టిలేభక్తవరులకు రక్షణాభివృద్ధుల గలిగించునదగుట వృషశైలంబాయెను జగదుత్తముండును. భగవద్భక్త వరుఁడును నగు నాంజనేయునిట నంజనాదేవి కనుటనీయది యంజనాద్రి నామమునొందెను. శేషభగవానునితో నిదియిటకుం గొని రాఁబడుట శేషశైలమాయెను.

## మేరుశిఖరము నుండి శుకమహర్షి శ్రీ వేంకటాద్రికి వచ్చుట

మహీసురుడు దేవలుడు శౌనకాదులకు రొమహర్షణుండిట్లనియె. దేవర్షిం దేవదర్శనుం గనుంగొని, కర్మబంధముల నుండి విముక్తియుఁ బరబ్రహ్మభావమును భగవంతుముకుందునితోడి యైక్యానందమును నొసంగు పరమార్థమును జెప్పుండని కోరినంత నాదేవదర్శన యోగివరుండిట్లులనియెను. ఓ భూమిసురవరా! దేవలా! మీరడిగిన దెంతయు నొప్పును. అద్దినే విశేషించి చెప్పువాడను, మీరలుదాత్తచిత్తులై యాలింపుడు. ఈయితిహాసమెంతయుఁ బుణ్యప్రదమును, జతుర్విధపురుషార్థముల నొసంగునదియును. ఇద్దియానందదాయకము, యశోవర్థకము, ఆయురారోగ్య ఐశ్వర్యములు సమకూర్పంగలదు.

ప్రాచీనకాలమునఁ జిత్రవిచిత్ర రత్నరంజితమును, మాణిక్యమణిమండితమును, నుద్దీప్తరత్న ప్రభాపుంజమున గాఢాంధకారమును దరుముచున్నట్టియు నిరంతర పరిప్లావిత గంగాజలములఁ గమనీయార్ద్రమును నగు సుమేరు శిఖరమ్మున, దట్టమగు నీడల నొసంగుచున్న, మకరందముం జిమ్ము పుష్పమాలాలంకృతములగు కల్పతరువన మధ్యమున, మాణిక్యమయ స్తంభములతో, మకరాకృతి తోరణములతో, నొప్పుచు, విచిత్రరత్న రంజితంబయి సువర్ణమయమగు మంటప మధ్యమున లోకపితామహుఁడు నవరత్నరంజిత సింహాసనమున విరాజిల్లుచుండెను. సహస్రాక్షాది లోకనాయకులు పరివేష్టించియుండిరి. దేవుని దివ్యవైభవములఁ బరస్పరముఁ జెప్పికొనుచు వసిష్ఠాది

మహర్షివరులు తన్నుసేవించుచుండ సాంగోపాంగములతోడి యుపనిషద్వాక్యములచేఁ గీర్తింపంబడుచు, గంధర్వులు గానములు చేయుచుండఁ గిన్నరులు కీర్తించుచుండ, హాహా హూహూ తుంబురాదులు స్తుతిగీతంబు లాలపించుచుండ, సావిత్రీ సరస్వతు లిరువలకుల నుపవసించియుండ నాస్వయంభువు పరమేష్ఠి యుపవిష్టుండై ప్రసంగవశంబున మహనీయంబగు, నారాయణగిరి మాహాత్మ్యంబును, దదుత్పత్తి కథయు బాగుగవచించెను. ఆ సభయందుననె యుపవసించియున్న యాకథనంతను నాలించిన శుకమహర్షి వర్యుండాగిరిరాజము నేనెపుడుచూతునుయనునుత్కంఠ మిక్కుటముకాగాఁ దన మనో వాంఛితమును బితామహునితోఁ జెప్పియనుమతింగొని తోడివారలకుం దెలిపియందఱికి వినతులొనరించుచు నటనుండి దక్షిణమునకుఁ బయనము సాగించెను

తమ్మిచూలి మోముదమ్ముల నుండి వెలువడిన యాపలుకుతేనెలానియాని యెడంద నాపురాణపురుష శ్రీనివాసదేవునందలి భక్తినిండి పొంగిపొరలుచుండఁ బోయిపోయి శుకుండా నారాయణాద్రిం దరిసెను. అందందు శిఖరములం దగిలినిలిచి యున్న కాదంబినీకదంబంబులంగని, పురులు విప్పియాడు నెమళ్లు, తరుశాఖలవిశ్రాంతిం దపము లొనరించుచున్న వాలఖిల్యతపోధనులు, సూర్యరథాశ్వములకును మేతలయందాశ పుట్టించు శాద్వలములు, చంద్రకిరణముల జెమర్చుచంద్రకాంత శిలలు కలిగి మోదమొదలించు, వితర్దికలు, శిఖరోద్భాసిత నిజకులాయముల నుండి, చంద్రకాంతములు చమర్చిన తీయని చల్లని జలములంద్రావు చకోరములు స్ఫటికశిలామండిత, గుహలనుండియు, శిఖరముల నుండియు గునగున ధ్వనులందిగు సెలయేళ్ళు, సింగములాయను భ్రమను గలిగించు చరియలయందలి పుష్పించిన లోధ్రవృక్షములు, తియ్యమామిళ్ల పూదేనెలఁ జెమ్మగిల్లి చల్లనగు నెలవులు, మదగజముల రాకపోకల రాపిళ్లనొప్పు శిలాతలములు, శరభమ్ములిడు గంతుల, నుఱుకుపరుగుల నున్న నగుపడుకులయెదలు, మహోన్నత ఋషభములు, వ్యాఘ్రాదిఘాతుక మృగములు, జలప్రపాతముల కెలకులఁ దుంగముస్తెల మోరలఁ ద్రవ్వితిను సూకరములు, యమరాజు వాహనముపై కాలుదువ్వి హుంకరించు కారెనుములు, బలిసి మదమెక్కిన భల్లూక, వృకశృగాలములు, చెట్లకొమ్మల నిటునటు దుముకులాడు వానరములుం గలిగిచూడ వింతమోదముం బుట్టించునదై, చెవులు గింగురువోవ నరచుచు నడవుల నటునిటుఁ దిరుగు బిల్లీ బిల్లనమూహములతోఁ జెట్లకొమ్మలఁ గూరుచుండి,విననింపుగఁ బాడుపక్షికులముల కలకలములతోఁ గృష్ణసారమృగీమృగ చమరీకస్తూరీ మృగ సంకులమగు తావులతో నందందు నీటివాగులకడఁ జెట్లనీడలఁ దపములొనరించుచుండు మునిజన నివహములతో, బ్రహ్మధ్యాన పరాయణులయునికికి ననువగు తావుల నొప్పునాశ్రిత జనదుఃఖనాశన మొనరించు విశాల ఛాయాయుత వృక్షరాజముల నొప్పుభగవన్నివాసమగు నా నారాయణగిరిం దరిసి యామువి దర్శించి ప్రమోదప్రపుల్లిత మానసుఁడాయెను.

## శ్రీశుకుఁడు పవిత్రధారల మునుకలిడుట

శ్రీ శుకయోగీంద్రుడు తొందర తొందరగ నావేంకటాద్రి పాదతలముం జేరెను. అట నట నతఁడు కనవచ్చిన సెలయేళ్లను, పవిత్ర జలపూర్ణతటాకములను, జలపాతముల, స్రవంతుల నదులఁ బావనతీర్థంబుల నెల్లవానియందునగాయత్రీ మహామంత్రమును మననముం జేయుచు మునుకలిడసాగెను. ఒక్కొక్కయెడ నొక్కొక్క దినముండి యజ్ఞానాంధకారముం దొలగించి భవసాగరముం దరింపఁ జేయఁగల బ్రహ్మవిద్య నాశ్రయించి యాయాతావుల స్నానంబులందపంబులం బుచ్చుచు నాతఁడు మెలమెల్లన భక్తజనావాసము, బ్రాహ్మణావాసము నంజనాద్రి నట నందందుఁ దిరుగుచు గుహల శిలాతలములఁ జెట్లనీడల నధివసించి తపములు సాగించుచు భక్తి రక్తిం బరవశించు భక్తవరుల, ఋషిముని తల్లజులఁ దపోధనుల యోగిపుంగవుల సిద్ధులవైఖానసులఁ గాంచి వారల పూజల నాతిథ్యముల నందుచు నందందు విశాలములగు పలకల నిలుచుచుఁ బోయిపోయి వ్యాసపుత్రుండు కడకొకనాడు నిర్మల జలపూర్ణ పవిత్ర కుమారధారను సమీపించి యందుం దనివిని మునకలిడియెను.

ఆ కుమారధారికా మాహాత్మ్యము నభివర్ణింప నేరికగును? దానికదియే సాటి. శరణార్థులకద్ది శరణ్యము. తొల్లి తారకాసురుచే నిడుమలం బడఁజాలక విబుధులెల్లగములుగ వచ్చి వేడిన మహేశ్వరుడను కంపఁబూని పుత్రుకార్తికేయు సేనాపతిగ నభిషేకించి నిజకార్యమును నిర్వర్తింపుమని నియోగించెను. దానిం బూని నిర్వహింపనెట్లగు నాయని చింతించి చింతించి యుపాయరహితుఁడై యుపాయసహితంబగు నాకార్యమును సాధింప గుహుఁడు దైత్యాది నార్తార్తి హరిన్మదినెంచి వేంకటగిరికిం జనుదెంచి యీపవిత్రతీర్థము దరి న్నెలవుకొని యందున ముప్పేళల మునకలిడుచు గాయత్రిం జపించుచు దివ్యకుసుమంబుల వేంకటగిరీశు శ్రీనివాసుఁ బూజింపసాగెను. కుమారుని తపసునకు సంతుష్టుండై విష్ణుభగవానుఁడట నాతనికిఁ బ్రత్యక్షంబై మహాశక్త్యాయుధంబుం బ్రసాదించెను. దానింగొని షణ్ముఖుఁడు దేవదేవునకుఁ బ్రణతులొనరించి నుతు లొనరించెను. దేవుండువాని న్విజయుండవగు మనుచునంతర్థానుండాయెను. ఉమాసుతుండును శక్తిధరుండై స్వర్గమునకుం బోయి దేవసేనల నడిపికొనిపోయి తారకుం జంపి జగద్ధితము నొనరించిమించెను. కావున ననంతానేకఫలంబుల నొసఁగు పవిత్రజల సంపన్నమగు నయ్యది కుమారధారయనం బ్రశిద్ధమాయెను. పిమ్మట నాతఁడు మఱి వచ్చి యాకుమారధారికా తటతీరముననే నెలవొనర్చుకొని దానములు తపంబులొనర్చి తానొనర్చిన హత్యాదోషమునుండి విముక్తినొందెను.

ఆ పిమ్మట నాశుకయోగీంద్రుఁడు పాపనాశనిం జేరి యట స్నానంబులొనరించి సంతృప్తినొందెను తత్తీర సమీపంబున నాజితేంద్రియుడు మూడు దివసంబులువసించి త్రిసంధ్యల స్నానములొనరించుచు భగవదారాధనము నొనరించెను.

తొల్లి వృత్రుండను ఘోరరక్కసుఁడు లోకంబుల నెల్లవికలంబు లొనరించుచు ధర్మవిధ్వంసనం బొనరించుచుండ వానిని మహేంద్రుడు దధీచియెమ్ములె వజ్రాయుధమ్ముగఁ బొనర్చికొని చంపెను. తత్కారణంబున బ్రహ్మహత్యాపాతకమ్ము వానినంటి స్వర్గాధిపత్యమున కనర్హుఁడై వెతనందెను. అతఁడు పరితప్తుఁడై యటశేషశైలముం జేరి యీ పవిత్రధారను స్నానంబు లొనరించుచు నారాయణుం గూర్చి తపంబొనరించెను. దానఁబాపంబు లెల్లందొలంగ నాతఁడు పవిత్రుండై స్వర్గమునకుం బోయిసుఖపాలన మొనరించెను. కావున మహాఘనాశనం బొనరించిన యాపుణ్యాధార పాపనాశన ధారయనం బరఁగెను. అందు నిర్మల భక్తిని మనసులు మార్చికొని స్నానంబాచరించు వారి పాపంబు లెల్లందొలంగుననుట నిక్కము.

అటనుండి శుకయోగీంద్రుడు చనియాకాశ గంగాతటనికటమున నుపవసించెను. అచటను త్రిదివంబు లుపవాసంబు పొనరించి త్రికాలముల నాతీర్థంబున నభ్యంగన మొనరించుచు నిశ్చలమతి భక్తిసక్తిందపం బాచరించెను. అందు స్నానంబొనరించిన స్వర్గవాసులయు మానవులయుఁ బాపంబులెల్లఁ బటాపంచలై పోవును. అదియెల్ల సత్ఫలములం జేకూర్చును అటకుం జేరి పవిత్రమానసంబుల సంసార సాగరంబునుత్తరింప నాసక్తులై దేవమానవులు నాగగంధర్వులు సిద్ధసాధ్యులు వైఖానసులు స్త్రీలు పురుషులు నెవ్వరుగాని దినదినము నెల్లవేళల వచ్చి వచ్చి స్నానంబు లొనరించుచుఁ బవిత్రులై చనుచుందురు.

## వ్రతతీవర్తన తీర్థస్నానము - పద్మాసరోవర వర్ణనము

శుకతపోధనుఁడట నుండిపోయి నారాయణ పర్వతవిహారి విష్ణుభగవానుని ప్రభావమును మనమున బాగుగఁ దలపోయుచు హర్షోత్ఫుల్లవదనుఁడై యఘునాశన వైష్ణవ సూక్తులు వల్లించుచుఁ బరము శ్రీహరిని స్మరించుచుఁ జనిచని "వ్రతతీవర్తనీ" తీర్థముందరిసి శ్రద్ధాభక్తుల నాతీర్థజలంబులం బ్రవేసించి మునిఁగిలేచెను. అంతలో నాతీర్థఅమృత జలతరంగముల మీఁదినుండి మహిమోత్ఫుల్లమగు నొకయశరీరవాణి యిట్లనియెను. భగవానుఁడు, పరంధాముఁడు, శ్రీవత్సలాంఛనుడు, లక్ష్మీసంయుతుఁడు, భక్తవరకల్పకము, మలినహృదయులకుం గనరానివాఁడు. అనంతు ననంతఫణాతలంబున నుండు ననంతుఁడనంత ఫలంబు నొసంగువాఁడు; అవ్యాజకరుణామయుఁడు. ఇది యెఱుంగుము. ఇచ్చటికి నాగ్నేయ దిగ్భాగంబున సార్థయోజన దూరంబున మహద్వృక్ష సంకీర్ణమీపర్వతమూల దేశంబున నంతంతనె పాపవినాశ మొనరించు స్వర్ణముఖరీనది యలరారుచున్నది. దాని రమ్యతటంబున నుత్తరంపు దెసపద్మసరంబనం బరఁగు ప్రసిద్ధ పరమపవిత్ర సరోవరంబొండు కలదు. శీఘ్రముగ నటకుంబోయి తత్తీరంబుననె యుండి

తపం బొనరింపుము. ఆమీఁద నీమతి సుస్థితి నందియభివృద్ధినొందును. మఱియుం బరముఁడు ప్రభులప్రభువు సర్వసాక్షి భగవానుఁడు శ్రీమహావిష్ణువు నీకుం బ్రత్యక్షంబుకాఁగలఁడు. ఇట్టులు సాదరవాక్యంబు లాతనికి వినిచి, యాతని మనోభావంబులు సుదృఢంబులు, పావనంబులు, నొనరించుచు నాయశరీరవాణి యంతర్ధానంబాయెను. ఆయశరీర వాక్కుల నాలించిన మునిద్వైపాయన సుతుఁడు, శుకుఁడాతీర్థజలంబుల నుండి లేచి బయల్వెడలి భక్తిప్రేమ సంభరితుడు నాశ్చర్యాన్వితుఁడునై యాదివ్యవాక్కులు దలపోయుచు నతివేగమున నాపద్మాసరోవరంబున్న యెడకుం బోయిచేరెను.

ఆ సరోవరము సజ్జనమనం బట్టులు ప్రసన్నంబై, వైఢూర్య రత్నము పగిది విమల జలపూర్ణంబయి హృదయానందకరంబై యుండెను. అందువికసితములు పుండరీకములు కల్హారములు, స్వర్ణకమలములు, నీలకమలములు, కువలయములు, రక్తకమలములు, నిండి హృదయంగమమై, కన్నులపండు వొనరించుచుండెను. అందునట నటమకరందపాన మదోన్మత్త భ్రమరరవంబులు, కారండవముల కలకలరవములు, జలపక్షుల కలకలములు, శ్రవణ పేయంబులగుచుండెను. అందుఁ బూవుపూవున భ్రమించు భ్రమరములు, పరమదుర్గ్రహములగు నక్రములు, ఇటునటు వలయములు తిరుగు మత్స్యంబులు తీరంబుల ముస్తలు త్రవ్వియెత్తు వరాహంబులు, మృణాళనాళంబులు తొండంబులఁ బట్టలాగి మెక్కునేనుఁగు గున్నలు, కూనలతో నందందు గంతులిడు హరిణంబులు, చిలిపి చేష్టలగంతులిడు వానరంబులు, నలువలకుల పలుతెఱఁగుల వినోదములం గూర్చు చుండెను. దాపుదాపుల నందందు నిశ్చలంబుగఁ దపంబులొనరించు తాపసులు, వారితను తాపములు హరించుపిల్లతెమ్మెరలు, హృదయశాంతిం గూర్చు పవిత్ర వాతావరణము నేమిచెప్పవలె. భగవంతుని విహారస్థానము నాపద్మాతీర్థమును శ్రీశుకదేవుండు కనుంగొనెను. అందు స్నానపానము లొనరించి, సేవలఁగష్టంబులు తొలంగనానందోత్ఫుల్ల మనంబున నిశ్చలభక్తి భావంబున నారాయణు విష్ణుభగవాను స్మరించుచు నాతండటనెయుండెను. అటనట్లు కొంతతడవు విశ్రమించి పిమ్మట తన నిత్య తపశ్చర్యకుం గడంగెను. నియమబద్ధుడై, సంయమియై యుండి వనమందలికాయలు, పక్వఫలంబులు, నేరితెచ్చి దినమున, బంచమ ముహూర్తమున నారగించెను. ఆహ్నిక క్రియలు సమాప్త మొనరించికొని, కుశాస్తరణముం బఱచికొని పరుండెను. మఱునాడు ప్రాతఃకాలమున బ్రాహ్మీముహూర్తమ్మునను మేల్కొని, జితేంద్రియుండగు నామహాముని ప్రవరుండు శయ్యనుండి లేచి పుండరీకనయను, శంఖచక్రగదాధారిని, బద్మహస్తుఁ గరుణారస కల్లోల తరంగిత కటాక్షుశరత్పూర్ణేందు వక్త్రాభు, పీతకౌశేయవసను, మహోరస్కు, నుదారాంగు శ్రీనివాసు భగవాను స్మరించుచుం బోయి తొలుత స్నానము నొనరించి పిదప విధిపూర్వకమ్ముగ సంధ్యోపాసన నెఱవేర్చి, పోయి పద్మాసరోవర తీరమున సుందరము, నత్యంతనవీనమునగు నొక వనమునుగాంచెను.

## పద్మాతీర్థతటస్థ దివ్యవనమున శుకమహర్షితపము-ప్రార్థన

మనమున కుల్లాసమును గలిగించు, నెల్లవస్తువుల సుసంపన్నమగు చైత్రరథమునునెక సక్కెములాడుచు నందనవనమునకుఁ గన్నెట్టి కలిగించునదై యొప్పు పద్మాసరోవరతటమునం గల యాదివ్యవనమున నామునితల్లజుఁడు శుకుఁ డాశ్రమముం జేసికొని మనముంచి జన్నములు పొనరించుచు నశరీరవాణిం దలపోయుచు, దృఢమతిని యమమునఁ దపమాచరింపసాగెను. మనమునం గలుగు కోర్కులనెల్ల నణచి, యాత్మా నందమున నుండును. కష్టములు కలుగుతతిఁ గలతనందఁడు. సౌఖ్యమొదవినంత నుబ్బితబ్బిబ్బుకాడు. ఆతడు వీతరాగుడు, ద్వేష రహితుఁడునై భయక్రోధములంటని సుస్థిరమనమున ద్వంద్వాతీతుఁడై శుభాశుభములకు మోదభేదములకునందక, నిశ్చలనిర్మల మనంబున, నింద్రియముల వశమున నిడికొని, విషయవాసనలంటనీయక తలంపుననైనఁ జేర్చక కూర్మ, మంగకములు ముడుచుకొను నటులు కామ్యములనుండి యింద్రియములఁ దొలఁగించి, కర్తవ్యములు కాదనక, ఫలవాంఛనొందక చేయుచుండును. ఆతఁడందహంకార మమకారము లంటనీయఁడు. ఎన్నినదీనదములు జలములు తెచ్చిపోసినను సముద్రమచలమై యుండునటుల నిశ్చలమతి నాతఁడే వేళను గోర్కులకుం గలతనందఁడు. చేయుకర్మలెల్ల నాపరాత్పరునవే, ఫలమును నాతనిదేయనుదృఢమతి నుండునాతఁడు. తపసును పరంధాముఁడే, యజ్ఞము, యజ్ఞఫలము హోమము, హోమద్రవ్యము, వహ్నులు, హోమకార్యములు సర్వము నాబ్రహ్మమే యనునదే యాతనితలంపు. తనసమారంభములు, కృతములు నన్నియుఁ గామసంకల్పములు లేకజ్ఞానాగ్ని దగ్ధములు కాగా నాతడు నిత్యతృప్తుఁడు నిరాశ్రయుఁడునై యుండును. ఏ విధమగు సంగమము లేనివాఁడై, మనోబుద్ధులచే, దేహేంద్రియములచేఁ, బరమేశ్వరునందే, బ్రహ్మమందే యర్పించి కర్మలు చేయుచుండును. విషయేంద్రియ సంపర్కముచేనైన యీ సుఖభోగములన్నియు, క్షణికములని, దుఃఖకారణములని దుఃఖాంతములనియెఱింగి, యాతఁడు వానియందాసక్తుఁడుకాఁడు. ఆతఁడు పత్రాహారియు హితాచారియునై నియమిత మితాహార విహారముల, మితభాషియై, నియమజీవితముం గడుపుచు శాంతుఁడు, దాంతుఁడు, సత్వసంపన్నుఁడునై, సచ్చిదానందు నెదనిశ్చల నిర్మలభక్తినుంచినవాఁడాయెను. శ్రీనివాస భగవాను పూజచేయకయే వేళను నాతఁడేమియు భుజింపడు. ఎంతయాకలిం గొట్టు మిట్టాడుచున్నను దేవునకు నివేదించియె యాతఁడా ప్రసాదమును భుజించును. భగవంతుని పాదోదకములు సేవించియె దగదీర్చికొనును. విష్ణుచరణోదకములు కాకమఱేమియు నాతఁడు త్రావఁడు. అతఁడు నిర్ద్వంద్వుడు, నిరహంకారుఁడు, మత్సరశూన్యుఁడునై కుశాస్తరణమును సుస్థిరముగ సమతలమునఁ బఱచి మీఁదఁ గృష్ణాజినమును నెలవుపఱచి, యందేకాగ్రమనంబున, యతచిత్తేంద్రియుఁడై కూరుచుండి,

ధ్యాననిమగ్నుఁడగును. అగ్నిశిఖలంబోలు, జటలు తలను వెలుగొందుచుండఁ గుశాగ్ర బుద్ధియగు నాతఁడెల్లపుడుఁ గుశలు చేఁబట్టి కృష్ణమృగచర్మముం దాల్చి, రుద్రాక్షల మాలంబట్టి, క్షమాసంపన్నుండై, తలమెడయొడలుఁ దిరముగఁ దిన్నగ నిలిపియుంచి నాసికాగ్రముం గనుచు, దెసలకుం దృష్టినిపోనీక పట్టియుంచి ప్రశాంతుడై, బ్రహ్మచారి వ్రతుండై, భగవంతు, వైకుంఠు, వేంకటనగాధీశు, సంస్మరణము పొనరింపసాగెను. ధ్యానధారణా సంపన్నుండై, ప్రాణాయామమున వైష్ణవీగాయిత్రిని జపింపసాగెను. ఆశుకమౌనివేసఁగి నుగ్ర సూర్యాతపమునకులుకడు, వానకారున జడివానలకుం జంకడు, సేతునఁ జలికిం జలింపడు, అచంచలుఁడై నిశ్చలమతిం దపమాచరించుచునే యుండును.

అదియాలించి శౌనకాది మునివరులు సూతముని తల్లజుంగని యిట్లని యడుగసాగిరి. ఓ తపోధనా దేవకాంతల, అప్సరసల లక్షింపకయు నాత్మరక్షణ మొనరింప నాశుకముని దేవదేవు నవ్యాజకరుణామూర్తిని భక్తార్తిహరుం బ్రార్థించి వేంకటేశు కృపకు యెట్లు పాత్రుడాయెను. అనిన ఆ సూతముని వరుండు వారికిట్లనియెను.

శుకుడాత్మ రక్షణ మొనరింప భగవాను శరణంది యిట్లు ప్రార్థింప దొడంగెను. శ్రీలలనామణికిని శ్రీసమృద్ధి నొసంగు శ్రీపతిఁ జిన్మయు, షడ్గుణవిభాసితు, శ్రీవత్సలాంఛను నజహర మహేంద్రాది దేవవందితుఁ బరమపురుషు శరణముం బొందుచున్నాఁడను. అఖిల లోకస్థు లోకేశుఁ బూజ్యు నిరాశ్రయు సర్వాశ్రయు సదయు సదమల చిత్తంబుల సంస్తవనీయు నపరిమేయుఁ బరాత్పరు నపారు నుపేంద్రు భగవంతు శరణముం బొందుచున్నాఁడను. వికసితాతసీ కుసుమ సమానకాంతివంతు, వికసితారుణ కమలాభకరపాదపల్లవు సుందర ప్రఫుల్లిత పద్మనయను దీనదయాళు నచ్యుతు శరణందుచున్నాడను. దినకర సమాన ప్రకాశిత దివ్య మణిరంజిత కిరీటోద్భాసితు శంఖచక్రగదాహస్తు శార్ఙ్గపాణి నిదేశరణు జొచ్చుచున్నవాడను. హృదయ సంస్థితు, హృదయేశు హృదయహరుని బరుని శరణంబు వేడెద. హరిమురహరు, దినకరేందు నేత్రునాశ్రయింతు.

రజోగుణోద్ధతుల మధుకైటభుల ఘోరరక్కసులందున్మి యజాప్రజాపతి భయముడిపిన యాదిమూర్తి కవ్యక్తునకివే నమస్కృతులు. విధాత్రకను మొఱఁగి తొలిపలుకులం దొంగిలిపోయి దాగిన సోమకుం దున్మికొని వచ్చి వేదమ్ములు పరమేష్ఠి కొసంగిన యాది మత్స్యమూర్తినిదే నేశరణంబుపొచ్చెద, సురలసురులొక్కటై క్షీరోదధి నమృతంబుం బడయ మథించునెడ మంథర కుధరము నీరధిమ్మునుగక యుండం బట్టిన కూర్మమూర్తి, దేవతల కమృతముం బంచి పెట్టిన మోహనమూర్తి నారాయణదేవుండు నాకు శరణంబగు గావుత. రసాతలాంతర్నివరాభిష్టను, దుర్భరహిరణ్యాక్షాసురపీడితను వసుంధర నాదైత్యుందునిమి యుద్ధరించిన యాదివరాహమూర్తి చతుర్భుజుఁడు నన్నోముత.

సుతీక్ష్ణనఖాగ్రంబుల హిరణ్యకశిపు దానవు నుదరోరస్థ్సలం జీల్చిచెండాడి లోకోపద్రవముడిపిన భక్తరక్షకుఁడు నరసింహమూర్తి నాకుశరణంబై ప్రోచునుగావుత. యజ్ఞవాటికను జేరిమూఁడడుగుల నేలయాచించి పొంది బలిని రసాతలమునకుం బంపి, యాపై నవ్యయ పరమపదమిచ్చి ప్రోచిన వామనమూర్తిని నేనెల్ల విధముల శరణముం బొందుచున్నాఁడను. ఆయుపేంద్రుడు, కరుణామయుఁడు నన్ను రక్షించి ప్రోచుఁగావుత. కరుణ వెదజల్లు కనుల నక్కటిక నిండి పారలెడి యెడఁద నెప్పొద్దుంజగములోము లోకేశుమహోజ్వాలాంగు శరణమందెద నేవేళ నెడదనుంచి ముయ్యేడు మారులు ముష్కరులైన భూమిపాలకులను పొలియించి నల్ల పితృదేవతకుం దర్పణలిచ్చి భూమి నిష్కంటకముగ పొనరించి తనిసిన పరశుధరు భార్గవరాము శరణంబు పొందెదను. లోకకంటకు దశానను సపరివారముగఁ దున్మిడి లంకారాజ్యము విభీషణున కిచ్చి నిష్కంటకముగ సర్వభద్రంబుగ భూమిం బాలించిన శ్రీరామభద్రుని పదపద్మములె నాకుశరణమ్ములు.

యదువంశదీపకు ప్రలంబ పూర్వాపరవైరి హంతకు వదాన్య బలభద్రురాము శరణంబు పొందుచున్నాడను. వృష్ణ్యన్వాయ ప్రభువు. ధరిత్రీభారాపహరు ప్రదిత ప్రభావు పాండవ భాగధేయు యోగీంద్రవంద్యు బరముఁగృష్ణు శరణమందెదను. కలియుగమ్మునన్నైన మహాపాప సంఘమ్ముల నాశమొనరించి దుష్టసంహార మొనరింపఁ గరాళ కలికిరూపమొందెడు ముకుంద భగవానుఁడు నాకు శరణమ్మగుత. జగతి సత్య శాంత్యహింసల నెలకొల్ప సత్యశాంత మూర్తియై జగదుద్ధారక మూర్తియై యొసగు నామహాత్ముఁడు నాకు స్మరణంబగుత. ఎచ్చటెచట నధర్మంబు పొడమిపెరుగు నచ్చటచ్చటఁ దాఁబుట్టి దాని నణచి ధర్మంబును బ్రోచునాపరాత్పరుఁడు వాసుదేవుఁడు జగదుద్ధారకుడు నాకు శరణంబగుగావుత.

అహంతత్త్వము, మహత్తత్త్వము, దశేంద్రియములు పంచభూతములు, తన్మాత్రలు, నిత్యాదిప్రకృతి కార్యమ్ము లెవ్వానిచేనగుచుండు, నెవ్వాడు సర్వాత్మ స్వరూపుండు, తొలుత నీసర్వంబెవ్వానిచే నుత్పన్నంబయ్యె, నెవ్వానియందు విలీనంబగు, నెవ్వాడు నిగ్రహానుగ్రహ సమర్థుండై శాసనము పొనర్చు నాశ్రీనివాసు నాత్మనాథు భగవాను శరణంబువేడెద. నిత్యుఁడు నిరామయుఁడు, నిరాకారుఁడు, నిర్వికారుడు, నిశ్చలుఁడు, నియామకుఁడు, నిరాత్మ, నిద్రామయుఁడు, సముద్రమట్లు వికాసపూర్ణుడు, సద్రూపమయుఁడు, సర్వంబునకుం గర్తయు, భర్తయు, హర్తయునగు తేజోరూపుఁడు భగవానుఁడు నాకుశరణంబగుత. బ్రహ్మాండంబుల, జంగమ స్థావరంబుల నెల్లనొక్కటిగ,

నుదరతలంబున నిమిడ్చికొని మహాంబురాశి మధ్యవటపత్రతల్పశాయియగు ననంతుఁడు దుఃఖదూరుఁడు నతీంద్రియుఁడు, కారణరహితుఁడు, సర్వంబునకుం గారణమైనవాఁడు, నప్రమేయుఁడు, నణుపరమాణు స్వరూపుడు, ననంతాకారుఁడు అంతరాత్మానుభావుడు, నగు నాసర్వాంతరాత్ముఁడె నాకుశరణమ్ము. సప్తాంబుధీరంజక రాజహంసుఁడు నప్తమహాసాగరాంతర్విహార కర్ణధారుఁడు సప్తాశ్వబింబస్థిత హిరణ్మయుఁడు, సప్తార్చిశరీరుఁడు, నిర్దోషుఁడు, నిష్కళంకుఁడు, పూర్ణచంద్రోపమానుఁడునగు నాది దేవుడే నాకు శరణమ్ము. నీతి నియమమ్ముల కెల్లనిధి, నిర్మాత, ఉపనిషత్ప్రతిపాద్యుడు, నిత్యసుఖసర్వరూపుడు, నద్వితీయుఁడు నసీమ కళ్యాణగుణుఁడు, నిధులకెల్లనిధి, యాత్మ స్వరూపుడునగు నాపరమేశ్వరు పదపద్మమ్ము లె నాకు శరణమ్ములు.

ఓ దేవదేవా! యశరణ శరణ్యా! త్వక్చర్మములు, రక్తమాంసములు, నెముకలు, ప్రేవులు, మలమూత్రములు నశ్రులు శ్లేష్మము వీర్యము మున్నగువాని సంపుటిచే నయిననీదేహములు. వీనియందు నాకేమియు నాసక్తిలేదు. ఇది నిక్కము. ఓ భగవానుఁడా నాయందుఁ బ్రసన్నుండవు కమ్ము. దేవాదిదేవా! స్వర్గాది సమస్తలోకనాథా! అనాథనాథా! కరుణాసాగర తరంగమాలోపరిస్థితరమ్య శైవాలరూపకజ్జలయుక్త; వికసితాధిక సుందర కమలదళాపాంగా! శేషశయనా! యనాథనాథా! యీయనాథు ననుగ్రహింపుము. ముదమొనరింపుము. మీచరణకమల మధురసము పెంపొనరించిక్రోలించు మహిమాన్వితా వ్యాజానన్య భక్తియెక్కడ! ఇంద్రియ రూపీచంచల తురంగముల నెక్కి దిక్కులకుంబారు నాబుద్ధియెక్కడ? దేవా! నాయీ మనమ్మును నదిమిపట్టుము. ప్రభూ ! ప్రకాశాంధకారమ్ము లెప్పుడు నొక్కెడ నుండఁజాలవు. మీచరణకమలముల మనసుంచు మనుజున కెన్నడునేమియు నశుభమనర్థ మొదవఁజాలదు. ఓయనాథనాథా! ఉండెనామానసం, బనవరతము నీపదాబ్జములనె. దేవయెల్లవేళఁ దిరముగానట్టులే, యచటెయుండఁ జేయుమబ్జనాభ. నీవెనన్నుం బ్రోచునేలికశరణంబుఁ వరమపురుషవరద పాహిపాహి ॥ చేతువందనమ్ము శ్రీవత్సలాంచన, ప్రణతులందుకొనుము భక్తవరద, కావుమయ్య కరుణకమలామనోహర, కైమొగుడ్తు భక్తిఁ గైకొనుమిదె.

పారాశరాత్మజుఁడు. అనంతరం శరీరయష్టిం దిన్నఁగనిలిపి యేకపాదమాత్రస్థితుండై భవార్తిభంజను భక్తరంజను హృదయాంబుజవాసు వాసుదేవునమ్యూతు నెంచి మదిమంచి నిశ్చల ఘోరతపంబొనరింపసాగెను.

## శుకునకుఁ బ్రసన్నమూర్తి భగవానుడు ప్రత్యక్షంబగుట

పదునాల్గులోకాల స్థితిలయకారకుండు నవ్యాజకరుణామూర్తి సర్వాంతర్యామి, నిగ్రహానుగ్రహ శాంతోదారమూర్తి, శంఖచక్రగదాంబుజధారి, చతుర్భుజుండు, సహస్రఫణుననంతు వేయిపడగలు తనకు ముత్యాంబుల గొడుగుగ నొనర్చికొని నిత్యనూతన సువర్ణోజ్జ్వల దివ్యపీతాంబరముం గట్టి, రంగురంగుల యుత్తరీయమ్మును వలెవాటు వైచికొని దివ్యసుగంధ ప్రసూనవనమాలాధారియై ప్రమోదామల గంధాదులనై పూతలతో చిఱునవ్వుల తోడి ముఖకమలము కలవాఁడై కరుణా మధువుం గడలఁ జిమ్ము కమలాక్షుడు. మహిమాయుక్తుఁడు మహాత్ముకున్మహాత్తయిన వాడు, కమలాపతి, చెంతను శ్రీభూనీళలతో సేవా విశారదులగు కుముదాది గణములతో, హేతివిభూషిత హస్తుఁడు విష్వక్సేనుచే సంసేవితుండయి మూర్తి మంతములగు పంచాయుధములు నాజ్ఞాపాలనకయి ప్రతీక్షించి దరిచేరియుండ మరీచ్యత్రి భృగ్వాది మహాత్ములు .మహర్షులు పార్శ్వంబుల స్వస్తి వాచకములు పలుకుచుండ నింద్రాది లోకపాలురు సపరివారులు చేతులు కట్టిచేరి ప్రార్థన లొనరించుచుండఁ పంచోప నిషద్రూపుడుపనిషద్వ కీర్తితుడు ఋగ్వాది వేదస్వరూపుఁడు నాగాభరణ భూషితుఁడు నప్రమేయ ప్రభావయుతుఁడునగు నాపరాత్పరుడు సుపర్ణువైనతేయు స్కంధపీఠమ్మున నధివసించి విరాజిల్లువాఁడు, అనేకానేక వైష్ణవీశక్తులచే, మేము ముందు మేము ముందు, సేవింతుమనియుబలాట పడువారిచే సంసేవితుండగు పరమపురుషుఁడు దేవదేవుఁడచ్యుతుఁ డాపద్మాసరస్తటమున నాకృష్ణద్వైపాయన సుతునకు శుకునకాతని తపోనిష్ఠలకుందనిసిన వాఁడు వచ్చిదరినిల్చి దరిశనంబిచ్చెను.

కరుణా కటాక్షవీక్షణంబుల నాశ్రితజన దుఃఖ సమూహముం దొలగించి దూరమొనరించు పుండరీకనయనుఁడు, పురాణపురుషుఁడు విష్ణుభగవానుఁడు ప్రసన్నముఖంబున సువర్ణ స్కంధోపరి సువర్ణాసనోపస్థితుండై తోచినంతఁ గాంచిన దుర్భరతపమున దుర్బల క్షీణకాయుఁడగు ముక్తుడు పరమ పవిత్రుఁడునగు నాఋషికుమారుఁడు శుకదేవుడువ్వెత్తుగ హర్షోత్ఫుల్ల నయనుండై తనకుశాసనము నుండి లేచియట్టే నిలిచెను.

పొంగిపొరలి వచ్చు నానందమున నేమేమి చేసెనోయాతనికేమియుందెలియదు. నివృత్తి ధర్మనిష్ఠాతుఁడగు నాతఁడు నవ్వుచు నవ్వుచుఁ బైనుత్తరీయముగ నున్నకృష్ణా జినముచించి మెడలోని యక్షమాలంద్రెంచి విసరివైచెను. కమండలువెత్తి పడవైచెను. ఆనందాశ్రుపూర్ణనయనంబులతో గద్గదకంఠముతో దేవుంబలుకుచుఁ బాడుచు మదమత్తగజంబు భాతి మందమంద గమనంబున నడుగులిడుచుఁ దనలోఁ దాను

దిరుగుచు నిర్వాతస్థానమందలి దీపకలిక యట్టులు నిశ్చలచిత్తుండగు నాతడు చేతులాడించుచుఁ జిటికెలు వేయుచు దిక్కులు ధ్వనింపఁజేయుచు సుధాబిలాషామరశరణ్యు పరాక్రమాతిశయు నాభగవానుని చుట్టు తిరుగుచు నర్తనము లొనరించుచుఁ బ్రసన్ను జేయుచుండెను.

కొంతవడి కుడివైపునకుం దిరిగి యంతలోనె డమకుం దిరుగును. ఇట్లు ప్రదక్షిణా ప్రదక్షిణంబు లొనరించుచు నెమ్మనమున శ్రీహరింజిన్మయునెయుంచి పుండరీకనయను నామంబులె స్మరించుచు దృష్టులెల్ల విశ్వంభరు విష్ణుభగవాను నందెయుంచును. వేరుభావనయు వేరుదృష్టియు నాతనికి లేనెలేదు. మెల మెల్లగ నడచును. అంతలోనె తొందరగ నడకసాగించును. కరతలంబుల తాళంబులవేయుచు తోటకవృత్త ఛందంబుల హరికీర్తనంబులు పాడుచునాడును చేతదండముం బట్టి నిలుచును; నేలఁ దాళంబుగఁ దాటించును, పాదంబులంటఁ దలవంచును. పాదములు తలదనుకనెత్తును. ఇట్లి భగవన్నామ సంకీర్తనంబుల సంతోషోన్మదమునఁ బులకితగాత్రుడు ముత్ఫుల్లనేత్రుఁడు నానందపూర్ణుఁడు నై యాతడు భవ్యభావమున నృత్యగీతములు సలుపసాగెను. అతఁడటు లచంచలమనమున నిటునటు పాదంబులూచుచు నాడించుచుఁ బ్రేమమయ గీతంబుల హరినామ సంకీర్తనం బొనర్చుచు నుల్లాసంబునఁ గమలా మనోహరు, భవ్యనటనంబుల ముత్ఫుల్ల హృదబ్జు వినతులుఁ పొనరించుచుండెను. ఆతండు కమలాయతాక్షు, సుదర్శన చక్రహస్తు నాలసీపుష్ప సమానకాంతియుక్తు భగవంతు హరిని మురారిని మాటిమాటికిఁ బ్రదక్షిణములొనరించుచు వేదాంతములె విలాసహారభూములగు నావ్యోమపాదు హృషీకేశుంగాంచుచు లయతాళంబులతో నెదుట నలువైపుల నాట్యంబులు సలుపుచుండెను. వ్రేలు జటలచుట్టి భుజముల బెట్టి యంజలించి యంతలోన నిలుచును. మృగరాజు నట్టుల వెనుకకుం దిరిగి చూచును. సర్పరాజమట్టులు మెలికలు తిరిగి తిరిగియొరగును. అంతలోనాతఁడు నిజయూధమునకై వెదకులాడు గజరాజ మట్లి విభునకై కమలావిభునకై వెదకుచుఁ జూపులు త్రిప్పును. సంధ్యాకాలీన త్రిపురాంతకు మహాదేవుతాండవ లీలలరీతుల ననుకరించును. ఇటుల నిత్యనిరంతర కళ్యాణదాత శ్రీనివాస భగవానునందు నిశ్చలదృఢభక్తి నుంచి, పాపరహితుఁడు, నింద్రియవాసనాయుత శారీరిక కర్మబంధనలు తెంపికొనినవాడై, యాత్మవిభూతిపూర్ణుఁడు నిర్మలపూర్ణుడునై సంయమివ్యాసతనయుఁడు, శుకదేవుడు రమాపతిని తనహృదయ కమలవాసిని, నిత్యునిరంజను భక్తసేవక సేవాయోగ్యవేషభూషణుఁ గమలనయను భగవాను బయటఁ గన్నుల కెదుటంగాంచుచు సఫల మనోరథుండాయెను.

ఈ విధముగ భక్తివిహ్వలచిత్తుఁడగు నామునికుమారుని, దయామితాంబోధితుంగలోల కల్లోల దృక్కులఁ బాగుగఁ గాంచి యాభక్తార్తిభంజనకరుడు భగవంతుఁడు తార్క్ష్యవాహనుడు వానింభాగవత ధర్మంబున నింకను సంస్కరింపం గోరినవాఁడై ప్రేమమయ వాక్కులఁ బ్రమోదితుంజేయుచు నిట్లనెను.

ఓ మునిశార్దూలమా! తపోనిధానా! నీవు దుష్కరమగు నానందకంద ముక్తిప్రదమగు మహోద్ధత తపంబు నొనరించితివి. ఎంతయు ముదమాయెను. నీకు నేనిదే ముక్తి నొసంగితిని. ఇప్పటినుండియు నీవు మదాకారమగు, వినశ్వరమగు దివ్య శరీరముం బొంది కల్పపర్యంతముండఁ గలవు. కల్పాంతమున మదీయానుగ్రహోద్భవమగు సాయుజ్యముం బొందఁగలవు. అనియెను. ముక్తుండును ముకుందగతచేతసుఁడు నగు మునియుఁ బ్రకృతిచే మాయనుత్తరించి దివ్యదేహయుక్తుండై మఱల మఱల సాష్టాంగదండ ప్రణామంబు లొనరించుచుఁ దన్మయుతనందెను. భగవానుండును కరుణాపాంగవీక్షణముల నాతనిం గనుచునే యంతర్ధానుండాయెను. ఎడందంగల కోరికిం బొందితనిసినవాఁడై సుఖానందముల శుకము నిసత్తముఁడచ్చటనె పద్మాసరోవర తటస్థవనములనె యాశ్రమమున నివసించి తపశ్చర్యలఁ దనియుచుండెను.

## శుకమునిచే నగ్రహార నిర్మాణము పిదప స్వామిపుష్కరిణీ తీర్థగమనము

అట శ్రీపద్మతీర్థంబుననె జీవన్ముక్తుఁడు ధ్యానయోగవరుడాధ్యాత్మ బ్రహ్మవిద్యావిశుద్ధాత్ముఁడే కాయనవిదశ్రేష్ఠుఁడు, పరమయోగి,శ్రీశుకు, డేకాంతభావమతియై నివాస మొనర్చుచుండెను. సాంఖ్యయోగపరుండాతఁడు నిత్యసద్ధ్యానాధ్యయనసంపన్నుండై ద్వాదశాక్షర మంత్ర ధ్యానతత్పరమతి నేకైకాక్షర నిరీక్షణ తత్పరుఁడై చిరకాలము శ్రీనివాస భగవాను సేవలఁ దత్పరుఁడై వెళ్లఁబుచ్చెను. పిమ్మట నాతని కటనుండి శేషశైలమునకు శ్రీ స్వామిపుష్కరిణీ తీర్థమునకుం బోవబుద్ధియాయెను.

అంతనట పద్మ సరస్తటమున నొక పవిత్రాగ్రహారమును నూటయెన్మిది సువసతి గృహములు కలదాని నిర్మింపంజేసెను. అందు నిత్యవేదానుష్ఠానపరుల ముఖ్యయజ్ఞక్రియల బాగుగ నొనర్చిన వారిఁ బవిత్రచిత్తుల విరక్తులవైదికక్రియా నిపుణుల ననేకానేక గోత్రంబుల వారి, జిరనియమనిష్ఠుల నాయగ్రహార గృహముల సుఖనివాసులంజేసెను. అట నాయగ్రహారమున దేవకీ వసుదేవుల, నందయశోదల, గోపగోపీజనంబుల, హృదయోల్లాసోద్దీపనకరు, కుహనాగోప తనుభాసితు భువనానందకరు, భూభారహరు మేఘశ్యాముఁ బురాణపురుషు, బరమ మాయావి, శ్రీకృష్ణదేవుని బలభద్ర మాయాదేవులతో గూడఁ బ్రతిష్ఠించెను. అట్లు ప్రతిష్ఠించి పరాశరపౌత్రుఁడు వ్యాసముని పుత్రుఁడు శ్రీశుకుఁడు బ్రహ్మనిష్ఠుఁడిట్టులు పలికెను.

ఓ కమలేక్షణా! విభో! ఆవైకుంఠమ్మున, క్షీరసాగరమ్మున సూర్యమండలమున యోగిజన హృదయముల భక్తజనాంతరంగమ్ముల, నెటులనివసించి యున్నారో యటులనే యిచ్చటను మీరెప్పుడును నివసింతురుగాత యని నేకోరుచున్నాఁడను. ఇటులు పెక్కుతెఱంగుల భగవంతుం బ్రార్థించుచు సాష్టాంగము లొనరించుచు మనమ్మున ధ్యానమ్మొనర్చుచు, ప్రేమమయ దృక్కుల నటుచూచుచుఁ బ్రసన్నచిత్తంబున స్వామి పుష్కరిణీ తీర్థంబునకు, బయనమయి వేంకటగిరి తటముం జేరెను.

ఉక్షశైలోపాంతముం జేరి యటనిర్మల నిర్ఝరిని త్రిషవణ స్నానంబొనర్చి వ్యాసాపత్యము తదుపత్యకనున్నయు దయా నిత్య సమోద్భాసితు, నుపాంసమానసిక జపు నుదారు, దారసంయుతు మహోత్పల దళములంబోలు మూడు కన్నులుగలవాని మహోపనిషద్రూపాంగకు నగ్ని జ్వాలాభజటాజాలంబున గంగను జాబిల్లిరేఖను, తనువల్లిని నాగాభరణము లందాల్చిన వాని, వ్యాఘ్రచర్మముం గట్టి, గజచర్మముం గప్పికొనిన వాని కృత్తివాస యుతుని గాలకూట విషోద్భాసిత కాలకంఠుఁ గమలవదను మహాదేవుఁ బ్రముదిత చిత్తంబునం గాంచి నమస్కరించి పరిపూర్ణ చిత్తంబున నుపాసనంబు జరుపుచు నటమూడుదివనంబులుండి మఱియు నటంగల యెల్లవింతలఁ గనుకోర్కిముందునకు సాగికందర స్థిత సిద్ధులతో విద్యాధరులతో యోగిజనులతో నొప్పునంజనా చలమున మెలమెల్లఁ జరించుచు, నందందు విహరించుచు సెలయేళ్ల మునుకలిడుచు, నాటి బ్రహ్మసభయందు విన్న వృత్తాంతమును స్మరింపుచు మంగళభూమిని శ్రీ స్వామిపుష్కరిణీ తీరముం జేరెను. తత్తీరభూమి యందంబునే మనవలె. అందెందును బరిమితాతి పరిమళములంజిమ్ము పూలలతలు పెరిగి చుట్టియుండెను. ఆనందకంద, ముకుంద భగవానునం దెడంద నుంచిన భక్తవరుఁడు నిరాశుఁడు నిర్లిప్తుఁడు విచిత్ర చిత్తుడు వ్యాసపుత్రుఁడు శ్రీశుకుఁడట నావనమునఁదిరుగుచు నానందోత్ఫుల్లహృదయుఁడాయెను.

అట్లుల్లసిత చిత్తంబుతో నామునివరుఁడు ముందుముందు సాగిపోయి విమలోదకమును, కాంచనాంబుజ కల్హారకముల శ్వేతరక్తనీల పంకజములతో నీలోత్పలములతో నుత్పలములతోఁ గువలయు కైరవములతో వంకీర్ణంబై పుణ్యసుగంధముం జిమ్ముచున్న తరంగాంతరంబుల నీదులాడు కారండవములతో నితరేతరజల పక్షి వితతులతో, నీదులాడు కలహంసల కలకలములతో శ్రవణానందము, నేత్రానందము పొనరించుచు హృదయంగమముగ శ్రీస్వామి పుష్కరిణి నామునివరుండు దరిసెను. తత్తీరముం జేరినంతనె యాతనికిం గోరికలెల్లఁ దీరెనన్నట్లాయెను.

పుష్కరిణీ జలంబులు స్పృశించి శ్రీ లక్ష్మీయుతు శ్రీనారాయణ భగవాను సంస్మరించుచుఁ బ్రసన్నచిత్తుండై మునివరుండం దఘమర్షణ స్నానంబొనరించి మునుకలిడిలేచెను. ఆతండచ్చటనె యొడ్డునఁ బద్మాసనస్థితుండై యోగంబున జపం బొనరింపసాగెను. వేదజ్ఞుండును బ్రహ్మదర్శియునగు నామునివరుండు పరమభక్తులగు మహర్షులతో శిష్యవరులతో బ్రసంగము లొనరించుచుఁ జాలకాలమచ్చటనె సుఖనివాస మొనరించెను. అంతటఁ గరుణామయుఁడు శ్రీవిష్ణుభగవానుఁడు తాననుగాఁదన్నుం దనయందెల్ల లోకమ్ములం బ్రకటమొనర్చుచు నాతనికిం దర్శనమిచ్చి ప్రమోదితు నొనర్చెను. పరమానంద స్వరూపుడు, గరుడుడు శేషుఁడు మున్నగు నిండు పరివారముతోఁ, బంచాయుధములతో, భూషణంబులతో మఱియు శస్త్రాస్త్రములందాల్చిన కుముదాది భృత్యగణములచే బ్రహ్మశక్తులచే శాంకరీ శక్తులచే సేవితుండై పరమానందితుఁడు నపూర్వకల్పితైశ్వర్యయుతుఁడునై శ్రీభూనీలాది పరమానంద మొసంగఁగల మహారాణులతో దేవేరులతోఁ గ్రీడారసోత్ఫుల్ల హృదయుఁడై సర్వాత్ముఁడా భగవానుఁడామోద ప్రమోదంబున నుండెను.

## శ్రీ శుకుండు దేవు నుతించుట

దేవుంగన్న శ్రీశుకుండిట్లునుతింపసాగెను. వివిధానేక లీలావినోద వేషునకు, నానందకందునకు, నీలనీరద సమానసుందర శరీరునకు, పీతాంబరధరునకు, వేవేలు వందనములు. ఉంగరముల జాత్తుచే నొప్పుతలను మణిమయ కిరీటం బొప్పువానికి, బక్షబింబాఫలోష్ఠునకుఁ గంబుకంఠునకుఁ బుండరీకాక్షునకు, హరికి, మురారికివే వైమొగుపులు. అష్టమిచందురుం గ్రిందుపఱచు, ముంగురుల మురిపెంబున నొప్పు, నెన్నుదుటను నూర్ధ్వపుండ్రములొప్ప, నువు పువ్వును నవ్వు నాసనొప్పు, మొలకనవ్వుల వెన్నెలలు గాయు మోముచందురు వానికిఁ దరిగట్టు ధారికి ననవరతమునంజలింతును. పద్మాక్షుఁ బద్మనాభుఁ బద్మముఖుఁ బద్మహస్తుఁ బద్మామనోహరు, పదపద్మమ్ములు హృదయపద్మమునంజేర్చి కొని ప్రణతులు, ప్రణుతులు పొనరింతును. శంఖ చక్రహస్తు కౌమోదకీధరు శార్ఙ్గనందకసముద్భాసితు భక్తజనార్తిహరు దుర్జనసంహరు దామోదరు చతుర్భుజు శ్రీవత్సలాంఛను జిన్మయు నెదనెంతు. వినుతింతు. సంస్తుతులొనరింతు ననవరతము.

కం॥ దెందంబున విడికొందును
మంథరధరు మాధవు వనమాలాధరుగో
విందుని గనువిందును గడు
సుందరు వేణుంధరు హరిసురముని వినుతున్

కౌస్తుభమణిభూషితు, వనమాలాశోభిత సువక్షు, నానందకందు నారాయణు, విష్ణురోచిష్ణుఁ గృష్ణు నేకొలుతు నేవేళ భక్తి నానందమతిని. భక్తార్తి జనపాలికల్పకంబును నానందమతిని. నానందకరుని మునిజనవందితు, నారదాది వినుతు నగధరు నచ్యుతు నాదిదేవు నిదె నమస్కరింతు. మాధవునకు నమస్కారములు వాసుదేవునకును వందనములు.

సీ॥ శ్రీనివాసునకును జేమోడ్పులందింతు,
కేశవునకుభక్తిఁ గేలుమోడ్తు,
వందనశతములు వైకుంఠునకు, వేద
వేద్యునకంజలి, విశ్వపతికి
పాలితామరునకుఁ బద్మనాభునకును
బార్థసారధికిని బ్రణతులివియ,
విశ్వనాధునకును విశ్వంభరునకును
విష్టరశ్రవునకు వేలునతులు

ఆ॥ నిర్వికారునకును నీరదతనునకు
నంబుజాక్షునకును నచ్యుతునకు
భక్తవరదునకును పాలితలోకున
కంజలింతు భక్తిననవరతము

ఎల్లభూతముల దానైతనయందెల్ల భూతముల నిమిడ్చికొన్నవానిఁ [illegible] దినకరహిమకరులమోమున వీతిమోత్రుని దాల్చినవాని వ్యోమపాద [illegible] నెదనుంచి వినుతింతును. అనేక దివ్యాభరణు ననేకోద్యతాయుధు [illegible] ననంతు విశ్వతోముఖు నభినుతింతును. మఱిమఱి యంజలింతును [illegible] శాశ్వత ధర్మగోప్తృ సనాతను పురుషోత్తముఁ బ్రణుతిచేతును. అఖిలలోక [illegible] నమరేశ్వరేశ్వరు నుతింతును. అప్రమేయు నవ్యక్తు [illegible] నాదిమధ్యాంతరహితు ననంతు నాత్మాభిరాము ననవరతము [illegible] నణువు, మహత్తునకు మహత్తునై యందు నిందునెందు [illegible] బాహూదర వక్త్రనేత్రు నిదే ప్రణుతిపేతును. అవాఙ్మానస [illegible] రూపొందితోచువాని సర్వమున కాభరణమై సర్వాభరణములఁ [illegible] దుఃఖనాశకు, నానంద స్వరూపువ్యాపీకేశుఁ బ్రస్తుతింతు [illegible]

యాదేవాది దేవుంగని వినుతించుచు జీవన్ముక్తుఁడు వ్యాసతనయుఁడు శుకుడు భూమిని సాష్టాంగ దండ ప్రణామం బాచరించి లేచి ఓకమలనయనా! రాగాదిదోష నిర్ముక్తా! సమగ్రగుణమూర్తి నీకుం జయమగుగాక. తేజోమయా ! విశ్వభావనా , విశ్వాత్మా, సర్వజ్ఞా సర్వేశా, నీకుం బ్రణామము. దామోదరా కేశవా! పుండరీకనయనా! నీకిదేవందనము. నీకుం జయము జయము. ఓ దయాసాగరా! నిన్నుంగని నేఁ గృతార్థుండనైతిని. ఇచటియెల్లప్రాణులు ధన్యములు, తరించినవి. ఓ విష్ణుభగవానుఁడ ! ప్రసన్నుండవగుము. పురుషోత్తమ ప్రసన్నుండవై నన్ను నీలోనికిం జేకొనుము.

అంచునిట్లు లింకనింకవినతు లొనరించుచు నానంద తన్మయుఁడై యాముని కుమారుడు నిలిచియుండ భగవానుడు కరుణామతిం దరిఁ జేరి యభయహస్తము నెత్తి శుకుని తలనుంచి యంతర్ధానుండాయెను.

శ్రీశుకముని వరుఁడును భగవానునకు మాటిమాటికిఁ బ్రణామంబు లాచరించుచు నటనేకాంత వాసులగు యోగుల నార్యులఁగూడి భగవాను నర్వావతార మూర్తిని, విభవావతారమూర్తిని దలంచుచు నర్చించుచు నుండి పిమ్మట మేరుపర్వత శిఖరమునకుం దరలిపోయెను.

ఓం శ్రీ నీలాద్రినిలయాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ క్షీరాబ్ధినాథాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ వైకుంఠాచలవాసినే శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ ముకుందాయ శ్రీ వేంకటేశాయ నమః

# అష్టమాధ్యాయము

## శ్రీ వేంకటగిరిని వరాహ భగవాను నావిర్భావ కథనము

తొల్లి దేవర్శనమునితల్లజుంగని దేవలమునివరుండిట్లనియెను. ఓ మహాత్మా! అట శేషశైలమున స్వామి పుష్కరిణీ తటమున నాశ్వేత వరాహదేవు దివ్యవర్తనయేమి? లీలలేమి? వచింపవే! యన దేవదర్శనుండిట్లని చెప్పందొడఁగెను.

తొల్లి దుష్టులు విజృంభించి ప్రజాపీడాకరులై భూమినిండి రక్కసులై దైత్యదానవులం దలపించు వారై ధర్మనాశనముం గావింపసాగిరి. వారలు మదోన్మత్తులై స్వేచ్ఛాచారులు నుద్దండదుష్టచరితులునై పాలకుల యాజ్ఞలం బాటింపక నిరంకుశులై పాపులై నీచాతినీచులై తమనీడలఁ దాము భక్షింపఁ గోరువారై యసురభావమున నరిష్టకరులు ధూమకేతువులునై నీతినియమములకు దయాధర్మములకుం దూరమై ప్రజలందు రాత్రింబవళ్ళు ఘోరాతి ఘోరోపద్రవముల నొనరింపసాగిరి. తమ విధ్యుక్త ధర్మముల కర్తవ్యకర్మల సక్రమముగ నాచరింపక దుండగులై ప్రజలనిడుమలం బెట్టుచుండిరి. త్రాగుబోతులు దబ్బరకాండ్రునై ఒడలు విఱుచుక తిరుగుచుండిరి. వారి యారక్కసిచే తలకు విసిగివేసారి మఱిసహింపనోపక భూదేవియుఁ బాతాలమునకుం దరలిపోయెను.

ఎల్లజీవులకేకైక మాతభూధాత్రియట్లు పాతాలమునకుం బోయి యణఁగి యుండఁబరమదయాళుఁడు పాలితామరుఁడధోక్షజుఁడు సర్వరక్షకుఁడు సర్వసాక్షి పరమపురుషుఁడు భగవానుఁడాదివిష్ణు వధోలోకమ్మున నుండి భూమాతనుద్ధరింపం దలంపుంగొని మహావరాహ రూపమున బయలు వెడలెను. ఆదేవు దివ్యముకుటమ్మునఁ బ్రకాశించు వేదరత్నముల, యుపనిషన్ముక్తాఫలమ్ముల కాంతులంగనుగొన్న సిద్ధులు, సత్యలోకవాసులు నాదిగాగలారలీయకాలోదితోద్దీప్తి ప్రకాశిత సూర్యమండలమిదేమా? ఆశ్రవణ కుహరంబుల శబ్దంబున కెల్ల నధిష్ఠానంబగు నాకాశం బిమిడియున్నదే. అవి కన్నులా? తద్గహ్వరంబులఁ దేజఃపుంజమంతయు నింతగ నణఁగియున్నదే. అదో వనదేవుఁడా ముక్కుపుటంబుల తొలివాకిలినేనిలిచియున్నాడు. ఈ సమస్త జలార్ణవమా దేవుపాద పద్మముల బురదగ నంటికననయ్యెడి అల్లవే కులపర్వతమ్ములు, మేరునగమ్ము లోకాలోకము మున్నగునగమ్ములవి యెల్ల నావరాహ ఖురాగ్రమ్ముల ధూళికణమ్ములట్టులు పట్టియున్నవి. అజ్జారే! మాయామయాంగకమ్ముల నొప్పియున్నవాఁడే యనియేమేమియో వింతను దలపోయసాగిరి.

సంద్రతలమునకుం బోయి వరాహరూపుఁడు లోకవిభుఁడు వెన్నుఁడు, తమ్మియింటి గరితలచ్చికి సవతిని, సకల ప్రాణిలోక నివాసస్థానమైనదాని, వసుంధరను వెదుకసాగెను.

అట్టట్టె దరిఁజేరిన మాయా వరాహరూపధారిని సత్యస్వరూపు వైకుంఠుంగని నూతన వధువగు నవవధూమణియట్ల చెంతల సిగ్గులొలకఁబోయుచున్న, ఇంతగవణకుచున్న ధరారమణిని పరమపావనిని గని యాస్వయంభువుఁడాయమకరముల బాహువల్లరులంబెన వైచి మూర్ధంబు మూర్కొనెను. ఇర్వురు నానందోల్లాసమున నుయ్యేలలూగిరి. లోకనాథు నాత్మనాథుంగని జగన్మాత ధాత్రీమతల్లి శరత్కాలోత్ఫుల్ల నవనీరజములట్లు నయనయుగము ప్రేమ వికసితముకాగా, నమృత పవిత్రభావోల్లసిత మానసాబ్జమున వినమ్రయైయున్నం గని యుదారభావనాయుత మధుర వచనమ్ముల నాదేవదేవుఁడు కమలనయనుఁ డిట్లు పలికెను.

భద్రే! వసుధాదేవీ! నీకున్మంగళమేకదా? భద్రముం బొందియుంటివా? ఇటనుండ నేల రమ్ము నీసుస్థానంబునకుం బోయి నెలకొని యెల్లజీవుల సుస్థిరులం జేయుము. ఎల్లవిధముల నీకు మేలగు అనియిట్లు వరాహరూపధరుఁడు, పరమపురుషుడు భగవానుఁడెంతయు నొప్పుగఁ బలుకనపుడు సిబ్బితియుబ్బునఁ దబ్బిబ్బగు శ్రీ గంటిచూపుల నాధరణీబిబ్బోకవతి యటువరాహదేవు ముఖముంగని ప్రేమరసపూర్ణములు మధురములునగు పలుకుల నాథుముఖమున ధర్మములు విని తెలియుఁగోరికి నాపురాణపురుషుంగని యిట్లనియెను.

ఓ దయానిధీ దేవదేవేశా భగవంతా! దైత్యాంతకా దైత్యదానవదుర్ధర్షా! సర్వభారసహన సమర్థగరుడగమనా, దుర్భరభారకారణమున రసాతలమునకు నసమర్థురాలనై క్రుంగియున్న నన్నుంబట్టియెత్తుము. ధరణింబ్రబలియున్న యాపాపభారమునే భరింపజాలకుంటిని. ఉద్ధరింపుము, రక్షింపుము. సమస్త శక్తుల కాధారుడవు నీవ. నీకివే వందనములు. అనంతశిరునకు, ననంతనయనునకు ననంత శక్తునకు ననంత శయనునకు ననంతునకు నీకివే నమస్కృతులు. నిశ్చలునకు, సుహృదునకు ననంత విభూతునకు నీకివే వేవేలు ప్రణతులు. అనియిట్లు కంపితగాత్రంబునఁ బల్కుధరా రమణి వినమ్రవచనముల నాలించిన సర్వలోక సంరక్షణ దీక్షితుఁడగు భగవానుఁడు ధరణీ తరుణీమణితో నిట్టులనియెను.

బాగు బాగుదేవీ! మఱి మఱిబాగు. నీవెంతయు మేలుగ బలికియున్నదానవు. భూమింగల దుష్టులకంతకాల మాసన్నమాయెను. వారెల్లవిధములఁ దగురీతిం దండితులు కాగలరు. వారివారి పాపములకుం దగు ఫలితముల, తీవ్రదండనలు వారికందంజేతును. పాపనాశము, దుష్టవినాశము నొనరింపనే నాదీక్ష నాపని. ఓవసుంధరా! నాపలుకు లాలింపుము. ఓప్రియా! సర్వంసహా! నీవిపుడు యదార్థసార్థక నామధేయురాలవుకమ్ము. ఇదియ నాపల్కునది. ఇట్లా దేవదేవుడు వరాహమూర్తి పలికి యాసర్వంసహకుఁదనకగు భారమునెల్ల నశ్రమంబున నోర్వంగల సుశిక్షణ నొసంగెను. దాననామహనీయ భూదేవియు

మిక్కిలియు స్వభార భరణక్షమయై భాసిల్లెను. అప్పటినుండియు నాయుగ్రవరాహదేవుఁడా పాతాలంబున నుండి భూదేవితో నిటకు భూమికిఁ గతూహలమున వచ్చి శ్రీస్వామిపుష్కరిణీ పశ్చిమ తటమ్మున నొకపుట్ట పట్టున నునికిపట్టుగ నుండి యటకునిటకు బోవుచు వచ్చుచునుండును. శ్వేతవరాహమూర్తియై విహరించుచునుండును. పాపవాసనలేని పవిత్రజనంబులచే సేవింపఁబడుచుండును. యుక్తపరిచర పరివృతుఁడై, సోజ్వలమణి భూషణాలంకృతుఁడై, సర్వాయుధధారియై దేవర్షిదివ్యాత్మలకు భక్తజనహృదయంబులకు నవ్యయానందం బొసంగుచు విహరించుచునుండును.

## దూర్వాసుశాపమునఁ గిన్నరదంపతులు కిరాతులగుట

సర్వభూతాంతర్యామియుఁ బరుని కంటెను బరుండును. బవిత్రుండుడునునగు భగవానుఁడు శార్ఙ్గపాణి విచిత్రరూపమున నట వసించుచుండెను. ఆలోనతి కోపస్వభావుడు దూర్వాసుఁడొక సమయమునఁ దనయాశ్రమ పరిసరములఁ గామమోహితులై విహరించు కిన్నరదంపతులం గాంచి కుపితుఁడై మీరిర్వురును సింహాచలంబను కొండను నొకపవిత్రమగు సెలయేటిదరి వన్యామహారులగు కిరాతదంపతులై తిరుగాడుడు పొండు అని శపించెను.

అప్పుడాకిన్నర దంపతులెంతయు దుఃఖితులై వినమ్రులు కాగా నామునియుఁ గనికరముం బొందినవాఁడై వారలకాశాపము నుండి విముక్తి బొందుటకు నుపాయమును వచించెను. అట నాస్వామి సరస్తీరంబున సంచారమును పొనరించు శ్వేతవరాహమూర్తిచే, మీకుం గ్రోధోద్దీపితుఁడనై యిచ్చిన నాయీశాపము నుండి విముక్తిచేకూరంగలదు. ఆది విన్న వారును అట్లనేయగుగాత మని దుఃఖితులగుచు నటనుండిపోయి కిరాతులయి జన్మించి యటపుష్కరిణీ తటమ్మున దంపతులైయుండిరి. దుష్టజంతుల సంహరించుచు కందమూలఫలాది శాఖాహారంబులు కొనుచు నాదంపతులా సింహాచలమునఁ జాలదినములుగ నివసించియుండిరి. అటవారు సింహశార్దూల శరభ గజభల్లుకాది జంతులచే నతిభయంకరంబును నతిదుర్గమంబునునగు నాయడవి నాపవిత్ర సరస్తీరమునఁ జిరకాలము గవసించుచుఁ బూలతేనెలు త్రావుచు వినోదించుచునుండఁ జిరకాలంబునకు వారలకుఁ జిత్రశరీరుండగు నొకపుత్రరత్నముదయించెను. ఆసుందర సుకుమారకుమారుం గన్న యాశబర దంపతుల యానందమునకు మేరలేలేవు. వారి మనోరథములన్నియుఁ దీరినట్లాయెను. తీయనిపూఁదేనియలతోఁ గమ్మని గుమ్మపాలతో వారాముద్దులపావని నతిగారాబమ్మునఁ బెంచిరి. వాఁడైదేండ్ల వాఁడాయెను. మత్తగజముల మదధారలతో స్వామి సరోవరమందలి పవిత్రమగు మృత్తికతో వానికి నలుగులిడి సరోవర జలంబుల

జలకమార్చుచుండిరి. సింహనశములట్లవాడియై తీక్షణమగు నాయుధంబుల గజమస్తకంబులు చీల్చితీసిన మంచిముత్తెములతో నెమలిపింఛెమట్ల చిత్రవర్ణముల నందమగు సన్నబట్టలతో నింకను నందములగు పక్షులతెక్కలతో నాయాలుమగలా ముద్దుల గారాబు బిడ్డనలంకరించుచుండిరి.

ఒక దినమున నాయడవిం దిరుగాడుచుండ నాకిరాతున కొకమఱ్ఱిచెట్టు తొఱటయందు మిగుల రమణీయమగు కుందనపు చాయన్మించి బాగుగపండిన కొఱ్ఱవెన్నులు కాననాయెను. వానింగొని వచ్చియాకిరాతుఁడు తనప్రియురాలికి నొసంగెను. ఆమెయు నాకొఱ్ఱధాన్యమును బాగుగనెండించియుండెను. ఆ తరువాత వారాధాన్యములతోఁ గొఱ్ఱచేనుంబెంచిరి. వారిర్వురును జాలజతనంబున నాచేనును నలువైపులం దిరిగి కాపాడుచుండిరి. ఆచేను పంటకు వచ్చునని వారెంతయు నాసించి యుత్సాహమున నుండిరి. దాని రక్షణకొఱకొక్కొక దినమున వారు తమపుత్రుం బంపుచుండిరి. ఆ బిడ్డడును పండిన యాప్రియంగు సస్యమును జూచి యెంతయు మోదంబందుచుండెను. ఆచేను పంటకు వచ్చెను. బంగరు వన్నెవెన్నులతోఁ బాగుగఁ బండి బరువెక్కి వంగియుండెను. చుట్టును గట్టిగఁ గంచెపెట్టి యావరణయందు నడుమను నాలుగురాడులు పాతిమంచెను నిర్మించి యందునునె యుండి కిరాతుఁడాచేనుం జూచుచు రాత్రింబవళ్లు కాచుచుండెను.

## వరాహదేవు కథ - చక్రవర్తి చరిత్ర

ఇట్లుండ నొకదినమున భగవానుఁడు శ్వేతవరాహరూపుడు ఆకలిగొన్నవాఁడై తనయున్న యాపుట్టపట్టున నుండి వెలువడి యావరణను దాటిచేను నడుమను జేరెను. అట్లు వచ్చిన దానింగాంచి యాకిరాతుడు కడునచ్చెరువందెను. అంతంబోకయది మఱియు మఱియు వచ్చిపోవుచుంటంగని యాతడు తొందరగఁ బోయి చక్రవర్తి యనుపేరున నొప్పునాదేశాధిపునకు నివేదించెను. ఇయ్యది యాలించిన సార్వభౌముడును గడుంగడు వింతనంది యుత్సుకత మీఱ నప్పుడవేట పొనరింప లోకహితకాంక్షం బయలుదేరి కిరాతువెన్నాడెను. మజ్జన మొనరించి భగవత్ప్రణిదాన మొనరించి యలసటమానిన వాడాయెను. అన్యమృగముల వేటాడు నభిలాషమానియాతఁడు కిరాతు వింతపలుకుల నెదఁ దలపోయుచునె యాప్రియంగు క్షేత్రమునకుం బోయి నడుమ నాకిరాతుతోఁ బాటుగ నామంచె నధిరోహించెను. ఎత్తయిమెత్తనగు నాకులుపఱచి మృదువగు లేడిచర్మము పఱచియున్న దాన నెక్కిడిన విల్లును జేతఁబట్టి యారాజవరుఁడు కూరుచుండియుండెను. వారటఁబరాకుమాని మెలకువ నలుగడలం గనుచుండిరి.

అంతలోననె యావల్మీకము నుండి వెలికివచ్చి విచిత్రమూర్తి వరాహదేవుండా యావరణముందాటి చేనుంజేరి యిటునటు గంతులిడుచుఁ జామలఁ దినుచు నుత్సాహమునఁ దన్మయముననుండెను. దంతముల ధవళకాంతులాయెడ వింతకాంతులు వెదజల్లుచుండ నుజ్జ్వలతనుకాంతులతో నవురూపవుటందమున నొప్పు నావరాహముం గన్న రాజు మిక్కిలి యచ్చెరువు నందినవాఁడై యంతలోననె విక్రమ విరాజితుఁడగు నాతఁడెక్కిడిన వింటినారిని బాణముసంధించి, బలముగఁ జెవులవరకా గుణమును లాగిపట్టెను. ఇంతలో దానింబట్టవలయునను నుత్కంఠ మిగులనట్టులనే మంచెనుండి దిగి దానినైపునకుం బోయెను. చేతవిల్లుం బట్టిపరుగున వచ్చురాజుంగని యావరాహ మాచేనునుండి గెంతి కంచెను దాటి వల్మీకముం జేరియందునఁ బ్రవేశించెను. విఖ్యాతవీరుఁడారాజు భగ్నప్రతిజ్ఞుడు విఫలప్రయత్నుఁడునై చింతించి తానెటులైన నాబలమున నావరాహముంగన వలయునను గోర్కిపొంది పోయి యటనామంచెను మృదులాస్తరణమున నట్టెపరుండి నిద్రించెను. ఏకలయులేకయె వేకువనె మెలకువ నందిలేచెను. తనువును బావన మొనరించికొన నాస్వామి పుష్కరిణీజలముల మునిగిలేచి వింతలవింతయగు నావరాహమును బట్టెదననుచుఁ గోర్కిమిగులఁ దపసివేసమున నటనే కూరుచుండి ధ్యానమొనరింపసాగెను. ఏమైన నగుగాత యావరాహదేవుం దర్శింతునని కడునిష్టనుండియు నేమియునుపయోగింపమి నేమిచేయను దోపక కడకుం బ్రాణములనె విడువనుద్యుతుఁడాయెను. కిరాత దంపతులొనరించు సపర్యలు గొనుచు నచటనె నిరాహారుఁడై తపమొనరింపనుద్యుతుఁడగుచుండ నారాజునకాకాశమున నుండియిట్లు తీయనియమృతములట్టి పలుకులు విననాయెను.

ఓ సాధుచరితా! రాజవరా! నీకావరాహదేవు దర్శింపఁ గోరికయే యున్నఁ దపమొనరించి కాంచఁగలుగుదునను నీయహంకారమును వీడుము. ఓ సువ్రతఁ బాగుగవిని నాచెప్పినటులఁచేయుము. సవత్సకముల యావులపాలుగొనివచ్చి యాక్షీరధారల వల్మీకస్థిత వరాహదేవునకభిషేకింపుము. అట్టులభిషిక్తుఁడై యావరాహ భగవానుఁడు పుట్టపట్టున నుండి యట్టెవెలికి రాఁగలఁడు, దర్శనంబీయఁగలఁడు. ఇంతవినిచిన పలుకులు మఱివినరాలేదు. ఇంతయు విన్నరాజు గర్వముడిగినవాఁడై మించిన యచ్చెరువున నట్టులెచేయనుద్యుక్తుఁడాయెను. ఆ లక్ష్మీనారాయణాలయమునకు నారాయణగిరికి దక్షిణమున రెండు యోజనముల దూరమున స్వర్ణముఖరికి దక్షిణమున నెల్లయుపకరణముల నొప్పు గ్రామములంగల లేగలతోడి యావులచటికి రప్పింపఁబడెను. పవిత్రస్నానంబుల వస్త్రాభరణాలంకారముల, నిర్మలభక్తియుక్తచిత్తంబున నుభయపవిత్రుఁడై యారాజు భగవానుని పూజలనిర్మగ్నుఁడాయెను. మంత్రిపురోహితులు నెల్లప్రజలు

పవిత్రహృదయంబుల రాజానుమతంబున నటకువచ్చి చేరినవారు పూజలఁ బ్రార్థనములఁ భక్తిం బాల్గొనుచుండరాజు భక్తిభావభరితుండప్పుడప్పుడ యెడలేక పితుకంబడుచున్న యాలపాలం గడవలకొలదిగఁ గొనుచు నిర్మల సమభావంబున నాకాశవాణి చెప్పినచొప్పున నావల్మీక బిలంబున నవిచ్ఛిన్నధారల నభిషేకం బొనరింపసాగెను.

అట్లులభిషేకం బొనరించిన పిమ్మట నావల్మీకంబున నుండి యొక్కపరి నుదయించిన వేవురుసూర్యుల కాంతితో, వెలుంగుమణులతో నలంకృతుఁడై చంద్రకిరణంబులట్టి చల్లనికాంతుల నొప్పుదంతమరీచుల, నున్నతముఖమండలమున లలాటంబున వెదురాకులట్టిరేఖలఁ దీర్చి దిద్దిన నూర్ధ్వ పుంఢ్రములలరుచుండ శంఖమును దలపించు కంఠముతోఁ బలిసిన, యుప్పొంగియున్నస్కంధములతో, సుదీర్ఘసుందర చతుర్బాహుల శంఖచక్రముల ధరించి యభయముద్రాంకిత, కరపల్లవములతో, నొడినెడమతొడ నంగకంబుల లజ్జాసంగోపితంబు లొనరించికొనుచున్న దరిచేరు భక్తజనముల దయాపాంగమ్ములంగను నపారహర్షప్రదాయిని భూమాత యుపవిష్టయై యుండ నపారానందము వెలిజిమ్ము మోముదమ్మితో శ్రీవత్సమున, గౌస్తుభముతో సుశోభితమగు విశాలవక్షముతో, యజ్ఞోపవీతోత్తరీయములు హారకేయూర కటకరమ్య హేమాంగుళీయకములుం దాల్చి చూపులఁ బ్రేమతరంగిణి వెల్లువలువేయుచుండఁ గనువారికి భక్తజనముల కానందమునొసంగు నవ్యక్తాప్రమేయ స్వరూపుడు శ్వేతవరాహమూర్తి యెదుటం దోచెను. తోచినదేవున కాపాలధారమోకాళ్లవరకు వచ్చి మడుగు కట్టి నిలిచిపోయెను. దానఁబాలను మునిగిన యాదేవు శరీరమున కూర్ధ్వభాగమె సులక్షితము సుశోభితము నాయెను. జానుమగ్నమేగునా క్రింది భాగము కనులకుంగానరాకపోయెను. రాజనేకోపాయంబులొనరించియు మోకాలికి, గ్రింది భాగమును గాంచఁజాలకపోయెను. ఇఁక నుపాయములచే నుపయోగములేదని యెఱింగి రాజాశాయుత నేత్రంబుల నట్టెకాంచుచునుండిపోయెను. చూచుకోరిక లీరికలెత్తఁదమిమీఱ నాలుక తడియారెను, కంఠముపెదవులు దవడలు నెండిపోయెను. దీర్ఘనిశ్వాసములు విడుచుచు మనసు చుమ్ములుచుట్టవిహ్వల చిత్తమున రాజట్టెయండిపోయెను.

## కిరాత దంపతుల శాపవిముక్తి

అట్లుద్రిక్త పరిస్థితినున్న రాజుంగని భూతభావనుఁడు శ్వేతవరాహరూపధారి యపారకరుణానిధి భగవానుడు పురాణపురుషోత్తముఁడిట్లనియెను. ఓరాజా! వ్యర్థములగు నీయీ పెద్ద పెద్ద జతనంబులేల? కట్టిపెట్టుము. ఓనృపవరా! నీకునే నింతవరకెతోచితిని. ఆ క్రిందనీకుంగనరాని విషయము. ఓధరాధిపా! నీకు నేను వచియించుపలుకులాలింపుము,

భక్తి శ్రద్ధలనటులొనరింపుము. పవిత్రశుద్ధ శిలల నీకుంగననగుచున్నంత దనుకనె యర్చావతారమూర్తింజేయించి ప్రతిష్టించుము. దాని కన్నివిధముల పూర్ణభోగంబుల నొసంగుము. ఇద్దియప్రాకృతమగు దివ్యరూపము, రాజసాదిగుణరహితము. ఇట్టి భావము మదినుంచి వైఖానసాది సుద్ధ సాత్విక భావులచే మహర్షులచే దానిపూజల నొనరింపఁజేయుము. ఆ పిమ్మట నీవునన్నుం బొందఁగలవు. కావున నాయానఁదలనూని పొమ్ము. పోయి ప్రజానుకూలంబుగ ధరాపాలనంబొనరింపుము. ప్రజలందున నన్నుం గాంచుము. ధర్మమునెల్ల విధములఁ గాపాడుము.

ఆవరాహమూర్తి విష్ణుభగవానుఁడు రాజునకిట్లు కాలము గడుపు నుపాయముంజెప్పి, కిన్నరదంపతులఁగిరాతరూపులంగాంచి వారిం దుర్వాసముని శాపవిముక్తులనొనరించి వారికిందొల్లిటి స్వపదవి నోసంగెను. ఆపైనాదేవదేవుండంతర్ధానము నొందెను. కరుణామయుదేవునక్కటికం దలపోయుచు నాకిన్నరదంపతులును రాజునకు ధన్యవాదములొసంగుచు వెడలిపోయిరి.

అటుపిమ్మట రాజవరుఁడు ప్రసన్న మతియై వేలుపుల కర్మచారియగు విశ్వకర్మం బిలిపించి యాతనిమతిననుసరించి వానిచే భగవదాజ్ఞానుసారంబుగ భగవానుని మూర్తిని నిర్మింపఁజేసి వేదోక్తరీతుల బ్రతిష్ఠింపంజేసెను. ఆపిమ్మట నిర్మల మతుల భక్తియుక్తుల త్రికరణ పరిశుద్ధుల వైఖానసుల రావించి పూజల నియమించెను. ఆయర్చావతారమూర్తి దేవుండు భక్తుల కెల్లరకు నారాధ్యదైవంబయి పూజలనందుచుండెను. అటు పిమ్మట జితేంద్రియుఁడు కామక్రోధవిరహితుఁడు నిర్జిత సాంసారికమాయావిమోహుఁడు వినిర్జిత శత్రుఁడు సర్వసముఁడు రాజర్షియునైన యాచక్రవర్తి దేవాదిదేవు శౌరి. బూర్ణచితు సర్వాత్ము భూవరాహు భగవాను శిరమున నంజలించి మ్రొక్కి సాష్టాంగ ప్రణామంబు లాచరించి యాయా వింతలు మాటిమాటికి నెడందఁదలపోయుచు, దననగరంబునకుం జనెను. ఆనాటినుండియు వరాహరూపధారి దేవదేవుఁడాది దేవుఁడు భగవానుఁడు సర్వాత్ముఁడు సర్వభూతాశయ స్థితుఁడు వేంకటాచల శిఖరమ్మున ధరణీదేవి ద్వితీయుఁడై స్వామిపుష్కరిణీ తటమున నేకాంతవాసియై యానందమ్మున నివాసంబుండెను.

## శ్రీ నృసింహాచలమున నీలకంఠ తపః క్షేత్ర వర్ణనము

ఓ దేవదర్శనమహాశయా! ఇట నీపర్వతమున నీలకంఠుఁడు మహాదేవుఁడు శ్రీనృసింహభగవానుని పూజనెచ్చట నెటులు పొనరించెనొప్పుగ జెప్పవే! యని దేవలుండడిగిన దేవదర్శనుండిట్టులనియెను. భక్త సత్తమా విప్రవరా! ఆలింపుము. పురారాతి శంకరుని యొక్క దివ్యచరితమును, చరితార్థులగు యోగిపుంగవుల కుత్తమ భోగసాధనమును, రమ్యాభీష్టఫలప్రదంబును, సఫల చతుర్వర్గ సమ్యగానందదంబును వచించెదను.

పరబ్రహ్మస్వరూపుఁడు విష్ణుభగవానుఁడు, నరకేసరి యొక్క ప్రసాద భక్తి హేతువును, భక్త జనకల్పకమునగు, నిచటి కుత్తరభాగమునంగల యాపవిత్రస్థానముంగూర్చి చెప్పెదనాలింపుము. ఇటకు సుమారు ముప్పది యోజనముల దూరమున నుత్తరమునంగల దొకయుత్తుంగ భూధరము నృసింహాచలము. అందుఁదావుతావులఁదనువుబులకింపజేయు, మనములు తలకింపఁజేయు, జంతుసంతతుల కిరవులు, దేవర్షి మునిజననిలయంబులగు సుందరకందరంబులు, వానివాని పరిసరమ్ముల ఁబుట్టిపెరిగి పుష్పఫల పల్లవ సంభరితంబులై కనులకింపొనరించు, ముదమ్మును పొనరించు వృక్షలతాగుల్మంబులు నెంతయు వింతంగొలుపుచుండును. పలుతెఱఁగుల పిట్టల గూండ్లకిండ్లై కలకలారావముల దెసలలమి వీనుల విందొనరించునవై మఱ్ఱిజువ్విరావి మాలి పనస రేగు నేరేడు మొదలగు చెట్లు దిక్కులలమినిండునీడ లొసంగుచుండు. అందందుఁ జరియలనుండి వెడలి గలగలపాఱు తీయతీయని తేటనీటిసెలయేళ్ల మొత్తంబులు, నేటి దరుల మొత్తంబుగ నెదిగి కొమ్మల నాకసమంటుచు దెసలతో మంతనములాడు తరువర శోభిత సుందర వనవాటికలు. అందలిగుహలు, లతాగుల్మములు నెలవులుగ, జపతపంబులు ధ్యానంబులు పొనరించుచు క్షేత్ర క్షేత్రజ్ఞ విజ్ఞాన వికాస చరిత్రులు వైఖానసులు యోగితల్లజాలు, తపోధనులు తలచూపుచుందురు. బంగరు తెఱఁగున మెఱయు గైరికాది ధాతులవ్యాప్తిచే మిత్రకిరణ ప్రాప్తిచే చిత్రవిచిత్ర కాంతులు చిమ్ము సూర్యకాంతమణుల మొత్తములచే హిమకిరణు కరముల తాకుడున నమృతధారలు కురియు చంద్రకాంత శిలాతలములచే నొప్పులు గుల్కుచు మెండుగ మోదముం గూర్చునాకొండనెత్త మెంతయుఁదనరారును. మఱిమఱి చెప్పనేల ? సింహనఖవిదారిత కుంభికుంభస్థల విగళిత గజముక్తాఫలము లందందలమి తోచుచుండు. పలువిధములగు మణుల సమూహములనుండి వెలువడు కాంతుల వెలుగులీను తలముల, ఇందు నందునెందును నందంబున నమరియొప్పుపగడాల డాలున జాలువాలు తలాల, నమరు నాకొండం జంద్రకాంతముల గచ్చున మణులు మాణిక్యములుంబొదిగిన తలముల నొప్పుకుటీరములు, అందందుఁ గనఁ గన్నులకు వినవీనులకు విందొనరించుచు నాడు నప్సరసలు, మంద్రమధ్యమ పంచమ స్వరమ్ముల పాడుగంధర్వులు, వేడుకల వినోదములు కొల్పుచు నిందందు నరహరి దేవు దివ్యావిర్భావో దంత గాధల లయతాళంబుల గానాలాపంబులొనర్చు కిన్నరయుగళమ్ములు గలిగి కన్నుల పండువొనరించుచుండు కొండనెత్తమ్ములు. అందలిగుహాతలమ్ముల, పటకుటీరమ్ముల, లతాకుంజమ్ములఁదపస్తేజమ్మున సూర్యకాంతుల గ్రిందుచేయుచు గనుదమ్ముల ప్రేమవెన్నెలలు గురియుచుఁదమ్మునెల్లరందును, నెల్లరందమయందును, దమయందున, నెల్లరందున నాపర్మాత్మనెఱుకంగాంచుచు సర్వసమభావులై ఋషిముని తల్లజాలు తపోధనులు నిజతేజంబుల నా పర్వత తటులవెలుగొందఁజేయుచు నుందురు.

అందాకొండనెత్తమ్మున నటనట భైరవీ భైరవులు యోగినీయోగులు, సిద్ధులు, భూతమ్ములు, యక్షకిన్నెరులు, నసురులు మాతరులు మఱియు మఱియు నన్యాన్యదేవయోనులు శంకరసేవలు నృసింహు పూజలు పొనర్చుచు, పరబ్రహ్మమును ధ్యానంబున నుంచి, యోగనిష్ఠల నిత్యావాసంబుల నుండి ప్రమోదంబున దినములు పుచ్చుచుందురు. అటమృగపక్ష్యాదులును సహజవైరములు మఱచి ప్రేమానురాగంబుల నన్యోన్యము సమాదరముల నుండెనన నికవేరె చెప్పవలసినదేమున్నది.

ఆ పర్వతరాజమున నొక్కెడ సుందర వనంబొండు విరాజిల్లు. అందుసుకోమల పల్లవ సుశోభితములై యాకసముతో మంతనములాడుచు దెసల కొసల పసలెఱుంగు కొమ్మలతో నొప్పు నేరేడులు, మారేడులు, రావులు, మావులు, రుద్రాక్షలు, ప్లక్షమ్ములు పనసలు నాది నీడలకు నీడమ్ములగు నింకను నెన్నెన్నియొ వృక్షమ్ములు, యజ్ఞకార్యముల కనుకూలములు, పుష్పలతావృతమంజులములు నగువానిచే జగదుత్సాహకరము, మనోహరము నైయావనవాటికయొప్పును. అవ్వనవాటిక యందునపవిత్ర వైడూర్యములట్ల చెన్నొందు విమలోదకముల నిండి కాంచనాంబుజ కల్హార కమలేందీవరాది పుష్పసంభరితమై పరిమళంబుల గుబాళించుచుఁ బూదేనెలు త్రావిమత్తెక్కి పూవుపూవున నెగురుచు పాడు గండుతుమ్మెద పిండులన్మండితంబై యాదులాడుచుఁ దేలుచుఁగనులవిందొనరించు మీన కమఠాదులచే హంస బకాదిజలపక్షులచే నలంకృతంబై పుణ్యాపుష్కరిణి యొండు విరాజిల్లుచునుండు. అత్తామరకొలకునకు నలువైపుల నొడ్డుల నాశ్రయములొనరించికొని తపమ్ములొనరించు దేవర్షి రాజర్షులు తపోధనులు తన్మయానందములఁ దేలియాడు చుందురు. తొంబదారు విధములగు నారసింహక మంత్రమ్మును జపించుచు నామువి తల్లజాలత్తీరభూమి నాశ్రయించి యుందురు. నిష్కలము, సకలము, మిశ్రమము నాశ్రితావన విశ్రుతమునై శ్రీవత్సాంకయుతము, జ్ఞానానందరూపము, జ్ఞానగమ్యము, వైరాగ్యభోగ భూమియగు నతీంద్రియ పరబ్రహ్మమును ధ్యానమొనరించుచు బ్రహ్మభావమును బొందిన బ్రహ్మర్షివర్యులచేనది సంసేవితమ్ము. అద్ది యనారతమా యంబికాపతి శ్రీశంకరుని పాదతల స్పర్శచేఁబవిత్రమైదరిఁజేరిన జీవుల నెల్లం దరింపంజేయు పురాణపుణ్యస్థానము అద్దిపురాణపురుషప్రాప్తింజేకూర్చున దైవపుణ్యజనసంసేవితమ్ము, ప్రశంసితమ్మునై దర్శన స్పర్శన పానంబులచే నెల్లరకు నెల్లకొర్కులం దీర్చు పుణ్యప్రదము పవిత్ర శక్తివంతమునగు నాపుణ్యపుష్కరిణి. తత్తీరమున నొకయెడఁబెనుబండంబగిల్చి మహావటవృక్షమొండు వెలువడినది. ఆమఱ్ఱికల్పకంబులకు బ్రతినిధియై యాశ్రితజనముల యఘాంధకారంబును దరిమి దివ్యజ్ఞానతేజంబుల విరియించుచున్నది. ఊడల బోడిమి మీఱిన యామఱ్ఱియ మొదటనె భక్తవ శంకరునకు శంకరునకు నాశ్రమమొప్పెను.

ఆ యాశ్రమము నలుదిక్కుల పరిసరములు నరసింహదేవర వివర్ధితములగు లేళ్లచే గోవృషభాది జంతులచే నావృతములై శాంతమూర్తులైన సింహశార్దూలాదులచే శాంతమండల మైనది. వైశ్వామిత్ర, ముంజ, కుశ, కాశాది తృణవిశేషములచే బరివ్యాప్తమై పచ్చని తివాసులు పఱచి నయట్టులందమిచ్చుచున్నది. మందార కుందమాకంద, హరిచందనాది వృక్షములతో, పాటలాశోకతిలక, కృతమాల, నక్తమాల తాల తమాల కములతో, నారికేళ పనస రసన ధవములతో బున్నాగపూగ రుద్రాక్ష వకులాక్ష హరీతకములతో, నింకను, నితరములగు నందములగు నాటవికములగు పలుతెఱుగులగు తరువులతో నంద్యావర్తక, జాతియూథీకరవీరాతి వీరకములతో, శతపత్రదమనక మాధవీమాలతీందుగులతో, తులసి చంపక పారుజాతాదులతో సుగంధిత పుష్పలతాదులతోఁబరివృతమై యాయాశ్రమము సుఖానందప్రదమై యద్వితీయమై యుండెను. ఆపవిత్ర పుణ్యక్షేత్రమున నారసింహదేవుపూజలు పొనరించు నాసక్తిని జగన్మయుండు శంకరుండు వచ్చియట నుండెను. ఆదేవుండు శంకరుడు శివుండు పుణ్యాపుష్కరిణిం దానమిడి పవిత్ర వ్యాఘ్రచర్మముం ధరియించి హరిచందన మొడలున నలందికొని యొల్లపుడు విరిసియుండు, వాడుట యెఱుంగని, పూలమాలల మెడవైచికొని యందందుఁజేపడిన దివ్యమణులు రత్నములు నేర్చి కూర్చి తనువునలంకరించికొని శుభమంగళ వేషధారియై, నందీశ్వరాది రుద్రగణములచే, సేవారసవిశారదులగు భూతగణములచే, నుజ్వల నీలకాంతుల వస్త్రములం గట్టి యొప్పారు ప్రమధ గణములచేఁ బూజాది శుభకార్యములను విఘ్నములు కలుగకుండ దొలగించి సుసంపన్నములొనరించు క్షేత్రపాలునిచే సేవితుండై ప్రసన్న చిత్తుండగు మహేశ్వరుండు, పరాపరభూతంబుల సృష్టికర్త, నాపరమేశ్వరు రమేశు, పాపహరు, సర్వశాసనకరు, భక్తపాలనకరు, కృపాకరు సర్వేశు నచ్యుతు నవ్యయుఁదన తపఃఫల స్వరూపు పరాత్పరుఁ బరము లక్ష్మీనృసింహలు అసుర సంహారనృసింహు, దివ్యనృసింహు, నశేషదుఃఖహరు, నుగ్రనరసింహు, వీరనృసింహు ప్రత్యగ్ర విగ్రహు, శబ్ద బ్రహ్మమయు, శబ్దాతీతు హృషీకేశు, శబ్ద విజృంభణు, నవ్యయానందు, గోవిందు పూతు పూతాత్ముఁ బుణ్యుఁబురాణపురుషు, నవ్యాజమిత్రు శత్రుఘ్ను, సర్వశరణ్యు, శరణా గతవత్సలు, భక్త జనార్తి భంజను, సచ్చిదానంద సందోహు, నవక్రవిక్రము, త్రివిక్రము, శ్రీవత్సలాంఛను, సర్వలక్షణ లక్షితు, సచ్చిదానందరూపు, నవినాశు నిర్వికారు, సర్వవ్యాపి, విశ్వేశు, విశ్వంభరు పరబ్రహ్మ నేకాగ్రచిత్తమ్మున ధ్యానంబొనరించుచు పాంచరాత్ర విధానమ్మున, పంచకాలపరాయణుండై యా మహెూపలవట వృక్షంబుక్రిందను సర్వలోకహితమును గాంక్షించినవాఁడై, సర్వజనసంక్షేమంబునకై యాశంభుండు విశ్వంభరుండు సర్వాశ్రయు శార్ఙధరు భగవంతు నృసింహు సంవిధానార్చనలు కావింపసాగెను.

ప్రసన్నాత్ముడు పార్వతీపతి, సర్వలోకహితాకాంక్షి, సర్వేశుఁడు సదయహృదయుడు వ్యాఘ్రచర్మాంబరధారి, శాంతమూర్తి, శ్రీశంకర భగవానుఁడు, ఆపాషాణ తలోత్పన్నవట వృక్షతలమునకు శాస్తరణముం గావించికొని పద్మాసనంబున సుఖోపవిష్టుండై సంయమియు సమదర్శియునై వైకుంఠు నారసింహు నెమ్మనంబునఁ దలపోయుచుఁ గరుణాసముద్రోల్లోల భావతరంగ భాసితలోచనుఁడు త్రిలోచనుఁడు, తరుణసూర్యసమారుణ కపర్దజటాజూటుడు శ్రీకంఠుడు కంఠేకాలుఁడు భక్తప్రహ్లాద సంత్రాణు నరసింహమూర్తిని మనసుననుంచికొని యట న్యగ్రోధతలమ్మున నెలకొల్పి వామనపదత్రయ పవిత్రత ముల్లోకమ్ముల ముదమ్మున సమను కంపావలోకనమ్ముల, సర్వత్రాకాంక్షంగనుగొనసాగెను. పశుపతి, పరమేశుఁడు, హిమకర, దినకర, వైశ్వానరనేత్రుఁడు పెద్దపులి చర్మంబుం బెంపొందఁగట్టి, పైనేన్గుతోలును వలెవాటుగఁ గప్పుకొన్నాతఁడు, ముల్లోకముల నేలుముక్కంటిదేవర, ప్రళయకాలోజ్వల వీరవిక్రమతేజుఁ డహిర్బుధ్న్యుడు మహాకాలుఁడు సర్వలోక రక్షాకాంక్షి దక్షిణామూర్తి మహానటుఁడు భస్మాంగధారి నృసింహభగవానుని సగుణమూర్తిం బొనర్చి నిత్యపూజ నొనర్పనుద్యోగించెను. మృడుఁడు చండికేశ్వరుఁడు సమస్తలోకచరాచర మిత్రుడు, భువనేశ్వరుఁడు, శంభుఁడీశుఁడు భూతేశుఁడు వైజయంతీమాలాధరు శ్రీవత్సలాంఛను నృసింహదేవు నానందకందు ననన్యమనస్కుఁడై సంస్మరణం బొనరింపసాగెను.

అస్థిహారుఁడు నాగకంకణుఁడు కాత్యాయనీ మనోనాథుఁడు శూలి మృత్యుం జయుండు సుప్రతిష్ఠితమొనర్చిన యానరసింహమూర్తినేమని వచించునది? నరుఁడును సింగంబుగనైన సగుణమూర్తి శత్రుసంహారకుండగ్ని శిఖలట్టు వెలుగొందు మెడజూలున నొప్పుచున్నవాఁడు. కటకటలాడించు దంతకోణంబుల నుండి యగ్గికణమ్ములు వెలిజిమ్ముచున్నవాడు. తనపెందొడలపై హిరణ్యకశిపు వికరాళ శరీరముం బట్టియుంచి గోళ్లకొనల దైత్యేశువిశాల వక్షస్థలముం బట్టి చీల్చుచు నయ్యెడ నుండి వికటముగఁ బాఱురక్తపు టోడికల నెత్తునైన యనేకానేక భుజంబుల ననేకాస్త్రశస్త్రంబులు పట్టియొప్పుచున్నవాఁడు. వికటాట్టహాసోద్భాసిత ముఖమండలమునఁ బరమభవ్య స్వరూపుడై భక్తవత్సలుఁడు, దుష్టుల కత్యంతభీతిప్రదుఁడు, సజ్జనానందకరుఁడు, విబుధజన విభవానందదాయకుఁడు, దేవతలకుం బూర్వదేవతలకును సమానాధిదేవుఁడునైనవాఁడు. ఆదేవుశిరమున నవరత్నరంజితము నందాలయపరంజి కిరీటము ప్రకాశించుచుండెను. మకరకుండలములు మాణిక్యరత్నరంజితములు, వెలుగులీనుచుండెను. రతనాల, ముత్తెముల యలరారునేడేడు పేటలపేరులు భుజములనడుమ నిరవుకొని సొంపుపెంపుఁ జూపుచుండెను. కటకకేయూరాంగుళ్యాది భూషణములు కరముల నిరవుకొని మెఱయుచుండెను. భుజమున జన్నిదము నాపై వన్నెలపెంబట్టు కండువా వలెవాటెంతయు వింతహెయలు సూపును. చిఱుగంటలమ్రోతలఁ జిన్నవుచ్చుకాలిగజ్జెలు

తనరుచుండ బంగరుహొంబట్టు బట్టంగట్టినవాఁడు మాయలమారియయ్యె, ఆయయ్యె కరకమలములు, పదపద్మములు నవనవోత్ఫుల్ల వనజాతమ్ముల సిగ్గునంబెట్టు. ఒకవంకదుష్టుల గుండెలవియించు, వెఱపుగొల్పు వెక్కసమగువేసము, మఱియొకవంక భక్తులకు సాధుసజ్జనులకుఁ బ్రమోదధైర్యమ్ములుం గూర్చునింపగు నక్కటికల వెలుగులు చిమ్ముశాంతస్వరూపము. ఆతనిదర్శనంబట వింతల వింతయై యొప్పెను. ఇంద్రాదిదేవతలు దరినిజేరి సంసేవలొనరించుచుండిరి. మందారాదిపూలమాలల నలంకరించి యర్చించుచుండిరి.సనకసనందాదులు వినయ వినమితాంగులై యంజలిఘటించి వినుతులు వినతులు పొనరించుచుండిరి. తుంబురాది గంధర్వులనన్యభక్తి భరితమానసులై సప్తతంత్రీనాదంబుల వీణలు మీటుచు, దేవుచరితలంబాడుచు, నుతించుచుండిరి. వైనతేయ విష్వక్సేన కుముదాది పరివారము పరివేష్టించి సేవలు పొనరించుచుండెను. శ్వేతచ్ఛత్రాది రాజలాంఛనము లెంతయు నొప్పంబట్టి వివిధాయుధంబులం బూనినవైష్ణవీశక్తులచే రౌద్రశక్తులచే బ్రాహ్మీశక్తులచే నాదేవుడు పరివేష్టితుఁడైయుండెను.

ఏడేడు లోకంబులంగల నెల్లసిద్ధులచే నభిసేవితుండగు నాపరబ్రహ్మను నరసింహమూర్తిని నీభూతలంబున నటసుప్రతిష్ఠిత మొనర్చిచెంతలనుండి యెల్లవేళల నాశంకర భగవానుఁడుపచారంబుల సమభ్యర్చన లొనరిచుచుండెను. పరాపరప్రాణి మాత్రంబుల కెల్లనీశుండు, సర్వాత్ముండు, విష్ణుహృదయుండు శంకరభగవానుఁడాత్మ స్వరూపునుపచారంబుల సమభ్యర్చనల నొనరించుచుండెను. అచ్చటనె యున్న భగవతితోఁ గూడనాపురారి పురాణపురుషుఁడు శంకర భగవానుఁడాత్మయందునని తనచూపులు నిలిపి, భాగవతధర్మములను సమాచరించుచు సుఖపూర్వకముగనుండెను. ప్రాణధారులందెల్లఁ బ్రాణస్వరూపుఁడు, జంగమాత్మలనెల్ల జంగమస్వరూపుఁడానీల కంఠభగవానుఁడెల్లరకు న్మహాత్ముఁడు ప్రసిద్ధుఁడునై యొప్పెను.

## ఉపలవటము

అటనదే పుణ్యపుష్కరిణి, పున్నెంబుల పున్నెంపుఫలముల నొసంగునది; భక్తిభరితులకుఁ బవిత్రహృదయులకు నెల్లరకుం బురుషార్థములనెల్ల నొసంగునది. భగవంతుని ప్రేమను పూర్ణమొనరించి యొసంగునది ఈపుణ్యపుష్కరిణి.

అద్దిశంకర భగవాను నహిర్బుధ్న్యు నాశ్రమము, తపఃక్షేత్రము, పవిత్రాతిపవిత్రము. ఇటనొనర్చినతపము కోటిగుణితమై ఫలించును. అచ్చటియా,యుపలవటము, రాతిబండ పైమట్టి భగవన్నివాసము, ఒక్కపరిదర్శనమాత్రమున కడుంగడు పాపవినాశమొనర్చును. సర్వాభీష్టములు నొసంగంగలదు.

శితికంఠుని మహాదేవుని శంకరభగవానుని పూజలఁ బరితృప్తుండైన యావైకుంఠవాసికి, నృసింహదేవునకు నిందిరారమణునకు త్రివిక్రమునకు మహాత్మునకు సింహాచలము, పాపహారము, కృతశౌచము నీలకంఠాశ్రమము, అహోబిలమునను నైదుమహత్పుణ్యక్షేత్రమ్ము లొప్పియున్నవి. పవిత్రక్షేత్రంబులందెల్లఁ బవిత్ర క్షేత్రములీయైదును. వీనియందునను నీలకంఠక్షేత్రము పావనాతిపావనము, సర్వపాపహరము ననివిబుధులు, జ్ఞానవిజ్ఞానఖనులు యోగులు వేనోళ్ల వినుతింతురు.

## పాండవ తీర్థమాహాత్మ్యము

శ్రీనివాసనగరాజమునఁ దూరుపుదెస స్వామిపుష్కరిణికిందగ్గరలో నెల్లదోషములం దొలగించు, మనమున కత్యంతానందము నొసంగు ప్రాచీనాబర్హినాబడునొక నదీమతల్లి యొప్పియున్నది. ఆనాడు పరమునానందమయు శ్రీకృష్ణునాశ్రయముం బొంది తదాజ్ఞలం బాటించి పరాక్రమతాధికులు పాండవులు మహారణమొనరించి ధర్మాను బంధితులయ్యు జ్ఞాతులం బంధులం జంపి సామ్రాజ్యసంప్రాప్తులయ్యు గడుంగడు దుఃఖవిదగ్ధచేతసులై పరితపించిరి. దీనమానసులై యాపాపవాగురుల నుండి విడివడుటకై కడుంగడు చింతించి కాలీయమర్దనుఁడు వాసుదేవుడు శ్రీకృష్ణభగవానుఁడు ప్రేరేప నిశ్చింతులై యిటకువచ్చి ఈ ప్రాచీన బర్హియందెంతయు ముదితమానసులై మునుకలిడిరి.

అట వారతిమలాపహారిణిపాపవినాశిని మహిషాసురమర్దిని, మహామాయను భక్తియుక్తులై యర్చించి ప్రస్తుతులొనరించితనిసిరి. అట నాపుష్కరిణీతటమున నధోక్షజు శ్రీనివాసభగవాను నెంతయునొప్పుగఁ వారుపూజించి వినతులొనరించిరి. పాపములు వాసిపావనతనులు శుద్ధమతులునై యటనుండి వారెటనుండి వచ్చిరాయెడకుం మరలిబోయిరి. పాండవుల పాపములనెల్ల కడిగితుడిచి వైచిన యాపావననదినిగాంచిన విన్నజ్ఞాన విజ్ఞానులు నిర్మలమానసులు దానిపాండవ తీర్థంబని పలుతెఱఁగుల వినుతించిరి. ఆపుష్కరిణికి వెనుకనె నారాయణగిరితనరియున్నది. దానింగాంచినంతనె జీవధారులు ముక్తింబొందఁగలరు. అటదేవదేవుఁడు భగవానుఁడు నిజమనోహర దివ్యకాంతులు నలుదెసలం జిమ్ముచు శ్రీభూనీళలతో లోకమాతలతో నిచ్చావిహారంబులు పొనరించు చుండెను.

ఓం శ్రీ నారాయణనగేశాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ బ్రహ్మోక్తప్రోత్సవాయ శ్రీ వేంకటేశాయ నమః

# విధాతృనాజ్ఞను వసిష్ఠాదులు వేంకటాచలమున ఘోణతీర్థమునకేగుట

ఓవసిష్టమునిమహాభాగా! కాశీక్షేత్రమునకు దక్షిణ భాగమున వేంకటాద్రియని ప్రసిద్ధమగు విశ్వలోక సమ్మతమగు నొకేయొక పవిత్ర పర్వతరాజము కలదు. వేంకట నామస్మరణంబున నదిమానవుల చేతనేకాదు దేవతలచే, ముల్లోకవాసులచే నమస్కరింపం బడుచున్నది. అదియట్టి ప్రభావముకలది. ఆ శ్రీ వేంకటశైలమున నెల్లపాపములు హరింపఁ జేయుపెక్కులు దివ్యతీర్థములుకలవు. అందలి యాసర్వతీర్థములందున నుత్తమొత్తమము స్వామి తీర్థము సర్వప్రసిద్ధము. దాని దక్షిణ తీరమున సాక్షాద్భగవంతుఁడు విష్ణుదేవుఁడు లక్ష్మీ దేవితో గూడి యానందమున వసించుచున్నవాఁడు. అగస్త్యుడు శంఖణుఁడాది భక్తవరుల కభీష్టవరప్రదాయకు శ్రీ వేంకటేశుని మ్రొక్కియర్చించి భక్తజనులు దృష్టాదృష్ట ఫలంబులెన్నెన్నియుం బొందుదురు. ఆ వేంకటనగమధ్యమున ఘోణ మను ప్రసిద్ధమగు నొక పవిత్ర తీర్థము కలదు. ఆఘోణతీర్థమునందు స్నానమొనరించిన మానవులేరుగాని దప్పక పావనులగుదురు, పాపములెల్లంబాసియిందున నందున సుఖింతురు. సూర్యుఁడు మీనరాసింగలపుడు, అనమీనమాసమున పౌర్ణమి మహాతిథిని ఘోణ తీర్థస్నానమొనరించిన వాని యెల్లపాపములు సమూలముగ నశేషముగ నశించును కావున నీవును నీభక్తుడును శ్రీ వేంకటాచలమునకుంబొండు; మీనమాసమున పున్నమి దినమున నటయాఘోణ తీర్థస్నానమొనరించి పావనులు కండు, దేవదేవునర్చించి తరించుడు. ఇట్టులన్న బమ్మనువిని మునిసత్తముఁడు లోకేశునకు నాత్మభవునకు నమస్కరించి ప్రసన్న చిత్తుండై బ్రహ్మలోకమ్మున నుండి వెడలి వచ్చి శీఘ్రముగ సర్వాబద్ధుని వద్దకుంజేరి యాతనితో నిట్టులనియెను. ఓయీ బ్రాహ్మణా! ఎల్లపుడు నానామమె స్మరించుచు నన్నె శరణంది యాశ్రయించియున్నాడవు. నీపాపములెల్లను దొలంగిపోవ నొకయుపాయము వచించు చున్నాఁడను. నీవును నాతోనచటికి నరుగుదెమ్ము. అనినంతనాఁతడప్పుడ వసిష్టముని వరుని వెంటంబోయెను.

బ్రాహ్మణువెంటనిడికొని వసిష్టమునితల్లజుఁడు పయనమై వచ్చి పాపముల నెల్లంబాపు సువర్ణముఖరీనదింజేరి యందున స్నానమొనరించి, శుకమునివరునను గ్రహించి వరంబులొసంగిన శ్రీకృష్ణదేవు దర్శించి వందనంబొనర్చి, ముందునకు సాగిపోయెను. అటవారు వేంకటనగమూలమున సర్వాఘహారిం గపిలతీర్థమున మునుకలిడి కపిలేశు దర్శించి మ్రొక్కులిడి పైకింబోయి స్వామి పుష్కరిణిని దరిసిరి. అచ్చటనందున స్నానములొనరించిన పిమ్మట భూవరాహదేవుని దర్శించి ప్రణామము లొనరించిరి.

తమతమ పాపముల నాశమొనరింపంబ్రార్థించిరి. పిమ్మట దక్షిణ తీర్థమ్మునకుం జేరి లక్ష్మీపతిని దర్శించి నమస్కృతు లొనరించి బాగుగఁ బ్రార్థన లొనరించిరి. బమ్మదేవరయను మతింబొంది వచ్చిన మమ్ము ననుగ్రహించి దరిసెనం బొసంగిన యోదేవా! శ్రీనివాసా! జయము జయము. లోకావనదక్షా శంఖణపూజితా! జయము జయము. ఓకేశవా! మమ్ములను రక్షింపుము. ఇటనన్ను నీబ్రాహ్మణుంబవిత్రులుగ నొనర్చికాపాడుము. ఓదేవా! మీయీ పవిత్రవేంకటాచలమున నత్యంత శోభాయుతము పరమపావనమునగు ఘోణతీర్థమున స్నానములొనరింప మిమ్ముసేవింపవచ్చితిమి. ఓభగవంతుఁడా! అద్దానిఫలంబును మాకొసంగుము. ఇట్టులు ప్రార్థించి విప్రునితో నామునివరుండట నుండి యుత్తరమునకుంబోయి పాపనాశని తీర్థంబున నాబాపనయ్యతోఁ గలిసి మునుకలిడి ఘోణతీర్థమునకుంబోయి దరిసెను. ఏకాదశి నటకుంజేరినవారట పంచరాత్రము లుపవసించిరి. ఫాల్గునమాసమున పౌర్ణమాసిని మధ్యాహ్నమున నటనందున స్నానములొనరింప వచ్చిన ఋషిమునుల, దేవతల, దపోధనుల యక్షగంధర్వులఁ గిన్నరాదుల జూచి వారలెంతయు నబ్బురమందినవారైరి. వారటనియమ పూర్వకముగ స్నానము లొనరించి ఋషులకుం, దేవతలకుం దర్పణము లర్పించి కూర్చుండి వారిద్దరును విధిపూర్వకముగ జపమొనరింపసాగిరి. శ్రీహరిధ్యాన మొనరించుచు మునివరుఁడు సమాధి సంస్థితుఁడాయెను.

## భగవంతుఁడు వసిష్ఠునకుం వర్ణించి చెప్పిన ఘోణతీర్థ మాహాత్మ్యము

అట్టులట ఘోణతీర్థమున స్నానములొనరించి కూర్చుండి యున్న యామున్యాదులందఱియెదుట శ్రీవేంకటేశభగవానుఁడు జగత్పితగరుడ వాహనారూఢుఁడు పీతాంబరధరుడు ప్రసన్నవదనాంభోజుఁడు కారుణ్యమూర్తి, శ్రీహరి లక్ష్మీ సమేతుఁడై యాతీర్థసేవ కటకు వచ్చిన వారినెల్లరం గరుణ దృక్కులంగనుగొనుచుఁ సనకసనంద నాదులచే, సేవ్యమానుండగుచు వచ్చిన యాదేవుఁడు వసిష్ఠునక్కటికమ్మునంగనుచు నిట్టులనియెను. ఓవసిష్ఠా! నేనెంతయుఁ బ్రసన్నుండనైతిని. నీవువైభవమ్మునఁ బెంపొందుము. నాయీ తీర్థమాహాత్మ్యమును బమ్మదేవరవచియింప నాలించి, భక్తియుక్తుండవై యిటకువచ్చితివి. దానిచేత నేనెంతయు నంతుష్టుండనైతిని. ఓబ్రాహ్మణశ్రేష్ఠామునివరా! నీమనంబునంగల యాకోరికయేమి? కోరికొనుము. నీకోర్కి నేతీర్తును. ఇట్టులన్న భగవంతునితో భక్త్యాదరమ్ముల వసిష్ఠుండిట్టులనియెను. విశ్వరక్షామణీ! హరీ వేంకటపతే వందనమ్ములు గైకొమ్ము వరద ప్రణతపాల! నాపల్కు లనుకంప నాలకింపుము. అంబుజాక్ష దయామతే, యమరవినుత అనుచునింక నిట్టు

లనియెను. దేవా! యీవిప్రుఁడు నామిత్రుఁడు. ఘోరములగు పాపము లొనరించినవాడు. నాయందున నక్కటికపూని వీనియా యఘములెల్ల సహించి యీతీర్థ ప్రభావమున వీని నీపాఱుని బవిత్రు నొనరింపుడు, సర్వపాప విముక్తుంజేయుఁడు. ఇదియ నా ప్రార్థనయనుచుఁ బ్రార్థింప భగవంతుండిట్టులనియెను. ఓమహామునీ! వసిష్ఠా! నీయాశ్రితుఁడని యెఱింగి యీతనియందు నీవెంతయు దయామతివైతివి కనికరముంజూపితివి. దీనిచేనాకెంతయు ముదమాయెను. ఆశ్రితులందున వాత్సల్యముం బూను నాతఁడిందున నందున నెందున నుత్తమోత్తముఁడు. అట్టివారియందున నాకెంతయుంబ్రీతి. అయ్యదియ నీమహద్గుణము. ఈతండును నీయందెంతయు విశ్వాసముంచి మిక్కిలి భక్తింగలిగియున్నవాఁడు. పెద్దలయందున భక్తిశ్రద్ధలుంచుచు, నాదరసన్మానములు పొనర్చు నాతఁడెంతయు శ్రేష్ఠమానవుఁడు. అట్టివాని హృదయమున నేను లక్ష్మీయుతుండనై వసింతును. ఇకనీతఁడో లోకమున గడునింద్యబ్రాహ్మణుఁడై యనేకమ్ములు పాపమ్ములు చేసినవాఁడు. వీనియందున సద్గుణ మొక్కటేనియుఁ లేదు. ఈతండు సర్వాబద్ధుండన సార్ధకనామధేయుఁడై యున్నవాఁడు. అయినను గతమునకు వెతనంది నీ సాయమున నీతఁడీ దివ్యతీర్థమునకే తెంచి భక్తియుక్తుఁడై యీమీనమాసమునఁ బూర్ణిమా యోగమున నిందుమునుకలిడినాడు. దాననీతనిపాపము సర్వ నాశనమాయెను. ఓమునివరా! నీదగుసత్సహ వాసమున నీతని దుర్గుణములన్నియుం దొలఁగిపోయినవి సద్గుణములు బాగుగఁ బట్టి యున్నవి. కావున నింతటినుండియు నీతఁడు సర్వసిద్ధుడను పేరును బొందిప్రసిద్ధుఁడగును. నేవీనియెడందను నిలిచి సత్కార్యములందునఁ బ్రవర్తిల్లంజేతును. వీనినే ధనికునిగ, ధార్మికునిగ నొనర్చి సుఖిగఁ బొనర్తును. ఓ వసిష్ఠ! ఈ నాపలుకులాలింపుము. . స్త్రీయగుగాత! పురుషుండగుగాత, బ్రాహ్మణుఁడో, క్షత్రియుఁడో, వైశ్యుఁడో, శూద్రుడోయగుఁగాక, మరేయితరుండగుఁ గాక, యెవ్వరేని పవిత్రమానసమున నన్నుద్దేసించి తపంబొనరించు వారు, పవిత్రవర్తనులగు వారు పాపములను బాసి యుచితఫలములను బొందఁగలరు. ఇందావంతయు సందియములేదు. పాపచింతను విడనాడినవాడె పావనుడు, నాభక్తుఁడు. తొల్లితుంబురుండీ దివ్యతీర్థమునం దపం బొనరించి ననుంబరితృప్తునింజేసియీదివ్యతీర్థము తనపేరునఁ బ్రఖ్యాతి నందవలయునని కోరివరమును బొందెను. కావున నోవసిష్ఠమునీ! ఈ దివ్యతీర్థము తుంబురుతీర్థమనుపేరుననుఁ బిలువంబడుచుండును.

ప్రతిసంవత్సరమునను మీనమాసమున పూర్ణిమతిథిని పుణ్యదినమున నీతుంబురు తీర్థమునఁ బావనమతిస్నానమొనరించువారు ముల్లోకములందు ననుధన్యతములు కన్నియయైనచో సర్వగుణోత్తరుఁడగు భర్తనుబొంది సుఖించును; పుణ్యవతియు చిరసౌభాగ్యమును, కులోద్ధారకు సుపుత్రుని పడసిసౌభాగ్య, సంతతి భాగ్యముల వర్ధిల్లును, వృద్ధ స్త్రీపాపమ్ములుపాసి, పుత్రపౌత్రాదులలో, ధనవతియు

బంధువతియు నై భర్తజీవించియుండఁ జిరకాలము సౌభాగ్యవతిగ జీవించి ముదమందును. ఇందున స్నానమాడిన గోడ్రాలును సత్సంతానవతికాఁగలదు. ధనమునాసించువారు ధనవంతులగుదురు. పుత్రులంగోరువారు పుత్రులఁ, పౌత్రులంగోరువారు పౌత్రులఁబడయుదురు. సద్గౌరవముం బడయఁగోరువారు జగతిని మంచిసన్మానమును, విద్యలంగోరువారమితమగు విద్యనుబొంది సుఖమునఁ జీవింతురు. సజ్జనులు లౌకిక వైదికకార్యములఁ గడుసమర్థులగుదురు. ఇందునస్నాన మొనరించి, పాపంబులెల్లఁ దొలఁగ ధనధాన్యాభివృద్ధి పుత్రపౌత్రాభివృద్ధికలుగ సౌఖ్యసంవర్ధనముగ, బంధువులమధ్య పెంపొంది చిరజీవులగుచు మానవులు విష్ణుసాయుజ్యమంది తరింపఁగలరు.

భక్తియుక్తులగు మానవులకు, వైష్ణవులకు, బ్రాహ్మణులకు భక్తియుక్తి నాదరమున భోజనంబులిడు వారింగాంచిన నాకును లక్ష్మీదేవతకును నత్యంతానందంబుఁ కలియుగమున నీశైలము, నీతీర్థము నత్యంతము ప్రసిద్ధమై యుండును. ఇందున స్నానములు దానములు నొనరించు నెల్లవారల పాపములనెల్ల నిది నాశమొనరించును. ఈయెడలోకుల తాపములు, దాహములు, తొలగింప చలువపందిళ్లు, చలివేంద్రములు నిర్మింప నొనరించువారిని మదంశ సంభూతులనియె తాపసులు, ఋషిమునివరులు, తలంచి యాదరింతురు. అదియెంతయు నిజమె, సందియములేదు. ఇందొనరించు దానంబులెల్లఁ కోటిగుణితములై ఫలించును. కావున నెల్లమానవులిట నాశక్తిని దానధర్మము లొనరింపుడు. పుణ్యదినంబుననే నిటఁ బ్రత్యక్షంబుగనుందును. ఇందున స్నానదానాదులొనరించు వారలకు వారియభీష్టఫలంబు లొసంగుదును.

అట తీర్థంబునకు నేతెంచిన యెల్లవారల పిలిచి సంబోధించి సావధానులై యాలకింపుఁడని శ్రీవేంకటేశ భగవానుఁడు సార్థకవచనంబు లిట్లుపలికెను. మీయందఱి పాపములు సర్వనాశమైనవి. మీయందఱికిని మీమీ మనంబులంగల వాంఛితముల నొసంగితిని. మీరవి పొందఁగలరు. మీయెల్లరకు, జీవితాంతమున ఈ తనువులు తొలంగిన పిదప యోగిజనులకుం గూడ దుర్లభమగు నామహల్లోకములభ్యము కాగలదు. కలియుగమున భరతవర్షమున మానవుడై పుట్టుట దుర్లభము, ఎంతయో పుణ్యమొనర్చినం గాని వేంకటాచలమునకుం బోఁగల్గుట యంతకంటెను దుర్లభము. అందునను నీపుణ్యదివసమున నీతుంబురుతీర్థమున స్నానంబొనర్పంగన్నవారు, దానంబులు పొనర్పంగన్నవారు నెంతయుం గృతార్థులు. ఇందున నిసుమంతయు సందియములేదు. ఇట్టులువచించి గరుడవాహనుఁడు శ్రీవేంకటేశుఁడు రమాసహితుఁడై వేంకటాచలమున విహరింపసాగెను. అట తుంబురు తీర్థమున స్నానమొనరించి దేవతలు ఋషులు మానవులు మొదలగు వెల్లరు శ్రీహరికి భగవానునకు నమస్కరించి ఆదేవు ముఖకమల దర్శన భాగ్యమున కానందించి యాతీర్థము నెంతయుఁ బ్రశంసించుచు మోదంబునఁ దమతమ తావులకుంబోయిరి.

## నారదశాపముచే తుంబురుడు ఘోణతీర్థముం జేరుట

శౌనకాది మహర్షులు సూతమహర్షింగాంచి యిట్లులనిరి. ఓ రౌమహర్షణీ, సర్వార్థవిజ్ఞాన విచక్షణా! మహామతే! మేమొక్క విషయముం దెలియమిమ్మడుగుచున్నాము. అద్దిమాకు వివరించి చెప్పమిరె తగుదురు. పూజ్యుడు తుంబురుడు నావేంకటాచలమున నాపుణ్యతీర్థమున నెట్టియుద్దేశముతో నెందులకై తపమొనరించెను? దాననాతండేమి ఫలమును బొందెను? ఆతండెందులకై ఘోణతీర్థమును దనపేరునఁ బ్రసిద్ధమొనరింప వలెనని దేవుం బ్రార్థించెను.?

ఇట్లులు తన్నడిగిన వారలకు సూతుండు శ్రీవేంకటేశునకు భక్తిని వందనమొనరించి యిట్లులనియెను. ఓ బ్రాహ్మణవరులారా, మునివతంసులారా! సర్వపాపముల సమయింపం జేయు పుణ్యగాధను నేను మీకుం జెప్పుచున్నాడను. సావధానచిత్తులై యానందమున నాలింపుడు.

నిర్మల నిశ్చలమనంబుల భగవంతుని శ్రీహరిని నెమ్మనంబులం దలంచుచుఁ దన్మయత వీణలవాయించుచు నొకప్పుడు నారదతుంబురు లాకాశమార్గంబునం బోవుచుండిరి. అట్టులాకాశ మార్గంబునంబోవుచు దేవర్షినారదుఁడు రత్నమణిఖచితమగు, సుందర సురమ్యమగు వీణంబట్టియున్న తుంబురుంగాంచి నెమ్మనంబున నెంతయు నబ్బురమంది యిట్లులడిగెను. ఓయీ! తుంబురా! నీయీవీణ నావీణకంటెనెంతయు నమితముగ శోభిల్లుచున్నది. ఏమికారణమున నిదియిట్టివింత శోభనందినది? ఇంతకుమున్నిది యింతగ శోభనందినదికాదే. అద్దినాకు నిజముగ వివరించి చెప్పవే. అనయాతనికి, దుంబురుండిట్టులనియెను. ఓనారదమునివరా! దేవర్షివర్యా! ఒకప్పుడు నేను ప్రాచీనబర్హిరాజవరుని వద్దకుం బోయి యాతనినెంతయు స్తుతించిపలికితిని. ఆరాజవరుండెంతయు బ్రసన్నుండై యీవిధముగ నీవీణను సంబద్ధముగ నొనరింపంజేసి నాకొసంగెను. అన్నయీపలుకు లాలకించినంతనె నారదుండెంతయుఁ గోపమంది మండిపడుచు నిట్లుపలికెను. ఓరీ అసాధూ! సజ్జననిందితా! నీవుమానవు సంస్తుతించి పాడితివే! కావుననీచుడా యికనీకు నాతోనుండ, చరింపనేమియు యోగ్యతలేదు. అట్టియర్హత నీయందు నాకేమియుఁ గనరాదు. ఎల్లలోకములకుం బ్రభువును గేశవును గాక నేనెందు నెప్పుడు నేమానవుని స్తుతింపంబోను. ఎల్లవిధముల నాశ్రీహరియె మనకత్యంత ప్రియతముఁడు. సంస్తవనీయుడు. మానవుని సంస్తుతించు నీకు నెన్నటికిని నాతో మైత్రిచేకూరదు. ఓరీనీచా! తలక్రిందుగఁ గ్రిందికింబడిపొమ్ము. ఇట్టులిక నీచేనేమియు నాకాశయానంబు సాధ్యమగునదికాదు. ఇట్టులానారదుండు పలికినంత నాతుంబురుండట్లె తలక్రిందుగఁ గ్రిందికిం బడుచుఁబడుచు శ్రీవేంకటాచల మధ్యమున నిర్మానుష్యమగు

సింహశార్దూలాది జంతుసంకులము, భీరుజనభయదాయిని యగు నొకభయంకర స్థానమునఁ బడిపోయెను. అట్టులతడటఁ బడియు నమ్రుఁడై యానందదాతను భగవాను శ్రీహరిని ధ్యానించుచు నేమియు వ్యధంబొందక, పరితాపముం దోపనీయక మెల్లఁగఁబోయి ఘోణతీర్థమును జేరెను. అచట నతఁడా ఘోణతీర్థముంగాంచి దెసలవలోకించి భగవంతునందు శ్రీహరియందు మనంబుజేర్చి ధీరమతియై యిట్టులు చింతించెను.

ఈ వేంకటాచలమునందు భగవంతుఁడు శ్రీహరి శ్రీవేంకటేశుఁడు కాకమఱొండు సమర్థుండుండజాలడు, ఉండబోడు, లేడు. కావుననన్నెల్ల విధముల నాభగవంతుఁడు వేంకటాధినాథుడె రక్షింపఁగలడు. నాకెల్ల విధముల శ్రీవేంకటనాధుండె గతి మఱొండులేఁడు. ఇట్టులు తలంచి యాతండు శంఖచక్రగదాధారిని శ్రీశుని శ్రీహరిని ధ్యానింపసాగెను. ఆతీర్థమున భక్తిపూర్వకముగ స్నానమొనరించి పూర్వాభిముఖముగఁ గూరుచుండి ప్రాణాయామశతం బొనరించి తుంబురుమహర్షి దేవుని ధ్యానంబున మునిగియుండెను.

పీతాంబరు, పీనభుజచతుష్కభుజాంతరాళస్థిత లక్ష్మీయుక్తు, ప్రసన్నవక్త్రు, పరమపురుషు, దయాప్రపూర్ణనేత్రు, కరుణాసముద్రు, శేషగరుడ విష్వక్సేనాది భక్తవరులచే ఋషివరులచే సంసేవితుఁడగువాని, దేవాధిదేవు, దైత్యాంతకు, చక్రహస్తు, సేవాపరులకు సులభ్యుండగు వాని శ్రీవేంకటశైలనాధుని హృదంబుజమున మనోహర మూర్తిగనుంచికొని బాగుగ ధ్యానించుచు సార్థంబగు గోవిందయను త్రయక్షర మంత్రమును జపించుచు వాయురహిత స్థానమందలి దీపమట్టులు చలనము లేక సుస్థిరముగ నుండెను.

## తుంబురు తపంబునకు మెచ్చిభగవంతుని ప్రత్యక్షము

ఇట్టులు తుంబురుఁ డొక్కసంవత్సరము నియమమూర్తియై తపమాచరించి నంతనట ఫాల్గునమాసమునఁ పౌర్ణమితిథియందునఁ బీతాంబరధారియు దివ్యసుగంధ మాల్యాలంకృతుండును, వివిధానేక రత్నమణిభూషణ భూషితుండునునై పున్నమినాటి నిండుచందురునట్టు శోభిలుచున్న ముఖముతో రాజీవసమనయనములతో సర్వలోకమాత లచ్చిని కలుముల జవరాలిని పెన్నురమునం దరించినవాఁడై శ్రీవేంకటగిరినాథుఁడు దివ్యమంగళవాద్యముల గిరికందరము లెల్లఁ బ్రతిధ్వనించుచుండ నాతనియెదుటఁ బ్రత్యక్షమైతోచెను. తోచి, యాతనింగాంచి ప్రేమవాక్కుల నిట్టులనియెను. వత్సాతుంబురా! ఇట నన్నుంజూడుము. నీకేమికావలయును? ఇట్టులనుచున్న యాదేవుని తుంబురు మహర్షి తన్మయతఁ గన్నులు మూతలువడుచుండ సాష్టాంగ నమస్కారము లొనర్చిలేచి నిలిచి కోర్కిని తన్మయతను దేవదేవుని దర్శించెను.

అద్దేవు నలుకెలకులఁ బరివేష్టించి సేవించుచున్న వారిని నవ్యయుననంతుని, గిరివరసదృశుగరుడుని, మహాప్రభావు విష్వక్సేనుని, దేవుపాదములందె చూపులిడిన ఋషిముఖ్యునగస్త్యుని, అంజలిబద్ధులై కనుచున్న ద్వైపాయనాది ఋషితల్లజాలను, సనకాదియోగిజనులను, వైఖానసముని ముఖ్యులను, శుకుని, దేవగంధర్వ సిద్ధులను, విశ్వావసుఁడాదియక్షులను గింపురుషుల, గిన్నరుల, సర్పనాయకులను గాంచెను. మఱియు హేదేవ, జగన్నాధ! జయము జయమ. హేసావధానమానసా, భక్తజనావనా జయము జయము. ఇట్టులు మేఘగంభీరధ్వనులఁబలుకుచున్న యాబ్రహ్మభువనమున నుండి యేనేతెంచియున్న వేత్రధారులను రక్షకగణములను, గన్నులనిండుగ, గనువిందుగఁ దుంబురుడు గాంచెను. అంతలో నందున్నవారలనెల్ల సంబోధించి దేవదేవుండు వేంకటేశుం డిట్టులనియెను. సర్వపాపమ్ముల నాశమొనరించు నెల్లశుభములు సమకూర్చు నీపావనతీర్థమున నిందున్న మీరెల్లరు శీఘ్రముగ స్నానమ్ములొనరింపుడు. ఇట్టులన్న దేవునాలించిన వారెల్లరు నప్పుడె భక్తిసంభరితులై సంకల్పయుక్తులై గోవింద, గోవిందయను త్ర్యక్షరిం బలుకుచు స్నానములొనరించి యొడ్డులెక్కిరి. శుద్ధహృదయుండు తుంబురుండును వారలతోఁ బాటుగ స్నానమొనరించి భగవంతుని సన్నిధికివచ్చెను. అచ్చటనున్న వారెల్లరు నెవరికి వారు వేరువేరుగ భగవంతుసంస్తుతు లొనరించిరి. ఓ దేవదేవా! సర్వజనహృదయవాసీ! సర్వలోకరక్షకా! శ్రీహరీ! మీకు జయమగుంగాత. భక్తజనపాలకా! ఆర్తజనరక్షకా! రణాగత జనుల దుఃఖములను దూరంబొనర్చునో ప్రభూ! లక్ష్మీమనోనాయకా! యనంతా! సాధుల, విజ్ఞానుల, బ్రాహ్మణుల, నెల్లజనుల రక్షించునో దేవా! మీకు జయము జయము. ఓ కృపాళూ! దయాసింధూ! లోకమునెల్లఁ బావనమొనర్పం బాలింపన్ వచ్చినదేవా! మీకుం జయముజయము. అనుచుండనప్పుడ దేవుగామితార్థప్రదు, సర్వేశు, శ్రీవేంకటేశుంగని తుంబురుండు.

వందనము వేంకటాద్రీశ వందనమ్ము
ప్రణతులేవేళ మాధవా! ప్రణతపాల
కైమొగిడ్చెదఁ గైకొమ్ము కమలనేత్ర
సర్వపాపహరా నతుల ల్పదయ హృదయ.

ఓదేవదేవా! రమాధవా! యుమాధవవినుతా! నాయందు నక్కటికపూనుము.

నాకీదివ్యతీర్థముయొక్క మాహాత్మ్యమాలింపఁ గోరికయగుచున్నది. వందనము, నీకు, జయమౌతవాసుదేవ అనుచున్న వాని వాలించిన భగవానుడు శ్రీశుఁడు కుంభసంభవు నగస్త్యుంగాంచి ఓ మహామతీ! నేడీయెల్లరకును శ్రీవేంకటాచలవైభవమును నీతీర్థ మాహాత్మ్యమును గొంతకొంత యెఱింగింపుము. అన్నదేవు నాలించిన యగస్త్యుండు వారలనెల్లరంగాంచి యిట్టులు పలికెను.

పూజ్యవరులారా! ఆలింపుడు. ఈ వేంకటాచలము పవిత్ర పుణ్యక్షేత్రంబులం దెల్లఁ బరమపవిత్రము, పుణ్యప్రదము. ఎల్ల పవిత్రతీర్థమ్ములు నిటకువచ్చియుండును. మనసులు మారిన పవిత్రహృదయులగు భక్తజనముల యపరాధములెల్ల నోర్చి దయామయుఁడు శ్రీవేంకటేశదేవుఁడు వారల రక్షించుచుండును. కావుననే యిదియెల్లరి సేవలనంద నెంతయుం దగియున్నది. ఇందునీదివ్యనగమ్మునఁ బావనక్షేత్రమ్మున నీతీర్థమున స్నానమొనర్చిన వారిపాపములెల్ల నిర్విశేషముగ హరించును, వారికిం గళ్యాణ సంసిద్ధియగును. ఇందునేమియు వేరుఁగఁదలంప వలసినదిలేదు. ఇట బంగారము వెండియన్నము తాంబూలము సుగంధములు సీతలజలములు నాదిగ దానములొనరించు మానవులు పవిత్రులై యెల్లకోర్కులుం బడయుదురు. పవిత్రమతులారా! దేవుంగొలువుడు. తరింపుడు.

ఇంతయును విన్నతుంబురుఁడు భగవానుంగమంగొని భక్తిని నమస్కరించి, ఓ దేవదేవా! పరమపురుషా! పవిత్రపాదా! భగవంతాదయఁగనుము. నాయెడంద యెల్లపుడు నీయందె లగ్నమై నిన్నె నుతించుచుండునట్లుగ నన్ను అనుగ్రహింపుము. మఱియు ఈతీర్థము నాపేరుననే ప్రసిద్ధమై వెలయునట్టు లనుగ్రహింపుము. అన్నవిన్న దేవుఁడును చిఱునవ్వు లొలయ నట్టులెయగుంగావుత మని తుంబురుంగాంచి మఱియు నిట్టులనియెను. ఓతుంబురా! నీవుపావనుండవైతివి. పవిత్రుండవగు నీవు నారదుతోడం గూడియుండి మత్కీర్తన లొనరించుచుండుము పొమ్ము. మరియు నెల్లరిదివినుడు. ఫాల్గునమాసమ్మున పున్నమిదినమున నిందు నీతీర్థమ్మున స్నానమ్ము లొనరించువారికి, దానాదులొసంగువారికి నేనీలోకమ్మునఁబరలోకమ్మున నెల్లయభీష్టములు నొసంగుదును. అనుచు దేవుడు మఱికానరాలేదు. ఇట్టులన్న భగవంతునాలించిన తుంబురుడాదిగ నెల్లవారును నెంతయుఁ బ్రసన్నచిత్తులై దేవునకు భక్తినమస్కరించుచు నెడందలం దలంచుచుఁ దమతమ తావులకుం బోయి సుఖంబుండిరి.

లక్ష్మీమనోనాధునకు మంగళము, సర్వమంగళనిధికి, మంగళకరునకు మంగళము. అర్థిజనమంగళకరునకు, వేంకటగిరివాసునకు మంగళము. శ్రీనివాసునకు మంగళము:

శ్రీశునకు మంగళము వేంకటేశునకును
నిధికి కళ్యాణనిధికిని నిత్యజయము
అర్థిజనకల్పకమునకనంతునకును
ప్రేమమూర్తికి నంజలుల్ ప్రియతమునకు.

## దేవశర్మకథ :

శౌనకాది మహర్షులు సూతమహర్షిం గాంచి యిట్లులనిరి. శ్రీనివాసదేవు ననుగ్రహమున, సర్వదామంగళైశ్వర్యము లొసంగు శ్రీవేంకటేశ మాహాత్మ్యమును మీరెంతయు ననుకంపమాకుం జెప్పివినిచితిరి. ఆదేవుని దివ్యగాథలింకను వినమాకుఁ గతూహలముగనెయున్నది. లక్ష్మీపతి శ్రీనివాసుఁడెవ్విధమునఁ బ్రసన్నుండై సర్వదా సర్వవిధముల మాకువాంఛితఫలంబు లొసంగుచునుండంగలడు, దయామతిన్మాకుం దర్శనసుఖంబులొసంగి తనియింపం గలండు? ఓదయామతీ! శ్రీ వేంకటేశదేవుని ప్రేమకథ యమృతాధిక మధురమగు దానివిధము మాకు వినిపింపవే. సర్వతత్త్వజ్ఞా! భగవన్ రౌమహర్షణీ! మేమెంతయు మీయనుగ్రహమునకుం బాత్రులము. అన్నవారలంగని సూతుండిట్లనియె.

ఓమునివరులారా! సావధానమతులై యాలింపుడు. మీరడిగిన యర్థంబును, దివ్యమంగళగాధను మీకున్వినుతును. ఈ బ్రహ్మాండమందెచ్చటను శ్రీవేంకటచలమునకు నీడగు పుణ్యక్షేత్రము పావనస్థానంబు మఱొండులేదు. శ్రీనివాసునకు, వేంకటేశునకు సముఁడగు దేవుండులేడు, కలుగఁబోడు. దేవుఁడొక్కండె శ్రీహరికేశవుండు. అద్దేవుని యద్భుతమ్ములు చరిత్ర లెవ్వండు వర్ణించిచెప్పంగలండు? అయినను, తరింపంజేయుఁ బాపంబులెల్ల హరింపంజేయు, పున్నెమును బెంపొందించు, చిత్రాతిచిత్రమగు, దేవర్ష్యాదులచే నాదరింపంబడు, సంకీర్తితంబగు, లోకోత్తరము, సర్వాశ్చర్యమయము, సర్వసిద్ధిదమగు దేవుని దివ్యగాథ నాకుంజేతనైనంతగ మీకు వివరించిచెప్పెదను. శేషాచలమున గలిగిన యట్టి యామాహాత్మ్యమింతయు మఱొండు క్షేత్రమునం గానరాదు. అందున్నదేవు శ్రీనివాసుని మహిమయు ననుపమము, మంగళమయము. మనోహరము, సుశ్రావ్యమునగు నిహమున, పరమున సర్వాభీష్టదాయకమగు, విశేషజ్ఞానప్రదము, మహదైశ్వర్యకారణమునగును. శ్రీవేంకటేశుని యమృతగాధ వేదములందునఁ బురాణములందున, నితిహాసములందున, భారతాదులనెంతయు నింపుగ వర్ణితమై యున్నది. అర్థిభక్తివైరాగ్యాది సత్త్వగుణముల నొసంగును; ఇంద్రియముల వశమొనరించి కొనం దోడుపడును. అపవిత్రక్షేత్రమున, నపవిత్ర దోషమునకుం దావులేదు కావున శ్రీవేంకటేశదేవుని పవిత్రోత్తమ నైవేద్యమును, ప్రసాదమును గ్రహింపందగును. దానవారలకు, వారిపరివారములకు నెంతయు క్షేమమగును. దానింగ్రహింపకుండుట యెంతయు నమంగళము.

అద్దేవవరేణ్యుండు, సృష్టిస్థితి సంహారకారకుండు సత్వరజస్తమసాది గుణములనొందియు నంటనివాడు, అనుపముడాద్యంత రహితుఁడు, ననిర్వాచ్యుఁడు, సజ్జనులకేకమాత్రాశయుఁడు, దేవవరేణ్యుఁడు. లక్ష్మీసమేతు నావేంకటేశ దేవునిత్యము. హిరణ్యాగర్భాహిభూషణులు, శేషగరుడేంద్రాదులు మౌనివరులు భక్తితత్పరులై పూజింతురు. చరాచరగురుఁడు, సర్వసాక్షి, మహేశ్వరుఁడు, దేవాదిదేవుఁడు శ్రీహరి యెల్లరికి జపించి తపించుటకు స్మరించుటకు యోగ్యుడు. అద్దేవునందె మనసులగ్నమొనరించి వానియందె ప్రాణంబులర్పించి, భక్తితత్పరులై తన్నామస్మరణం బొనరింపుఁడు. అనేకానేకగోదానములు, అశ్వమేధాదియజ్ఞములు, అసంఖ్యములు కన్యాదానములు, పెక్కులు మేరుతుల్య సువర్ణదానములు మఱియు మఱియుం బెక్కు లితరములు పవిత్రదానంబులన్నియుం గలిసియు నాదేవు నామస్మరణ పుణ్యమునకుం దుల్యములు కాఁజాలవు. మీరడిగిన దానికిందగునది, వినినంతన భగవంతుని పాదపద్మముల నవిరళనిశ్చల నిర్మలభక్తియొదవి యుప్పొంగునట్టి దివ్యయితిహాసంబొండు. మీకిప్పుడు వినుతును మనసుంచి యాలింపుడు.

వాయువునకుం బ్రియశిష్యుండు జితేంద్రియుండు విష్ణుదేవున కనన్యభక్తుండు దేవశర్మయనునాతండొకరుండుండెను. ఆతఁడెల్లపుడు శ్రీనివాసదేవునె చింతించుచు గడునిష్ఠను దపోనిరతుఁడై యుండెను. ఆతఁడు విషయములందున విరాగియై, మమతాహంకార శూన్యుఁడును, షట్చత్రువిజయియు, శాంతచిత్తుఁడునై యుండెను. దారిద్ర్యముచేఁ కడుంగడు పీడితుఁడయ్యుఁ గామక్రోధాదుల వేగమునణంచి, కుటుంబమున మనసును జిక్కువడనీక విరాగియై దైవచింతనమున ధన్యుండైన యాతని యర్ధాంగి నిత్యదారిద్ర్య ప్రపీడిత వానిగాంచి యిట్లనియెను.

పతిదేవా! ప్రాణనాథా! కరుణామయా! స్వామీ! యనుగ్రహింపుడు. తమయీబిడ్డలు చిఱుతపాపలాకలి మంటలఁ గడుంగడు పీడితులై వెతనందుచున్నవారు. ఈయడవులం దిరిగి కందమూలములం గొనితెచ్చి వీరిక్షుద్బాధనణంప నేనేమియు సమర్థురాలను కాకున్నాను. ఈచిన్నిబిడ్డల పాలనపోషణ నొనరింప నాకువేరురక్షకులేరునగానరాకున్నవారు. ఓదేవ! కరుణామయా! నాయందున, నీ పసికందులందున నింత కనికరముం జూపుడు. నాయీప్రార్థన మాలింపుము.మనకులస్వామి, యిష్టదైవము, జగద్రక్షణ దీక్షితుఁడు, శరణాగత సంత్రాణుఁడు, శ్రీనివాసదేవుఁడు, సజ్జనులకుం గతి, భక్తవత్సలు డెందఱెందఱో భక్తులం గాపాడిపాలించినవాఁడు. ఆ లక్ష్మీమనోనాయకు పాదపద్మముల శరణమంది ప్రార్థింపుడు. దాననాదేవుండెంతయుం బ్రసన్నుండగును, మనయెల్లరి జీవితయాత్రయు సుగమమగును. ఓ దయానిధీ! ప్రసన్నులగుడు, కనికరముం జూపుడు. కరుణాసింధూ! కనికరింపుడు, కరుణింపుడు. ఇట్టులత్యంత దీనురాలగు నిజసతీమణిచే నిల్లాలిచే రాత్రింబవళ్లు సతముఁ బ్రార్థితుండయ్యు నాతఁడు తనతపమునందెక్కడ విఘ్నము

బాధవాటిల్లునోయను వెఱపున నావిషయమేమియు మనసునఁ బట్టింపకుండెను. పతిసేవాపరాయణురాలగు నాపతివ్రతయందునను, దీనులగు నాబిడ్డలందునను గడుంగడు జాలిగొని ప్రసన్నమతి నాతని గురుఁడు దయామతి వాయుదేవుఁడు వారిభాగ్య వశమున నయ్యెడకు నరుగుదెంచెను. తనతపోవసానమున వచ్చిన గురువరుంగాంచి దేవశర్మయానందమున లేచి సాష్టాంగనమస్కారము లొనరించి లేచి గురునెదుటఁజేతులు జోడించి నిలిచియుండెను. అప్పుడు గురుఁడు వాయువుశిష్యవరుంగని మధురవాక్కుల నిట్లనియెను. ఓయీ దేవశర్మా! శ్రీమద్వేంకటేశ దేవుందర్శింప యాత్రకుఁ దొందరగ బయలువెడలుము ఆలసింపకుము. ఆదేవుకరుణను మీయభిలాష లెల్ల నిహపరములఁ బరిపూర్ణముగ సిద్ధించును. వేరొక్కతెఱంగునం గాఁబోదు. ఇందిరానాధుఁడు దయాసముద్రుఁడు. బ్రహ్మాదిదేవులకును వరంబులొసంగంగల యాదేవుయాత్రోత్సవమున నేమియు శంకలిడకుము. భక్తియుక్తి, తత్పరమతివై, వేగముగ బయల్వెడలుము. ఇట్టులు గురుదేవుడు వాయువుచేఁ బ్రేరితుఁడై మాటిమాటికిం జెప్పఁబడిన యాతడు గురుదేవుని పలుకుల నత్యంతము భక్తిశ్రద్ధల నాశక్తిగలయాతఁడు విష్ణుదేవు యాత్రయందమితమగు నాదరాసక్తులు గలవాఁడాయెను. గురుబోదను దలందాలిచి యాతఁడు "గురూపదేశ మెంతయు బలవంతము, గురునానతినేమియు నుల్లంఘింపరాదు అనుచుఁ బరిపరి విధముల మనమున నూహించుచుఁ బయనమై శేషాచలమునకుం బోయి చేరెను. శ్రీవేంకటేశదేవుని దర్శనమునం దెంతయు నాదరముకలిగియున్న యాతఁడట నానందనిలయమున నానందజ్ఞానము లొసంగు నానందమయునామకు శ్రీహరిని శ్రీమహావిష్ణువును నానందపూర్వకముగ దర్శించెను. పెక్కువిధముల నిచ్చావిహారములు సలుపుచు లీలావినోదములు, విలాసములు నొనర్చుచు దర్శించిన మాత్రన భక్తజనుల యందునఁ బ్రసన్నుండగు నాదేవుమందమందస్మితాననను శ్రీవేంకటేశుం గాంచి ప్రణామమొనరించి యిట్లుసంస్తుతులొనరింపంసాగెను.

ఓదయానిధి! వేంకటేశా! వందనంబులివె. ప్రేమమూర్తీ శ్రీనివాసా ప్రణతు లందుమయా. ఇవి నమస్కృతులబ్జనాభా! యబ్జనేత్ర పరాత్పరా!! పాలితామరపద్మ జేశేంద్రవందిత పద్మామనోహరా!ప్రణతులు, వందనాల్పద్మచరణ. సర్వాంతర్యామి, సర్వహృత్పద్మ సంస్థితా! పద్మమాలీ, పద్మహస్తా! పద్మాభయదాతా! వందనశతమ్ము నతులు, నమస్కృతుల్వినతులు, సుందరత్వత్పద పద్మయుగళమునకు దేవదేవ! త్రివిక్రమా! నీపదపద్మ మాహాత్మ్యమతులమనంతము. త్వత్పదకనిష్ఠాంగులినఖాగ్ర మాహాత్మ్యమేనియు వర్ణనకందదు; అనిర్వచనీయము. లక్ష్మీకలుముల జవరాలా యనంతగుణములు గాంచుచు సంస్తుతులొనరింపం గోరికపడి క్షణము లోననె హర్షానంద గంభీర మహాసముద్రమ్మున మున్గితన్మయమై పోవుచున్నది. పుత్రప్రేమను నీచేఁ బ్రబోధితుడైన స్రష్టప్రజాపతి త్వద్గుణములనెన్నంబూని యత్యంతానందము

నొందుచున్నాడు. కాని యింతదనుక నాతడొనర్చు నావర్ణన మసంపూర్ణమే. ఇంతయుఁ గాలేదన్నఁ బూర్తియెన్నడో? ఎల్లవేదార్థములనెఱింగిన యనంతుఁడు వేయిముఖములవాఁడు శేషుఁడుగూడ దేవునఖాగ్ర మాహాత్మ్యమును మహద్గుణములను, వైభవమును, నేనింతయుఁ గాంచి గ్రహించివచింపఁజాలకున్నానే యనితలచుచున్నాడు.

అనంతములగు వేదములు తమలోఁ దామెంతయు విచారించియునిట్లు చెప్పుచున్నవి. శ్రీశుభగవంతు, విష్ణుదేవుననుమతి, నద్దేవునధికారమునకు లోనై బ్రహ్మాదులు వారివారి యాయాపదవుల నధికారముల నియుక్తులై యున్నవారు. క్రమమున సత్యాదిలోకములఁ దమతమ యధికారముల నిమగ్నులై యుండి యాదేవతలెల్లరు తమతమ యభీష్టముల నుపభోగించుచు నత్యంతాదరమున శేషాచల నివాసిని శ్రీశు భగవాను భజించుచు నున్నవారు. అనంత వేదములము మేము శేషాచలాధీశు లక్ష్మీమనోహరు శ్రీహరియొక్క గుణానుభావమును స్తుతించుటకే నియోగింపఁబడితిమి. పరమాత్మ గుణములాయనంతములు. ఎల్లవేదములము మేమెంతయుం గలసియు నాదేవు చరణాంగుళినఖాగ్రవర్ణనముననుఁ మాహాత్మ్యమును, గుణగణములను వర్ణించుటలో నించుక సమర్థులమైతిమేమో? కావుననే వేదములము మేమనంతములమని కొనియాడఁ బడుచుంటిమి. అనంతములుగ నొనరింపఁబడితిమి. ఇవి వేదవాక్కులు. ఇట్లుగ నావేదములు దేవుమాహాత్మ్యమును సమగ్రముగ నెఱుంగకుండియు, నాగుణముల; నేకాంశమునె గ్రహించి స్తుతియింపందొడఁగినవి. ఆయేక గుణాంశస్తుతియే పెరిగి పెరిగి యనంతముకాగానది గాంచియవి తమలో దామిట్లులనుకొనినవి. మనమేకగుణమునె గ్రహింతము, స్తుతింతము, మిగిలిన వానిజోలి మనకేల? వానినీడుదము. ఇట్లులు నిశ్చయించుకొని యవి వానిమహాదేవ గుణముంగొని గుణానువాదమొనర్ప నదియు ననంతమాయెను. ఇట్లులొక్కొక్క గుణానువాదమొనరించుచునే వేదమనంతములాయెను. సూర్యుని కిరణములట్లుల దేవుగుణములనంతములు, తేజోవంతములు, నెల్లదిక్కుల నగణనీయములై ననంతములునై యున్నంగని యావేదము లిట్లులూహించినవి. ఇవ్వియనంతము, లనంతశుభప్రదములు. మనకంటె నెంతెంతయో మించి పెఱిగియున్న యాగుణగణములఁ గాంచను, వినను కీర్తింపను, గ్రహింపగూడ మనమసమర్థులము. ఇంకవీని, నీదేవుగుణముల వర్ణనమొనరించుట యననేమి? మనమల్పతత్త్వజ్ఞులము. మనమీయనంతతత్త్వము నేమి వర్ణింతుము? అధికముగా నాత్మప్రశంసకుందొరకొనుట వ్యర్థము. అనియిట్లులను కొనుచునావేదములు తమ తమ మనసుననుసరించి శక్త్యను సారము భగవద్గుణ వర్ణన మొనరింపసాగెను. ఎట్లులెంత యొనరించియు నొకయింతయె యనంతగుణముల యేకదైశిక గుణాంశవర్ణనమె చేయఁబడిన దాయెను. అంతియకాని

బహుదంశముల వర్ణన మనునది పరిపూర్ణ వర్ణనమనునది కలలోని వార్తయు. ఇట్టులనే ఓదేవదేవా! లక్ష్మి, బ్రహ్మ, శేషుఁడు, వేదవిదులాదిగ నెల్లరనేరును దమగుణముల బూర్తిననుభవముంబొందఁజాలక యేయున్నారు. ఓదేవదేవ తమయనంత గుణముల మాహాత్మ్య మనంతము నత్యద్భుతము. - ఓం తత్సత్

దేవశర్మ దేవదేవునకభిముఖుడై యిట్టులనియెను. ఓయనంతదివ్యమూర్తీ! మీ దివ్యమూర్తి యవ్యక్తము నభివ్యక్తము సౌందర్యవంతము నయ్యు మీచరణకమలముల యద్భుత సౌందర్యమును వర్ణింప సంప్రేరితుండనై నేను నాయీ బుద్ధి ననుసరించియే యభివర్ణించుచున్నాడను. తమహృదయ పద్మమున నెలవుకొనియున్నదయ్యును లోకమాత సౌందర్యమూర్తి లక్ష్మీదేవి మీపదపద్మముల సౌందర్యముంగాంచి సమ్మోహింతురాలై, యాశ్చర్యచకితయై, మఱియు మఱియుంగాంచ నభిలషించి తనయారెండు కండ్లతోఁ గాంచ శక్యమగునది కాదని మూడు రూపంబులం బూనినదాయెను. మీకుంగుడివైపున లక్ష్మీదేవిగను, నెడమవైపున ధరణీ తరుణీమణిగను, పెన్నురమున నీలగను రూపంది చేరిసేవించుచు నిరుమూఁడు కన్నుల నేకాగ్రతమనసుంచి కాంచుచు రేబవళ్లు త్వత్సౌందర్యామృత రసమును గ్రోలుచున్నదయ్యునింత దనుక నామెయా సౌందర్యపిపాసా నివృత్తురాలుకాలేక పోయెను, కాలేకపోవుచున్నది.

ఓదేవాదిదేవా! దివ్యప్రభావా! సుందరా! శ్రీనివాసా! తమనాభికమలమునం గూర్చుండియున్న నలువ తమ చరణాంబుజమ్ముల యందంబునందుననే మనసుంచి తనయెన్మిదినేత్రముల రాత్రిందివములు గాంచుచుఁ దనివి నందఁజాలక, తనయాయెన్మిది నయనములేమియుం జేయఁజాలవని యెంచి, తమకంఠమునఁ గౌస్తుభముగను, నాభిని గమలాసనుఁడుగను, సత్యలోకమునమేరుగిరిగి వైకుంఠాదిముల్లోకముల నెల్లయెడల ననేకానేకములనంతములు రూపములు దాల్చియున్నవాడై యమృతరసమాధుర్యమును గూడఁగ్రిందుచేయుతమ చరణకమల సౌందర్యమధువును గ్రోలుచున్నాఁడు. రాత్రింబవళ్లు యుగయుగములారస మాధుర్యపానమున సుఖభోగము నందుచున్న యాతమ్మిచూలికి మీయీ సౌందర్యపిపాస తీరలేదు. ఇంతదనుక శాంతుఁడు కాకున్నవాఁడు. ఇట్టిదోదేవా! మీపదకమలముల యందము.

తానెమీకు శయ్యగా, ఛత్రంబుగా, నాసనమ్ముగానై యోదేవ మీసేవలొనరించు వేయికన్దోయిలు గల, యేవేళ మీయంతిపురముననే మీసన్నిధినె వసించి సేవలొనరించు శేషుండు తనమనంబున నిట్టులు తలఁబోయుచున్నవాడు. నాసామియొక్క యీసౌందర్యము కడునబ్బురము, కడుమనోహరము, మున్నెన్నడుం గాంచినదికాదు ఇదియత్యంత విలక్షణము. ఆహాహా రూపమిదియెంతయుఁ జూడనొప్పినదై యెల్లలోకముల

మోహమున ముంచుచు నామోహముననె ముగ్ధముగనొనర్చునదిగనున్నది. భగవదనుగ్రహమున నాకెన్నియో నేత్రములబ్బినవి. నానివాసము కూడ నీభగవంతు చెంగటనే. ఇదియంతయు నాభాగ్యమే. ఇట్టులెంతయునుత్సుకతం గూడియుండి శ్రీనివాసదేవున కెంతయు ప్రియతముడైన శేషుండు రెండువేల నాల్కలవాడు తలంచుచుఁ దన సహస్ర నేత్రయుగంబుల లక్ష్మీపతి యొక్క చరణాబ్జముల యత్యంతాద్భుత సౌందర్యము మఱిమఱి కాంచుచు నానందసాగరమునమునుకలిడుచు మఱియు మనమ్మున నిట్టులు తలపోయసాగెను. నాప్రభువు యొక్క యీచరణాంబుజమ్ముల నంటిపెట్టికొనియే యేనెల్లపుడు వసింతును. విష్ణుదేవుని యడుగుదమ్ములను విడిచి నేను వైకుంఠమున కేనిపోజాలను. నాదేవుని యీచరణ సరోజమ్ములం జూచుచుండ నాకుందొరుకుచున్నట్టి యీమహదానందము వైకుంఠముననను గైవల్యముననను మఱెందున జేపడునదికాదు. దేవుని చరణమూలంబు లెందున్ననందుననే నావాసము. అద్ది పాతాళమేయౌగాక, వైకుంఠమేయగుత. ఇట్టులె నిశ్చయించికొనినవాఁడై నాగేంద్రుఁడు పరమపాద సౌందర్యమోహితుఁడిందిరా రమణుపాదమూలము లెందెందుఁ బ్రవర్తిల్లు నందంద తానుండి యాసౌందర్యామృతమును బానముచేయువాఁడాయెను.

లోకకళ్యాణకరుఁడు మంగళమూర్తి శంకరుఁడు సాంబశివుఁడు తనమనమ్మున నిట్లని తలపోసెను. శ్రీవేంకటేశునను కంపనందిన యాదిశేషుని యదృష్టమె యదృష్టము. ఆదేవుచరణ సౌందర్యముంగాంచి సేవింపఁదనియ నాతనికి నెన్నెన్నియొ నేత్రములు కలవు. అయ్యయ్యో మఱినాకోమూఁడే మూఁడు కన్నులు. కావుననే నాకాదేవు సంపూర్ణసౌందర్యముం గాంచి యానందింపగాకున్నది. ఇది నాకెంతయు దుఃఖభాజన మగుచున్నది. ముందు జన్మమున శేషుఁడనై పుట్టనేతపమ్మొనరింతును. మహత్తపం బొనరింతును. అనుచు నెంతయు విరాగియై శివుడు మహేశుఁడు కైలాసమునకుం బోయి తాపసియై వసించుచుండెను.

ఓ వేంకటేశ శ్రీశ సంకట హరహరి వేయికన్నులవాఁ డింద్రుండు మీముఖ కమలమున నుండియె యుద్భవించి మీచరణకమలముల యబ్బురంపుటందమ్మును దన కనుదమ్ములంగాంచుచు నిట్టులు చింతించెను. అజ్జారే! యేమి, దేవుని యీసౌందర్యరసము తొల్లియమృతముం ద్రావినపుడును నాకిట్టి యతులనీయమగు సుఖము సంప్రాప్తము కాలేదు. ఈ సౌందర్యమింకను నమితము. చెంతలనుంటచే బాగుగ నాకుంగానవచ్చుట లేదు. ఇంతకుం గొంతదూరమ్మున నేనుండఁగన్న నింతకన్నను మిక్కుటమగు నానందమును నేబొందఁగల్గుదును. కావున, నేనిప్పుడ స్వర్గమునకుం బోయి నిర్నిమేషనయనుండనై రాత్రిందివములు దేవుందర్శించుచు నుండఁగలవాఁడను.

తనివిదీరువరకు నటనుండి దర్శింతును. దేవుననుచు నటనుండి తనస్వర్గధామమునకుం బోయెను. అటకుం బోయి తనవేయి కన్నులతో నోదేవ మీపాద సౌందర్యామృతముం గ్రోలుచునింత దనుక సంతృప్తిని, దనివిని పొందలేనివాఁడాయెను. కావుననే వానియునికి యటస్వర్గముననే యుండిపోయెను.

ఓ శ్రీనివాసా! లక్ష్మీ మనోహరా! మీపాదపద్మ సౌందర్యమును వర్ణింపదేవులం దెల్లఁ బెద్దలగు వారికిని నిట్టులు కడుకష్టము కాగా నిక నన్యుల విషయమును జెప్ప పనెందులకు? ఓవిష్ణుదేవా! మీపాదరేఖ యొక్కటియె తనమాహాత్మ్యమున లోకమ్ముల నెల్లంబావన మొనరింపంగలదు. ఓదేవనేనిదె మిమ్ము మతిమతి ప్రార్థించుచున్నవాఁడను. నాయపరాధములను క్షమింపుడు. ఓ భక్తవత్సలా! మీచరణాంబుజంబుల మాహాత్మ్యము నాలించు భక్తజనుల యజ్ఞానాంధకారమును నాశమొనరించి జ్ఞానకాంతుల వ్యాపింపఁజేసి వారికిందిన్నని తెన్నును జూపనే మీరు మీచరణములఁ జక్రరేఖను ధరించియున్నారు. పాదమాహాత్మ్యము నాదరించి, సమ్ముదమందు వారికి సాంగచతుర్వేదముల నితిహాసముల నుపనిషదాత్మక మంత్రములఁ బురాణముల నెల్లసద్విద్యల నొసంగనెంచి యదితెలుపనె మీరు శంఖరేఖను జరణమ్ముల ధరించియున్నవారు. తమపద పద్మమ్ముమాహాత్మ్యమును సతతము ధ్యానించువారలకు నెప్పు డుపద్రవము లొనరించు దుష్టులను, దైత్యులను రాక్షసులను పిశాచములను కూష్మాండులను బ్రహ్మరాక్షసులనిత్యాదుల నెల్లర మర్దింపఁ దలంచియె యదిసూచించుచు మీరు మీపదపద్మముల గదారేఖను ధరించియున్నారు. మత్పాదమాహాత్మ్యము నెంచి తలంచి చెప్పువారల సన్మందిరముల నిల్లాలు పద్మతో, పద్మజాడు పుత్రునితో సకుటుంబుఁడనై పద్మనాభుఁడనే వసింతునని సూచించుచు నోదేవా! పద్మేశా! పదపద్మముల పద్మరేఖను ధరించియున్న వారుగదె, హే పరమాత్మా! పరమపురుషా! పరంధామా! మీపదసరోజముల విరజా, మానససరోవరము, దనుష్కోటి, మహాగయా గంగా, మున్నగు సర్వప్రసిద్ధ పవిత్రతీర్థంబు లెన్నేని విరాజిల్లుచున్నవి. అందున సహస్రపత్ర సరోజములాదిగ పలుపుష్పములు నిత్యము నుత్పన్నములగు చుండును. అద్దిసూచించుచునె యడుగుదమ్ములనంబుజ రేఖను దమరుధరించి యున్నవారు. మాధవా! తమయెడందం దమ్మినినివసించుచున్నదయ్యు పద్మాదేవిలోకమాత తమపాద పద్మమ్ముల యపూర్వాద్భుతాలౌకిక సౌందర్యమునుఁ దనకనుదమ్ములఁ గాంచికాంచి ముగ్ధురాలగుచున్నది, యెంతకుం దనివినందఁ జాలకయున్నది. వేదములందెల్లం జెప్పఁబడినవాని యామాహాత్మ్యమును దనహృత్పద్మమ్మునఁ దలఁచి తలఁచి వాని దనకరకమలమ్ములం బట్టి యెత్తి తనయెడందతమ్మిని హత్తుకొనియున్నది. అదియె సూచించుచున్నదో దేవ, నీపదపద్మముల పద్మరేఖ మీరు మీచరణకమలముల

మాహాత్మ్యమును దమచేతుల స్వయముగ లిఖించి చదివి తనియుమద్భక్తుల మహాపాపములన్నియు సమూలముగ నాశమొనరించి తరింపఁజేతునని చెప్పుటకే! తమరు తమయరికాళ్లను వజ్రరేఖనొప్పుగఁ బూనియున్నవారు. మాహాత్మ్యము నెఱింగి చరణకమలములం బూజించి భక్తవరులయొక్క కామాది శత్రురూపీదుర్దమ మత్తేభములను బాగుగ మర్దించి యణంతునని సూచించుచున్నది. తమచరణమందలి యంకుశరేఖ దేవదేవ! మహాదేవ, దివ్యమూర్తి, కృపానిధే, ఆదరమ్మున నాకథలాలకించి తనియు నాభక్తులనెల్ల నీధ్వజమ్ములట్టులనె సర్వోన్నతుల నొనర్చియుంతునని సూచించుటకే మీరు మీపదతలమున ధ్వజరేఖను బూనియున్నవారు. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అహంకారము, మహత్తత్త్వము, సత్త్వము రజస్సు, తమము నను నీదశవిధ గుణములచేఁ గ్రమముగ నావృతమైయున్న యీయఖండ బ్రహ్మాండములు దేవునియే చరణనఖాగ్రమున నుండి యుద్భవించెనో యాదివ్యాద్భుత పాదముల మాహాత్మ్యము నెవ్వరు వర్ణింపంగలరు? శేషుఁడు మహత్తపంబు నొనరించి, లోకేశ్వరు మిమ్ముభక్తి నారాధించి మీయనుగ్రహమున దుర్లభమగు మహాభాగ్యమును బొందఁగలిగెను. మీకు శయ్యగ, నాసనముగ, పాదుకగ, నాతపత్రముగనై యద్భుతానందమును బొందుచున్న వాఁడు.

ఆదిశేషుఁడనంతుఁడు తాఁబొందుచున్న యాసౌఖ్యానందములంగాంచి రమాదేవినై కుంఠుచతుర్భుజా హృదయాబ్జవాసయై యానందించుచున్న దయ్యును మనమున నిట్టులు తలపోసెను. మత్పతిదేవు నంగసంగతిచే నొదవుసౌఖ్యమును బ్రమోదభాగ్యమును నేనెపొందుదును. పాదపీఠంబుగా, నాతపత్రంబుగానై, దర్శన స్పర్శనంబుల నానంద సౌఖ్యములనేనెఁ బొందుదును. దానినేనేలవిడనాడుకొనవలయును? వైకుంఠాది పదునాల్గు భువనముల, నెల్లబ్రహ్మాండములనేకైక మూర్తియై లోనబయటఁ దానయై యెల్లరి హృత్కమలముల నాదగునెడందఁ దమ్మి నెల్లవేళల నెల్లయెడలవసించి వినోదించుచునె యున్నవాఁడు. అద్దేవునిసేవలనేనెంతయుం దనియంగలనని యెంచినదాలోకమాత. అట్లెంచి, మంచిపరిమెళముల మందముగఁజరించు పిల్లతెమ్మెరల కలిమిని నొప్పియున్న, విరిసినపూలనూగులాడు మల్లికాకేతకీజాతి, చంపక పారిజాతములచే నొప్పు నుద్యానములుగ, ఫలభరితములగు ఖర్జూర, పనస, ద్రాక్షకదళీనారికేళములచే బదరీ మాతులుంగకపిత్థచూత దాడిమలచే, జంబూజంబీరక్రముకాది వృక్షములచే, శ్రీచందనేక్షుమందారములచే నిత్యపుష్పఫలభరిత కల్పకములచే మనోహరములై యొప్పుచున్న సుందరోద్యానములుగ, మహద్వనములుగ, నందందుఁ దనరారుచున్న, స్వచ్ఛమధురజలముల నొప్పి, సుందరసోపానమండితములై నవరత్నాభ కమలములచే, సువర్ణాభములు కుశేశయములచే, రంగురంగులనందాల కలువలచే నొప్పుచు,

మధుమత్తమధుకరముల ఝుంకారసంకులములగు సరోవరముల సుందరాలంకృత రత్నమయ క్రీడామండపముల నంతయుఁ దనయై సౌందర్యలక్ష్మి యలరారుచున్నది. లీలావినోద విహారములు సలుపు విభునడుగుదమ్ములంటి యానందించుచున్నదై, తలనిడలొనంగుచుఁ దనియుచున్నది. అచటలోకమాతయిందిర పరమపురుష, పరదమిమ్ము నర్పింపంబూని, షోడశోపచారములఁ బూజింపసాగినది. పాయసములు, అన్నములు, కూరలాదిగఁ బంచభక్ష్యములు, అమృతతుల్యంబులు, నూతనములు, పరిపక్వములుఁ, బహువిధముల రుచికరములు నగు ఫలములు, ఆర్ద్రకాదులు, హితకరములు మూలములు, స్వర్ణపాత్రముల నుంచి నిత్యతృప్తులకుఁ బూర్ణకాములకు దేవరను మీకు నాదరమున నర్పించి పూజించుచున్నది. అంతటితోఁ దృప్తినందఁ జాలక [illegible] తానె బంగారు గొలుసులనూగుచు నందమై సువిశాలమై సులక్షణమై నవచాలకోళ్ల సువర్ణమయ వజ్రంబులపట్టియలు, మాణిక్యముల ముత్తియముల జాలరులు కలిగి మనోహరమగు నుయ్యెలగా, ధరణీరూపము నొంది పానుపుగా, శ్రీమూర్తిని తలపడగ నీలారూపమున సేవికగనై భోగసాధనము తాంబూలము, బంగరుచేనైన పానకట్ట, విద్యుత్కాంతుల వెలుగొందు చామరము, వైడూర్య ఝాలరుల నొప్పుఛత్రము, రత్నమయములు పాదుకలు, నిత్యాది రాజోపయుక్తములు, రాజార్హములు, ఆనందప్రదములు, తేజోవంతులు, నగునెల్లవస్తువులు తానయ్యెలోకేశుని దేవదేవుని, పతిదేవుని మిమ్ము సర్వవిధముల నన్నిరూపులునంది సేవించుచు నిరుపమానందమును, అవ్యక్తానిర్వాచ్య సుఖమునందుచు, నాయంబయానందించుచు, నానె ధన్యురాలనని తలంచి తనియుచున్నది. ఎల్లభోగ్య వస్తువుల రూపమున మిమ్ము సేవింపం గోరిక, నందియున్న, యామంగళదేవత రమారమణి మహానందసాగరమున మునుగుచు, దేలుచు నోలలాడుచు మిమ్ముంగూడి వినోదించుచున్నది. వైకుంఠాది పరమధామముల నిజాసనమున నుండి బ్రహ్మాది దేవతలచే దశదిక్పాలురచే నన్యామరాధిపులచే, ఋషిముని తాపసులచే నెల్ల విధముల సేవింపఁబడుచు మీరు లక్ష్మీమాతతోఁ గూడి వినోదించు చున్నారు. ఓ శ్రీనివాసా! లక్ష్మీమనోహరా! మీనాభికమలమున బ్రహ్మయునంతఃకరణమున శంకరుండును, నవయవమ్ముల నింద్రాదిదేవతలు ఋషిమునిగణములాదిగ నాలుగు విధములగు జీవుల దగురీతి నుంచికొని వానియందున, బయటనుండియు నిర్లిప్తులరై సమస్తమును బాలించుచుండిరి. ఓదేవా! మీకివే నమస్కృతులు, భక్తివినతులు, జోహారులు.

ఓ దేవదేవా!యనంతా!వేంకటేశా!శ్రీనివాసా!మీకెంతయు వేరైన యాజీవరాసు లన్నియుం గడుజడాత్మకములు. మీయందుఁ బారతంత్ర్యాది దోషగుణములేమియు లేవు. సర్వదోషరహితులు, స్వాతంత్ర్యాది మహద్గుణముల నొప్పియున్నవారు మీరు. ఓదేవ, నిరపేక్ష, నిత్యతృప్తపూర్ణకామ, దుఃఖనాశక సుఖానందప్రదాతా! మీకివేవందనములు,

సత్యకామా! సత్యసంకల్పా! సత్యస్వరూపా! నిత్యనమస్కృతులు, రమాపూజితా! హరహిరణ్యగర్భేంద్రాది దేవవందిత పాదపద్మా! యివే ప్రణతులు సర్వమునకీవే ప్రేరకుడవు. మోక్షబంధంబు లొనరించువాఁడవీవే. అఘట్య ఘటనాసమర్థుండవు, ననంతాగణ్యగుణ శోభితుండవు నచ్యుతుండవునగు నీకుఁగై మొగుపులు. అచ్చెరువులందెల్ల నచ్చెరువులు పొనర్చు వింతల వింతరూపునకు, నెల్లబ్రహ్మాండములకు లోనబైటఁదానయై సర్వమునెఱుంగు సర్వేశునకు సచ్చిదానందునకు మీకు నమస్కారములు. అణువునకు నణువును మహత్తునకు మహత్తునునగు సర్వవ్యాపకుడవును సర్వాధారుఁడవునగు ఓగోవిందా! యివే దండములు. సర్వసాక్షికి, సర్వోత్తమునకు సర్వసుందరునకు సర్వసమునకు సర్వజ్ఞునకు మీకు సాష్టాంగములు. దేవ! దివ్యస్వరూప! సర్వశక్తుని, సర్వప్రదాతను, సచ్చిదానందుని, వ్యక్తు,నవ్యక్తు, శేషు, నశేషు, సనాతను, నిత్యు, నిర్మలు, నిర్లిప్తు, నిర్వికారు, మిమ్ము నే వేంకటాద్రీశ యెంతని వినుతిసేతు? అధోక్షజా! అప్రాకృతుఁడవు నీవనంత మహిమాన్వితుఁడవు. ధర్మరక్షకుడవు. పురుషార్థప్రదాతవు, మూలపురుషుడవు, ప్రసిద్ధావతారుండ వనంతుండవీవు. నీవనంతనాముండవనంత గుణుండవు. శ్రుతుఁడవు, చతుర్ధర్మప్రవర్తకుఁడవు, చతుఃపురుషార్థప్రదాతవు, చతుర్మోక్షప్రదుండవీవ. ఓదేవదేవ! నీవప్రసిద్ధావతారుండవు, బ్రహ్మణ్యుండ వనంతా! వేదవేద్యుండవు. వేదములకగమ్యుండవు. మ్రొక్కులివియెల్ల నీవెయౌ మూలమూర్తి ప్రేమఁబడసినదొండాన నొప్పుదేవ! ఇందిరా మనోనాయకా! అహోభాగ్య మహాభాగ్యము! మీచరణకమలములు డెందమునఁ జేర్చిన యదృష్టవంతులకు మానవులకు నీలోకమునఁ బరలోకమున ననంత సుఖానందములు పెంపొందిసేకూరును. హేప్రభూ! మీయనుగ్రహాల వలేశములవలేశమేమి, యందున లవలేశము పొందఁగలిగినను వానికి మఱిపొందవలసి నదియేయుండదు. ఓ పరంధామా! పరమపురుషా! మీరు, మీవగు, ననేకానేక, యవతారమ్ముల మీభక్తులకు మీవిచిత్రాతి విచిత్రమగు మహచ్చరిత్రను జూపితనియించితిరి. ఒక్కండు కీటకమేయయ్యు మీప్రసన్నతచే సామ్రాజ్యానుభవమును బొందెను. మహారాజాయెను. మఱియు మీచరణకమలమున నింతసంపర్కము నందియె గట్టిపాషాణముగూడ దివ్యసుందరలల నామణియై జగమునఁ బేరందినది. మనుజులంగూర్చి వేరెపలుకునదేమి? కావుననే మీరు నరునకు రథసారథిగ, బలిదైత్యునకు ద్వారపాలకుఁడు గనై యనుగ్రహించిరి. ఇంద్రునందెంతయు ననుగ్రహముంగలిగిన మీరుబలికడఁ జేచాచి యాచించిరి. గజేంద్రుని రక్షింపం బూని పరివారమునందేరికి నేమియుం జెప్పక స్వయముగ మీరె పరులెత్తిపోతిరి. వైకుంఠమేని, నేవిడువంగలను గాని భక్తులనెన్నడు నేమియు నేవిడువం జాలను. నాభక్తులెనాకత్యంత ప్రియులు, సన్నిహితులు ననుచున్నారు. ఇద్దియ మీసంకల్పము దృఢప్రతిజ్ఞ.

ఓవేంకటేశా! కామధేనువు, కల్పవృక్షమును, జింతామణియు మీస్వరూపములె. భక్తజనులకెల్ల కోర్కులు నొసంగుచు మీరు వేంకటాచలమునఁ గల్పకము, కామధేనువు చింతామణియునై యున్నారు. కాని యామూఁడును భోగవస్తువులనె యొసంగం గలవు. ముక్తియు స్వర్గసౌఖ్యము నొసంగంజాలవు. వానిసామర్థ్యమంతటిద. కాని మఱిమీరు ప్రసన్నులైన సర్వము నొసంగంగలరు. మీరొసంగఁజాలనిదెలేదు - ఓం తత్సత్

అనంత వేదవేద్యా! శ్రీవేంకటేశా! లక్ష్మీ మనోహరా! జ్ఞానానందైశ్వర్య ప్రపూర్ణా! కరుణాకరా! మీకివే నమస్కృతులు. భూమిని మట్టికణముల, నక్షత్రములనేని నెన్నవచ్చుంగాని యనంతామేయావ్యక్తానంత వీరపరాక్రమ కార్యములు, కరుణాకృతములు, నాబ్రహ్మయు, ననంతుడు, వాణీమాతయు లక్ష్మీమాతయునేని లెక్కింపఁజాలరన్న మాబోంట్లనెన్నుటేల? ఐన నేను మీభక్తదాసానుదాసుడనాయోపిన కొలందిగ మిమ్ము మీఘనమగు చేతల వర్ణించి నుతింతును. మీచేతను మీభక్తిచేతను బ్రేరితుడను, భక్తుండను, నాసామీ, శ్రీవేంకటేశా! దయానిధీ, జ్ఞానానందపయోధీ! భక్తవత్సల! విశ్వకుటుంబీ, మాధవా! నన్నుంగృపగనుము రక్షింపుము, రక్షింపుము.

సత్యు సత్యస్వరూపు సత్యేశు, సత్యసంకల్పు సత్యవ్రతుని, సత్యనారాయణు శ్రీహరిని, సత్యయోనిని, సత్యచర్యు సత్యశీర్షుని విష్ణునినే భజింతును. వినినయంతన యెల్లపాపములు నాశమొనరించు, మననమొనరింపఁ బుణ్యము నొసంగిపెంపొందించు, ధ్యానము నొనరింప సిద్ధినొసంగు, దర్శనము చేసికొన్న మోక్షమునొసంగు పరాత్పరు శ్రీమన్నారాయణ భజనమేను సొనర్తును. శ్రీవేంకటేశు, లక్ష్మీశుననిష్టఘ్ను, నభీష్టదు, శ్రీనివాసుని, నలువను గన్నయ్య ననిశము భక్తిభజింతును. కరుణాపంగ వీక్షణంబుల నింతఁగాంచి యంతనె బ్రహ్మాదులఁ దమతమ మహాపదవులంది పెంపొందంజేసిన మహారాజాధిరాజు మిమ్ము శ్రీనివాసుననిశము భక్తినిభజింతును. అనంతు, ననంతవేద సంవేద్యు, నతీంద్రియు మిమ్మునిశంబునభినుతింతు. నిత్యు, నిర్దోషగుణవార్ధినిత్యముక్తు శ్రీనివాసు, రమాధవు చింతసేతు, పాపములఁ దొల్చి కోరికల్గూర్చి ప్రేమ భక్తజనములఁ బాలించు ప్రభునిగొల్తును. సర్వమునఁ దానుదనయందున సర్వముండ శేషశయనుఁడైన శేషశైలవాసు శ్రీనివాసు నిరతంబు భజింతుఁ దలఁతు, గొలుతు, భక్తానుగ్రాహకు, సుశాంతు గరుడధ్వజు, ప్రసన్నవక్త్రనయను, శ్రీనివాసు విష్ణుదేవు, మిమ్ముసతతమ్మునన్య భక్తి భజించెదను. భక్తుల భక్తిపాశమునం, బంధింపఁబడిన పాదపద్మములు గలిగిన, సనకాదుల ధ్యానగమ్యుని శ్రీనివాసుని మిమ్ముశేషశైల వాసుని నిరతంబునే భజింతును. సత్యాహింసలె సాధనములుగఁ బ్రజలపాలకుల హృదంతరాళములందలి దౌష్ట్యమును నధర్మమును దొలఁగించి దేశముల శాంతిసౌఖ్యముల నెలకొల్పు మహాత్ము భగవంతుని, నిరతంబు మదినెంతును, వినతులు వినుతులు, నేసొనర్తును.

తురంగారూఢు, కలికల్మషనాశనకరు, కళ్యాణప్రదు, అవిఘ్ను, కలిక్యవతారు శ్రీశు సతతంబు భజియింతు, జేమొగుడ్డు. హరిని హంసుని, కృష్ణునరసింహు, ననంతు, మధురిపు, హృషీకేశు, యజ్ఞస్వరూపు, కపిలుని, ఋషభుని, హయగ్రీవుని, నరుని, నారాయణు, వ్యాసు,ననఘు, నాత్మారాము, నమృతు, దత్తాత్రేయు, ధన్వంతర రూపు మిమ్ము నోదేవదేవ ! నిరతంబు భక్తినినే భజింతును. అనంతరూపు, ననంతచరితు, ననంతవీర్యు, ననంతవేదములచేతను వర్ణనీయు, మిమ్మునననంతనామునని శము భజించెదను. అనంతదేవు, ననంతకళ్యాణ గుణసుందరు, నభిరాము, ననంతశక్త్యంశు, ననంతవిక్రము, ననంతశయును, ననంతునాదిశేషు శరీరమునె పాన్పుగఁ జేసికొని పవళించినవాని, హరిని, నిరంతరము భజింతును. అనంత సౌభాగ్యు ననంతనేత్రు, ననంతపాదపద్మ, ననంతసౌఖ్యు, ననంతసౌఖ్యదు, నసురసమూహముల నాశమొనరింప జక్రము ధరించిన వానిని, పాపసమూహ పర్వతమ్ములఁ జీల్చిచెండాడు వాని కారుణ్యమూర్తిని ప్రేమమధుపూర్ణ హృదయపద్మని, కనకాద్రి సుందరశంఖమును ధరించిన వాని మిమ్మునేన నవరతమును భజింతును. శ్రీవేంకట నగాధినాథా, శ్రీనివాసా! మీరనేకానేకానంత పురుషార్థ ప్రదాన నిపుణులు. కానిచో నీమహద్దివ్యోన్నత పర్వతమున నిటులు గుప్తరూపమున నేలవసింతురు? అపారదివ్యగుణౌఘరత్నహార సంశోభితుని మిమ్ము స్మరియించు నట్టి నిజభక్త జనముల దోషములెల్ల హరించు హరిని భక్తాభీష్టప్రదుని, శేషశైలవాసు శ్రీనివాసు, సదామందహాసు, లక్ష్మీసహితు, లీలావిలాసు, శ్రీవేంకటేశు, మిమ్మునేభక్తిఁ గొలుతును. సర్వతీర్థ శరణంబులు, నాకుశరణంబులు నగు మీపాదపద్మములకిదే యొఱఁగుచునున్నవాఁడను. ఓదేవదేవ! లక్ష్మీ సరస్వతి శివుడు, శేషుడు నజుఁడు, సూర్యచంద్రులు నగ్ని మొదలగు నెల్లరచే నమస్కరింపంబడుచున్న మీపదపద్మములకిదే నేమ్రొక్కుదును. సుకుంకుమ వర్ణములు, లోకపావనములు నగు మీశ్రీపదములకు, ప్రణామములు. నిగమాగమ వేదాంత వేద్యునకు వినతులు.

నిజకరుణా కటాక్షవీక్షణంబుల భక్తులకు సుఖానందములు కూర్చునట్టి పరాత్పరుఁజతుర్భుజు, శంఖచక్రగదాబ్జధరు, నధోక్షజు, బ్రహ్మసంభవాభవాది పూజితు, వరదానములుపొంది దుష్టులై లోకకంటకులైన ఖలుల నంతంతనఁదునుమాడు నప్రతిహతవీరు, నజ్ఞానాంబుధిందరింపఁజేయుటలో, జ్ఞానసేతువు నిర్మించుటలోఁ గడుంగడు చతురు, నద్వితీయ విష్టరశ్రవునేవేళ వేడికొలుతు, జ్ఞానివిద్వజ్జన సంపూజితు, లక్ష్మీమనోహరు, నమరాధిపసంసేవితు, దారిద్ర్యదుఃఖమును పాపతాపమును మొదలంట నాశమొనర్చి యార్తుల, భక్తులఁ గరుణనేలువాని, గమలనయను, హారకేయూరాది భూషణ సంశోభితుని, సర్వవ్యాపిని నఖిలాంతరాత్మునని శంబుఁ జేరిభజింతు.

బహుగుణభరు, దోషదూరు, దయాసముద్రు, భక్తజనులతాపత్రయములఁ జల్లార్చువాని, నజు, నిర్విశేషు, విశేషు, నశేష సంసారాతీతు, లోకాతీతు, ననుపము, పురుషోత్తము నాయిష్టదైవము ననవరతము భక్తిఁ దలపోతు, భజింతు, బ్రణుతిసేతు. ఓదేవ, శ్రీశైలవాస, శేషాద్రినాథ! మీపాదపద్మములనుద్భవించి గంగజగత్పావని. మీకరుణాకటాక్ష వీక్షణంబు నలువ, శివుఁడు, మఘవుఁడు, సూర్యుఁడాదిగ నెల్లరకు నిష్టఫలంబు లొసంగునదైయున్నది. మీనామస్మరణమున మహాపాపములును నశించిపోవును, సర్వమోక్షములును జేకూరును. మీపాదకమలము లర్చించు భక్తులు బ్రహ్మేంద్రాదులకును బూజనీయులగుచున్నారు. అట్టియోదేవ వేంకటగిరివాసా! ఇంద్రియాగోచరులు మీరు నిగమాగమనిచయ సంవేద్యులు, నాత్మమాహాత్మ్య సంపూర్ణులు. మీరెల్లవారికి నాదిమిత్రులు. మిమ్ము నేనేవేళ భజియింతు, భక్తిఁగొలుతు. రవిశశినయను, బూర్ణకారుణ్యదేహు, నిర్వాణు, నిష్ప్రపంచు, ననంతవేద సమూహములచే నసంగులచే గీర్వాణులచే నిరంతరము భక్తిపూర్వకమగు స్తుతులచేఁ బ్రణామములచే బూజింపఁబడువాని, మిమ్మునే నియతిని నిరతంబు భక్తిభజింతును గొలుతును. ఓదేవ ! నీవశంకరుఁడవు బ్రహ్మవు. ఈలోకముల నెల్ల మీచే పరివ్యాప్తములు. మీప్రేమయపారము. మీయనంత ప్రేమగాధల నెల్లభువనాల శేషుఁడు. శుకుఁడు, పైలుఁడు, నారదుడు నాదిగ భక్తులు ముక్తకంఠములఁ బాడివినుతురు. ఓవేంకటేశదేవ, మిమ్మనుసరించియుండు వారల సౌభాగ్యము దశదిశలఁ గడువ్యాపించి పెంపొంది యుండును. వారల కైహికపారలౌకికాతుల సౌఖ్యంబులు సంప్రాప్తంబులు, పిదప వారికిన్ముక్తియుం జేకూరు. దేవకారుణ్యామూర్తి నిన్భక్తి, దలతుఁ గొలుతు సతము.

ఓయనంతా! దేవేశా!భక్తిభావంబున స్మరియించినంత, నెంతయు సామాన్య చరితులకుంగూడ మీరిహపరంబుల, మహావిభవంబుల ననంతసుఖముల నొసంగంగలరు, ఉద్ధరింపంగలరన్ననిక ఘనులంగూర్చి వేరెచెప్పుటయెందులకు. పుండరీకనయను బురుషోత్తమీశుని, గరుణభక్తజనులఁగాంచువాని, సర్వలోకవినుతు సర్వేశుజగదీశు వేంకటేశు వరదువినుతిసేతు. ప్రభునిపరునిబూతభావను పుండరీకాక్షుని భగవంతునవ్యయుహరి ; విశ్వవంద్యుజిష్ణువిష్ణు లోకావను సర్వవంద్యుసతము సంస్తుతింతు.

లోకోత్తరుని, బరాత్పరుని, పరాత్పరతరుని, దయామతి నెల్లర దరిఁజేర్చువాని, నెల్లరందరిఁజేర్చుకొనువాని, కాలస్వరూపు, భూతభవిష్యద్వర్తమానంబుల నొదవించి సాగించువాని, భూతజాలంబునెల్లనొదవించి పోషించువాని, ప్రళయమ్మున నవ్వానినెల్లఁ దనయందుననె విలీనంబొనరించుకొనువాని మిమ్ముజగత్ప్రవర్తకు మదీయహృదయాధీశు, హృదంతరవాసు నిరతంబు భజియింతుఁ నీయందెజీవింతు నిర్వికార.

దేవశర్మ మఱియు మఱియు దేవునిట్టులు వినుతింపసాగెను. ఓ శ్రీవేంకటేశా! మదీయస్వామీ! ప్రణతార్తి ప్రణాశనా! జ్ఞానానందదయాప్రపూర్ణా! నావిన్నపమిది యాలింపుము. ఓంతత్సత్.

## ప్రార్థన పద్యములు

సుగంధిః-

కొన్నవడ్డికాసులెల్ల కోటిరెట్లు లెక్కగా
నెన్ని, మించికామితార్థమిత్తు భక్తకోటి కా
పన్నరక్షకుండ వీవ; పాలితామరాధిపా!
నిన్నువడ్డికాసులయ్య నిచ్చలున్ భజించెదన్

తే॥ సతులమోమున నెడదందుసగముమేన
దాల్చిజగములఁ బుట్టించి, దయను బెంచి
కాలముంబొందఁ జేసెడి ఘనులు మువురు
మూర్తులకు, మూలమూర్తికి మ్రొక్కుదెపుడు.

సీ॥ తారలేమణులుగాఁదగఁ గూర్చి తీర్చిన
యపరంజి బొమిడికయలరఁదలను.
రేబవళ్లను జేయురేరాజు దినరాజు
కనుదమ్ములను; మొగముననలము
భుజముల వేల్పులు పొలుపొందుచుండంగఁ
పెన్నురంబునలచ్చి చెన్నుమీఱ
బొడ్డుతమ్మిని బమ్మ బొజ్జనులోకాలు
జడముల జడములు తొడలనొప్ప

గీ॥ పాదపద్మంబె వ్యోమమై పరిఢవిల్ల
రోదసెల్లను నిండినీరూపమొప్ప
నీవకాకొండు లేదంట నిజముకాదె
దేవదేవ నమస్కృతుల్దీనశరణ.

శా॥ శ్రీశున్వేంకట శైలవాసుఁగరుణా సింధున్సు రజ్యేష్ఠ దే
వేశాది త్రిదశావళీ ప్రవినుతు న్వేదాంత వేద్యున్హరిం
దోసంబుల్దొసగుల్దొలంగనిడు చున్దోరంపు భక్త్యుక్తినెం
తేసంతృప్తిని జీవితంబుగడుపంజేయంగ నేఁగొల్చెదన్

ఆ॥ అంత కాదినుంటి వలరెద వంతతో
నంతచెడిన పిదప నలరఁగలవు ॥
అప్రమేయు నిన్ను నాది మధ్యాంతము
ల్లేని వాని దలఁతుఁబూని కొలుతు॥

తే॥ దీనజనముల మొఱలెందు వీను దోయిఁ
బడునొయని కొండకొమ్మెక్కికడపనెంచి
తేమొ యదినీకు సాగదు దేవదేవ
బొబ్బలిడుచును నిన్నుట్టి ముట్టఁగలము.

తే॥ మూలసౌధాన వైకుంఠ పురమునందు
నింతతో గుల్కునిను ద్విరదేంద్రుమొఱలు
పరుగులెత్తింపవే నేఁడు పర్వతాల
దాగసాగదుమముఁబ్రోవఁదరలిరమ్ము

తే॥ హరిని బద్మావతీమనోహరుని బరుని
వేంకటాద్రి నివాసుని సంకటహరు
శ్రీనివాసు దయామయుఁ జిత్తమునను
హత్తుబత్తిని గీర్తింతు ననవరతము

కం॥ గిరివరనివాసు గిరిధరు
కరివరదు మురాసురహరుఁ గరుణాకరునిన్
బరమాత్ముని దీనవన
పరు, భక్తజనార్తిహరుని భావింతునెదన్

చ॥ కడిమిని దుష్ట భావముల గాఢతమిందొలగంగఁద్రోయ, నా
యెడదను గోరినన్నరుగులెత్తుచు వచ్చివసింతువీవని
న్నుడయఁగనేలనో యిటటుఁబర్వులు వేంకట శైలవాసని
న్నుడుగని భక్తిడెందమున నుంచి తలంచియు గొల్తునిచ్చలున్

ఉత్సాహ॥ వేంకటేశ సంకటహర వేడికొందు నిచ్చలున్
పంకజాక్షపరమపురుషపాలితముని సురవరా
పంకమేల బింకముడిగి వచ్చి వేగఁబ్రోవనా
వంక; భక్తపాలకుండ వనెడి బిరుదునిలుపుకో

## పదమహాత్మ్య వర్ణన - దేవశర్మ ప్రార్థనాశేషము

శ్రీ వేంకటేశ్వరా! శ్రీనివాసా! శేషశైలవాసా! భక్తి ప్రణామము లొనరించుచున్నవాఁడను. స్వర్ణాభరణశోభితా! విశాలరమ్య వక్షస్థల దక్షిణభాగమున శ్రీవత్స చిహ్నమొప్ప దాని దరిని కడలికూతురొప్పియుండు నోదివ్య స్వరూపా వేంకటాద్రివాసు నిన్ను నే శరణుఁ జొచ్చి యున్నాడను. సర్వప్రాణి హృదంతర్వాసా! వాసుదేవా! సర్వలోకహితకరా! సర్వశరణ్యా శ్రేష్ఠ పురుషోత్తము మిమ్మునే భక్తి నేవేళ అట్టి భక్తి నా యొడందను బట్టి యుండనిమ్ము. భజియింతును. మనోవ్యక్తు, సూక్ష్మ, పరుకంటెను బరు, శ్రేష్ఠ, జగదుత్పత్తి కారకు సాక్షిని, నవ్యక్త మూర్తిని మిమ్ము నమస్కరించుచున్నాను. వాసుదేవునకు సంకర్షణునకుఁబ్రద్యుమ్నున కనిరుద్ధనకు మీకు బ్రణతులు. యోగి హృత్పద్మవాసికి, సూక్ష్మనకుఁ బంచభూతాత్మునకు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియాధీశునకు, హృషీకేశునకు, వైష్ణవేశునకు, జిష్ణునకు, విజయప్రదాతకు, నిష్టునకు గృష్ణున కుత్తమ కర్మాచరణునకు, క్షరాక్షరాతీతునకు, క్షరాధిపునకు నక్షరునకు, భవునకు, భావునకు, బరమేష్ఠి, ధీరునకు, వీరునకు, ఋషికి, ఋషివరపూజితునకు, బరమాత్మునకు సాష్టాంగ నమస్కృతు లొనరఁజేతును.

నారాయణాభిధేయు భక్తునుద్ధరించిన శ్రీమన్నారాయణునకుఁ, బరమ పూజ్యునకు నాది భూవరాహరూపధారికిఁబూజ్యులకును బూజ్యుఁడగు వానికి,వంద్యులకును వందనీయ చరణారవిందునకు, నీకు హిరణ్య గర్భగర్భునకు శంకరునకు, భక్తవశంకరునకు, సచ్చిదానందునకు, స్కందునకు, శిపివిష్టునకు, కర్మజ్ఞాన ద్విరూపునకు శ్రుతిస్మృత్యా లయునకు, మీకు భక్తినమస్కరించుచున్నాను. యమనియమునకు, దానవ్రతకరునకు, దపస్వికిఁ దపస్యుల దపస్తును బొందనర్హునకు. దాపత్రయ హరునకుఁ, దగిలి భక్తిరక్తి దండంబులిడుదును. యజ్ఞస్వరూపునకు విశ్వరూపునకు, విశ్వమంగళకరునకు, సుందరునకు, సుతీర్థ స్వరూపపాదునకు, దరింపం జేయు వానికి, దారకునకుఁ బ్రసన్నాత్ముల ననుసరించు దేవునకు, శంభునకు, శుద్ధునకు, శాశ్వతునకు, నవినాశికి, గుణస్వరూపునకు మీకు ననన్య భక్తి సాష్టాంగ నమస్కృతులు పొనరించుచున్నవాడను, అవ్యయాత్మ! ఈశ! అప్రమేయ కర్మస్వరూపునకు, జ్ఞానికి, జ్ఞానదాతకు, నిత్యముక్తునకు, హరికి, నిత్యముక్తి ప్రదాతకు మీకు ప్రణతి. భక్తిరక్తి భజించు వారికి శుద్ధ శరీరమును, బరమయోగము, నతుల సౌభాగ్యమును, నిహమును,బరమును తత్త్వజ్ఞానమును భక్త్యను రక్తిని వైరాగ్యమును మఱియు నితరేతర సుగుణములు నొసంగునట్టి శ్రీశుని దయోదధిని సతతంబు శరణంబునొందుచున్నాఁడను. మలభు,దుర్లభు, భగవంతు, సనాతను, సదసత్స్వతంత్రనంవాను విష్ణురూపు రూపరహితు, శుభాశుభు, శుభాశుభస్వరూపు,

సర్వస్వరూపుఁ గోవిందు గోగణాతీతు, నింద్రియగణముల నెల్ల వశముననుంచి కొన్న వాని, పాప వినాశకు, పాపరహితు, పావను, కల్పకల్పాల ననల్పావ్యయాఖిలార్థంబులొసంగు ననల్పకల్పతరు మిమ్ముబత్తిమ్రొక్కి సేవింతును.

శ్రీనివాస నామసంకీర్తన మద్దియే సమస్త మనోరధంబుల నొసంగునది. పరమమోక్షము నొసంగునది. విష్ణునామానువర్తులదే భాగ్యము, అహోభాగ్యము యమలోకము వారికిందూరముగ బోయినిలుచును, స్వర్గమోక్షమ్ములు వారి పదపద్మము లంటినిలుచును. విష్ణునామ మాహాత్మ్యమును వర్ణింపంగల వారెవ్వరు? మహాపాపి యజామిళు నట్టివాఁడు, తన్నామస్మరణ మాత్రమునందరించి యమపాశములు త్రెంచికొని వైకుంఠమునకుం దరలిపోయెను. శ్రీ విష్ణునామస్మరణము మనమ్మునంజేర్చి భక్తియోగమున నుంటయే తరించుటకుఁబట్టుకొమ్మ. మహద్ధర్మము. ఆదేవునామ స్మరణమునఁ గేవలమజామిళుఁడొక్కండెకాదు, ప్రహ్లాదుఁడు, గజేంద్రుఁడు, పృధ్వీ మొదలగు నెందరో దుఃఖ సముద్రముదరియించి, తరించి సుఖమునొందిరి. ఆదేవునామస్మరణామృత జలధిని నేటి దనుక నిరతము శివపరమాత్మ మునుకలిడుచు తన్మయుఁడై యున్నవాఁడు. దేవు ధ్యానమున సంలగ్నులై బ్రహ్మాదులు మహద్విభవమును బొందియున్నవారు. శ్రీ భగవన్నామ మీప్రపంచమునందెల్ల శ్రేష్ఠగురుండు. అద్దిపాపభారంబు హరించి లోకంబునుద్ధరించును. భగవంతుం డాదినారాయణుండు విశ్వరూపుడు, సర్వశక్తిమంతుఁడు. ఓయనంతప్రభావా! శక్తిసంపన్నా నాయందునఁ బ్రసన్నుండవు కమ్ము. దేవదేవా! మీకిదేవందనమ్ము. ఓయనంతరూపా! యవ్యయాత్మా మీరు నామపరహితులు. గుణరహితులు, జన్మరహితులయ్యు, మీపదపద్మానురక్తుల భక్తుల ననుగ్రహింపవారియందున నక్కటిక మూని నామరూపమ్ముల, జన్మకర్మంబుల, గుణమ్ములం బూనుచున్నవారు. అట్టి భక్త జనానురక్తులగు మీకు నమస్కృతులు. ప్రసన్నులు కండు. దేవ! మీరీ మానవులందు యథాయోగ్యమ్ముగ, జన్మమోహమ్ముల, రాగవిరాగమ్ముల ( గలిగించుచున్న వారు. ఎల్లరననుగ్రహముంబూని చూచుచున్నవారు. ఓదేవ! యిప్పుడు నాయందున నింతయనుగ్రహముంజూపుఁడు. మీ కృపాదృష్టి యింతమాత్రమే యయ్యుమాకు నిహమునఁబరమున నెల్లయభీష్టములనొసంగి తరియింపంజేయంగలదు. ఇందున నింతయు సందియము లేదు. ఇదియ నామనో నిశ్చయము.

**ఓం నమో వేంకటేశాయ.** మహాత్ముఁడు, పురుషోత్తముఁడు, మహానుభావుఁడు, నమేయ కర్ముఁడునగు ప్రణవయుతుండగు శ్రీ వేంకటేశదేవునకు నమస్కారములు. ఓవరమేశా! పరంధామా! మహామాయా కరుండవును, విశ్వ

కుటుంబివియు నైన మీనామస్మరణ యేస్థలముల జలముల దుర్గముల నాకాశ స్థలంబుల గర్భంబుల నరణ్యంబుల, కైతవంబుల నన్నియెడల నెల్లక్షేమంబులు సేకూర్పంగలదు. మహావిపత్తుల మీనామస్మరణముచే నావిపత్తులు నమూలముగ నశించును. మఱియు సంపత్తుల మీనామంబును మఱపందిన నాసంపదలు నశించిపోవును. కావుననే యేనెల్ల విదంబుల మీచేతనే ప్రేరితుండనై. మీయనుగ్రహముచేతనే నేనెల్లవుడు మీ నామస్మరణమున ననురక్తుడనై భక్తింజపించుచున్నవాఁడను. నాయదృష్టము, నాపుణ్యము సర్వము నది మీదయవలననె కాఁగలదు. ఓపరంధామా! నాకిందున నింతయు నెపుడును భయమును శంకయేలేదు. నేనెల్లపుడును మీయ లౌకిక నామమునందె యనురక్తుఁడనై యున్నవాఁడను. కాని శ్రీనివాస! నాయందున మీదయలేశాతి లేశమాత్రమె చేరియున్నది. ఎంతవింత? లక్ష్మీమనోనాయకా! మీయద్భుతమగు చరిత్రమును గడుంగడు పాపినగు నేనేమియెఱుంగలను? సర్వజ్ఞులకు మీకు నే జెప్పున దేమున్నది? ఆర్తావనా! దీనజనరక్షకా! నాయందున దయచూవుము, కనికరమ్మున నునుంగాపాడుము. ఓ గోవిందా! మీనామస్మరణముచే మహాపాపసమూహములును నశించిపోగా మనశ్శరీరములు పవిత్రములగును, అట్టి పవిత్రులంగాంచి మీరెంతయు, ప్రసన్నులగుదురు. అటు పిమ్మట పుణ్యకర్మలొనగూడును. మహత్పుణ్య మొదవును. అట్టి యాపుణ్యకర్మలచే సత్కర్మలచే జ్ఞానసాధన విజ్ఞాన సంసిద్ధి కాఁగలదు. దానిచే దేవ! శ్రీ విష్ణు! మీకు నెంతయు నబ్బురంబగు ప్రీతియనుకంప వారలయందొదవు. ఆపైనానందమును బెంపొందించు ముక్తి మోక్షము వారికి ప్రత్యక్షంబైదరిసి సంప్రాప్తమగుచున్నది. అనేకానేక గోదానములు, కన్యాదానమ్ములు, పొనరించుట, కరువుల కాటకముల దినదినము గంగాతీరమున లక్షలాదిగ దీనజనముల కన్నదానంబులు సేయుట మొదలగు పుణ్యకార్యములును భక్తియుక్తి నిర్మలమతింజేయు మీనామస్మరణమునకు సమములు కాఁజాలవు. కావునె యవియెల్ల కర్తృభావము, ఫలభావము, మీయందుననెయుంచి, మమకారాహం కారములుమాని మీనామస్మరణ మొనరింపవలయును. అదియ కోటిగుణిత సత్ఫలద మగును. మీనామ మహాత్మ్యమిట్టిదియ. మీనామస్మరణము సిద్ధులను, పురుషార్థములన, సులభముగ సిద్ధింపంజేయును. ప్రజల కీకార్యము, మీచూపినయీ మార్గవనిర్భయమైనది, లోకోత్తరమైనది. ఎల్లవుడన్నివిధముల నామస్మరణమున, నమస్కృతులొనరించుట యందు మనసులు లగ్నములుకాగాఁబవిత్రులగువారిం గూర్చి చెప్పుట యెందులకు? అంతకుమున్నెట్టి పాపపంకిలులైనను మనసులు మాటిపావనమతులై దేవునారాయణు నామస్మరణ భక్తినొనర్చి నమస్కరించు వారిదరికి యమరాజాను రాజాలఁడు. చేతుల మృత్యుపాశములంగొనిన యమదూతలుందరిని జేరంజాలరు. కన్నెత్తివారిందేరిచూడనైనం జాలరు.

ఓమ్

ఆ॥ వేంకటాద్రివాస సంకట హర శ్రీశ
పంకజాక్షవరద పరమపురుష
భావమీయ మోక్ష పదవినేయొసఁగెడి
యవ్యయాత్మ భక్తి నంజలింతు.

ఓం శ్రీ వేంకటేశాయ నమః ॥ ఓం నమోభగవతే వేంకటేశాయ. ఓం నమోనమః

## దేవశర్మకు శ్రీనివాసుడు ప్రత్యక్షమగుట

అంత తనయొనర్చినయీ ప్రార్థనలకు, భక్తికి మెచ్చి లక్ష్మీసమేతుండై యెదుంటం దోచిన శ్రీనివాసదేవుంగాంచి దేవశర్మయిట్లు ప్రార్థింపసాగెను. శ్రీశ శ్రీనివాస శ్రీమనోనాథ! సర్వలోకజనని రమాదేవి, ఆకమలాలయ మీయర్ధాంగి. ఆమె యత్యంత మృదులాంగి, సుకుమారి, అతసీకుసుమ మట్టి శరీరకాంతి నొప్పు సుందరి యాకమలాలయ యెల్లపుడును మీ హృత్పద్మమున,నాడిఁదొడలందునఁగూరు చుండి ప్రేమఁగులుకు చుండు. ఆయమ్మ హరిహిరణ్యా గర్భులకును బరువులిచ్చి పెంపుగూర్ప దక్షురాలు. ఈతల్లి కడుంగడు కరుణామతియై యెల్లలోకములకును శుభములొడఁ గూర్చుచుండును. తమతమ పదవుల నుండియు నాబ్రహ్మేశాను లెల్లపుడాయమ్మ రమాదేవి కటాక్ష వీక్షణంబులం గోరుచుంద్రు. సుందరీరమణులగు వాణీయింద్రాణీ మున్నగువారలంగూడ నందంబునంగ్రిందు పడుచు చున్న యాయమ్మ యందాలబరిణి మందస్మితానన పద్మ మీసరసను జేరి మిమ్మను రక్తులనొనర్చియనురక్తి నందుచున్నది. నిత్యముక్త, దోషదూర, సర్వసద్గుణ గరిష్ఠ యాయమ్మయెల్లపుడు మీచరణ సరోరుహముల సేవలొనరించి తనియందలంపూని పూజలొనరించి తనియుచున్నది. తనభక్తుల నభీష్టము నొసంగి తనియించు కరుణాసాగర. ఆతల్లిభక్తులపాలి కల్పవృక్షము, చింతామణి, మఱియుం గామధేనువు, ఆమాతల్లికి లోకమాతకు మీయర్ధాంగికిని మీకు నో వేంకటేశ సతతము భక్తివందనములు. ఇందిరామాత! పద్మాలయ, దశదిశల నెల్లయెడల వ్యాపించియున్నయీ జగత్తులెల్లఁ బ్రేమఁబాలించుచున్నది. ప్రశస్తగుణవిఖ్యాత, గుణవ్యాప్త, యామంగళదేవత బుద్ధి ప్రచోదితయెల్ల విధముల ధ్యేయురాలు, పూజ్య తేజోమూర్తి లోకమాత. తన్నుం గీర్తించువారి దుష్టములగు పాతకముల, నుత్పాతకముల నాశమొనరించి రక్షించు గాయత్రీ మాతయే రమామాత. వేయి కిరణముల వానికిని వెలుగులిచ్చుచు భక్తజనముల కిష్టదానమ్ము లొసంగుచు చరాచరోత్పత్తి నొనర్చుచుఁదనరు కలుముల జవరాలు లక్ష్మియ పావిత్రియవం బడుచున్నది. వాణికి పరీశ్వరియై వాణీ ప్రదానమునొనర్చు చున్నదగుట

ఓమ్

ఆ॥ వేంకటాద్రివాస సంకట హర శ్రీశ
పంకజాక్షవరద పరమపురుష
భావమీయ మోక్ష పదవినేయొసఁగెడి
యవ్యయాత్మ భక్తి నంజలింతు.

ఓం శ్రీ వేంకటేశాయ నమః ॥ ఓం నమోభగవతే వేంకటేశాయ. ఓం నమోనమః

## దేవశర్మకు శ్రీనివాసుడు ప్రత్యక్షమగుట

అంత తనయొనర్చినయీ ప్రార్థనలకు, భక్తికి మెచ్చి లక్ష్మీసమేతుండై యెదుంటం దోచిన శ్రీనివాసదేవుంగాంచి దేవశర్మయిట్లు ప్రార్థింపసాగెను. శ్రీశ శ్రీనివాస శ్రీమనోనాథ! సర్వలోకజనని రమాదేవి, ఆకమలాలయ మీయర్ధాంగి. ఆమె యత్యంత మృదులాంగి, సుకుమారి, అతసీకుసుమ మట్టి శరీరకాంతి నొప్పు సుందరి యాకమలాలయ యెల్లపుడును మీ హృత్పద్మమున,నొడిఁదొడలందునఁగూరు చుండి ప్రేమఁగులుకు చుండు. ఆయమ్మ హరహిరణ్యా గర్భులకును బరువులిచ్చి పెంపుగూర్ప దక్షురాలు. ఈతల్లి కడుంగడు కరుణామతియై యెల్లలోకములకును శుభములొడఁ గూర్చుచుండును. తమతమ పదవుల నుండియు నాబ్రహ్మేశాను లెల్లపుడాయమ్మ రమాదేవి కటాక్ష వీక్షణంబులం గోరుచుంద్రు. సుందరీరమణులగు వాణీయింద్రాణి మున్నగువారలంగూడ నందంబునంగ్రిందు పఱచు చున్న యాయమ్మ యందాలబరిణి మందస్మితానన పద్మ మీసరసను జేరి మిమ్మను రక్తులనొనర్చియనురక్తి నందుచున్నది. నిత్యముక్త, దోషదూర, సర్వసద్గుణ గరిష్ట యాయమ్మయెల్లపుడు మీచరణ సరోరుహముల సేవలొనరించి తనియందలంపూని పూజలొనరించి తనియుచున్నది. తనభక్తుల నభీష్టము నొసంగి తనియించు కరుణాసాగర. ఆతల్లిభక్తులపాలి కల్పవృక్షము, చింతామణి, మఱియుం గామధేనువు. ఆమాతల్లికి లోకమాతకు మీయర్ధాంగికిని మీకు నో వేంకటేశ సతతము భక్తివందనములు. ఇందిరామాత! పద్మాలయ, దశదిశల నెల్లయెడల వ్యాపించియున్నయీ జగత్తులెల్లఁ బ్రేమఁబాలించుచున్నది. ప్రశస్తగుణవిఖ్యాత, గుణవ్యాప్త, యామంగళదేవత బుద్ధి ప్రచోదితయెల్ల విధముల ధ్యేయురాలు, పూజ్య తేజోమూర్తి లోకమాత. తన్నుం గీర్తించువారి దుష్టములగు పాతకముల, నుత్పాతకముల నాశమొనరించి రక్షించు గాయత్రీ మాతయే రమామాత. వేయి కిరణముల వానికిని వెలుగులిచ్చుచు భక్తజనముల కష్టదావమ్ము లొసంగుచు చరాచరోత్పత్తి నొనర్చుచుఁదనరు కలుముల జవరాలు లక్ష్మియ సావిత్రియనం బడుచున్నది. వాణికి నధీశ్వరియై వాణీ ప్రదానమునొనర్చు చున్నదగుట

శ్రీయెవాణి యనియు సరస్వతియనియుం బిలువం బడుచున్నది. కాంత్యాదుల నొనంగుచు లోకమాత లోకేశ్వరియైనది. మంగళ దేవత రమాదేవి సంపూర్ణ గుణయోగయుక్తయై బ్రహ్మమున వశమైయున్నది బ్రహ్మాండమునందంతట బయటలోన స్థూల సూక్ష్మ మధ్యమరూపమున వ్యాపించియున్నది. ఆలోకమాత మహద్రూపంబులగు నెల్లకర్మలు బ్రవర్తిల్లఁ జేయుచున్నది. ఈ యిందిరాదేవి కటాక్షవేశముననే యీలోకముననెల్ల సంపదలు, స్వర్గము వైరాగ్యము, భగవద్భక్తి, జ్ఞానము, ముక్తియు గలుగుచున్నవి. భార్గవిలోకమునకుం బరురాలు, జగత్పూజ్య, ఓదేవా! త్రివిక్రమా! మీకునత్యంతము ప్రియురాలు, ఈ తల్లి సర్వశక్తుల సర్వసుఖముల, సర్వసల్లక్షణముల సంపూర్ణురాలు, సదాపూర్ణకామ, ఆయమజ్ఞేయ, యజ్ఞేయ, యఖిలపురుషార్థ ప్రదాయిని, మహైశ్వర్యమతి, సౌభాగ్యయుతయయ్యును మీవశవర్తినియయ్యె మెలగుచున్నది. ఆలక్ష్మి క్షీరసాగర కన్యకమిమ్మనె స్మరించుచు, ధ్యానించుచు, స్తుతించి, నమస్కరించుచున్నది. మీకై తపంబులొనరించుచు, బూజించుచు, దర్శించి, సేవలొనరించుచున్నది. మిమ్మె జపించుచుఁ బ్రతీక్షించుచున్నది. నిత్యానిత్యానపాయిని యాయమ వినమ్రయై సర్వదా మిమ్ముంబ్రార్థించుచున్నది. అట్టిచో నావంటి వృత్తి వర్జితులు, దరిద్రులు, బంధురహితులు, జీవనాకాంక్షులు ననాథులు నగువారలోమహాదేవ! యశరణ శరణ్యా! మిమ్ముబ్రార్థింపఁగోరుట, కీర్తింపంబూనుట యీముల్లోకముల నేమియు వింతకాదు గదా.

ఓమ్ శ్రీ వేంకటేశా! మదీయప్రభూ! జ్ఞా నానందదయానిధీ! శరణాగత సంత్రాణకారణా! భక్తుల కభీష్ట వర్షములు కురియుకరుణామూర్తీ! లక్ష్మీమనోనాథా! మీయద్భుతరూపమును, గర్మలును, శివబ్రహ్మేంద్రాదులును వేయిపడగలవాడును బలుకుదేవతయును గణింపఁజాలరన్న, నెఱుఁగఁ, జింతింపంజాలరన నట్టి మీరూపమ్మును, మాహాత్మ్యంబును వర్ణించి చెప్పనాకు సామర్థ్య మెక్కడిది? నేనేపాటి వాఁడను? నాశక్తి సామర్థ్యము లేపాటివి? మందబుద్ధినినేను మిమ్మేమి స్తుతియింపం గలను?నేనలసుఁడ నహంకారి, నజ్ఞుఁడ, మూర్ఖుఁడ, శఠుఁడ. నేను జ్ఞానము భక్తి మొదలగు గుణములు కొఱవడినవాడను; కామక్రోధాదులచేనిండిన వాడను, మనసును జయింప, వశమునునుంప శక్తిచాలనివాఁడను. ఇట్టులెల్ల విధముల నేనెల్లపుడు విషయముల లంపటు డనైయున్నవాఁడ. భూమినిమట్టికణములు, వాననీటి బిందువులు, నాకసమున నక్షత్రములు, వాననీటిబిందువులు, నాకసమున నక్షత్రములు, వలెనే నాదోషములు లెక్కించుటయుఁ గానిపనియేకదా! ఆపై నోదేవ! యంతయు మీదయ. దేవదేవ! దయానిధీ దివ్యమూర్తి! మీయందున గుణములెట్లు సంపూర్ణములై యున్నవో యట్లే నాయందున దుర్గణములు నిండియున్నవి. ప్రభూ! పరంధామా! అలవతాహం

కారములచే, ప్రమాదాజ్ఞానములచే, దంభలోభములచే, దాక్షిణ్యముచే, స్వభావముచే, సహవాసముచే నేనెన్నెన్ని యపరాధములు పొనరించితినో! వాని నోకరుణామయా! ఏమియులెక్కింపకనన్ను ననుగ్రహింపుము. క్షమింపుము. నన్నునెల్లపుడు సద్బుద్ధిని సన్మార్గముననుంపుము. ఎల్లవిధముల గురువులు, మాతాపితలు సోదరులు బంధుమిత్రులు చదువుసంధ్యలు, పున్నెములు, ధనధాన్యములు, నన్నియునాకు, మీరె. మీకన్న నాకుమఱిలేరు. ముందు వెనుకల,పైనఁగ్రింద బ్రక్కలఁదలను, హృదయమున, బయటను లోనను, అనేకానేక జన్మల తండ్రి తాతలాదిగ, పెక్కు తరములుగ మాకెల్లరకును గోరివరియించిన యిష్టదైవము కులస్వామి మీరలె. ఓలక్ష్మీ మనోనాథ నాకు సర్వస్వము మీరె. మిమ్ముకాక నేనితరుల నేమియునెఱుంగ. ఓదేవ దుష్టకామనను, జెడ్డ సంస్మరణను, దూరమునుండియె, నన్నుజేరకుండగనె హరింపుము. మిమ్ముమఱచు నాదుర్గుణమును దూరమొనరింపుడు, నామనమెల్లపుడును మీయందె తగిలియుండం జేయుఁడు. మీసంస్మరణ నొసంగుడు. మీవంటి ప్రేమ పాత్రులు ప్రియులు నాకు మఱొండులేరు. మీయందుననె మనసుచేర్చి, లగ్నమొనర్చిన ప్రాణములర్పించిన, మీపాదపద్మముల నాశ్రయించిన మీభక్తుండ నేను, శిష్యుండనేను, సర్వవిధముల మీకు సేవకుఁడను. దాసానుదానుఁడను, రేబవళ్లు మిమ్మెన్నఁరింతును.

ఓశ్రీహరీ! మీరమదీయ హృత్పద్మకర్ణికారస్థితు లతిసుందరులింద్రనీల తనుద్యుతి నొప్పికమలాసీనులై కుంకుమార్ద్రములు, కంజకోమలములు నగుపదముల నొప్పు, పదతలముల వజ్రాంకుశ, ధ్వజాబ్జరేఖలు దనరుచుండ, నఖరత్న శోభితపదపద్ములై యతసీపుష్పకాంతి శోభిత సుందరకాయులైయొప్పునో వేంకటగిరివాసా! నింతదనుక మమ్ము కరుణాదృక్కుల బరవుచు నోమితివి, నోముచుంటిరి, యప్పుడు నన్నోముడోవడని వేడుట యేమియిది నావెఱ్ఱియేకదా.

కింకిణీకంకణాల సద్వలయాంగద భూషితుఁడు, కంబుగ్రీవుఁడు, సుబింబోష్ఠుఁడవు, మల్లిమొగ్గలట్టి పండ్లవరుసల నొప్పువాఁడవు, కమలనాభుఁడవు, కరుణాలయుండవు, అద్దములట్టులందమై వెలుగొందు చెక్కిళ్లచెన్ను వాఁడవు, నువ్వు పువ్వు నవ్వు నాసికయు, వంచిన విలుబద్దవంటికను బొమలు నొప్పు, దామోదరుండవు, జాలిచూపులం భక్తులంగనియేలువాఁడవు, వేడిచాయల నొప్పుపూర్ణశరదిందు బింబమట్టు లొప్పుముంగురులతోడి ముద్దుల మోమువాడవు, కరుణాపూర్ణ లోచనుడవు, కంజాత నయనుఁడవు ననుపమసుందరతిలక సంశోభితుఁడవు, రత్నకుండలా లంకృతుడవు తలను గాంతులీను రత్నఘటిత సువర్ణకిరీటమొప్పువాఁడవు, సర్వసులక్షణ సంయుతుఁడవు, జగద్విలక్షణుఁడవు, నిత్య సచ్చిదానందుఁడవు, పెంపెక్కిన, సాటిలేని కాంతులఁ బ్రకాశించు

వాడవు, హృదయాంగ వల్లులకానందంబిచ్చు చల్లదనంబుల సౌఖ్యసంపదల నొసంగువాడవు మన్మనోనాధుఁడు వేంకటాద్రివాసుడ వనంతవేదములకును, నలువకు విదాతకును దెలియరానివాఁడవు నప్రాకృతుఁడు, శ్రీభూనీలాసమాదరలాలితుడవు, బ్రహ్మరుద్రేంద్రాది సంసేవితుఁడవు, పుర్ణానంద జ్ఞాన దయామూర్తివి, పరమమంగళుఁడవు మంగళాంగుఁడవు, భక్తజమలకు నిత్య మంగళము లొసంగువాఁడవు, నారాయణుఁడవు, శేషశైలవాసుఁడువు, శ్రీనివాసుఁడవు, కరుణామృత రసపూర్ణనేత్రాబ్జముల నన్నుంగాంచుచునున్నవాఁడవు.

ఇఁక నాకుంజింతయేమి? ఈప్రభువు నీలోకమునఁ బరలోకమున నాకగుకష్టముల నరిష్టముల మొదలంట నాశమొనరింపంగలడు. ఇద్దేవు చరణ కమలములనే నాకెంతయు విశ్వాసముకలదు. ఓదేవా! మీరనాకోర్కులెల్లం దీర్చు వారని, అభయదాతలని, శరణమని రాత్రింబవళ్లు మిమ్ముందలంచి స్మరియించుచున్నవాఁడను. ఇదే మీ శరణంబునొంది యున్నవాఁడను. దేవా! మీరుపూర్ణ కాములు, సంపూర్ణైశ్వర్య యుతులు. మీకేమియు గోర్కియుఁ బ్రయోజనములేకయున్నను. యోగమాయంబూని, పలురూపంబు, లవతారంబులు దాల్చుచున్నవారు. ఇదియంతయులోకోపకారార్ధమై, పరులెవ్వరిచేనేమియుం గాని యసాధ్యంబులు, కార్యంబులుపూనినెఅవేర్చి లోకరక్షణ మొనరించుచున్నవారు. వింతయగువాయనంత బ్రహ్మాండమును మీరలెంతయు, నుపాయమున మీదగు సూక్ష్మ మృదూదరమ్మునఁ బట్టిపెట్టి తాలిచియున్నవారు.

ఇట్టులు మహాబ్రహ్మాండ భారమును వహించియున్న, విశ్వకుటుంబికి, పరిపూర్ణదయా సముద్రునకు మీకునావంటి యత్యంతానల్పు నుఁద్ధరించుటయేమంత ఘనకార్యము? ఓ శ్రీవేంకటేశ శ్రీనివాసా! మదీయప్రభూ! స్వామిజ్ఞానానందస్వరూపా! దయానిధీ! దుఃఖసముద్రమున మున్గియున్న మీభక్తునన్నుమీరేల నుద్ధరింవక యున్నవారు? హేశ్రీనివాస కృపాప్రపూర్ణా! భక్తపాలన తత్పరా! ఈసంసారారణ్యమునం బడియున్ననన్ను మీరేలఁగవకయున్నవారు? ఓ భక్తబంధూ! దయాసింధూ! మీపద పద్మములకు నేనిదేవందనంబు లొనరించుచున్నవాఁడను. మంచివాఁడనో చెడ్డవాఁడనో యెట్టివాడినైనను నాయొనర్చినయపరాధములెల్ల క్షమియింపుడు. మఱి మీచరణ కమలమ్ముల విడువని భక్తియు, నిరతంబు మీసంస్మరణము, నెల్లపుడు నిహమున, బరమున సుఖము నొసంగుననేక పవిత్రార్ధ విజ్ఞానము నాకుంబ్రసాదింపుడు. ఈశ్రేష్ఠపరంబునె మిమ్మునేఁగోరుచున్నవాడను. ఇదియ మీరునాకొసంగుఁడు. శ్రీస్వామి పుష్కరిణీ రూపమునను్న క్షీరసాగరమున, మంధరరూపమగు శ్వేతద్వీపమున శ్రీభూదేవులంగూడి, విహారములు సొనరించు నోవిష్ణుదేవా! రామకృష్ణా! భక్తునకునాకుఁ గరుణను మోక్షం బొసంగుఁడు.

ఇందిరారమణు ధరణీశు వేంకటేశునిట్లు స్తుతించి భక్త శ్రేష్ఠుఁడు దేవశర్మయట్టె మౌనమూని యూరకుండెను. మఱియుభక్తాభీష్టార్థమ్ములఁ బూర్తిచేయుఁగరుణా వారివాహునకుఁ దనయిష్ట దైవమునకు శ్రీనివాసునకు నాతఁడు సాష్టాంగనమస్కృతులొనరించెను. అవ్వానిన్నుతులకుం బ్రసన్నుండైన, సజ్జనులకుంగతియైన శ్రీనివాసదేవుఁడు మేఘగంభీర వచనంబుల వరదానము లొసంగుచు నిట్లుపలికెను.

నీయుపాసనలచే నేనెంతయుఁ బ్రసన్నుండనైతిని. నీవుమహైశ్వర్య సంసిద్ధి కారణంబున నుత్తమస్తుతి నొనరించినాఁడవు. కావున నీవిటనీలోకమున నటుఁబరలోకముననేమియుం భయమందం బనిలేదు. నీవో మద్భక్తుఁడు వాయువునకు శిష్యుండవు. గురుచరణాశ్రయుఁడవు, గురుభక్తుండవు, నీవిపత్తులు నశించిపోఁగలవు. నీకు సంపత్తి ప్రాప్తికాఁగలదు. నాభక్తుఁడవగు నీయింటఁ బ్రతిదినము సువర్ణవృష్టి కాఁగలదు. నేను నీకుం బెక్కులు వత్సరమ్ముల యాయువు నంతియ వయసుగల పుత్రపౌత్రుల నొసంగుచున్నాఁడను. నూరుతరముల వరకనేక భోగంబు లనుభవించినీవు నీసంతతుల వారు మత్పదమును, పరమపదమును, బొందఁగలరు. ఇట్టులు వచించి భగవానుఁడ దృశ్యుఁడాయెను.

రోమహర్షణ మహర్షి సూతమునివరుండు శౌనకాది తపోధనుల కిట్లనెను. శ్రీవేంకటేశ దేవుని యీ కథామృతము, మాహాత్మ్య సారము శ్రేష్ఠ తపస్వులకును వెదకిపొందఁ దగినది. శ్రీవేంకటగిరీశుడు శ్రీశుడు భక్త్యనురక్తుఁడు ఆదేవశర్మ దేవున కెంతయుం బ్రియుఁడు, జగతినెంతయు నుత్తమోత్తముడు. దేవతలకును ఋషులకును బ్రియుండు. శ్రీవేంకటేశదేవుని పదారవిందముల అతడొనర్చిన యీ సంస్తుతి స్మరణము లొనర్చువారి సమస్త పాప సమూహముల నాశమొనరించును.పుణ్యసమూహముం బెంపొందించును.

శ్రీ వేంకటేశ్వరమాహాత్మ్యమును భక్తిశ్రద్ధలఁ జెప్పివినుచువారల నాలకించువారల పఠించువారలయెడ, మాహాత్మ్య మెఱింగి భక్తిశ్రద్ధల దన్మయులగు వారియెడ శ్రీవేంకటేశుఁడు పరాత్పరుఁడెంతయు, బ్రసన్నుఁడగును. మఱియు నీస్తోత్రంబుచే సంతుష్టుండై రమాపతి శ్రీవేంకటేశుఁడు భక్తమానవుని మనోరథముల నెల్లనొసంగి, మఱియు ముక్తినొసంగంగలఁడు. భక్తమానవుడు కోరుకోర్కులెల్లఁ దీరముక్తి నొందును.

## ఫలశృతి

శ్రీ వేంకటాచలమునకు సమానమగు పవిత్రదివ్యస్థానము బ్రహ్మాండమున నెందును మరొండులేదు. కలుగబోదు. శ్రీ వేంకటేశునకు సమానుఁడు దేవుండెందును లేడు, కలుగఁబోడు. స్వామిపుష్కరిణికి సమానమగు పుణ్యతీర్థము మరెందునులేదు. కలుగదు. శ్రీ వరాహాచలవాసిని శ్రీహరిని శ్రీనివాసుని దర్శించువారు వేలకొలదిగ నశ్వమేధములయు, వందలకొలదిగ రాజసూయములయు నింకను సమస్త యజ్ఞములయు. సత్కృతములయు సమస్తదానములయు ఫలముబొంది యిందున నందున సుఖింతురు. ఓ భారతా! నరవరా! నేను నీకు శ్రీ వేంకటాచలమును సంక్షేపముగ జెప్పితిని. పవిత్ర హృదయమున దీనిపారాయణము, మానసిక శాంతిని దేశశాంతిని యింతయేల విశ్వశాంతిని చేకూర్చగలదు.

కం దండములు వేంకటనాయక
దండములొకపదియు నూరుధరణీనాథా॥
దండంబులు వేవేలయు
దండంబులు కొనుచుమాకు దండవుకమ్మా

ఆ॥ వరదావాసుదేవ వైకుంఠపురవాస
వేంకటాద్రివాస సంకటహర
భక్తసుజనపాల ప్రణతులు ప్రణతులు
ఆదుకొనుము వచ్చియాదరమున॥

మంగళము శ్రీనివాస॥ రమాధవా వేంకటేశ
మంగళము కామితార్థ॥ ప్రదాతకారుణ్యమూర్తి॥
మంగళమ్మార్తసంత్రాత॥ అచ్యుతమహితమూర్తి॥
మంగళము దేవదేవేశ॥ కేశవాదివ్యమూర్తి॥

కాళ్యాణాద్భుత గాత్రాయ కామితార్థప్రదాయినే॥
శ్రీమద్వేంకటనాథాయ శ్రీనివాసాయ మంగళం॥



అమ్మహా దివ్యపర్వతము తిరుమలను నెచ్చటనేని కూరుచుండి భక్తితత్పరులై దేవాది దేవు, జనార్ధను శ్రీ వేంకటేశ్వరు నర్చించువారు, ఉపాసించువారు, భగవానుని సాన్నిధ్యముం బొందుదురు.

భగవానుడు దయామయుడు. ఆ పవిత్రశైలమున యుండి ఉపాసించ జాలకపోయినను, తమ యిరువులనే యుండి తన్మయత, భక్తితత్పరులై కొంతకాలవ్యవధిలో శ్రీ వేంకటాచల మాహాత్మ్యమును పారాయణ చేసి దేవునికి దూవదీవ నైవేద్యములర్పించువారు ఇష్టకామ్యాభివృద్ధిని పొందుదురు.

శ్రీ వేంకటాచల మాహాత్మ్యము నందలి ఏ అధ్యాయమును గాని, కధనుగాని స్తుతివిగాని భక్తితత్పరత చదివిన వినిన వినిపించిన నత్ప్రవర్తనులై, ఇహసౌఖ్యములను పొంది, దేవు కృపాపాత్రులయి కైవల్యమును పొందుదురు.



ఓం నమః శ్రీ వేంకటేశాయ.